వ్యాకరణనియమమునుబట్టి వచ్చిన వకారము లఘువు (అతఁడు+ ఉలికె=) అతఁడు వలికె (ఇచటి వకారము ఉకారమునకు బదులుగ వచ్చినది ) శబ్దము పుట్టుకనుండియుఁ నున్న వకారము అలఘువు—వాఁడు, నీవు మొ॥ లఘ్వలఘుభేదము వర్ణసమామ్నాయములో నున్న య-ర-ల లను సంబంధించినది కావున హల్లుల చివఱలోఁ జెప్పబడిన శకారమునకు ఈభేదములతో నెట్టి సంబంధమును లేదు ఆ శకారము ప్రత్యేకవర్ణము.

## సంస్కృత ప్రాకృతతుల్యంబగు భాష తత్సమంబు ౧౯.

| సంస్కృతము. | | | సంస్కృతసమము |
|---|---|---|---|
| రామః | ... | ... | రాముఁడు. |
| విద్యా | ... | ... | విద్య |
| హరిః | ... | ... | హరి. |
| ధేనుః | ... | ... | ధేనువు |
| భూః | . | ... | భువి. |
| పితా | ... | .. | పిత |
| గౌః | ... | ... | గోవు. |
| నౌః | ... | ... | నావ. |
| ద్యౌః | ... | ... | దివి. |
| హృద్ | .. | ... | హృది. |
| జగత్ | .. | ... | { జగత్తు / జగము |

ఇత్యాదులూహ్యంబులు

| సంస్కృతము | | ప్రాకృతము | | ప్రాకృతసమము. |
|---|---|---|---|---|
| అగ్నిః | ... | అగ్గి | .. | అగ్గి |
| ఆటిః | ... | ఆడీ | .. | ఆడి |
| ఆలిః పఙ్క్తిః | .. | ఓలీ | .. | ఓలి |
| కటుః | . | కారో | ... | కారము |
| గౌరవమ్ | ... | గారవం | ... | గారవము. |
| జటా | .. | జడా | ... | జడ |
| మిరా | ... | మేరా | .. | మేర. |
| యమః | .. | జమో | .. | జముఁడు |
| రాజ్ఞీ | .. | రాణీ | .. | రాణి |
| శృఙ్గారః | .. | సింగారో | ... | సింగారము. |
| శ్రీ | . | సిరి | ... | సిరి |

ఇత్యాదు లెఱుంగునది

౧౯ ఆంధ్రభాషలోని పదములను మూఁడువిధముల విభజింపవచ్చును. ౧ తత్సమములు. ౨ తద్భవములు 3 దేశ్యములు ఆయాపదములతోఁ గూడిన భాషాభాగములు తత్సమాదినామముచేఁ బిలువఁబడును (తత్ = సంస్కృత ప్రాకృతములతో సమములు = సమానమగునవి = తత్సమములు) తత్సమపదములుగల భాష తత్సమభాష ఇట్లే తద్భవ దేశ్యములును సంస్కృత పదముల చివఱ కొంఁదిమార్పులు కలిగి తెలుఁగుప్రత్యయములు చేరఁగ నేర్పడు పదములు సంస్కృతసమములు ప్రాకృతభాషాపదముల చివఱ కొంఁద మార్పులు కల్గి తెలుఁగుప్రత్యయములు చేరఁగా నేర్పడునవి ప్రాకృత సమములు ఇట్లు సంస్కృత ప్రాకృతపదములతో సమానములగు పదములు గల భాష తత్సమభాష యనఁబడును.

## సంస్కృతప్రాకృతభవంబగుభాష తద్భవంబు. ౨౦.

| సంస్కృతము | | సంస్కృతభవము. |
|---|---|---|
| ఆకాశః | ... | ఆకసము. |
| కుడ్యమ్ | ... | గోడ. |
| చన్ద్రః | ... | చెందురుఁడు. |
| తమఙ్గః | ... | తమగము. |
| తామరసమ్ | ... | తామర. |
| నారాచః | ... | నారసము. |
| నిభః | ... | నెపము.<br>నెవము. |
| ముఖమ్ | ... | మొకము.<br>మొగము. |
| మృగః | ... | మెకము.<br>మెగము. |
| వక్రః | ... | వంకర. |
| వేసరః | ... | వేసడము |
| సముద్రః | ... | సంద్రము |
| సూచీ | ... | సూది. |
| స్మరః | ... | మరుఁడు. |
| హరణమ్ | ... | అరణము. |
| హరితాళమ్ | ... | హరిదళము. |

ఇత్యాదులు గ్రహించునది.

| సంస్కృతము | ప్రాకృతము | తద్భవము. |
|---|---|---|
| అఙ్గారః | ఇంగాలో | ఇంగలము |
| అప్సరాః | అచ్ఛరా | అచ్చర |
| ఆశ్చర్యమ్ | అచ్ఛేరం | అచ్చెరువు. |
| పఞ్చాశత్ | పణ్ణాసా | పనస |
| పృథివీ | పుఢవీ | పుడమి |
| ప్రయాణమ్ | పయాణం | పయనము. |
| ప్రవాళః | పవాళో | పవడము<br>పగడము. |
| మత్సరః | మచ్ఛరో | మచ్చరము. |
| యజ్ఞః | జణ్ణో | జన్నము. |
| లక్ష్మీః | లచ్ఛీ | లచ్చి. |
| విష్ణుః | విణ్హూ | వెన్నుఁడు. |
| వైద్యః | వెజ్జో | వెజ్జు |
| స్తమ్భః | ఖంభో | కంబము |
| స్థూలమ్ | థోరం | తోరము |

ఇత్యాదులు తెలియునది.

౨౦ సంస్కృతపదములనుండియు, ప్రాకృతపదములనుండియు పుట్టిన పదములు తద్భవములు (తత్=ఆసంస్కృత ప్రాకృతములనుండి భవములు = పుట్టినవి కాన తద్భవము లనఁబడుచున్నవి) అట్టిపదములు కలభాష తద్భవము. ఈతద్భవము లేర్పడునపుడు కొన్నిచోట్ల మూలపదముల చివరి యక్షరము లోపించును (సం) తామరసమ్ (తద్భ) తామర కొన్నిచోట్ల వేఱువర్ణము లాదేశముగా వచ్చును (ప్రా) పుఢవీ (తద్భ) పుడమి.

కొన్నియెడల వర్ణాగమము కల్గును (సం) రథః (తద్భ) అరదము కొన్నిచోట్ల ఉన్నయక్షరములు ముందువెనుక లగును

(సం ) శుచిః (తద్భ) చిచ్చు.

## త్రిలింగదేశవ్యవహారసిద్ధం బగుభాష దేశ్యంబు ౨౧

ఊరు - పేరు-ఇల్లు - ముల్లు - కోట-పేట - దూడ-మేడ కోఁత-లేఁత-తావి-మోవి-ఇత్యాదు లరయునది

౨౧ శ్రీశైలము దాక్షారామము కాళేశ్వరము నను మూఁడు క్షేత్రములకును నడుమనున్న దేశము తెలుఁగుదేశమని పెద్దలవాడుక ఆ తెలుఁగునాట నిత్యవ్యవహారమున—జనులవాడుకలో ఉండుభాష దేశ్యము (సంస్కృత ప్రాకృతములతో ఎట్టిసంబంధమును లేనిపదములు దేశ్యము లని భావము )

## లక్షణవిరుద్ధంబగుభాష గ్రామ్యంబు ౨౨.

వస్తాఁడు-తెస్తాఁడు వచ్చేని - తెచ్చేని-వచ్చేవాఁడు - తెచ్చేవాఁడు-వచ్చేటివాఁడు - తెచ్చేటివాఁడు ఈభాష ప్రయోగంబున కనర్హంబు.

౨౨ లక్షణ మనఁగా వ్యాకరణము ఆవ్యాకరణమునకు విరుద్ధమైన (లాంగని) పదములు గ్రామ్యములు వానితోఁగూడినభాష గ్రామ్యభాష గ్రామీణులు విద్యాగంధములేనివా రగుటచే వారు ఒప్పుల నెఱుఁగరు కఱచు తప్పుపదములనే వాడుచుందురు గాన అట్టివారు వాడుచుండుభాష గ్రామ్యమని గ్రహింపనగును.

## ఆర్యవ్యవహారంబుల దృష్టంబు గ్రాహ్యంబు ౨౩.

పెద్దలు వ్యవహరించినమాట గ్రామ్యంబయిన గ్రహింపం

పూర్వపర మొదటి పదము చివరియచ్చును రెండవపదము మొదటి యచ్చును కలియునపుడు—ఆ రెండచ్చుల స్థానమునను (వానిని కొట్టివేసి, వానికి బదులుగా) రెండవపదము మొదటి యచ్చు వచ్చుటయే సంధి

పూర్వస్వరము=మొదటి యచ్చు పరస్వరము = తరువాతి యచ్చు ఏకాదేశము=(రెండింటికిని) ఒక్కటియే ఆదేశముగా నగుట.

పయి లక్షణము అచ్చులకు సంధి యగునపుడే సరిపడును.

రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు' ఇచట రాముఁడు' అనునది మొదటి పదము అతఁడు' అనునది రెండవపదము మొదటిపదము చివర ఉ' అను అచ్చు కలదు అతఁడు అనుదానిలోని మొదటిఅచ్చు అ' అనునది. మీఁది సూత్రమువలన వీనికి సంధి కలుగునపుడు ఈ ఉ అ అను రెండచ్చులునుపోయి ఆ రెండిటికిని బదులుగ పరస్వరమైన అ' కారమువచ్చి (రాముఁడ్+అ+తఁడు=) రాముఁడతఁడు' అని అయినది తక్కిన యుదాహరణములు నిట్టే ఈసంధి నిత్యము—అనఁగా ఎల్లపుడును వచ్చునది

ప్రథమెతరవిభక్తి శత్రర్థచువర్ణంబులందున్న
యుకారమునకు సంధివైకల్పికముగానగును. ౨

| | | | | |
|---|---|---|---|---|
| నన్నున్ | ... | అడిగె | ... | నన్నడిగె. / నన్నునడిగె |
| నాకొఱకున్ | ... | ఇచ్చె | ... | నాకొఱకిచ్చె. / నాకొఱకునిచ్చె. |
| నాకున్ | ... | ఆదరువు | ... | నాకాదరువు / నాకునాదరువు |
| నాయందున్ | ... | ఆశ | .. | నాయందాశ. / నాయందునాశ |

| | | | |
|---|---|---|---|
| ఇందుఁ | .. | ఉన్నాఁడు | . ఇందున్నాఁడు. / ఇందునున్నాఁడు. |
| ఎందుఁ | .. | ఉంటివి | ... ఎందుంటివి / ఎందునుంటివి |
| వచ్చుచుఁ | .. | ఉండెను | .. వచ్చుచుండెను / వచ్చుచునుండెను. |
| చూచుచుఁ | .. | ఏగెను | ... చూచుచేగెను. / చూచుచునేగెను. |

౨ ప్రథమేతరవిభక్తులు = ప్రథమావిభక్తికంటె వేఱయిన విభక్తులు (ఇచట ద్వితీయా చతుర్థీ షష్ఠీ సప్తములు) శత్రర్థచవర్ణంబులు=(సంస్కృతమున 'శతృ' ప్రత్యయాంతములై) వర్తమానకాలపు టర్థమును దెల్పు 'చున్' ప్రత్యయములు వైకల్పికముగా నగుట=ఒకసారి వచ్చుట వేఱొకసారి రాకుండుటయుఁ అనఁగా-- ద్వితీయాది విభక్తులయందును 'చున్' ప్రత్యయములందును ఉన్న ఉకారమునకుఁ దరువాత అచ్చున్నయెడల సంధి రావచ్చును లేదా రాకపోవచ్చును

నన్నున్=అడిగె=నన్నడిగె

ఇచట నన్నున్' లోని ఉకారము మొదటిపదము చివరిది అడిగె' లోని అకారము రెండవపదము మొదటిది ఈరెండింటికిని బదులుగ పరస్పరమైన అకారము ఆదేశముగా వచ్చి (నన్న్+అ+డిగె=) నన్నడిగె'అనినైనది (ఈరీతిగా అచ్చులకు సంధియగునపుడు ఆరెండచ్చులకును నడుమనున్న ద్రుతము (నకారము) లోపించుచుండును )

ఈసంధి వైకల్పికము కావున ఇది రానపుడు (నన్నున్+అడిగె=) నన్ను నడిగె అనియుండును ఇట్లే తక్కినయుదాహరణములను గ్రహించునది

## సంధిలేనిచోట స్వరంబుకంటెం బరంబయినస్వరంబునకు యడాగమంబగు. 3.

ఆగమంబనఁగా వర్ణాధిక్యంబు

| | | | | |
|---|---|---|---|---|
| మా | ... | అమ్మ | ... | మాయమ్మ. |
| మా | ... | ఇల్లు | ... | మాయిల్లు. |
| మా | .. | ఊరు | ... | మాయూరు. |

3 యడాగమంబు = యట్' అనునది ఆగమముగా వచ్చుట— అనఁగా య' కారము అధికముగా చేరుట (యట్—అనుదానిలో యకారమే' మిగులును టకారము లోపించును ఆ టకారపు ప్రయోజనమేమనఁగా ఈ యకారము' ముందుగా వచ్చునని తెలుపుటయే )

ఒకయచ్చుతరువాత వేఱొకయచ్చున్నపుడు సంధిరానియెడల ఆరెండవయచ్చునకు ముందు (అనఁగా—రెండచ్చులకును నడుమ) యకారము చేరుచుండును.

మా+ఇల్లు' అనుచోట సంధిలేదు దీర్ఘములైన అచ్చులకు సంధి విధింపఁబడలేదు కాన ఇచట సంధిలేనందున ఇచటి రెండచ్చులకును నడుమ యకారము చేరి(మా+య్+ఇల్లు=) మాయిల్లు' అనురూపమేర్పడినది.

[ఈవ్యాకరణమున హ్రస్వములగు అచ్చులకే సంధి విధింపబడియున్నది కాన దీర్ఘములకు సంధి లేదని గ్రహింపవలెను. కాని ప్రత్యేకముగ నిట్టి సూత్రములేదు]

## అత్తునకు సంధి బహుళముగా నగు 4.

| | | | | |
|---|---|---|---|---|
| మేన | ... | అల్లుఁడు | .. | మేనల్లుఁడు.<br>మేనయల్లుఁడు. |
| పుట్టిన | ... | ఇల్లు | ... | పుట్టినిల్లు<br>పుట్టినయిల్లు. |

చూడక . ఉండెను .. { చూడకుండెను. / చూడకయుండెను.

బహుళగ్రహణముచేత స్త్రీవాచకతత్సమసంబోధనాంతంబులకు సంధి లేదు.

| | | | | |
|---|---|---|---|---|
| అమ్మ | ... | ఇచ్చెను | . | అమ్మయిచ్చెను |
| దూత | . | ఇతఁడు | ... | దూతయితఁడు |
| చెలువుఁడ | . | ఇందము | .. | చెలువుఁడయిందము. |

సంస్కృతీయంబునకు సంధి యగునని యధర్వణా చార్యులు చెప్పిరిగాని దానికిం బూర్వకావ్యంబులందుఁ బ్రయోగంబు మృగ్యంబు ఆధునికకృతులం దొకానొకచోట స్త్రీవాచక తత్సమంబులకు సంధి గానంబడియెడు గంగను కాసె. నెలఁతిచ్చెను. వెలయాల్యాదుల సంధిలేమి బాహుళ కముచేతనే యని యూహించునది

౪. అత్తు=హ్రస్వమైన అకారము బహుళము=కొన్నియెడల సంధి వచ్చుట కొన్నియెడల రాకుండుట కొన్నియెడల వికల్పముగా వచ్చుట యును హ్రస్వమగు అకారమునకుఁ దరువాత అచ్చున్నచో—ఆ రెండిటికిని బదులుగా రెండవపదము మొదటియచ్చు వచ్చును

ఈసూత్రమున సంధి వికల్పముగావచ్చుటకును సంధి రాకుండుటకును ఉదాహరణము లీయఁబడినవి వికల్పమున కుదాహృతి— మేన+అల్లుడు= మేనల్లుఁడు (ఇది సంధి వచ్చినరూపము )

మేన+అల్లుఁడు=మేనయల్లుఁడు (ఇది సంధి రాకుండుట కుదాహర ణము. సంధి రానందున 3-వ సూత్రముచే యడాగమము వచ్చినది )

బహుళ—అకారసంధి బహుళమని చెప్పుటచే స్త్రీవాచకములకును (స్త్రీలను దెల్పుపదములకును) తత్సమశబ్దములకును పిలుపును దెలియఁజేయు పదములకును సంధి రాదని గ్రహింపవలెను

(అమ్మ+ఇచ్చెను=) అమ్మ యిచ్చెను— అనునది స్త్రీవాచకమున కుదాహృతి. (దూత+ఇతఁడు=) దూత యితఁడు' అనునది తత్సమమున కుదాహృతి (చెలువుఁడ +ఇదిగో=) చెలువుఁడ యిదిగో' అనునది సంబోధనాంతమున కుదాహరణము

అథర్వణాచార్యులు వికృతివివేకమున సంస్కృతీయమునకు) సంస్కృతసమమైన అకారాంతపదమునకు సంధి ర్వావచ్చునని చెప్పినను, ప్రాచీనకవుల ప్రయోగములందు అట్టిసంధి మిక్కిలి విరళముగా నున్నందున తత్సమములకు సంధిచేయుట సరికాదని యెఱుఁగవలెను

అర్వాచీనకవులు కొందఱు తత్సమములకును స్త్రీవాచకములకునుగూడ సంతచ్చేసి ప్రయోగించియున్నారు (గంగ+అను+కాసె=) గంగను కాసె' అనునది తత్సమసంధి కుదాహరణము.

(సెలఁత+ఇచ్చెను=) సెలఁతిచ్చెను' అనునది స్త్రీవాచకమున కుదాహరణము

ఈ అకారసంధి బహుళ మగుటచేఁ గొన్నిచోట్ల రాకున్నను మానవచ్చును. కాన (వెల+అలు=) వెలయాలు' అనునపుడు సంధి రాలేదు. గావున వెలాలు' కాలేదు

౧౧ ఏమ్యాదులయిత్తునకు సంధి వైకల్పికముగానగు ౫

ఏమి-మఱి-కిమప్షి-అది-అవి-ఇది-ఇవి-ఏది-ఏవి ఇది యాకృతిగణంబు

| | | | | |
|---|---|---|---|---|
| ఏమి | ... | అంటివి | . | ఏమంటివి.<br>ఏమియంటివి. |
| మఱి | . | ఏమి | . | మఱేమి<br>మఱియేమి, |

(మహాస్వేశ్వరుడు)

హరికిన్ ... ఇచ్చె ... { హరికిచ్చె / హరికినిచ్చె }

౫ ఏమ్యాదులు=ఏమి మున్నగునవి ఇత్తు=హ్రస్వమైన యికారము ఏమి' మొదలగువాని యికారమునకు దర్వాత అచ్చున్నచో సంధి వికల్పముగా నగును.

కిషష్ఠ=షష్ఠీవిభక్తిలోని కిన్' ప్రత్యయము. ఆకృతిగణము = (ఇట్టి) పోలికచే ఊహింపదగిన పదసమూహము (అనగా వికల్పసంధివచ్చిన ఇకారాంతపదముల నన్నిటిని ఈ ఏమ్యాదులలోఁ జేర్చనగునని భావము.) (ఏమి+అంటివి=) ఏమంటివి. సంధివచ్చిన రూపము ఏమియంటివి సంధి రానిరూపము (సంధి రానప్పుడు యడాగమము వచ్చినది)

హరికిచ్చె' అనుచో కిన్' లోని ద్రుతము లోపించినది

క్రియాపదంబులం దిత్తునకు సంధి వైకల్పికముగానగు. ౬.

వచ్చిరి . అప్పుడు ... { వచ్చిరప్పుడు. / వచ్చిరియప్పుడు. }

వచ్చితిమి .. ఇప్పుడు ... { వచ్చితిమిప్పుడు. / వచ్చితిమియిప్పుడు. }

౬. పనిని దెలియఁజేయునవి క్రియాపదములు ఆపదముల తెలు నున్న (హ్రస్వమగు) ఇకారమునకుఁ దరువాత అచ్చున్నచో సం గలదని ముగా నగును.

ఉదాహరణములలో మొదటిది (ఇతరులను గూర్చి తెల ప్రథమపురుషకు వర్తించును రెండవది (తన్నుగూర్చి తెల్పు) ఉ 7 వర్తించునది

## మధ్యమపురుష క్రియలయం దిత్తునకు సంధి యగును

ఏలితివి ... అపుడు ... ఏలితివపుడు

ఏలితి ... ఇపుడు .. ఏలితిపుడు

ఏలితిరి ... ఇపుడు .. ఏలితిరిపుడు

2 ఎదుటనున్న వారినిగూర్చి తెలుపు క్రియ మధ్యమపురుష క్రియ-ఆ క్రియలోని (హ్రస్వమగు) ఇకారమునకు సంధి (ఎల్లపుడును) వచ్చును

## క్త్వార్థంబైనయిత్తునకు సంధిలేదు

వచ్చి ... ఇచ్చెను .. వచ్చియిచ్చెను

భూతకాలమును దెలుపు అసమాపక క్రియ క్త్వార్థము అట్టి యసమాపక క్రియల యికారమునకు సంధి రాదు సంధి రానందున రెండవ పదమునకు ముందు యడాగమము వచ్చి వచ్చి యిచ్చెను' అనురూప మేర్పడినది

## ఇఁకాదులకుఁదప్ప ద్రుత ప్రకృతికములకు సంధిలేదు.

ప్రథమేతరవిభక్తివిధి నిరవకాశంబు గావున దీనిని బాధించెడిని.

వచ్చున్ ... ఇపుడు .. వచ్చునిపుడు

చూడన్ . అయితి ... చూడనయితి

గణంబు .. అతఁడు .. ఉండెడినతఁడు

ఏమి క - ఇఁగ-ఎట్టకేలకు - ఎట్టకేని - ఈయవి యిఁకాదులనినది వీనికి సంధివైకల్పికము.

మఱి • నకార మంతమందుఁ గలవి ద్రుతప్రకృతికములు ఆద్రుతముఁ దఱువాత అచ్చున్నయెడల సంధిలేదు. కాని యిఁక

మొదలగువానికి మాత్రము ఈనిషేధము లేదు ఇఁకాదులు ద్రుతాంతము లైనను సంధి వచ్చునని భావము

వచ్చున్+ఇపుడు=వచ్చు నిపుడు—అనుచోట సంధి రాలేదు. ఏల యన వచ్చున్' అనునది ఇఁకాదులలోఁ జేరలేదు ఇట్టే తక్కినయుదా హరణములను గ్రహించునది ఈసంధి పరిచ్ఛేదము ౨-వ సూత్రమున నున్ కొఱకున్ కున్ అందున్' అను ప్రత్యయములు కలవానికిని చున్నంత క్రియలకును సంధి విధింపఁబడినది అవియన్నియుఁ ద్రుతాంతములు కాన ఈ ౯-వ సూత్రమునుబట్టి వానికి సంధి రాకపోవలసివచ్చును అవేవియుఁను ఇఁకాదులలోఁ జేరలేదు. కాని యిఁకాదులకుమాత్రమే సంధి వచ్చుననినచో 'ప్రథమేతరవిభక్తి.' అను ౨-వ సూత్రమునకుఁ బ్రయోజనమే లేక పోవును కావున ఆసూత్రము ఈ ౯-వ సూత్రముకంటె బలముగలదనియు నందువల్ల దానినిబట్టి సంధి చేయవచ్చుననియు నభిప్రాయము ఈరీతినే ఏమ్యాదులలోని కిమష్టి'నిగూడ ఈ ఇఁకాదులకు—' అనుసూత్రము బాధింపదని గ్రహింపవలెను

సూత్రమునఁ గాకున్నను వివరణమున ఇఁకాదులకు సంధి వికల్పముగా నగు' నని చెప్పఁబడినది (ఇకన్+ఏమి=) ఇఁకేమి? అనునది సంధివచ్చుటకును ఇఁక నేమి? అనునది సంధి రాకుండుటకును ఉదాహరణములు

## అచ్చునకామ్రేడితంబు పరంబగునపుడు సంధి తఱచుగ నగు ౧౦

ద్విరుక్తముయొక్కపరరూప మామ్రేడిత మనంబడు. తఱచుగ ననుటచేత నొకానొకచోట వైకల్పికసంధియుం గలదని తాత్పర్యము

ఔర .. ఔర ... ఔరౌర
ఆహా ... ఆహా ... ఆహాహా

ఎట్టూ .. ఎట్టూ ... ఎట్టెట్టూ
ఓహో ... ఓహో ... ఓహోహో
ఏమి ... ఏమి { ఏమేమి / ఏమియేమి

ఏగియేఁగి యనుచోఁ గ్త్వార్థంబగుట సంధిలేదు.

౧౦ ద్విరుక్తముయొక్క పరరూపము=రెండుసారు లుచ్చరింపఁబడిన పదముయొక్క రెండవరూపము అదే యామ్రేడితమని చెప్పఁబడును. అనఁగా—ఒకపదమును రెండుసారు లుచ్చరించునపుడు. అందు రెండవపద మున కామ్రేడితమని పేరు. ఆ యామ్రేడితమునకు ముందున్న అచ్చునకు సంధి సాధారణముగ నగును.

(ఔర+ఔర=) ఔరౌర' అని యుదాహృతి. ఈసంధి కొన్ని చోట్ల వికల్పము (ఏగి+ఏగి=) ఏగియేగి' అనుచోట సంధి రాకుండుటకుఁ గారణము—అది (క్త్వార్థ మగుటయే') భూతకాలమును దెల్పు నసమాపక క్రియ యగుటయే. (అట్టివానికి సంధి లేదని యిదివఱకే తెలుపఁబడినది )

అంద్వవగాగమంబులుదప్ప నపదాదిస్వరంబు పరంబగునపు డచ్చునకు సంధియగు. ౧౧.

మూర ... ఎఁడు ... మూరెఁడు
వీసె .. ఎఁడు .. వీసెఁడు
అర్థ ... ఇంచు ... అర్థించు
నిర్జి ... ఇంచు ... నిర్జించు

అంద్వవగాగమంబులు పరంబులగునపుడు యథాసంభవముగా గ్రహించునది రాములందు - రాములయందు - హరియందు - ఎనిమినవది - ఎనిమిదియవది

౧౧. పదము కానిది అపదము కాఁగా ప్రత్యయము లపదము లగును ఆ ప్రత్యయముల తొలుత నచ్చులున్నపుడు—వానికి ముందున్న అచ్చునకు సంధి (తప్పక) జరుగును. అనఁగా అచ్చునకు అజాదియైన ప్రత్యయము పరమగుచో సంధి నిత్యమని తేలుచున్నది

కాని యీనియమము అందు అవ' అనువానికిమాత్రము చెల్లదు. అవి పరమగునప్పుడు సంధి వికల్పమైనను గావచ్చును లేదా రాకున్నను రాకపోవచ్చును.

[ అందున్' అనునది సప్తమీవిభక్తిప్రత్యయము అవక్' అనునది సంఖ్యావాచకములు విశేషణములగునపుడు వాని కాగమముగా వచ్చునది. అందు అవ' అనునదియే మిగులును క' కారము లోపించును ఈరీతిని 'క్' చివఱనున్నవన్నియు విధింపఁబడువానికిఁ జివఱ ఆగమములుగా వచ్చుచుండును ఉ (ఎనిమిది+అవ=) ఎనిమిదవ' కాని అవ ఎనిమిది' అని కాదు ] (మూర+ఎఁడు=) మూరెడు' అనునది యీసూత్రమున కుదాహరణము ఎఁడు' అనునది కొలఁతనుదెల్పు ప్రత్యయము అపదము. అందలి యాదిస్వరమైన ఎ' పరమగునపుడు దాని ముందలియచ్చునకు— 'ర' వర్ణమీఁది అకారమునకు సంధియైనది ఇట్టే తక్కిన యుదాహరణములను గ్రహించునది.

ఇఁక అందు అవ' లలో అందు' పరమగుచోఁ గొన్నియెడల సంధి వికల్పము—ఉ రాములందు రాములయందు కొన్నియెడల సంధిరాదు— ఉ వారియందు అవ' పరమగునపుడు సంధి వికల్పము ఉ ఎనిమిదవ, ఎనిమిదియవ

**కుఱు చిఱు కఱు నడు నిడు శబ్దముల ఱడల కచ్చుపరంబగు**
**నపుడు ద్విరుక్తటకారంబగు ౧౨**

| | | | | |
|---|---|---|---|---|
| కుఱు | .. | ఉసురు | ... | కుట్టుసురు |
| చిఱు | ... | ఎలుక | .. | చిట్టెలుక |

| | | | | |
|---|---|---|---|---|
| కడు | ... | ఎదురు | ... | కట్టెదురు |
| నడు | ... | ఇల్లు | ... | నట్టిల్లు |
| నిడు | ... | ఊరుపు | ... | నిట్టూరుపు |

౧౨. కుఱు, చిఱు' అనుశబ్దముల ఱ' కును కడు నడు నిడు' అను వానిలోని డ' కారమునకును దఱువాత అచ్చున్నయెడల—ఆ ఱడలు, ట్ట లగును—అనఁగా అవి ద్విత్వటకారమును పొందును

ఈసూత్రమున ఱ డ లనఁగా ఉకారముతోఁగూడినవానినే (ఱు డు లనే) గ్రహింపవలెను

కుఱు+ఉసురు'—ఇచట ఉసురు' లోని ఉకారము పరమగుటచే కుఱు'లోని ఱ' కారమునకు టకారద్విత్వమువచ్చి కుఱు కుట్టుగా మాఱి కుట్టుసురు' అయినది

కడు+ఎదురు' అనుచోట డు' కు అచ్చు (ఎదురు'లోని ఎకారము) పరమగుటచే డు' ట్టు' గా మాఱి కట్టెదురు' అయినది తక్కిన యుదాహరణములు నిట్లే

## ప్రథమమీఁది పరుషములకు గసడదవలు బహుళముగా నగు. ౧౩.

| | | | | |
|---|---|---|---|---|
| వాడు | ... | కొట్టె | ... | వాఁడు గొట్టె<br>వాఁడు కొట్టె. |
| అపుడు | .. | చనియె | .. | అపుడు సనియె.<br>అపుడు చనియె. |
| నీవు | ... | టక్కరివి | ... | నీవు డక్కరివి.<br>నీవు టక్కరివి. |
| మీరు | ... | తలఁడు | ... | మీరు దలఁడు.<br>మీరు తలఁడు. |

వారు ... పోరు ... { వారు వోరు.
వారు పోరు.

అప్పు డిప్పు డెప్పు డనుశబ్దములు నిత్యైకవచనాంతములు వాగనుశాసనులు యదా తదా యని గ్రహించుట ప్రపంచార్థమని యెఱుఁగునది. ఈ కార్యము కళలగు క్రియా పదములమీఁద సహితము కానంబడియెడి.

రారు ... కదా ... { రారు గదా.
రారు కదా.

వత్తురు ... పోదురు ... { వత్తురు వోదురు.
వత్తురు పోదురు.

౧౩. దు ము వు లు ప్రథమావిభక్తి కచటతప' అనునవి పరుషములు ప్రథమావిభక్త్యంతములగు పదములకుఁ దఱువాతనున్న క' కు 'గ' చ' కు స' ట' కు డ' త' కు ద' ప' కు వ' బహుళముగా ఆదేశ మగుచుండు (బహుళమనఁగా తోఁచినట్లు వచ్చుట యనియు ఆదేశ మనఁగా ఉన్న యక్షరమునుఁగొట్టి వచ్చుట యనియు నీవఱకే చెప్పఁబడినది ) వాఁడు+కొట్టె' అనియుండఁగా ప్రథమయగు దు' కుఁ దర్వాతి క' కారము గ' గా మాఱి 'వాఁడు గొట్టె' అయినది ఇక్కడ సంధి బహుళగ్రహణమునుబట్టి వికల్పమయి వాఁడు కొట్టె' అనియు రూపమేర్పడినది

ఇచటి యుదాహరణములన్నియుఁ ఈ గసడదవాదేశము' వికల్పమునుటకు అనుకూలముగ నీయఁబడినవి.

అప్పుడిప్పుడు — అప్పుడు ఇప్పుడు ఎప్పుడు' అనునవి యెల్లపుడును ఏకవచనములో నుండుపదములు. ఆంధ్రశబ్ద చింతామణిలో దానిని రచించిన శబ్దానుశాసనుఁడు (అనుబిరుదుగల నన్నయ) కళలను వివరిం

చుచు ప్రథమాంతములతోఁబాటు యదా తదా' అనువానిని గ్రహించుచు అప్పుడు ఇప్పుడు' అనువానిఁగూడఁ బ్రత్యేకముగఁ జేర్చ్కొని యున్నాఁడు. అట్లు గ్రహించుట అనవసరము ఏల యన ఇవి ప్రథమాంతములే యగుటవలన మఱల వీనిని యదా తదా' అని ప్రత్యేకముగఁ జేర్చ్కొన నక్కఱలేదు అట్లయినను—వివరముగాఁ దెలుపుటకయి గ్రంథకర్త వీనిని మఱలఁ జెప్పెనని గ్రాహ్యము

కేవలము ప్రథమాంతములు మీఁదనేగాక కళలగు క్రియాపదముల మీఁద నున్న పరుషములకుఁ గూడ ఈ గసడదవా' దేశము కలుగవచ్చును.

(రారు+కదా=) రారుగదా రారుకదా రారు' అనునది కళయగు క్రియాపదము దానికిఁ బయినున్న కదా' లోని కకారముగకారముగా మాఱి (బహుళముగ) రారుగదా అయినది.

## తెనుఁగులమీఁది సాంస్కృతికపరుషములకు గసడదవలు రావు ౧౮

| | | | | |
|---|---|---|---|---|
| వాఁడు | ... | కంసారి | ... | వాఁడుకంసారి |
| వీఁడు | ... | చక్రపాణి | ... | వీఁడుచక్రపాణి. |
| ఆయది | ... | టంకృతి | ... | ఆయది టంకృతి. |
| అది | ... | తథ్యము | ... | అది తథ్యము |
| ఇది | ... | పథ్యము | ... | ఇది పథ్యము |

౧౮ అచ్చతెనుఁగు పదములకుఁ దరువాత సంస్కృతసమములున్నచో ఆసంస్కృతసమముల తొలిపరుషములకు గసడదవ' లు ఆదేశముగా రావు.

(వాఁడు+కంసారి) వాఁడు కంసారి'

ఇచట వాఁడు' తెలుఁగు పదము కంసారి సంస్కృతసమము కాన అందలి కకారము' గకారముగా మాఱి వాఁడు గంసారి' అని కాలేదు. (ఇచట గసడదవాదేశము రాలేదు )

## ద్వంద్వంబునం బదంబుపయి పరుషములకు గసడదవలగు ౧౫.

| | | | | |
|---|---|---|---|---|
| కూర | .. | కాయ | . | కూరగాయలు |
| కాలు | .. | చేయి | ... | కాలుసేతులు |
| టక్కు | .. | టెక్కు | .. | టక్కుడెక్కులు |
| తల్లి | ... | తండ్రి | .. | తల్లిదండ్రులు |
| ఊరు | . | పల్లె | ... | ఊరువల్లెలు. |

౧౫ ద్వంద్వసమాసమున మొదటి పదమునకుఁ దరువాతఁ (రెండవ పదము మొదట) గల పరుషములకు గసడదవ' లు నిత్యముగా ఆదేశమగును

[రెండుపదములు కలిసి ఏక పదమగుట సమాసము సమాసములోని పదములన్నిటియర్థములును ప్రధానము లయి యున్నచో—ఆ సమాసము ద్వంద్వమగును ]

(కూర + కాయ=) కూరగాయలు ' కూర, కాయ' అని రెండు వేర్వేఱు పదములు అవిరెండును కలిసి కూరగాయలు' అని యొకపదమైనందున ఆ యేకపదము సమాసము. ఇందుఁగల రెండుపదములయర్థములును ప్రధానములగుటచే నియ్యది ద్వంద్వ సమాసము కూర' అను తొలిపదము పయిఁగల కాయ' లోని క' కారము గకారముగా మాఱి యిచట కూరగాయలు' అను రూపము వచ్చినది ఇట్లే తక్కినవియును

## ద్రుతప్రకృతికముమీఁది పరుషములకు సరళములగు. ౧౬.

| | | | | |
|---|---|---|---|---|
| పూచెను | . | కలువలు | ... | పూచెనుగలువలు. |
| తోఁచెను | ... | చుక్కలు | ... | తోఁచెనుజుక్కలు. |
| చేసెను | .. | టక్కులు | ... | చేసెను డక్కులు. |

నెగడెను ... తమములు ... నెగడెనుదమములు.

మొగిడెను... పద్మము ... మొగిడెనుబద్మము.

౧౬. [నకారము ద్రుతము. ఆ ద్రుతము చివరియక్షరముగాఁ గలది ద్రుతప్రకృతికము.] ద్రుతప్రకృతికములగు తొలిశబ్దములకుఁ దర్వాత నుండు (రెండవ శబ్దముల మొదట నుండు) 'క-చ-ట-త-ప' అను వానికి వరుసగా 'గ-జ-డ-ద-బ' అనునక్షరము లాదేశమగును (పూచెను+కలువలు=) 'పూచెను గలువలు' అనుచోట 'పూచెను' లోని 'ను' ద్రుతము కాన 'పూచెను' అనునది ద్రుతప్రకృతికము. దానికిఁ దరువాతనున్న (పరుష మైన) కకారము సరళముగా (గకారముగా) మారినది. ఇట్టే తక్కిన యుదాహరణములను గ్రహించునది

ఈ పరిచ్ఛేదములోని ౧౬-వ సూత్రోదాహరణముల ననుసరించి నకారపుఁబొల్లు ద్రుతమని తెలియుచున్నది ఈసూత్రోదాహరణముల ననుసరించి ఉకారముతోఁగూడిన నకారము (ను) ద్రుతమని తేలుచున్నది. ద్రుతలక్షణము 'నకారంబు ద్రుతంబు' అని యున్నది కాన పొల్లుగా నున్న నకారమును ఉకారముతోఁగూడిన నకారమునుగూడ ద్రుతముతే యని గ్రహింపవలెను.]

ఆదేశసరళములకు ముందున్న ద్రుతమునకు బిందు
(ం) సంశ్లేషములు విభాషనగు. ౧౭
సంశ్లేషం బనఁగా మీఁదిహల్లులతోఁ గూడికొనుట.

పూచెనుగలువలు ... { పూచెంగలువలు / పూచెఁగలువలు. / పూచెన్గలువలు.

తోఁచెనుజుక్కలు ... { తోఁచెంజుక్కలు / తోఁచెఁజుక్కలు / తోఁచెన్జుక్కలు

| | | |
|---|---|---|
| చేసెనుడక్కులు | ... | చేసెండక్కులు.<br>చేసెఁడక్కులు.<br>చేసెన్డక్కులు. |
| నెగడెను దమములు | ... | నెగడెందమములు<br>నెగడెఁదమములు.<br>నెగడెన్దమములు. |
| మొగిడెను బద్ధము | ... | మొగిడెంబద్ధము.<br>మొగిడెఁబద్ధము.<br>మొగిడెన్బద్ధము. |

✓ పక్షంబున స్వత్వంబగు స్వత్వంబనఁగా ద్రుతంబునకుఁ బ్రకృతిభావము.

౧౭. ఆదేశసరళములు = మొదటినుండియు సరళములుగా నుండక పిదప వ్యాకరణనియమము ననుసరించి పరుషములకు బదులుగావచ్చిన సరళములు [అనఁగా క-చ-చ-ట-త-ప లకు బదులుగా వచ్చిన గ-జ-జ-డ-ద-బ లు] ద్రుతంబు=ఉకారముతోఁగూడిన నకారము-ను బిందువు = నిండుసున్నయు అరసున్నయును సంశ్లేషము = ద్రుతము (తన యుకారమును విడిచి పొల్లుగానుండి) తరువాతి హల్లుతోఁగూడియుండుట అనఁగా పొల్లుగా మాఱుట యని యభిప్రాయము

ఆదేశములుగా వచ్చినసరళములకు ముందున్న 'ను' కారము నిండుసున్నఁగాఁగాని అరసున్నగాఁగాని మాఱవచ్చును, పొల్లుగానైనను మాఱవచ్చును లేదా నకారముగానే ఉండిపోయినను ఉండిపోవచ్చు నని యభిప్రాయము.

(పూచెను+గలువలు=) (1) పూచెంగలువలు (2) పూచెఁగలువలు, (3) పూచెన్గలువలు; (4) పూచెను గలువలు.

ఇచట 'తొలుత పూచెను+కలువలు' అనియుండి 'ద్రుతప్రకృతికము మీఁది పరుషములకు సరళములగు' నను సూత్రముచే కకారము గకారముగా మారి 'పూచెను గలువలు' అని యైనవి కాన యిచటి గకారము ఆదేశ సరళము దానికి ముందున్న ద్రుతము 'పూచెను' లోని నకారము అది బిందుపున్నగా మారి 'పూచెం గలువలు' అయినది అఱసున్నగా మారి 'పూచెఁ గలువలు' అయినది పొల్లుగా మారి 'పూచెన్గలువలు' అయినది ఇట్లగుట వికల్పముగాన ఇవియేవియు రానప్పుడు నకారము అట్లే యుండగా 'పూచెను గలువలు' అనియు నుండును ఇట్లు నాల్గువిధముల రూపము లుండును.

[పక్షంబున = బిందు సంశ్లేషలు రానియప్పుడు ప్రకృతిభావము= ఉన్నది యున్నట్లుండుట-అనఁగా 'ను' నుగానే యుండుట]

## ద్రుతంబునకు సరళస్థిరంబులు పరంబు లగునపుడు లోప సంశ్లేషంబులు విభాషనగు ౧౮.

| | | |
|---|---|---|
| వచ్చెను .. గోవులు ... | { | వచ్చెగోవులు.<br>వచ్చెన్గోవులు<br>వచ్చెనుగోవులు. |
| మెఱసెను ... ఖడ్గము ... | { | మెఱసెఖడ్గము<br>మెఱసెన్ఖడ్గము<br>మెఱసెనుఖడ్గము. |

౧౮ సరళస్థిరంబులు = సరళముగాని, స్థిరముగాని లోపసంశ్లేషలు = పోవుటగాని మీఁదివాల్లుతోఁ గలియుట (అనఁగా నకారపుఁబొల్లుగా మాఱుట) గాని విభాషనగు = వికల్పముగా జరుగును

( ) సరళములకు ముందున్నద్రుతము లోపించినను లోపించును, లేదా పొల్లుగా మాఱినను మాఱును. లేక 'ను' గా కూడ ఉండిపోవచ్చును.

(వచ్చెను + గోవులు =) (1) వచ్చె గోవులు (2) వచ్చెన్గోవులు- (3) వచ్చెను గోవులు.

వచ్చెను + గోవులు' అనుచోట గో సరళము దానికిముందున్న ద్రుతమైన ను' కారము లోపించి వచ్చె గోవులు' అయినది పొల్లుగా మాఱి వచ్చెన్గోవులు' అయినది ఇట్లు జరుగుట వికల్పముగాన ను' ఉన్నట్లుగానే ఉండిపోయి వచ్చెను గోవులు' అయినది

(మెఱసెను + ఖడ్గము=) (1) మెఱసె ఖడ్గము (2) మెఱసెన్ఖడ్గము (3) మెఱసెను ఖడ్గము

ఖడ్గము' లోని ఖకార మిచట స్థిరము దానికి ముందున్న ద్రుతము ('మెఱసెను'లోని నుకారము) లోపింపఁగా మెఱసె ఖడ్గము' అయినది అద్రుతము పొల్లుగా మాఱఁగా మెఱసెన్ఖడ్గము అయినది అది ఎట్టిమార్పును పొందకపోఁగా మెఱసెను ఖడ్గము' అనియే యుండిపోయినది

**వర్గయుక్సరళములు పరములగు నపు డొకానొకచో ద్రుతము నకుఁ బూర్ణబిందువును గానంబడియెడి. ౧౯.**

| | | | | |
|---|---|---|---|---|
| వచ్చెను | .. | ధాత్రీపతి | ... | వచ్చెంధాత్రీపతి |
| పాడెను | ... | గంధర్వుఁడు | . | పాడెంగంధర్వుఁడు |
| కన్ | ... | దోయి | . | కందోయి |

౧౯ వర్గయుక్కులు = వర్గము లైదింటియందునుగల ఒత్తక్షరములు పది- ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ అనునవి ఈపదియక్షరములకుఁగాని సరళములకుఁగాని ముందుగా నున్న ద్రుతము కొన్నిచోట్ల నిండుసున్నగాఁగూడ మాఱుట కలదని సూత్రము నర్థము

**అవసానంబునందు ద్రుతస్వరంబునకేని ద్రుతంబునకేని లోపంబు బహుళంబుగానగు ౨౦**

వాఁడువచ్చెన్ - వాఁడువచ్చె - వాఁడువచ్చెను ఈ లోపంబు పద్యాంతములయందు గణానుసారంబుగ వ్యవస్థితం

బయియుండు గుర్వవసాయి యగుపద్యంబు తుదను స్వత్వంబు లేదు. అతిశయముగ బుద్ధిమంతుఁడగు బుధసేవన్.)

౨౦. అవసానంబునందుఁ = తుదిని-వాక్యముచివఱ-దానికిఁ దరువాత నేయక్షరములును లేనప్పుడు వాక్యము చివఱనున్న ద్రుతముగాని ద్రుత స్వరముగాని బహుళముగా లోపించును — అనఁగా కొన్నియెడల లోపింప వచ్చును కొన్నియెడల లోపింపక పోవచ్చును కొన్నియెడల వికల్పముగా నైనను లోపింపవచ్చును.

వాఁడు + వచ్చెను' అని యున్నపుడు ద్రుతస్వరమగు ఉకారము లోపింపఁగా వాఁడు వచ్చెన్' అయినది ద్రుతము (ను) లోపింపఁగా 'వాఁడు వచ్చె' అయినది ఈలోప మేదియు రాకపోఁగా వాఁడు వచ్చెను' అనియే ఉండిపోయినది

ఈలోపము పద్యపాదములచివఱ నాయాగణముల ననుసరించి నియమితమై యుండును. గురువగునక్షరము చివఱ నుండవలసినపద్యపాదముని- తుదను పొల్లై యుండునుగాని ను' ఉండదు ఉదా — అతిశయముగ బుద్ధిమంతుఁదగు బుధసేవన్' అనుకందపద్యపాదము చివఱ సేవను' అనిగాని, సేవ' అనిగాని యుండరాదు

[గుర్వవసాయి = గురువగునక్షరము చివఱఁ గలది స్వత్వంబు = ఉత్వముతోఁగూడిన ద్రుతము-ను' అనునది వ్యవస్థితంబు = కట్టుఁబాటు చేయఁబడినది నియమింపఁబడినది ]

## కొన్నియెడల ద్రుతంబుమీఁద నకారంబు గానంబడియెడి ౨౧.

అదియునున్గాక - దివంబునుంబోలె.

౨౧ కొన్నిచోట్ల ద్రుతాంతములమీదను ద్రుతము (నకారము) వచ్చుట కనఁబడుచున్నదని భావము.

(అదియును + గాక =) అదియునుఁ గాక ' ఇచట అదియును' అనునది ద్రుతాంతము. అందలి ద్రుతమగు ను' కుఁ బిదప మఱియొక్క ద్రుతము రాఁగా (న్' రాఁగా) అదియునుఁగాక' అని యైనది ఇట్లే కొండవయుండా వారణమున ను' కుఁ బిదప న్ వచ్చి అది పూర్ణబిందువుగా మాఱి దివంబు నుంబోలె', అనురూప మేర్పడినది

**అఁట యిఁక చుఁడు శబ్దంబులందప్ప నుడి తొలి హ్రస్వంబు మీఁద ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లేవు ౨౨.**

ముంగొంగు - క్రొంబసిఁడి - కన్దోయి.

౨౨ అఁట' అనునది కిలార్థము (ఇట్లందురు అనునభిప్రాయము) ను తెలియఁజేయు నవ్యయము కళ ఇఁక' అనునది మఱి' యనునర్థమును దెల్పుద్రుతాంతమగునవ్యయము చుఁడు' అనునది ఎదుటివారితో సంభాషించు నపుడు ఉపయోగింపఁబడు కళయగుపదము పయిమూఁడుపదములలోను మొదటి హ్రస్వమునకుఁ దరువాత అఱసున్న కనఁబడుచున్నది వీనిని మూఁడింటిని విడిచి మఱియేపదమునందును తొలిహ్రస్వమునకుఁ బ్రక్కగా అఱసున్న యుండదు నిండుసున్నయే యుండును మఱియు (సమాసమును పొందిన) అయితరపదములలో తొలిహ్రస్వమునకుఁ బిదపనుండు ద్రుతమునకు లోపమును రాదు, [అనఁగా సమాసమునందు ద్రుతంబునకు లోపంబగు' నను సూత్రముచే (సంధి-౨౮) వచ్చు ద్రుతలోపము రాదని యభిప్రాయము.]

(ముందు + కొంగు =) ముంగొంగు ' ఇచట ఈ సంధిపరిచ్ఛేదములోని ౩౬-వ సూత్రముచే ందు'కు లోపమురాఁగా ము + కొంగు' అయినది. ౩౭-వ సూత్రముచే నకారము' ఆగమముగా వచ్చి పరుషమునకు సరళ మ్రాదేశమై ద్రుతము నిండుసున్నగా మాఱఁగా ముంగొంగు' అయినది.

(క్రొత్త + పసిఁడి =) క్రొంబసిఁడి.

✓ [క్రొత్త+పసిడి-(త్త' లోపము) క్రొ+పసిడి (న్కారాగమము) క్రొ+న్+పసిడి- (సరళాదేశ ద్రుతకార్యములు) క్రొంబసిడి]

కను+దోయి=కన్దోయి

[కను+దోయి (౩౯-సూత్రముచే లోప నకారాగమములు) కన్+దోయి=కన్దోయి] ఇది కందోయి' అనియును గావచ్చును

[సంధి. ౧౯-వ సూత్రముచే పూర్ణబిందువు వచ్చినది]

**తాను నేను పదంబుల ద్రుతంబునకు సంశ్లేషంబు లేదు ౨౩.**

తాను ... చదివె ... { తాఁ జదివె / తాను జదివె.

తాను ... వినె . { తా వినె / తాను వినె.

దీర్ఘంబుమీఁదిది గాన దీనికి నెఱసున్న లేదు.

౨౩ తాను నేను' అనునవి ద్రుతాంతములగు పదములు వానికి ఆదేశసరళములుగాని సరళ స్థిరములుగాని పరమగునపుడు వాని ద్రుతము పొల్లుగా మాఱదు మఱియుం తాను నేను' లలోని ద్రుతము దీర్ఘాక్షరమునకుఁ దరువాత నున్నందున (సంజ్ఞా ౧౫-వ సూత్రము ననుసరించి) అర్ధ్యాది నిండుసున్నగా మాఱదని గ్రహింపనగును (తాను+చదివె=) తాఁ జదివె తాను జదివె'

తాను+చదివె' అని యుండఁగా ౧౮-వ సూత్రము ననుసరించి నిండుసున్న అఱసున్న పొల్లు స్వత్వములచే నాల్గువిధములుగా మాఱి (1) తాంజదివె (2) తాఁజదివె (3) తాన్జదివె (4) తాను జదివె అని కావలసియుండఁగా ఈసూత్రము విధింపఁబడినది ఈసూత్రమునుబట్టి సంశ్లేషము రానందున 'తాన్జదివె' అని కాఁజాలదు దీర్ఘముమీఁద పాక్షిపూర్ణము లేనందున తాంజదివె అనియుఁ గాఁజాలదు (తాను+వినె=)

‘తావిసె తాను విసె’ ఇచ్చట ౧౮-వ సూత్రము ననుసరించి (స్థిరము ద్రుతమునకుఁ బరముగా నుండుటచే) ద్రుతమునకు లోపసంశ్లేషములును, ద్విత్వమును వచ్చి ‘తావిసె తాన్విసె, తాను విసె’ అను మువ్విధముల రూపములు కావలసియుండఁగా ఈసూత్రముచే సంశ్లేషము వారింపఁబడినది. కాఁగా రెండురూపములే యేర్పడినవి.

వెఱసున్న = నిండుసున్న.

## సమాసంబునందు ద్రుతంబునకు లోపంబగు. ౨౪.

ఎల్లయర్థములు - ఎల్లకలుషములు సర్వపర్యాయంబయిన యెల్లశబ్దంబు ద్రుతాంతంబయిన యవ్యయంబు. దీని కసమాసంబున విశేష్యంబునకు ముందు ప్రయోగంబు లేదు.

౨౪ సమాసమును పొందుపదములలో మొదటిపదము చివఱిద్రుతము లోపించునని యర్థము.

(ఎల్లన్ + అర్థములు=) ఎల్ల యర్థములు’ ఇచట ఈసూత్రము ననుసరించి ద్రుతము లోపించిన ఎల్ల + అర్థములు’ అగును పిదప సంధిలేనందున యడాగమమువచ్చి ఎల్లయర్థములు’ అయినది (ఎల్లన్ + కలుషములు=) ‘ఎల్ల కలుషములు’

సర్వపర్యాయంబు = సర్వశబ్దమునకు నామాంతరమయినది అసమాసము = సమాసములేనికాలము-వ్యస్తమగుట విశేష్యంబు = నామవాచకము.

[ఎల్ల’ యనునది ఎల్లపుడును సమాసము పొందియేయుండును గాని, వేఱుగా నుండదనియు అది నామవాచకమునకుఁ దర్వాతగానే ముందుగాఁ బ్రయోగింపఁబడదనియు భావము కాన ధనములన్నెల్ల’ అనియే యుండుఁ గాని ఎల్లన్ ధనముల’ అని యుండరాదని శ్రీసూరిగారి యాశయము]

**సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుష సరళంబులు పరంబులగునపుడు నుగాగమంబగు ౨౫.**

ఇచటం బరుషంబులు పరంబులగునపుడు ద్రుతంబునకు బిందుసంశ్లేషంబులచే మూఁడురూపంబులు సరళంబులు పరంబులగునపుడు లోప సంశ్లేష పూర్ణబిందువులచేత మూఁడు రూపములు విధానసామర్థ్యమువలన దీనికి లోపము లేదు. వక్ష్యమాణవిధిచే స్వత్వము లేదు

| | | | |
|---|---|---|---|
| చిగురు ... | కయిదువు | | చిగురుంగయిదువు<br>చిగురుఁగయిదువు.<br>చిగురున్గయిదువు. |
| తళుకు .. | గజ్జెలు | ... | తళుకుగజ్జెలు<br>తళుకున్గజ్జెలు<br>తళుకుంగజ్జెలు |
| సింగపు ... | కోదమ | ... | సింగపుంగోదమ.<br>సింగపుఁగోదమ.<br>సింగపున్గోదమ |
| ఉన్నతంపు ... | గోడుగు | ... | ఉన్నతంపుగోడుగు.<br>ఉన్నతంపున్గోడుగు.<br>ఉన్నతంపుం గోడుగు. |

నలుఁగడాదుల నీయాగమంబు లేదండ్రు. ఈయాగమంబొకానొకచోట స్థిరంబు పరంబగుచోఁ గానంబడియెడి - గలువపున్మురువు.

౨౯ ఉదంతంబులు = హ్రస్వమగు ఉకారము చివఱఁగలవి. స్త్రీ సమంబులు = ప్రథమావిభక్తిలో డు-ము' అను ప్రత్యయములు రానివి. పుంపులు = ము' కారమునకు ఆదేశముగా వచ్చిన పు ంపు' అనునవి

రెండుపదములకు సమాస మగునప్పుడు-అందు ఉకారాంతమును స్త్రీ సమము నగు మొదటిపదమునకును పు ంపు' లతోఁగూడినపదమునకును పరుషముగాని సరళముగాని పరముగా ఉన్నప్పుడు నుక్' అనునది ఆగమముగా వచ్చును [ఈ నుక్ 'లో నకారముమాత్రమే మిగులును. కకారములోఁ జేర్చి చెప్పుటచే ఈయాగమము (మొదటి) పదము చివఱ జేరునని గ్రహింప వలెను కకారము చివఱఁగల యాగమము పదముకడపటను టకారము చివఱఁ గలయాగమము పదముమొదటను చేరుచుండును ]

బిందు సంశ్లేషచే = నిండుసున్న అఱసున్న పొల్లులచేత

విధానసామర్థ్యమువలన-ఇంతకు ముందుఁ జెప్పఁబడిన౨౮-వ సూత్రము ననుసరించి ద్రుతమయిన యీనకారము లోపింపవలసియున్నది ఆరీతిని లోపించినయెడల యీఁదేసిరూపములును సిద్ధింపఁజాలవుగదా అని సందేహము కలుగవచ్చును కాని ఆయాసూత్రములచే విధింపఁబడిన ద్రుతముల నన్నింటిని ౨౮-వ సూత్రము లోపింపఁజేసినయెడల ఈ ౨౯-వ సూత్రము ఉండియు లేనట్లే ఈసూత్రము వ్యర్థమయిపోవును. కాన ప్రత్యేకముగ నీరీతి సూత్రము వ్రాయుటంబట్టి యీఁదిచోట్లమాత్రము అనఁగా ఉదంతస్త్రీసమములకును, పుంపులకును దర్వాత నున్నపుడుమాత్రము ద్రుతము లోపింపదనియు అది ద్రుతమునకు రావలసినకార్యములను పొందుననియుఁ దెలిసికొనవలెను.

వక్ష్యమాణవిధిచే-ఈతర్వాతిదగు ౨౬-వ సూత్రమున సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబు (ను' గాఉండిపోవుట)లేదు అని చెప్పఁబడుచున్నదిగాన ౧౭-వ సూత్రమునను సరించి ద్రుతము ను' గా ఉండదని అభిప్రాయము.

## సమాసంబులందు ద్రుతంబునకు స్వత్వంబులేదు. ౨౬

౨౬ సమాసమునందు ద్రుతమునకు స్వత్వము నంగీకరించినయెడల (అనఁగా న్ కార ముండునని చెప్పినచో) చిగురున్గైదువు తలఁకున్గజ్జెలు' మున్నగు అసాధురూపములు కావలసి వచ్చును

## తలఁబ్రాలు మొదలగు సమాసంబుల ద్రుతమునకు లోపములేదు. ౨౭.

తలఁబ్రాలు-ఒడిఁబ్రాలు-సేసఁబ్రాలు - ఊరఁబంది - ఊరఁబిచ్చిక-తోఁడబుట్టువు - తోఁబుట్టువు ఒల్లఁబాటు - ఒడఁబాటు - ఇత్యాదులు

౨౭ సంధి ౨౪వ సూత్రము ననుసరించి సమాసమున ద్రుతము లోపింపవలసియున్నది అట్లు లోపించినచో తలఁబ్రాలు' మున్నగురూపములు సిద్ధించుటకు అవకాశము లేకపోవుచున్నది కావున ఈసూత్రము తలఁబ్రాలు మున్నగు కొన్ని పదములలోమాత్రము ద్రుతముండును' అని నియమించుచున్నది. ఈసూత్రముచుబట్టి 'లప్రాలు' మున్నగు నసాధురూపముల కవకాశము లేకపోవును

ఉదాహృతులలో తలఁబ్రాలు, ఒడిఁబ్రాలు ఊరఁబంది ఊరఁబిచ్చుక' అనునవి సప్తమీతత్పురుషసమాసములు తోడఁబుట్టువు తోఁబుట్టువు' అనునవి తృతీయాతత్పురుషములు పైవన్నియుం నలుక్సమాసములు (అనఁగా పూర్వపదము చివరి విభక్తిప్రత్యయము లోపింపనివి.) పయివిభక్తిప్రత్యయములు సహజముగనే ద్రుతాంతములు మిగిలినయుదాహరణములును సహజముగ ద్రుతాంతము లని యనవలెను.

(తలన్+పాలు=) తలఁబ్రాలు.

## సంధిపరిచ్ఛేదము

క్రమమును నిండుసున్నగా మార్చి కలంద్రాలు' అనియు వాడ వచ్చును సమాసమున స్వత్వము లేనందున కలుబ్రాలు' కాదు సంశ్లేషతోఁ గూడిన కలన్ప్రాలు' అనురూపము ప్రసిద్ధిలో లేదు

(ఒడిన్+ప్రాలు=) ఒడిఁబ్రాలు' దీనికి పూర్ణబిందు సంశ్లేష స్వత్వ రూపములు మూఁడును లేవు.

తక్కినయుదాహృతులలో తోడఁబుట్టువు' మాత్రము తోడం బుట్టువు గా మాఱవచ్చును. తక్కినవన్నియుఁ ఉదాహరింపఁబడినట్లే యుండును గాని వేఱురూపములను పొందవు.

### కర్మధారయంబులం దుత్తున కచ్చుపరంబగునపుడు టుగాగమంబగు. ౨౮.

| | | | | |
|---|---|---|---|---|
| కఱకు | .. | అమ్ము | ... | కఱకుటమ్ము. |
| నిగ్గు | ... | అద్దము | ... | నిగ్గుటద్దము. |
| సరసపు | ... | అలుక | .. | సరసపుటలుక. |

౨౮. విశేష్యమునకును విశేషణమునకును గలుగుసమాసము కర్మధార యము ఉత్తు=హ్రస్వమయిన ఉకారము టుగాగమము=ఆగమముగా వచ్చు టకారము

కర్మధారయసమాసములలో మొదటిపదము చివఱనున్న హ్రస్వమగు ఉకారమునకుఁ దరువాత అచ్చున్నయెడల ఆ ఉకారమునకుఁ బిదప (ఉకార మునకును రెండవపదము మొదటియచ్చునకును నడుమ) టకారము చేరును

(కఱకు+అమ్ము=) కఱకుటమ్ము' కఱకట మ్మనఁగా వాడియైనబాణ మని యర్థము. కాన ఈసమాసములో కఱకు' విశేషణము అమ్ము' విశేష్య ము. ఈరెండుపదములకును సమాసమగుటచే నియ్యది కర్మధారయసమాస మగును ఇచట కఱకు' లోని (చివఱనున్న) ఉకారమునకు అమ్ము' లోని

(కర్మధారయ ...) టుగాగమ సంధి

ఆకారముపరముగా ఉన్నదికాన ఆరెండచ్చులకును నడుమ టకారము చేరి 'కఱకుటమ్మ' అయినది ఇట్లే తక్కినయుదాహరణములను గ్రహించునది

**కర్మధారయంబునందుఁ బేర్వాదిశబ్దముల కచ్చుపరంబగు నపుడు టుగాగమంబు విభాషనగు. ౨౯.**

పేరు ... ఉరము ... { పేరుటురము. / పేరురము.

చిగురు ... ఆకు ... { చిగురుటాకు. / చిగురాకు.

పొదరు ... ఇల్లు ... { పొదరుటిల్లు / పొదరిల్లు

౨౯ కర్మధారయసమాసమునందు మొదటిపదమైన 'పేరు' మొదలగువాని ఉకారమునకుఁ బిదప అచ్చున్నయెడల టకారాగమము వికల్పమగును అనఁగా టకారమువచ్చినను రావచ్చు లేదా రాకపోవచ్చును.

[పేర్వాదిశబ్దములు = 'పేరు' మున్నగుశబ్దములు. విభాషనగును = వికల్పముగావచ్చును.]

(పేరు+ఉరము=) పేరుటురము పేరురము'

ఇచట టకారము ఆగమముగా వచ్చినపుడు 'పేరుటురము' అయినది. రానపుడు ఉకారసంధివచ్చి 'పేరురము' అయినది

'పేరురము' అనఁగా విశాలమైనఱొమ్మని యర్థము కాన ఇది కర్మధారయసమాసము )

ఇచట సంధి ౨౦-వ సూత్రము ననుసరించి టుగాగమము నిత్యముగా (ఎల్లపుడును) వచ్చుచున్నందున 'పేరుటురము' అని మాత్రమే కావలసియున్నది. 'పేరురము' అను రూపముకూడ నుండవలెనను అభిప్రాయముతో ఈ ౨౯-వ సూత్ర మారంభింపఁబడినది. తక్కినయుదాహృతులు నిట్లే.

**పేదాదిశబ్దంబుల కాలుశబ్దము పరంబగునపుడు కర్మధార యంబునందు రుగాగమంబగు. 30**

పేద ... ఆలు ... పేదరాలు
బీద ... ఆలు ... బీదరాలు.

పేద-బీద-ముద్ద-బాలెంత-కొమ - జవ-అయిదువ-మనుమ-గొడ్డు-ఇట్టివి పేదాదులు. ఇందు జవ్వనిశబ్దంబునకు జవాదేశం బని యెఱుంగునది. ఏకాంతమునందు నున్న జవరాండ్ర' నని ప్రయోగము.

30 పేదాదిశబ్దములు = పేద' మున్నగుశబ్దములు రుగాగమము = ఆగమముగా వచ్చు రేఫము

కర్మధారయసమాసములో పేద' మున్నగుశబ్దములకుఁ దర్వాత ఆలు' అనుశబ్దమున్నపుడు ఆరెండిటినడుమను రేఫము (ర్) చేరుచుండును.

(పేద+ర్+ఆలు=) పేదరాలు' [రేఫము పేద' అనుదానికే యాగమము రుక్' అనుదానిచివఱ లోపించు కకారముండుటచే నది పేద' అనుదానికిఁ జివఱవచ్చును కాఁగా రేఫము సమాసమునుపొందు రెండుపదముల కును నడుమఁ జేరునని తేలుచున్నది ]

జవ్వని+ఆలు' అని యుండునపుడు రేఫము ఆగమముగా వచ్చినచో జవ్వనిరాలు' అను అపరూపము కావలసివచ్చుచున్నది జవరాలు' అనియే పెద్దలు ప్రయోగించిరి ఆంధ్రకవితాపితామహుఁడగు అల్లసాని పెద్దన యట్లే ప్రయోగించెను. కాన జవరాలు' అనురూపము సిద్ధించుటకయి జవ్వని' అనుదానికిబదులుగా జవ' అనునది ఆదేశముగా వచ్చునని యనుకొనవలెను

**కర్మధారయంబున దత్సమంబులకాలుశబ్దము పరంబగునపు డత్వంబున కుత్వంబును రుగాగమంబునగు. 31.**

ధీర ... ఆలు ... ధీరురాలు.

గుణవంత .. ఆలు . గుణవంతురాలు.

ఇచట వృత్తియం దాలుశబ్దము స్త్రీమాత్రపరము

31 కర్మధారయసమాసమునందు సంస్కృతసమములగు శబ్దముల తరువాత ఆలు' ఉన్నయెడల వెనుకటివలె రేఫము ఆగమముగా వచ్చును మఱియు ఆమొదటిపదముచివఱ అకారముున్నయెడల నది ఉకారముగామాఱును

[అత్వంబు = అకారము ఉత్వంబు = ఉకారము ]

30-వ సూత్రము తత్సమేతరములగు (అచ్ఛికములగు-అచ్చ తెలుఁగులగు) సంబంధించినది (ధీర+ఆలు ధీరు+ర్+ఆలు=) ధీరురాలు'

ఇట ధీరశబ్దము తత్సమము దానికిఁ దర్వాత ఆలు' అనుదానికి ముందుగా రేఫము ఆగమముగా వచ్చుటయేగాక ధీర' లోని అకారము ఉకారముగా మాఱినది ఇట్లే గుణవంతురాలు' ను

ఇచట వృత్తియందు- ఆలు' అనఁగా భార్య' యని యర్థము కాని యీమీఁది రెండు సూత్రముల కుదాహరణములుగా నీయఁబడిన పేదరాలు ధీరురాలు' అనుమొదలగునవి పేదయైనభార్య ధైర్యముగలదైనభార్య' అనునర్థముల నీయవు ఇచట సమాసవృత్తియందు ఆలు' అనుదానికి సామాన్యముగ స్త్రీయనునర్థమునే చెప్పుకొనవలెను సమాసము పొందనప్పుడు-ప్రత్యేకముగా నున్నప్పుడు ఆలు' అనఁగా భార్య' అని యర్థము చెప్పనగును.

కర్మధారయంబులందు మువర్ణకంబునకుం బుంపులగు. 32

సరసము ... మాట ... { సరసపుమాట. / సరసంపుమాట

విరసము ... వచనము ... { విరసపువచనము. / విరసంపువచనము.

32. మువర్ణకంబు=(ప్రథమావిభక్తిలోవచ్చు) 'ము' ప్రత్యయము.

కర్మధారయసమాసములందు మొదటిపదము చివఱనున్న 'ము' ప్రత్యయమునకు 'పు' గాని 'ంపు' గాని ఆదేశమగును— 'ము' 'పు' గాంగాని 'ంపు' గాంగాని మాఱునని భావము

(సరసము+మాట=) (1) సరసపుమాట (2) సరసంపుమాట

ఇట 'సరసమైన మాట' అని యర్థము కాన (విశేషణ విశేష్యభావ ముండుటచే) నిది కర్మధారయసమాసము ఇందలి మొదటిపదము చివఱి 'ము' 'పు'గా మాఱి 'సరసపుమాట' అనియు 'ంపు' గా మాఱి 'సరసంపుమాట' అనియు రెండురూపము లేర్పడినవి

ఈయాదేశము నిత్యము కాన 'సరసము మాట' అని యుండదు

## ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున కచ్చుపరమగునపుడు నుగాగమంబగు 33.

| | | | | |
|---|---|---|---|---|
| చేయు | ... | అతఁడు | ... | చేయునతఁడు. |
| చేసెడు | ... | అతఁడు | ... | చేసెడునతఁడు |

33 ఉదంతము=హ్రస్వమగు ఉకారము చివఱఁగలది తద్ధర్మార్థక విశేషణము = కాలవివక్షలేక వర్తమానాదులను స్వభావమును దెలియఁజేయు క్రియావిశేషణము నుగాగమంబు = ఆగమమైన 'న్' కారము.

హ్రస్వమగు ఉకారము చివఱఁగల క్రియావిశేషణమునకుఁ దరువాత అచ్చున్నయెడల, ఆ ఉకారమునకుఁ బ్రక్కఁగా నకారము చేరునని భావము. ఇది నిత్యము. (చేయు+అతఁడు=) 'చేయునతఁడు' 'చేయు' అనునది యిట ఉకారాంతమగు తద్ధర్మ విశేషణము. ('అతఁడు' అనునది యిక్కడి విశేష్యము). ఆ ఉకారమునకుఁ బిదప అచ్చు ('అతఁడు' లోని అకారము) ఉండుటచే నీ రెండచ్చులకును నడుమ 'న్' కారము నిత్యముగ ఆగమమై పైదిరూప మేర్పఁబడినది ఇట్లే రెండవయుదాహరణముకూడ

**షష్ఠీసమాసమునం దుకారఋకారముల కచ్చు పరమగు నపుడు నుగాగమంబగు. ౩౮.**

రాజుయొక్క ... ఆజ్ఞ ... రాజునాజ్ఞ.
విధాతృయొక్క ... ఆనతి ... విధాతృనానతి.

౩౮ షష్ఠీసమాసమునందు = మొదటిపదము చివఱ షష్ఠీవిభక్తియొక్క యర్థ ముండు (తత్పురుష) సమాసమున

షష్ఠీతత్పురుషసమాసములో మొదటిపదము చివఱ ఉకారముగాని, ఋకారముగాని యుండి దానికిఁ దరువాత అచ్చున్నయెడల-ఉకార ఋకారముల ప్రక్క-అనఁగా పూర్వాపరపదముల నడుమ నుగాగమము (ఆగమమైన నకారము) చేరును

(రాజుయొక్క+ఆజ్ఞ=) రాజు నాజ్ఞ రాజుయొక్క' అనునది షష్ఠీ విభక్తి దానితో రెండవపదమునకు సమాసమగునపుడు యొక్క' అనువిభక్తి లోపించును కాని రాజు' అనుపదము ఆ యర్థమును తెలుపునుగాన 'రాజు' అనునది షష్ఠీసమాసములోని తొలిపదము దాని యుఁకారమునకు ఆజ్ఞ' అని అచ్చుపరముగా నున్నందున నకారము' ఆగమమై రాజు నాజ్ఞ' అయ్యెను ఇట్లే రెండవయుదాహృతిని గ్రహించునది

**ఉదంత స్త్రీసమంబులకును బుంపులకునదంతగుణవాచకంబులకును దనంబు పరంబగునపుడు నుగాగమంబగు. ౩౯.**

సొగసు ... తనము ... { సొగసుందనము. / సొగసుఁదనము. / సొగసున్దనము.

సరసపు ... తనము... { సరసపుందనము. / సరసపుఁదనము. / సరసపున్దనము.

తెల్ల ... తనము... { తెల్లందనము. / తెల్లఁదనము. / తెల్లన్దనము.

౩౫. ప్రథమావిభక్తియందు డు, ము' ప్రత్యయములు రానివి స్త్రీసమములు పదము చివర హ్రస్వమగు ఉకారము కలవి ఉదంతస్త్రీసమములు హ్రస్వమగు అకారము తుదినిగల గుణమును దెల్పుపదములు అదంతగుణవాచకములు.

హ్రస్వోకారము చివరఁగల స్త్రీసమముల తర్వాతఁగాని పుంపు' లు చివరఁగలపదముల తర్వాతఁగాని హ్రస్వాకారము చివరఁగల గుణవాచకము లగు పదములతర్వాతఁగాని తనము' అనునది ఉన్నయెడల ఆమొదటిపదము నకును తనము' నకును నడుమ నకారము ఆగమముగా వచ్చిచేరును. నకారము ద్రుతము గావునను తనము' పరుషము మొదటఁగలపదము కావునను-పరుషము పరమగునపుడు కల్గు ద్రుతకార్యములెల్లను కల్గును [అనఁగా నకారము ం ఁ న్-లుగామాఱును ఇయ్యది సమాసకార్యమగుటచే ద్రుతము స్వత్వరూపమును (ను' గా ఉండుటను) పొందదు] (సొగసు + తనము =) (1) సొగసుఁదనము (2) సొగసుందనము (3) సొగసున్దనము.

ఇట్లే తక్కినవియును.

సొగసు దనము' ఉదంతస్త్రీసమమునకును సరసపుఁదనము' పుంపు లకును తెల్లఁదనము' అదంతగుణవాచకమునకును ఉదాహృతులు.

**సమాసంబునం బ్రాఁతాదులతొలియచ్చుమీఁదివర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు. ౩౬.**

ప్రాఁత ... ఇల్లు ... { ప్రాయిల్లు / ప్రాఁతయిల్లు.

| | | | | |
|---|---|---|---|---|
| లేత | ... | దూడ | ... | { లేదూడ.<br>లేతదూడ. |
| పూవు | .. | రెమ్మ | ... | { పూరెమ్మ<br>పూవురెమ్మ. |

31. 'ప్రాత' మొదలగుశబ్దములతో రెండవశబ్దమునకు సమాసమగునపుడు 'ప్రాత'లోని మొదటియచ్చువఱకే మిగిలి తక్కినయక్షరములు లోపించును —[అనఁగా- 'ప్రా' అనునదిమాత్రమే మిగులును ఇట్లే తక్కిన వానిలోను మొదటియక్షరమే మిగులుచుండును.] ఇట్లు లోపించుట బహుళముకాన ఈలోప మిచ్చవచ్చినట్లు రావచ్చును ఇందలి రెండుదాహరణములు మాత్రము వికల్పలోపమువచ్చుట కీయఁబడినవి (ప్రాత+ఇల్లు=) ప్రాయిల్లు ప్రాతయిల్లు

ఇచట 'త' లోపించినపిదప యడాగమమువచ్చి 'ప్రాయిల్లు' అయినది 'ప్రాతయిల్లు' అనునపుడును బహుళమగు అకారసంధి రానందున 'యడాగమము' వచ్చి ప్రాతయిల్లు అయినది. [ఇందలి మొదటిరెండుదాహరణములును కర్మధారయములు మూఁడవది తత్పురుషము]

## లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు పుగాగమంబగు. 32.

| | | | | |
|---|---|---|---|---|
| ప్రాత | ... | కెంపు | ... | ప్రాఁగెంపు. |
| లేత | ... | కొమ్మ | ... | లేఁగొమ్మ |
| పూవు | ... | తోఁట | ... | పూఁదోఁట. |
| మీఁదు | ... | కడ | ... | మీఁగడ. |
| కెంపు | ... | తామర | ... | కెందామర |
| చెన్ను | ... | తోవ | ... | చెందోవ |

చెన్నుశబ్దము వృత్తిని శోణార్థకంబు బహుళగ్రహణముచే మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు వ్యవస్థితవిభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

౩౭ లుప్తశేషంబునకు=(మిగిలిన యక్షరములు) పోఁగా మిగిలిన మొదటి యక్షరమునకు

ప్రాఁతాదిసూత్రము (౩౬) ననుసరించి మిగిలిన తొలియక్షరమునకుఁ బిదప పరుషము లున్నచో-ఆ మిగిలిన తొలియక్షరమునకుఁ దర్వాత (పరుషమునకు ముందు) నకారము ఆగమముగా వచ్చును.

నకారము ద్రుతమగుటచే ద్రుతమునకు వచ్చుకార్యములు వచ్చును. (ప్రాఁత+కెంపు=) ప్రాఁగెంపు ఇట ౩౬-వ సూత్రముచేఁ త'పోయి ప్రా' అనిమాత్రము మిగిలి దానికి పరుషమగు కకారము పరమగుటచే నకారము ఆగమమయి ప్రాన్+కెంపు' అని యుండినది పిదప సంధి ౧౬-వ సూత్రముచే కకారము గకారముగా మాఱినది ౧౭-వ సూత్రముచే నకారము అఖసున్నగా మాఱినది

ఇచట ప్రాఁగెంపు' అని మాత్రమే యగును. కాని ప్రాంగెంపు ప్రాన్గెంపు ప్రానుగెంపు' అని యుండవు దీర్ఘముమీఁద నిండుసున్న యుండనందున ప్రాంగెంపు' కాదు ఈసూత్రములోని వివరణమునుబట్టి సంశ్లేషము రానందున ప్రాన్గెంపు' కాదు సమాసములలో ద్రుతమునకు స్వత్వము (ను) ఉండనందున ప్రానుగెంపు' గాఁజాలదు

తొలియచ్చుమీఁది వర్ణములకు లోపము రానప్పుడు ప్రాఁతకెంపు అనియు నుండును

లేఁగొమ్మ పూఁదోఁట' అనునుదాహరణముల నిట్లే గ్రహించునది. లోపములేనపు డచ్చటను లేఁతకొమ్మ పూవుఁదోఁట' అనురూపము లగును (మీఁదు+కడ=) మీఁగడ' అనుచోటను రూప మేర్పడువిధము ఇట్లే కాని

యిందును తరువాతి రెండుదాహరణములయందును. లోపము నిత్యము. కాన మీఁదుకడ కెంపుతామర చెన్నుతోవ' అనురూపము లుండవు ఏల యన ఈలోపము బహుళమని 31-వ సూత్రముననే చెప్పఁబడియున్నదిగాన, అక్కడ లోపము నిత్యమని గ్రహింపనగు.

కెందామర చెందోవ' అనుచోట్ల ద్రుతము నిండుసున్నగానే మాఱి నది ఏలయన —సంధి 22-వ సూత్రము ననుసరించి నుడి తొలిహ్రస్వము పయి నిండుసున్నయేగాని యఱసున్న యుండదు

చెన్నుశబ్దము — చెన్ను అనునది సమాసములోఁగాక వ్యస్తముగా నున్నప్పుడు అందము విధము అనునర్థములను తెలుపును. కాని వృత్తి యందు (సమాసమునందు) శోణార్థకంబు (ఎఱుపు అనునర్థమును తెల్పును కాన ఇచటి చెంగోవ' కు ఎఱ్ఱకలువ' యర్థము.)

మీఁదుప్రభృతులకు = మీఁదు' మొదలగువానికి. వ్యవస్థితవిభాష - ప్రయోగముల ననుసరించి యిది యిచ్చట వచ్చును ఇది యిచ్చట రాదు' అను వ్యవస్థను (నియమమును) ఏర్పఱిచిన విభాష

**క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల నుగాగమంబునుం గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు. 38.**

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | .. | ఛాయ | . | క్రొంజాయ. |
| క్రొత్త | ... | చెమట | . | క్రొంజెమట. |
| క్రొత్త | ... | పసిఁడి | | క్రొంబసిఁడి. |
| క్రొత్త | ... | కారు | ... | క్రొక్కారు. |
| క్రొత్త | ... | తావి | ... | క్రొత్తావి. |

పరుషేతరంబులు పరంబు లగునపుడు నుగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వంబగు.

| | | | | |
|---|---|---|---|---|
| క్రొత్త | ... | గండి | ... | క్రొంగ్గండి |
| క్రొత్త | ... | నన | ... | క్రొన్నన. |
| క్రొత్త | . | మావి | ... | క్రొమ్మావి |

కెంధూళి కెంజడలని ప్రయోగంబులు కానంబడియెడి. బహుళగ్రహణముచేతఁ గ్రొత్తకుండ లిత్యాదుల లోపంబు లేదు. క్రీఁగడుపు - క్రీఁగాలు - క్రీఁదొడ-ఇత్యాదులం గ్రిందు శబ్దమునకు లుప్తశేషంబునకు దీర్ఘంబు బహుళగ్రహణముచేత నని యెఱుఁగునది

3ర ఆద్యక్షరశేషము = (లోపింపఁగా) మిగిలిన మొదటియక్షరము
మీఁదిహల్లు = సమాసముపొందిన రెండవపదము మొదటిహల్లు

సమాసములందు వేఱొకపదము పరమగునపుడు క్రొత్తశబ్దములోని త్త' లోపించి క్రొ' మాత్రము మిగులును దానికి కొన్నిచోట్ల నకారము ఆగమముగా వచ్చును కొన్నియెడల పరమైనహల్లు ద్విత్వమును పొందును. (ద్విత్వము పొందుట యనఁగా ఇనుమడించుట)

క్రొత్తశబ్దము ప్రాఁతాదులలోఁ జేరినదే ప్రాఁతాదుల లుప్తశేషములకు పరుషములు పరమగునపుడు నుగాగమము విధింపఁబడెనుగాన క్రొత్త' శబ్దమునకును ఆయాగమము వచ్చుచున్నది కాని మీఁదిహల్లునకు ద్విత్వము రాకున్నది ద్వితీయపదాదిహల్లు ద్విత్వమును పొందుటకయి యీసూత్ర మారంభింపఁబడినది లుప్తశేషమగు క్రొ' అనుదానికి కొన్నిపరుషములు పరమగునపుడు నుగాగమమును ఇతరములగువర్ణములు పరమగునపుడు మీఁదిహల్లునకు ద్విత్వమును కలుగునని భావము

(క్రొత్త+చాయ) క్రొంజాయ'

ఇచట లుప్తశేషమగు క్రొ' అనుదానికి చాయ' అనుపదములోని పరుషమగు చకారము పరమగుటచే నకారమాగమముగా వచ్చి ఆద్రుతము పూర్ణబిందువుగా మాఱినది

సమాసమున ద్రుతమునకు స్వత్వము లేనందున 'క్రొనుజాయ' కాదు. ౨౨-వ సూత్రప్రకారము అఱసున్న లేనందున 'క్రొఁజాయ' కాదు. ౩౬-వ సూత్రవివరణము ననుసరించి సంశ్లేషము లేనందున 'క్రొజ్జాయ' అనియుఁ గాదు.

క్రొంకెమ్మ' క్రొంబసిఁడి' అనునవియుం మీఁదిరీతినే గ్రాహ్యములు

క్రొక్కారు' అనుచోట తొలుత 'క్రొత్తకారు' అనియుండఁగా, లుప్తశేషమునకుఁ బరమైన 'కారు' లోని కకారమునకు ద్విత్వము వచ్చినది. 'క్రొత్తావి' మున్నగునవియు నిట్టే

పరుషేతరంబులు = క్ష చ చే ట త ప లకంటె వేఱైన యక్షరములు. నుగాగమప్రాప్తిలేమిం జేసి = నకారాగమము వచ్చుట లేకపోవుటచేత వానికి =పరుషేతరములకుఁ-సరళ స్థిరంబులు పరమగునపుడు మీఁదహల్లునకు ద్విత్వమగునని భావము. కావుననే క్రొగ్గండి క్రొన్నన క్రొత్తావి' అనురూపములు సిద్ధించినవి.

కెంధూళి-ఉదాహరణములను బట్టి ప్రాఁతాదిసూత్రములకుఁ గేవల మాచ్ఛికసమాసములే (అచ్చతెలుఁగుసమాసములే) విషయమనియు తత్సమములు పరమగునపుడు లోప నుగాగమములుగాని, లోపద్విత్వములుగాని కలుగవనియు గ్రహింపవలెను అట్లు గ్రహించినచో 'కెంధూళి' అనురూపము సిద్ధింపఁజాలదు కాన చిన్నయసూరిగారు సూత్రములకు లోఁగని యిట్టి పెద్దలప్రయోగములు కనఁబడుచున్నవని చెప్పవలసివచ్చెను

కెంజడలు (కెంపు+జడలు)' అనుచోట రెండును అచ్ఛికపదములే. అయినను జడలు' లోని మొదటియక్షరము సరళముకాఁబట్టి సరళములు పరమగునపుడు ద్విత్వము రావలసియుండెను ద్విత్వమువచ్చినచో 'కెజ్జడలు' అని అసాధురూపము కావలసివచ్చును కెంజడలు అనునది సూత్రమునకు లోఁగని ప్రయోగముగాన దీనినిగూడఁ జూపవలసివచ్చినది

(క్రొత్త + కుండలు =) క్రొత్తకుండలు’ అనునప్పుడు క్రొత్త’ లోని త్త’ లోపింపలేదు పరమైన పదమునకు ముందు నకారాగమముగాని పరమైన పదమునకు ద్విత్వముగాని రాలేదు. అట్లు రాకుండుటకుఁ గారణము ప్రాంతాదిసూత్రములో బహుళము’ అని చెప్పుటయే. అందువలన పెద్దలప్రయోగముల ననుసరించియే లోప నుగాగమ ద్విత్వములను చేయుచుండవలెనని తేలుచున్నది.

ప్రయోగముల ననుసరించియే యిక్కార్యములను చేయవలసియుండుటచే ‘(క్రిందు + కడుపు =) క్రీఁగడుపు (క్రిందు + కాలు =) క్రీఁగాలు (క్రిందు + తొడ =) క్రీఁదొడ అనుచోట్ల లోపింపఁగా మిగిలిన క్రి’ అనుదానికి దీర్ఘమువచ్చినది ఆదీర్ఘమును ఏసూత్రమును విధించలేదు కాని కోరినరీతి రూపములను సాధించుట బహుళగ్రహణమునకుఁ బ్రయోజనముగాన అచ్చటి దీర్ఘము ప్రాంతాదిసూత్రములోని బహుళము’ అనుదానివల్లనే వచ్చినదని గ్రహింపనగును.

## అన్యంబులకు సహిత మిక్కార్యంబులు కొండొకచోఁ గానంబడియెడి ౩౯.

ఒకానొకశబ్దంబున కొకానొకశబ్దము పరంబగునపుడు తొంటియట్లు లోపనుగాగమంబులును గొండొకశబ్దమున కొకానొకశబ్దము పరంబగునపుడు లోపద్విత్వంబులును బ్రయోగంబులందుఁ జూపట్టెడు నని తాత్పర్యము.

| | | | | |
|---|---|---|---|---|
| పది | ... | తొమ్మిది | ... | పంతొమ్మిది. |
| తొమ్మిది | ... | పది | ... | తొంబది |
| వంక | . | చెఱఁగు | ... | వంజెఱఁగు. |
| సగము | ... | కోరు | ... | సంగోరు. |

| | | | | |
|---|---|---|---|---|
| నిండు | ... | వెఱ | ... | నివ్వెఱ |
| నిండు | ... | వెలుఁగు | ... | నివ్వెలుఁగు |
| నెఱ | .. | తఱి | ... | నెత్తఱి |
| నెఱ | ... | నడుము | ... | నెన్నడుము. |
| నెఱ | .. | మది | .. | నెమ్మది |
| నెఱ | ... | వడి | ... | నెవ్వడి. |

ఇత్యాదులు ప్రయోగంబువలనం దెలియునవి

౩౯ అన్యంబులకు సహితము=ప్రాఁతాదులకంటె వేఱయినపదములకుఁ గూడ ఇత్కార్యంబులు=కొన్నిటికి లోపనుగాగములు కొన్నిటికి లోప ద్విత్వములును కానంబడియెడి=(సూత్రములచే సాధింపఁబడనివి) కనఁబడు చున్నవి.

పండొమ్మిది' అనుచోట పది' ప్రాఁతాదులలోఁ జేరకున్నను అద్యక్షరము మిగిలి నుగాగమము వచ్చి ద్రుతకార్యములగు పూర్ణబిందు సరళాదేశములు వచ్చినవి

తొంబది పంకెలుఁగు సంగోరులు నిట్లే నివ్వెఱ' మున్నగువానిలో లోపు, ద్విత్వములువచ్చి కోరినసాధురూపము లేర్పడినవి.

**ఆమ్రేడితంబు పరంబగునపుడు కడాదులందొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల నదంతంబగు ద్విరుక్తటకారం బగు ౪౦.**

ఈ సూత్రంబునకు భృశార్థంబునందు ద్విరుక్తంబు విషయంబని యెఱుంగునది.

| | | | | |
|---|---|---|---|---|
| కడ | ... | కడ | ... | కట్టకడ. |
| ఎదురు | ... | ఎదురు | ... | ఎట్టఎదురు. |

కడ-ఎదురు-కొన-చివర-తుద-తెన్ను - తెరువు - నడుము - పగలు-పిడుగు-బయలు-మొదలు-ఇత్యాదులు కడాదులు

౪౦ (ఒకపదమును రెండుసారు లుచ్చరింపఁగా అందు రెండవసారి యుచ్చరింపఁబడినపదము ఆమ్రేడితము అ) ఆమ్రేడితమునకు ముందుండు కడ' మున్నగువాని మొదటియచ్చుమీఁది యక్షరములకు ట్ట' అగును అనఁగా- అందు మొదటియక్షరముమాత్రము మిగిలి తక్కినవాని నన్నింటిని కొట్టివేసి ట్ట' వచ్చునని భావము.

ఈసూత్రంబునకు—భృశార్థంబునందు = మిక్కిలి యనునర్థమున — ఈసూత్రోదాహరణములలోని ద్విరుక్తములు మిక్కిలి యనునర్థమున వచ్చినవి. కట్టకడ' యనఁగా మిక్కిలి కడ యని యర్థము ఇట్లే తక్కినయుదాహరణములను గ్రహించునది (కడ+కడ=) కట్టకడ' (డ-కు ట్ట వచ్చినది) (ఎదురు+ఎదురు=( దురు'కు ట్ట) ఎట్టయెదురు

## ఆమ్రేడితంబు పరంబగునపుడు విభక్తిలోపంబు బహుళంబుగా నగు. ౪౧.

అప్పటికిన్ . . . అప్పటికిన్ . . . { అప్పటప్పటికిన్ / అప్పటికప్పటికిన్.

అక్కడన్ . . . అక్కడన్ . . . { అక్కడక్కడన్. / అక్కడనక్కడన్.

ఇంటన్ . . . ఇంటన్ . . . { ఇంటింటన్. / ఇంటనింటన్.

ఊరన్ . . . ఊరన్ . . . { ఊరూరన్. / ఊరనూరన్.

౭ ఇంచుకనాఁడిత్యాదులందు బహుళగ్రహణముచేత నంతిమాక్షరలోపంబు నగు

ఇంచుక . . . ఇంచుక . . . { ఇంచించుక. / ఇంచుకించుక.

నాఁడు .. నాఁడు . { నానాఁడు. / నాఁడునాఁడు }

౪౧ ఆమ్రేడితము పరముగా నున్నపుడు మొదటిపదము చివరనున్న విభక్తి బహుళముగా లోపించును అనఁగా- కొన్నిచోట్ల లోపము వికల్పము. కొన్నిచోట్ల-విభక్తులులేనియెడల చివరియక్షరము లోపించును' అనిభావము.

(అప్పటికిన్ + అప్పటికిన్ =)అప్పటప్పటికిన ఇచట రెండవ అప్పటికిన్' పరమగునపుడు మొదటిదానిలోని షష్ఠీవిభక్తి కిన్ లోపించినది పిదప 'అచ్చున కామ్రేడితంబు పరంబగునపుడు సంధి కలుగ నగు' ననుసూత్రముచే సంధివచ్చి అప్పటప్పటికిన్' అని యైనది ఇట్లే తక్కినయుదాహృతులను

ఇంచుక—అంతిమాక్షర లోపంబు=చివరియక్షరము లోపించుట

(ఇంచుక + ఇంచుక =) ( ) ఇంచించుక ఇంచుకించుక'

ఇచట మొదటిపదము చివరి క' లోపించినపిదప ఇంచు + ఇంచుక' అనియుండఁగా ౧౦-వ సూత్రము ననుసరించి సంధివచ్చి ఇంచించుక' అయినది ఆయక్షరము లోపింపనపుడు ఇంచుకించుక' అయినది

## అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు ౪౨.

అందదుకు - ఇట్టింకులు - ఇల్లిగ్గులు - చెల్లచెదరు - చెల్లాచెదరు - తుత్తుమురు - తుత్తునియలు - మిఱుమిట్లు - ఇత్యాదు లెఱుంగునది

౪౨ అందదుకప్రభృతులు=అందదుకు మున్నగునవి యథాప్రయోగంబుగ=ప్రయోగముల ననుసరించి గ్రాహ్యంబులు=గ్రహింపఁదగినవి.

(అదుకు + అదుకు) అందదుకు' ఇచట ఆమ్రేడితము పరమగునపుడు తొలి అదుకు' అందు' గా మారినది. ఇట్లే తక్కినచోట్లను ఒకనియమము లేక

మార్పులు కానవచ్చుచున్నవి ఇట్టిచోట్ల వర్ణలోపము వర్ణాదేశము మున్నగునవి మహాకవులప్రయోగముల ననుసరించి గ్రహింపనగునని యీసూత్రమున కర్థము

ఇంకులు + ఇంకులు = ఇల్లింకులు' ఇగ్గులు + ఇగ్గులు = ఇల్లిగ్గులు చెదరు + చెదరు = (1) చెల్లచెదరు చెల్లాచెదరు తుమురు + తుమురు = తుత్తుమురు తునియలు + తునియలు = తుత్తునియలు మిట్లు + మిట్లు = మిఱుమిట్లు

## చేత తోడ వలనల కిత్వంబు సమాసంబులం దగు ౪౩.

| | | |
|---|---|---|
| నీచేతన్ | ప్రోపు .. | నీచేతిప్రోపు |
| నాతోడన్ ... | చెలిమి .. | నాతోడిచెలిమి |
| నీవలనన్ ... | భయము ... | నీవలనిభయము |

౪౩ ఇత్వంబు = ఇకారము సమాసమునందు చేత తోడ వలన అనువానికి ఇకారము ఆదేశముగావచ్చును అనఁగా మీఁదివాని చివఱనున్న అకారముపోయి దాని స్థానమున ఇకారమువచ్చునని భావము (నీచేతన్ + ప్రోపు=) నీచేతిప్రోపు' అనుచోట తొలుత సంధి ౨౪-వ సూత్రముచే 'చేతన్ లోని ద్రుతమగు నకారము లోపించును' అపిదప త' మీఁది అకారమునకు ఇకారమాదేశమయి నీచేతిప్రోపు' అని యైనది తక్కినవియు నిట్లే

## అంద్వాదుల కలిగాగమంబు సమాసంబునం దగు ౪౪.

| | | |
|---|---|---|
| నాయందున్... | కరుణ .. | నాయందలికరుణ |
| ఇందున్ ... | జనులు ... | ఇందలిజనులు. |
| ఎందున్ ... | వారు . | ఎందలివారు. |

ఎందు శబ్దమున కలిగాగము కొందఱు లేదందురు.

౪౪ సమాసమునందు అందు' మున్నగువానికి అలి' అనునది ఆగమముగావచ్చును [ అలిక్' అని కకారము చివఱఁగలదగుటచే ఈ అలి' అనునది అందు' అనుదానిప్రక్కఁజేరునని గ్రహించునది ]

(నాయందున్ + కరుణ=) నాయందలి కరుణ అనుచోట పుంస్తు తొలుత ౬౮-వ సూత్రముచే సామాసికద్రుతమగు నకారమునకు లోపము వచ్చును పిదప నాయందు' అనుదానిప్రక్క అలి' చేరి ఉకారసంధిరాఁగా నాయందలికరుణ అని యైనది ఇందలి జనులు' మున్నగునవియుం నిట్లే

ఎందు—ఎందుశబ్దమునకు అలిగాగమము లేదనియుం అందుచే ఎందలివారు మున్నగురూపములు కావనియు నథర్వణాచార్యులయభిప్రాయము

అది యవి శబ్దంబులయత్తునకు వృత్తినిలోపంబు బహుళంబుగ నగు. ౮౫

నా . అది . ) నాది ( నాయది

నా ... అవి { నావి ( నాయవి

ఉదంతములగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు నిదంతంబులగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద నిత్యంబనియు బహుళగ్రహణముచే నెఱుంగునది

వచ్చునది-వచ్చునవి-వచ్చెడిది-వచ్చెడివి

౮౫ అత్తు=హ్రస్వమైన అకారము వృత్తిని=సమాసమునందు.

సమాసమునందు మొదటిపదమునకుఁ దర్వాతనున్న అది, అవి' యను శబ్దముల అకారము బహుళముగా లోపించును

ఈసూత్రమున కీయఁబడిన యుదాహరణములఁబట్టియు, వానిక్రిందఁ గల వివరణమునుబట్టియు నీ అకారలోపము నీక్రిందివిధమున నిశ్చయింపవచ్చును (1) అకారమునకుఁ దరువాతనున్న అది అవి' శబ్దముల అకారము వికల్పముగా లోపించును

(2). ఇకారమునకుఁ బరముగా నున్నప్పుడు 'అది' 'అవి' లోని అకారము నిత్యముగా లోపించును

(3) ఉకారాంతవిశేషణములమీది 'అది' 'అవి' లోని అకారమునకు లోపము రానేరాదు

(నా+అది= నాది నాయది ఇక్కడ అకారలోపము వచ్చినపుడు 'నాది' అయినది లోపము రానప్పుడు యడాగమము వచ్చి 'నాయది' యైనది. ఇది వికల్పమున నుదాహృతి

(వచ్చు+అది=) 'వచ్చునది' ఇచ్చట 'వచ్చు' అనునది ఉకారాంత తద్ధర్మవిశేషణము, దానికిఁబరమైన 'అది' లోని అకారమునకు లోపము లేనే లేదు పిదప 33-వ సూత్రము ననుసరించి నుగాగమము వచ్చి 'వచ్చునది' అని యయినది

(వచ్చెడి+అది=) 'వచ్చెడిది' ఇచట 'వచ్చెడి' అనునది ఇకారాంత తద్ధర్మవిశేషణము. దానికి పరముగానున్న 'అది' లోని అకారము లోపింపఁగా 'వచ్చెడిది' అయినది

ఇన్నిరీతులకును బహుళగ్రహణమే కారణము

### పడ్వాదులు పరంబులగునపుడు మువర్ణకంబునకు లోపపూర్ణబిందువులు విభాష నగు ౪౬.

భయము ... పడె ... { భయపడె / భయంపడె. / భయముపడె

సూత్రము ... పట్టె ... { సూత్రపట్టె / సూత్రంపట్టె / సూత్రముపట్టె

ఈకార్యము కర్తృవాచి మువర్ణకమునకుఁ గలుగదు
గజము పడియె - అశ్వము పడియె.

౪౬. పడ్వాదులు=పడు మొదలగునవి మువర్ణమునకు=(ప్రథమావిభక్తి సంబంధమగు) ముప్రత్యయమునకు లోప పూర్ణబిందువులు=లోపమును బిందుసున్నయును విభాషనగు=వికల్పముగా కలుగును

పడు' మున్నగువాని పూర్వముగా (ముందుగా) నుండు ప్రత్యయ సంబంధమైన ము' అనునది లోపింపనైనను లోపించును లేదా బిందుసున్నగా మాఱును లేదా ము' గా ఉండినను ఉండిపోవచ్చును

(భయము+పడె=) (1) భయపడె (2)భయంపడె (3)భయముపడె

ము' లోపమున భయపడె అనియు ం' గా మాఱగా భయంపడె' అనియు నీసూత్రము వికల్పమగుటచే భయముపడె అనియుం రూపము లగును

ఈకార్యము—లోప పూర్ణబిందువులు కర్మాద్యర్థకములగు పదముల 'ము' ప్రత్యయమునకేగాని కర్తను తెలియఁజేయుఁపదముల మువర్ణకమునకు రావు. [పనిని జేయునది కర్త కర్తచేయుపనియొక్క ఫలమును పొందునది కర్మ]

గజము పడియె' అనుచోటఁగల గజము' అనునది కర్తృవాచకము. కాన అచట గజపడియె గజంపడియె' అను అసాధురూపములు కలుగవని భావము

## మధ్యమపురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాషనగు ౪౭.

చూడుము ... నన్ను .. { చూడునన్ను.
చూడుమునన్ను.

ఇటు ... చూడుము ... { ఇటు చూడు
ఇటు చూడుము.

చూడుమనియె-వినుమనియె ఇచ్చట నచ్చు పరంబయి నది కావున లోపము లేదు

౪౭ మధ్యమపురుషముువర్ణకము = మధ్యమపురుష క్రియాపదములలో వు కు మాఱుగా వచ్చిన ము ప్రత్యయము

అవసానము = అక్షరములు లేకుండుట మధ్యమపురుషమునందలి ము ప్రత్యయమునకు హలు పరముగా నున్నను వేరొకపదము పరముగా లేకున్నను లోపము వికల్పముగా వచ్చును

(చూడుము+నన్ను=) చూడు నన్ను చూడుము నన్ను

ఇచట నన్ను అను పదములోని తొలి నకారము హల్లు అది పర మగునపుడు దానిముందున్న ము వికల్పముగా లోపించినది

(నన్ను + చూడుము=) నన్ను చూడు నన్ను చూడుము అనుచో ముప్రత్యయమవసానమందున్నందున-అనగా ము తర్వాత అక్షరములు లేనందున వికల్పముగ లోపించినది-అచ్చుపరమగునపుడు ము లోపించ నందున (చూడుము+అనియె=) చూడు మనియె అనియే యగును

## వ్యతిరేకమధ్యమముువర్ణకంబున కెల్లయెడలలోపంబు విభాషనగు. ౪౮

నమ్మకుము ... ఇట ... { నమ్మకిట / నమ్మకుమిట

౪౮ వ్యతిరేకమధ్యమముువర్ణకంబునకు = ధాత్వర్థమునకు విపరీతమగు నర్థమును దెలుపు కుము అను మధ్యమపురుష క్రియాభాగములోని ము ప్రత్యయమునకు ఎల్లయెడల = అన్ని చోట్లను—అనగా హల్లులు పరమైనను, అచ్చు పరమైనను లేక ఏదియు పరముగా లేకున్నను అవసానమందైనను) పరే మధ్యమపురుషమున వ్యతిరేకార్థమునందలి కుము లోని ముకార మునకు లోపము వికల్పముగా నగునని యర్థము

(నమ్మకము + ఇట=) నమ్మకిట నమ్మకుమిట'

ఇచట వ్యతిరేకార్థకమగు కము లోని ము' లోపింపఁగా ఉకారసంధి వచ్చి నమ్మకిట' అయినది ము' లోపించనపుడు ఉకారసంధివచ్చి నమ్మకుమిట' అని యయినది.

## ఆమ్రేడితంబు పరంబగునపుడు మధ్యమముడుజ్జులకు లోపంబు విభాషనగు ౪౯.

ఉండుము ... . ఉండుము { ఉండుండుము / ఉండుముండుము }

కొట్టుఁడు . కొట్టుఁడు .. { కొట్టు కొట్టుఁడు / కొట్టుఁడు కొట్టుఁడు }

౪౯ ఆమ్రేడితము రెండవపదముగా నున్నప్పుడు దానికి ముందున్న (తొలి) పదము చివరనున్న ము డుజ్' ప్రత్యయములు వికల్పముగా లోపించును

[ఆశీస్సు నున్నగు నర్థములో మధ్యమపురుష మేకవచనమునందలి ప్రత్యయమునకు ము' ఆదేశమగును బహువచనమందలి రు' కు డుజ్' ఆదేశమగును డుజ్'లో డు అనునది మాత్రమే మిగులును దాని చివర ఉకారమున్నందున (జిత్తు బిందుపూర్వ బగునను సూత్రముచే) డు' కు ముందు సున్న వచ్చుచుండును]

(ఉండుము+ఉండుము=) (1) ఉండుండుము (2) ఉండుముండుము'

ఇచట రెండవ ఉండుము' అనుదానికి ముందున్న మొదటి ఉండుము' లోని ము' వికల్పముగా లోపించినది

లోపింపఁగా ఉండుండుము' అయినది లేనపుడు ఉండుముండుము' అయినది (కొట్టుఁడు+కొట్టుఁడు =) (1) కొట్టుకొట్టుఁడు (2) కొట్టుఁడు కొట్టుఁడు

ఇట వెనుకటివలె ఆమ్రేడితము పరమగుచో మొదటి 'కొట్టుఁడు' లోని బిందుపూర్వకడకారము లోపించి 'కొట్టుకొట్టుఁడు' అయినది లోపము రానపుడు 'కొట్టుఁడు కొట్టుఁడు' ఐనది

**విసర్గంబున కనుకరణంబున లోపంబగు. ౫౦.**

వర్ధతాం శ్రీః—అనియె—వర్ధతాంశ్రీ యనియె

౫౦ విసర్గమునకు = ః అనుదానికి అనుకరణంబున = అను అను దానిని చేర్చి (సాధనముగాఁ జేసి—ప్రక్కఁ జేర్చి) చెప్పినపుడు

[ఒకరు చెప్పినదానిని—వారు చెప్పినరీతినే (అనుకరించి) చెప్పుట అనుకరణము అట్టియనుకరణమున విసర్గ లోపించునని యర్థము.]

(వర్ధతాం శ్రీః' + అనియె =) వర్ధతాం శ్రీ యనియె'

ఇట 'వర్ధతాంశ్రీః' అనునది ఇతరులు చెప్పినమాట ఆమాటను ఉన్నది యున్నట్లుగానే వేఱొకరిచే అనుకరింపఁబడినందున విసర్గము లోపించి తరువాత యడాగమమువచ్చి 'వర్ధతాంశ్రీ యనియె' అనియైనది

[అనుకరణమునందు ఇతరులు చెప్పినమాటకుఁ బిదప 'అను' ధాతుసంబంధములగు అను అని అన్న అన్ 'అనియె' మున్నగునవి చేరుచుండును ఇట 'అనియె' నని చేరినది

**అనుకృతిని నమశ్శబ్దము తుదియచ్చున కోత్వము విభాషనగు ౫౧**

తుభ్యం నమః.., అనె . { తుభ్యం నమోయనె.
తుభ్యం నమయనె.

ఈకార్యము లాఁతిచో సహితను గనంబడియెడి.
గతాను గతికో లోకో యటంచున్.

౫౧ అనుకృతి = అనుకరించునపుడు నమశ్శబ్దము తుదియచ్చునకు = 'నమః' అనుదానిలోని చివరి (మకారముమీఁది) హ్రస్వమగు అకారమునకు ఓత్వము = ఓకారము విభాష = వికల్పము

ఒకరుచెప్పినదాని నారీతినే తిరిగి చెప్పుసందర్భమున నమః అనుదాని లోని విసర్గమునకు ముందున్న (మకారముమీఁది) అకారము వికల్పముగా ఓకారమగును

(తుభ్యంనమః+అనె=తుభ్యంనమోయనె తుభ్యం నమయనె ఇచటఁ దొలుతఁ ౫౦-వ సూత్రముచే విసర్గము లోపింపఁగా ఈసూత్రముచే దానికి ముందున్న అకారము ఓకారముగా మాఱి తుభ్యం నమో యనియెా అయినది ఓత్వము వికల్పమగుటచే అది రానప్పుడు అకార ముండిపోయినది [రెండు చోట్లను సంధి పొందురెండుపదములకును నడుమ యడాగమము వచ్చుట గమనించునది ]

ఈకారము—అకారము ఓకారముగా మాఱుట (నమశ్శబ్దముకంటె) ఇతరములగుచోట్లను కనుబడుచున్నది ఉదా—(గతానుగతికోలోక +అటంచున్=) గతానుగతికోలోకో యటంచున్ ఇచట లోక అనుచోటఁగల అకారము ఓకారముగా మాఱినది

## అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనంబగు ౫౨

| | | | | |
|---|---|---|---|---|
| కింతత్ | ... | అనియె | ... | కింతత్తనియె. |
| కస్త్వమ్ | .. | అనియె | .. | కస్త్వమ్మనిగా. |

౫౨. అనుకరింపబడుపదము చివఱిహల్లునకు ద్విత్వముకలుగును (కిం తత్+అనియె=) కింతత్తనియె ఇచట కింతత్ అనునది అనుకరింపఁబడుచున్నదికాన దాని చివఱి తకారము ద్విత్వమును పొందినది

## అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాషనగు. ౫౩.

దాసోహమ్ ... అనె ... { దాసోహమ్మనె / దాసోహమనె

తత్కర్తవ్యమ్ ... అనె ... { తత్కర్తవ్యమ్మనె / తత్కర్తవ్యమనె.

౫౩ అనుకరణమునందు అహమ్ మున్నగుశబ్దముల మకారమునకు ద్విత్వము వికల్పముగా నగును

(దాసోఽహమ్+అనె=) (౧) దాసోఽహమ్మనె (2) దాసోఽహమనె.'

ఇట ద్విత్వమురాఁగా దాసోహమ్మనె అనియు అది రానప్పుడు దాసోఽహమనె' అనియు నయినది

కుఱుచోట మీఁదిసూత్రము (౫౨-వ సూత్రము) ననుసరించి ద్విత్వము నిత్యముగా వచ్చుచుండఁగా అహమ్ మున్నగువానికి అద్విత్వము వికల్పము గావచ్చుట కీసూత్రము వ్రాయఁబడినది

ఉదంతనామంబున కనుకరణంబునందు వుగాగమంబగు ౫౪.

ఇయంధేనుః ... అనె .. ఇయంధేనువనె

అనుకృతిని నిడుదకుం గుఱుచ యగునని యొకండు పలికె నది నిరాకరంబు దుర్బలస్య బలం రాజా యన వినవే.

౫౪ ఉదంతనామంబునకు=హ్రస్వమగు ఉకారము చివరఁగల నామ వాచకమునకు వుగాగమంబు=ఆగమమైన వు' అనునది [ఇదికకారము చివరఁ గలదిగాన మొదటిపదము చివరఁ జేరునని యెఱుఁగనది] (ఇయం ధేనుః+ అనె=) ఇయం ధేను వనె

ఇట ౫౦ వ సూత్రము ననుసరించి విసర్గలోపించినపిదప ధేను అను దానిప్రక్క వు' చేరును తర్వాత ఉకారసంధివచ్చి ఇయం ధేనువనె' అని యగుచున్నది

అనుకృతిని—అనుకరింపఁబడుపదములచివర దీర్ఘ ముండినయెడల ఆదీర్ఘము హ్రస్వముగా మాఱునని యిటీవలివా రొకరు చెప్పియున్నారనియు అట్లు చెప్పుటకు తత్సమపరిచ్ఛేదములోని నామంబుల తుదిదీర్ఘంబునకు హ్రస్వం బగు'నను (౫౪-వ) సూత్ర మాధారమయియుండవచ్చుననియు కాని యీ

సంధి విషయమున అది ప్రసక్తము కానందున హ్రస్వము చేయుట విరుద్ధమని యీ యభిప్రాయము దుర్బలస్య బలం రాజా యన వినమే' అనియే యుండును కాని దుర్బలస్య బలం రాజ యన వినవే' అని యుండదని భావము

**వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గాదని యార్యులంద్రు ౫౫.**

సత్యము సర్వశ్రేయము - అదిలేనిచో సర్వధర్మములు వ్యర్థములు ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంత మందు జూపట్టెడు

౫౫ వాక్యావసానంబున = వాక్యము ముగిసినపిదప సంధిలేమి=సంధి రాకుండుట వాక్యము ముగిసినపిదప సంధి సేయునక్కఱలేదని పెద్దలయభిప్రాయమని భావము ఉదాహరణము:- సత్యము సర్వశ్రేయ మదిలేనిచో. అని సంధిచేయఁబడలేదు

సంధివిరహంబు=సంధిలేకుండుట కావ్యంబుల = పద్యకావ్యములలో పాదాంతమందు=పద్యపాదముల చివరయందే చూపట్టెడు=కనబడుచున్నది

పద్యకావ్యములయందు పద్యపాదములు ముగిసినపిదప వేఱొక పాదములో సంధిచేయకుండుట కనఁబడుచున్నది కొన్నిచోట్ల మాత్రము సంధి కనబడుచున్నది

ఉదా-- పడగయన్న హనుమ భయవిహ్వలుఁడు కాడు అరదమునకు సూతుఁ డచ్యుతుండు (ఇచట కాడరదమునకు' అని సంధి రాలేదు)

సర్వవేద సమధిగమము సత్యంబుతో సరిదూఁగఁగావు ఎఱుఁగు సర్వ ధర్మంబుల' (ఇచట సరిదూఁగఁగావెఱుగు సర్వ' అని సంధిరాలేదు)

ఇది సంధిపరిచ్ఛేదము

---

# తత్సమపరిచ్ఛేదము.



డు-ము-వు-లు-ప్రథమ ౧ నువర్ణంబు-ద్వితీయ
చేత-తోడ-తృతీయ ౩ కొఱకు-కయి-చతుర్థి ౪
వలన-కంటె-పట్టి పంచమి ౫-కు యొక్క-లోపల షష్ఠి
అందు-న-సప్తమి

తత్సమపరిచ్ఛేదము—ఆంధ్రభాషాపదములు తత్సమ తద్భవ దేశ్యములని మూఁడువిధములు అందు సంస్కృతప్రాకృతపదతుల్యములు తత్సమములైనను ప్రాకృతసమములు సాధారణముగా తద్భవములక్రిందనే వచ్చుచుండుటచే ఈవ్యాకరణమున తత్సమము లనఁగా సంస్కృతసమములనియే గ్రహింపవలసియున్నది ఆతత్సమశబ్దములప్రక్రియ ఈభాగమునఁ జెప్పఁబడుటచే దీనికి తత్సమపరిచ్ఛేదము’ అను పేరు వచ్చినది

తద్భవ దేశ్యములు కలిసి యాచ్ఛికములని చెప్పఁబడును వానిప్రక్రియ ఆచ్ఛికపరిచ్ఛేదమునఁ జెప్పఁబడును

౧. డు ము వు లు-అనునవి ప్రథమావిభక్తియందు వచ్చుప్రత్యయములు [ఇట్లే-తక్కిన ౬ సూత్రములయెడను గ్రహించునది]

[పదములకు పరస్పరముకల సంబంధమును తెలియఁజేయునది విభక్తి, అనుబంధమును సూచించు డు ము, వు’ లు మున్నగునవి ప్రత్యయములు]

## తృతీయాదులకు నుగాగమంబగు. ౨.

రామునిచేతను - రామునితోడను - రామునికొఱకును. రామునివలనను - రామునికంటెను - రామునకును - రామునియందును.

౮ తృతీయాదులకు=తృతీయాదివిభక్తి మున్నగువానియందుఁ గల ప్రత్యయములకు నుగాగమంబు=ఆగమరూపమైన నకారము

తృతీయ మున్నగువిభక్తులయందుండు ప్రత్యయముల కివతలి ను' ఆగమముగాఁ జేరును ఉదాహరణములనుబట్టి యిచట న' అనునదియే ఆగమ మగునని గ్రహింపవలసియున్నది ]

కయి-పట్టి యొక్కలకు నుగాగమంబు లేదు ౯.

రామునికయి - జ్ఞానముఁబట్టి - రామునియొక్క

౯ మీఁదిసూత్రము ననుసరించి రామునికయిను పట్టిను యొక్కను' అను నుగాగమము రావలసియుండఁగా కయి పట్టి యొక్క'లకు నుగాగమము రాదని యీసూత్రముచే చెప్పఁబడుచున్నది

చేత-తోడ-లోపల-వర్ణకంబుల ప్రథమాక్షరంబులు వైకల్పికంబుగా శేషించు ౧౦.

ప్రత్యయంబు వర్ణకం బని ప్రాచీనులు వ్యవహరింతురు.

రామునిచే - రామునితో - వనములలో.

౧౦ చేత తోడ లోపల' అను మూఁడుప్రత్యయముల మొదటి యక్షరములు వికల్పముగా మిగులును అనఁగా చేత లోని త తోడ' లోని డ' 'లోపల లో పల అనునవి వికల్పముగా లోపించునని యర్థము

ఉ రామునిచే రామునిచేత వనములో వనములోపల

ప్రత్యయంబు— ప్రత్యయశ్చ వర్ణకః' అను చింతామణి సూత్రమును బట్టి ప్రత్యయమునకు తెలుగులో వర్ణకము' అనువ్యవహారమును ప్రాచీనులే యేర్పఱచినట్లు తెలియుచున్నది

డు-ము-వు-న-లేకవచనంబులు ౧౧.

ఏకత్వసంఖ్యను బోధించు ప్రత్యయం బేకవచనంబు.

రాముఁడు-సోముఁడు-వనము-ధనము-ధేనువు-భానువు

౧౧ డు, ము వు అను ప్రథమావిభక్తి ప్రత్యయములు మూఁడును 'వ' అనునది ద్వితీయావిభక్తి ప్రత్యయమును ఏకవచనమునందే యుండును

ఏకత్వ—ఒకటి యగుసంఖ్యను బోధించు ప్రత్యయము ఏకవచనము.

[ఏక=ఒకదానిని వచనము=తెల్పునది] ఇందలి రాముఁడు' మున్నగు నుదాహరణములన్నియు ఒక్కొక్కవ్యక్తిని గూర్చియే తెలుపుచున్నవి

## లువర్ణంబు బహువచనంబు ౧౨.

బహుత్వసంఖ్యను బోధించు ప్రత్యయంబు బహువచనంబు రాములు-సోములు-వనములు - ధనములు - ధేనువులు భానువులు.

౧౨ లు' అను ప్రత్యయము బహువచనమును బోధించును

ఒకదానికంటె ఎక్కువసంఖ్యను తెల్పునది బహువచనము.

రాములు' మున్నగునవి బహువచనాంతములు

## తక్కినవి యుభయంబులు ౧౩.

మిగిలిన ప్రత్యయము లేకత్వ బహుత్వములకు బోధకములని యర్థము వనమును - వనములను - వనముచేతను-వనములచేతను-వనముతోడను-వనములతోడను.

౧౩ ఉభయములు=రెండింటిని తెల్పునవి.

## ఓయామంత్రణంబునందగు. ౧౪.

ఓయనుశబ్దము సంబోధనంబునం దగునని యర్థము. ఇది సంబోధ్యవాచకంబునకు ముందె ప్రయోగింపంబడును. ఓశబ్దంబు తోఁడంగియు సంబోధ్యవాచకంబు ప్రయోగింపవచ్చును ఓరాముఁడ-ఓరాములార, రాముఁడ-రాములార.

౧౪ ఆమంత్రణంబు=ఆహ్వానము-పిలుపు ఇదియే సంబోధనము ఒక రిని పిలుచునపుడు (శబ్దమునకుముందు) ఓ అనునది చేరును

సంబోధ్యవాచకము = పిలువబడువాని వాచకము తో అంగియు=విడిచియు పిలువబడువారి పేర్లకు ముందు ఓ' అనుదానిని చేర్చినను చేర్చవచ్చును మానినను మానవచ్చును కాఁగా ఓ' అనునది వికల్పమని తేలుచున్నది

[ ఓ' అనునది ప్రత్యయముకాదు ప్రత్యయ మెప్పుడును శబ్దము చివరఁ జేరును కాని దానికి ముందు చేరదు ]

ఓశబ్దంబునకుం బురుష నీచ స్త్రీ పురుషామంత్రణంబులందు యి-సి-రి వర్ణంబులు విభాష నంతాగమంబులగు ౧౫

ఓయిరాముఁడ-ఓరాముఁడ-ఓసిదుష్టురాల - ఓదుష్టురాల-ఓరిదుష్టుఁడ-ఓదుష్టుఁడ

౧౫ మగవారిని పిలుచునప్పుడు యి' అనియు, నీచస్త్రీని పిలుచునపుడు సి అనియు నీచపురుషుని సంబోధించునపుడు రి అనియు వికల్పముగా ఓ' అనుదానికి ఆగమములు గావచ్చును

ఓయి రాముఁడ ' అనునది పురుషసంబోధనమునకును ఓసి దుష్టురాల' అనునది నీచస్త్రీసంబోధనమునకును ఓరి దుష్టుఁడ అనునది నీచపురుషామంత్రణమునకును ఉదాహరణములు కయి యి సి రి' అనునవి రానపుడు ఓరాముఁడ ఓదష్టురాల ఓదుష్టుఁడ' అనియు నుండును

ఓరి యోసి మైత్రియందుం గలవు ౧౬

ఓరిచిన్నికృష్ణ - ఓసిముద్దుబాల ఓయి మొదలయిన వానికి స్వతంత్రయోగముం గలదు. సంగతియె యోయి ఓసిపోవే-ఓరోరి యింకెందుఁ బోవచ్చు. వీనికి దీర్ఘంబుంగలదు.

ఓయీ విప్రకులావతంస - ఓరీ దుష్టనిశాటులార - ఓసీ ననుఁ జెనకరాకు.

౧౬ నీచస్త్రీపురుషసంబోధనమునందేగాక స్నేహమును దెలియఁ జేయఁనపుడును ఓసి ఓరి' అనువాని నుపయోగించవచ్చును

ఓరి చిన్నకృష్ణ ఓసి ముద్దుబాల ' అనునవి ప్రేమను సూచించు సంబోధనలు

ఓయి మొదలయిన— వెనుకటిసూత్రోదాహరణములనుబట్టి ఓయి' మున్నగునవి శబ్దమునకు ముందే వచ్చునని తెలియుచున్నది ఎట్టి శబ్దము నపేక్షించక యివి స్వతంత్రముగా ప్రయోగింపఁబడుటకలదని యీవివరణమున దెలుపఁబడుచున్నది సంగతియెరుగోయి అనుచో ఓయి'కి స్వతంత్రప్రయోగము ఇక్లాకే తక్కినవియగును

ఓయి, ఓరి ఓసి' అనునవి దీర్ఘమునుబొంది ఓయీ ఓరీ ఓసీ ' అని యగుటయుఁ గలదని ఉదాహృతులును జూపఁబడినవి

## స్త్రీతిర్యగ్జడభిన్నంబులును వాని విశేషణంబులును మహత్తు లనంబడు ౧౭.

తిర్యక్కు లనఁగాఁ బశుపక్ష్యాదులు జడము లనఁగా నచేతనములు

౧౭ జడము లనఁగా అచేతనములని వివరణము చలనములేనిప్రాణులగు చెట్లు మున్నగునవియు జడములే

స్త్రీలకంటెను పశుపక్షివృక్షాదులకంటెను వేఱైనపదములును అపదములకు విశేషణములగునవియు మహత్తులు' అని చెప్పఁబడును

పురుషులను వారివిశేషణములను దెల్పుశబ్దములు మహత్తులని యర్థము.

[స్త్రీలను, వారివిశేషణములను తెల్పునవి మహాళీ వాచకములు తక్కిన వన్నియు అమహత్తులు ]

ఇదివఱకు విభక్తులను వాని ప్రత్యయములను వివరించి వ్యాకర్త యింక మీఁద ఆ విభక్తి ప్రత్యయములు వేనికి చేరునో, ఆ పదముల స్వరూపమును దెల్పుచు ఈసూత్రము ప్రారంభించెనని తెలియనగును

ఈవిభాగవిషయమున సంస్కృతాంధ్రములకు భేదము కలదు. తెలుఁగునందు మగవారిని దెల్పు పదములు మహత్తులు స్త్రీలను దెల్పునవి మహతీవాచకములు. ఇతరములగు మృగములు పక్షులు చెట్లు కొండలు నదులు మున్నగువానిని దెల్పునవియమహత్తులు ఇట్లీ విభాగమాంధ్రమున అర్థము నాశ్రయించియే యుండును సంస్కృతమునం దిట్లుకాక శబ్దము ప్రధానముగాఁగల లింగము నాశ్రయించి విభాగము చేయఁబడినది అందు కొన్ని స్త్రీవాచకములు. మృగములు పక్షులు జడములుకూడ పుంలింగములు కావచ్చును మృగాదులు జడములును కొన్ని స్త్రీలింగములును గావచ్చును. పురుషులను దెల్పుపదములు కొన్ని నపుంసకలింగములును గావచ్చును.

ఉ సంస్కృతమున వృక్షః' పుంలింగము

తెలుఁగున వృక్షము' అమహత్తు

సంస్కృ ధేనుః' స్త్రీలింగము.

తెలు ధేనువు' అమహత్తు

సం దారాః పుం లిం. తె దార' మహతి

క్లీబంబులు మిత్రాదులు మహద్వాచకంబులు విభాషం బుంలింగ తుల్యంబులగు. ౧౮

మిత్ర శరణ ప్రధాన పాత్రాదులు మిత్రాదులు

౧౮ క్లీబంబులు=నపుంసకలింగములు పుంలింగతుల్యంబులు=పుంలింగములతో సమానమైనవి

మిత్ర మున్నగుశబ్దములు సంస్కృతమున ఎల్లపుడును నపుంసకలింగములుగానే యుండును అవి తెలుఁగున మహత్తులను దెల్పునపుడు

వికల్పముగా పుంలింగసమానము లగును [ఇయ్యవి పుంలింగములగునపుడు చివఱ 'డు' చేరి 'మిత్త్రుఁడు' మొన్నగురూపములును నపుంసకలింగము లగునపుడు 'ము' చేరి 'మిత్త్రము' మొన్నగురూపములును అగునని భావము ]

### జిత్తు బిందుపూర్వంబగు. ౧౯.

జకార మిత్తుగాఁ గలదానికి ముందు బిందువు వచ్చునని యర్థము కాశ్యర్థము ప్రత్యయాదులందు నిబద్ధమయి ప్రయోగించునపుడు మానంబడు వర్ణ మిత్తనాఁబడు ఉదాహరణము మీఁద స్పష్టంబగు

౧౯ ప్రయోజనము నపేక్షించి ప్రత్యయములచివఱఁజేరి ప్రక్రియ చేయునపుడు లోపించునది ఇత్తు జకారము ఇత్తుగాఁగలది జిత్తు ఏయక్షరము చివఱ జకార ముండునో ఆయక్షరమునకు ముందు బిందువున్నగాని అఱసున్నగాని చేరుచుండునని భావము మీఁదరాఁబోవు ఉదాహరణములలో ఈయంశము స్పష్టము కాఁగలదు.

[సంధిప్రకరణములలో యట్ రుక్ టుక్ నుగ్-అనునాగమములు వచ్చినవి అందు చివఱగల టకార కకారము లిత్తులు సంధిచేయునపుడవి లోపించినవని ఇదివఱకె యెఱుఁగుదుము ]

### దుజ్వర్ణకంబునకుం బ్రకృతియయినది దుమంతంబనంబడు.౨౦

స్పష్టము

౨౦. దుజ్' అను ప్రత్యయము చేరుప్రాతిపదికము (నామము) దుమంత మనఁబడును ప్రకృతి=ప్రత్యయము చేరుటకు ముందుండు శబ్దస్వరూపము దీనికే ప్రాతిపదికమనియు పేరు

### పుంలింగంబయి మహద్వాచకం బయిననామంబు తుదియత్వంబున కుత్వంబగు. ౨౧.

నామంబనఁగా బ్రాతిపదికము. డిద్ధ - రామ - భార్గవ

రాజపురుష-ఇట్టివి ప్రాతిపదికములు డిద్ధు-రాము-భార్గవు-రాజ పురుషు

౨౧ పుంలింగమగుచు మహద్వాచకమైన నామవాచకము చివఱి అకారము ఉకారముగ మాఱును

రామ' అనునది సంస్కృతమున పుంలింగము మగవానిని దెల్పుటచే నిది మహతు దాని చివఱి అకార ముకారముగా మాఱి రాము-'ఆయినది [వృక్ష' అనునది పుంలింగమైనను మహద్వాచకము కాకుండుటచే వృక్షు అని కాఁజాలదు ]

**పుంలింగమగు మహద్వాచకమునకు డుజ్జగు ౨౨**

ఇచ్చట డుజ్జనుదానియందు జకార మిత్తుగావున జిత్తు బిందుపూర్వం బగు ననుసూత్రముచేత డువర్ణమునకుముందఁ సున్నవచ్చును బిమ్మట జకారము లోపించును ఉ డిద్ధుఁడు-డిద్ధుండు-రాముఁడు-రాముండు-భార్గవుఁడు-భార్గవుండు.

౨౨ రామ' అనునది ౨౧-వ సూత్రముచే రాము' అని కాఁగా ఈసూత్రముచే డుజ్' వచ్చును. జిత్తు బిందురూపంబగు' ననుసూత్రముచే బిందువచ్చును జకారము లోపించును అవచ్చుబిందువు నిండుసున్న గాని, అఱసున్న గాని కావచ్చును గనుక నిండుసున్నవచ్చి రాముండు' ఆయినది అఱసున్నవచ్చి రాముఁడు' ఐనది ఇట్లే తక్కినవియును

[ఈసూత్రమునందలి డుజ్' అనునది యిందలి ౧-వ సూత్రములోని 'డు' కంటె వేఱుకాదు అచట డుజ్' లోని జకారము లోపించిన డు' గ్రహింపబడినది]

**డుమంతంబునకు ద్వితీయాద్యేకవచనంబు పరంబగునప్పుడు నిగాగమంబు సర్వత్ర విభాష నగు. ౨౩.**

రామునిని - రాముని-రామునిచేతను - రాముచేతను - రామునికిని - రామునకును. సర్వత్రయనుట నగాగమబాధ నార్థము.

౫౩. దుమంతంబునకు=దుజ్ ప్రత్యయము చివఱఁగలదానికి; ద్వితీయాద్యేకవచనంబు=ద్వితీయ మొదలగు విభక్తుల ఏకవచనము! ని గాగమంబు=ఆగమమైన 'ని' అనునది; సర్వత్ర=అన్నివిభక్తులయందును; విభాషనగు=వికల్పముగా నగును.

దుజ్ ప్రత్యయము చివఱవచ్చు నామమునకు ద్వితీయ మొదలగు విభక్తుల యేకవచనములు (ద్వితీయ, తృతీయ, చతుర్థి, పంచమి, షష్ఠి, సప్తమి అనువిభక్తుల యేకవచనములు) పరమగుచో. నామమునకు, విభక్తికిని నడుమ 'ని' అనునది చేరుచుండును.

రామశబ్దము దుమంతము. ౫౧-వ సూత్రముచే దీని అకారమునకు ఉకారము; పిదప ౫-వ సూత్రముచే ద్వితీయలో'ను' ప్రత్యయము. 'రాము+ను'. ప్రస్తుతసూత్రముచే నిగాగమము. 'రాము+ని+ను.'పిదప ౫౬-వ సూత్రముచే 'ను' లోని ఉకారము ఇకారముగా మాఱును. కాఁగా 'రామునిని' అగును. నిగాగమము వికల్పము కాన అది రానప్పుడు 'రాము+ను' అని యుండఁగా ౫౬-వసూత్రముచే 'ను' లోని ఉకారము ఇకారముగా మాఱి 'రాముని' అగును.

'రామునిచేతను' రాముచేతను, 'రామునికిని' అనునవి యిట్లే.

'రాము+కు' అని యుండగాఁ నుగాగమము రానప్పుడు ౫౭-వ సూత్రముచే నగాగమమువచ్చి 'రామునకును' ఐనది.

సర్వత్రయనుట—ఈసూత్రమునందు 'సర్వత్ర' అని చెప్పక నిగాగమము వికల్పముగా నగునని మాత్రమే చెప్పినయెడల ౫౭-వ సూత్రమువలన షష్ఠీవిభక్తియందు నిత్యముగావచ్చు నగాగమము ఈసూత్రమును బాధించి 'రామునకును' అనురూపముమాత్రమే సిద్ధించునట్లుచేయును. ఇందు 'సర్వత్ర' అని విశేషముగాఁ దెలుపుటచే మీఁది నగాగమము రానిపక్షమున ఈసూత్రముచే నిగాగమముకూడ వచ్చును. కాన 'రామునికిని' అను రూపము నగును.

కావున ఇందలి సర్వత్ర' అనునది షష్ఠిలో నిత్యమగు నగాగమమును బాధించి అది వికల్పమగునట్లు చేయుచున్నది

## అనుదంతమగు తెనుఁగు దుమంతమునకు నిగాగమము నిత్యముగా నగును ౭౮

మగనిని-మగనిచేతను-మగనికిని అనుదంతంబను పర్యుదాసముచేతను తమ్మునిని - తమ్ముని-తమ్మునిచేతను - తమ్ముచేతను, అల్లునిని-అల్లుని-అల్లునిచేతను-అల్లుచేతను బల్లిదునిని - బల్లిదుని - బల్లిదునిచేతను - బల్లిదుచేతను - ఇత్యాదులందు నిగాగమంబు పాక్షికంబని యెఱుఁగునది.

౭౮. అనుదంతము=హ్రస్వమైనయుకారము చివఱలేనిది తెనుఁగు దుమంతము=డుజ్ ప్రత్యయము చేరుఅచ్చతెనుఁగుశబ్దము

చివఱ హ్రస్వమగుఉకారము లేని యచ్చతెనుఁగుమహద్వాచక శబ్దమునకు నిగాగమము నిత్యము

ఉ మగనిచేతను— ఇట మగ అనునది చివఱహ్రస్వమగు ఉకారము లేని యాచ్ఛికశబ్దము దానికిఁ దృతీయైకవచనము పరమగునపుడు ని నిత్యముగావచ్చి మగనిచేతను' అయినది వెనుకటిసూత్రమునుబట్టిచూచినచో ఇచట మగచేతను' అనురూపము ఉండవలసివచ్చుచున్నది అట్టి యనిష్టరూపము రాకుండుటకయి యీ ౭౮ వ సూత్ర మారంభింపఁబడినది

అనుదంతంబు—పర్యుదాస మనునది నిషేధము ఉత్తరపదముతో నన్వయించునిషేధము పర్యుదాసము ఇచట నిషేధమునకు ఉల్లు అన్ అనునది ఉత్తరపదమగు ఉదంతము' అనుదానితో అన్వయించుచున్నది కావున నిది పర్యుదాసము ఉకారాంతభిన్నమును ఉకారాంతసదృశము నని యిచటి పర్యుదాసమున కర్థము ఇచటి మగ శబ్దము ఉకారాంతభిన్నమును ఉకారాంతమునకు గల మహద్వాచకత్వ ముండుటచే ఉకారాంతసదృశమును అగుచున్నది

ఉకారాంతములగు దుమంతశబ్దములు— తమ్ము మున్నుగనవి వైకల్పికమగు నిగాగము'నే పొందవు అనిగాగమము వానికి ౨౩-వ సూత్రము వలననే సిద్ధించును. పాక్షికంబు = వికల్పము

**దుమంతంబుమీఁది నువర్ణకంబునుత్వంబున కిత్వంబగు ౨౫.**

నువర్ణంబు ద్వితీయ యనుసూత్రముచేత రాముసు - అని ప్రాప్తింపఁగా నీ సూత్రముచేత నువర్ణకోత్వమున కిత్వంబు సిద్ధించె రాముని-భార్గవుని.

౨౫ దుమంతమగు శబ్దమునకుఁ దరువాతనున్న ను ప్రత్యయము యొక్క ఉకారము ఇకారముగా మాఱును రాము అనుదానికి నువర్ణకంబు ద్వితీయ అను సూత్రముచే ను' చేరి రామును' యైనది పిదప నీసూత్రము వలన ను' లోనిఉకారమున కికారమువచ్చి (ను-ని గామాఱి) రాముని' యైనది

## ఇకారంబుమీఁది కు-ను-వు క్రియావిభక్తులయుత్వంబున కిత్వంబగు. ౨౬

హారిని-హారికిని-శ్రీని-శ్రీకిని వారిని-వారికిని

౨౬ ఇకారము తరువాతవచ్చు కు-ను-వు అనువానియొక్కయు, క్రియలయందలి విభక్తులయొక్కయు ఉకారము ఇకారముగా మాఱును

ఇచట ఇకారము చే ఇ-ఈ లు రెండింటిని గ్రహింపవలెను క్రియావిభక్తులకుఁ గ్రియాప్రకరణమున ఉదాహరణము లీయఁబడును

హారి+ను' అని యుండఁగా ను' లోని ఉకారము ఇకారముగా మాఱి హారిని' అయినది ఇట్లే హారికిని' శ్రీ+ను' అనియుండఁగా ఈకారము' మీఁది ను' లోని ఉ ఇ గా మాఱి శ్రీని' అయినది తక్కినవియు నిట్లే

### ఈధాతుయుష్మదర్థంబులమీఁదివానియుత్వంబున కిత్వంబురాదు ౨౭

ఈరు-ఈవు-ఈను-ఈము ఈకు-నీకు-మీకు

౨౭ ఈధాతుయుష్మదర్థంబులు = ఈ' యను ధాతువును, నీ-మీ యనునవియు [ఇవ్వు యను మూలరూపము ధాతువు]

ఈ ధాతువు ని మీ—అనునవి యికారాంతములైనను వానికి మీఁదనుండు ఉకారము ఇకారముగా మాఱదు (ఈ+రు=) ఈరు అనుచో ఈధాతువుపై విభక్తిప్రత్యయము రు' దీని ఉకారము ౧౬-వ సూత్రము ననుసరించి ఇకారముగా మాఱి ఈరి అని యగుచుండఁగా నాకీరి కాకుండుట కీసూత్రము చెప్పఁబడినది. ఈవు ఈను ఈము' అనునవియు నిట్లే

(ఈ+కు=) ఈకు అనుచో ఈ' యుష్మచ్ఛబ్దము దానిపై షష్ఠీ విభక్తి ప్రత్యయమగు కు' కి గా మాఱలేదు ఇట్లే నీకు మీకు' లును

### కువర్ణకంబు పరంబగునపు డుకారఋకారంబులకు నగాగమంబగు. ౨౮

రామునకును-విష్ణునకును-సవితృనకును-విధాతృనకును.

౨౮ కు' ప్రత్యయము పరముగా నున్నపుడు ఉకార ఋకారములకు నగాగమము (ఆగమైన న' అనునది) వచ్చును అనఁగా ఉకార ఋకారములకును కు నకు నడుమ న' అనునది చేరుచుండును.

రాము+కు' అనియుండఁగా ము లోని ఉకారమునకుఁ బిమ్మట కు' ఉండుటచే నడుమ న' చేరి రామునకు' అని యైనది. ఇట్లే విష్ణునకు' సవితృనకు విధాతృనకు' అనునవి ఋకారముమీఁద కు' ఉన్నపుడు న' వచ్చుటకు ఉదాహరణములు

### ఉకారఋకారంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబగు. ౨౯

రామునందును-విష్ణునందును-విధాతృనందును.

ఉ ఉకారమునకుగాని, ఋకారమునకుఁగాని అందు' అనుప్రత్యయము పరమగునపుడు ఆగమమగును' అనునది వచ్చును

[ఈ ఉకారము నడుమవచ్చినదైనను గావచ్చును లేదా తొలుత నుండియు నుండినదైనఁ గావచ్చును.]

రాము+అందును = రామునందును' అనుచోట రాము' లోని ఉకారము పిదప అందు ఉన్నది కాన నడుమ ను' చేరి ఉకారసంధివచ్చి రామునందు' అయినది [ఇచటి యుకారము నడుమ వచ్చినది విష్ణువునందు' అనునది తొలుతనుండియు ఉన్న ఉకారమున కుదాహృతి] ఋకారాంతము నిట్లే గ్రహించునది

**ఆగమ ము-వు-వర్ణంబుల కందువర్ణకము పరంబగునపుడు నుగాగమంబు విభాషనగు. 30**

వనమునందును - వనమందును - ధేనువునందును - ధేనువందును.

30 ఆగమములుగా వచ్చిన ము వు' అనువానికిఁ దరువాత అందు' ప్రత్యయ మున్నయెడల (మీఁది) నుగాగమము వికల్పముగా నగును. కా

(వనము + అందును=) వనమునందును' ఇచట ము ఆగమము కాని ప్రత్యయముకాదు డు ము వు లు' ప్రథమ అనుసూత్రమునబట్టి ప్రథమా విభక్తిలోవచ్చు ము' మాత్రము ప్రత్యయ మగును మిగిలిన విభక్తులలో విధింపఁబడు ము' ఆగమము ఇచటి ము' సప్తమియం దున్నది కాన ఆగమము ఆ ము' కుం బిదప అందు' ప్రత్యయ ముండుటచే ఆరెండిటినడుమను 'ను' చేరి సంధివచ్చి వనమునందును' ఐనది నుగాగమము రానప్పుడు (వనము + అందు) వనమందును' అని మాత్ర మగుచున్నది

ఇట్లే ధేనువునందును' ధేనువందును అనుచోట్లఁగల వు సప్తమియందుండుటచే ఆగమము. కాన దానికిని వికల్పముగ నుగాగమము వచ్చినది.

## బహుత్వంబున ద్వితీయాదివిభక్తులకు లటాగమంబగు 3౧.

రాములను - రాములచేతను - విధాతృలను-విధాతృల చేతను

3౧ ఒకదానికంటె ఎక్కువవానినిగూర్చి తెల్పునపుడు (అనఁగా బహువచనమునందు) ద్వితీయ మున్నగు విభక్తులకు లట్' అనునాగమము (ఆగమమైనలకారము) వచ్చును

[ఇచట లట్' అనునది టకారము ఇత్తుగాఁగలది కావున ఆగమమైన ల' విభక్తికి ముందే—ప్రాతిపదికమునకును విభక్తికిని నడుమ వచ్చునని గ్రహింపవలెను]

(రాము+ల+ను ) రాములను

[ద్వితీయలో రాము+ను అనియుండఁగా ౨౧-వ సూత్రముచే ఉత్వము పిదప లడాగమము ]

ఇట్లే తక్కిన యుదాహరణములును

## సంబోధనంబున నేకార్థంబగు సపదంబు తుదియుకారంబున కకారంబగు 3౨

ఓరాముఁడ-ఓవృక్షమ-ఓశంభుప-ఓకోడుక

3౨ ఎవరినైనను పిలుచుట సంబోధనము ఆసంబోధనములో ఏకవచనమున పదము చివఱనుండెడి ఉకారము అకారముగా మాఱును

రాముఁడు' అనునది ఉకారాంతమగుపదము [విభక్తిప్రత్యయముతో కూడిన శబ్దమునకు పదమని పేరు ] దానికి ఓయామంత్రణంబునందగు' నను సూత్రముచే ఓచేరి ఓరాముఁడు అయినది. ప్రస్తుతసూత్రముచే డకారము మీఁది ఉకారము అకారముగామాఱి ఓరాముఁడ' అయినది తక్కినవియు నిట్లే-

## సంబోధనంబునందుఁ బదంబుతుదియకారేకారంబులకు దీర్ఘంబు విభాషనగు 33.

ఓరాముఁడా - ఓరాముఁడ    ఓచెలియా - ఓచెలియ
ఓహరీ - ఓహరి  ఓతండ్రీ - ఓతండ్రి

33 ఇతరులను పిలుచునపు డుపయోగింపఁబడు పదముల చివఱ అకారముగాని ఇకారముగాని ఉన్నయెడల నవి వికల్పముగా దీర్ఘము లగును.

రామశబ్దమున కిట్లు దీర్ఘము రాఁగా ఓరాముఁడా అనియు అది రానప్పుడు ఓరాముఁడ అనియు నగును ఓహరి ఓహరీ అనునవి ఇకారము వికల్పముగా దీర్ఘమగుట కుదాహరణములు

## కృతోత్వంబగు సంస్కృతనామంబు సంబుద్ధి డుజ్జునకు లోపంబు విభాషనగు. 3౪.

ఓరాము - ఓకృష్ణ    పూర్వసూత్రముచేత  దీర్ఘంబు. ఓరామా-ఓకృష్ణా.  సంస్కృతనామంబనుటఁ జేసి ఓతమ్ముఁడ - ఓబల్లిదుఁడ-ఇత్యాదులందు లోపంబు లేదు

3౪. కృతోత్వంబు = (తొలుత లేక పిదప వ్యాకరణనియమమును బట్టి) చేయఁబడిన ఉకారముకలది సంస్కృతనామంబు = తత్సమశబ్దము సంబుద్ధిడుజ్జు = సంబోధన ప్రథమావిభక్తియందలి 'డు' అనునది [సంబోధన ప్రథమావిభక్తిలో ఏకవచనమునకు సంబుద్ధియని వ్యాకరణమున ప్రసిద్ధమగు పేరు ]

ఉకారాంతమగు తత్సమశబ్దము చివరనున్న డు ప్రత్యయము సంబోధనమున వికల్పముగా లోపించును ఆయుకారము మొదటినుండియు నున్నదికాక నడుమ వ్యాకరణనియమము ననుసరించి వచ్చినదై యుండవలెను

ఓరామ ఓరామా' రామశబ్దము మొదట ఉకారాంతముకాదు. ౨౧ ౨౨ సూత్రములచే ఉకారము డుజ్జువచ్చి రాముఁడు' ఐనది ౧౪-వ సూత్రముచే ఓ' చేరినది ౯౫-వసూత్రముచే డు' లోపించును ౩౨-వ సూత్రముచే ఉకారమున కకారమువచ్చి రాము రామ' గా మాఱినది. ౩౩-వ సూత్రముచే వికల్పముగుదీర్ఘము

సంస్కృత-సంస్కృతసమములు డుజ్జునకే లోపమగు నను టచే తెలుఁగు పదముల డుజ్జు లోపింప దనవలెను కాన ఓతమ్ముఁడ మున్నగుచోట్ల డు' లోపింప లేదు తమ్ముఁడు' అనుదాని డు' లోని ఉకారము ౩౭-వ సూత్రముచే అకారముగా మాఱి ఓతమ్ముఁడ' ఐనది.

## ఉదంతసంస్కృతనామంబుమీఁది సంబుద్ధి డుజ్జునకు నూకారంబు ప్లుతం బాదేశంబు విభాషనగు. ౩౫.

ఓవిష్ణూ ౩ - ఓశంభూ ౩ - పక్షంబునందు - విష్ణుఁడ శంభుఁడ - ఇత్యాది.

౩౫ ఉదంతసంస్కృతనామము = హ్రస్వమగు ఉకారము చివఱఁగల సంస్కృతశబ్దము ప్లుతంబు = మూఁడుమాత్రలకాల ముచ్చారణకలది [మాత్ర యనఁగా చిటికెవేయునంతకాలము హ్రస్వమునకు ఏకమాత్రకాలము దీర్ఘమునకుమాత్రద్వయకాలమును ప్లుతమునకు మాత్రత్రయకాలమును పట్టును ]

హ్రస్వోకారము చివఱఁగల సంస్కృతసమశబ్దములకు సంబోధనమునఁగల డుజ్జునకు మాఱుగా ప్లుతమైన (సుదీర్ఘోచ్చారణముగల) ఊ (౩) కారమాదేశముగా వచ్చును ఇది వికల్పము

ఓవిష్ణు (౩)' విష్ణుశబ్దమునకు ౧౪-వ సూత్రమున ఓ' వచ్చినది. ౨౩-వ సూత్రమున డుజ్జు' వచ్చి దానికి ఈసూత్రముచే ఊకారమై ప్లుతము ఆదేశమైనది

[దీర్ఘమునకును ప్లుతమునకును భేదము తెలియుటకుఁగాను ప్లుతము ప్రక్క (3) అనుగుఱుతు వాడఁబడుట కలదు

ఈప్లుతము వికల్పము కావున ఇది రానిపక్షమున ఓ రాముఁడ వలెనే విష్ణుఁడ' అనియు నగును ప్రక్రియయు నిట్లే విష్ణుఁడ అనునది ఓ' శబ్ద విరహితమగురూపమున కుదాహరణము

## సంబోధనంబునందు బహువచనంబున కారగాగమంబగు 3౬.

ఓ రాములార-ఓకృష్ణులార దీనికిం బాక్షికంబుగ దీర్ఘంబగు-ఓ రాములారా-ఓకృష్ణులారా

3౬ సంబోధనమునఁ బ్రథమావిభక్తి బహువచనమునకు ఆగమమగు ఆర అనునది వచ్చును (అరగాగమము కిత్తుగావున విభక్తిప్రత్యయము చివరఁ జేరును)

(రామ+లు రాము+లు ఓరాములు ఓరాములు+ఆర=) ఓరాములార

(1) రామశబ్దమునకు బహువచనమున లు'
(2) ౨౧-వ సూత్రముచే అత్వమున ఉత్వము
(3) ౧౪-వ సూత్రముచే ఆమంత్రణమున ఓ' వచ్చె
(4) ప్రకృతసూత్రముచే ఆర' గాగమము

దీనికి . ఆర' అనుదానికి (పాక్షికముగా) వికల్పముగా దీర్ఘమగును కాన ఓరాములార!' అనియు నగును

## మధ్యమపురుషయోగంబునం దారగాగమంబు విభాషనగు. 3౭

వినుఁడు బాలకులు - వినుఁడు బాలకులార వచ్చితిరి కాంతలు-వచ్చితిరి కాంతలార అన్నలార మిమ్ము నడిగెద నొక-

మాట-ఇచ్చట మధ్యమపురుషయోగంబు లేమింజేసి యారగాగమంబు నిత్యంబు.

౩౭ ఎదుటివారితో సంభాషించునపు డుపయోగింపఁబడు పురుషము మధ్యమపురుషము ఆమధ్యమపురుష (క్రియ)తో సంబంధమున్నపుడు (నామంబులకు) అరగాగమము వికల్పముగా నగును

వినుఁడు బాలకులు వినుఁడు బాలకులార ' అనునపుడు వినుడు' మధ్యమ పురుషక్రియ దానితో సంబంధించుటచే బాలకులు' అనుదానికి అరగాగమము వికల్పముగా వచ్చినది అర' చేరనపుడు సంబోధనమునందును బాలకులు ' అని యుండిపోయినది వచ్చితిరి కాంతలు-కాంతలార ' అన్నదియు నిట్లే

అన్నలార అన్నలార మిమ్ము నడిగెద నొకమాట' అనునపుడు క్రియయగు అడిగెద' ననునది యుత్తమపురుషము (దానికర్త నేను' అనునది ) ఇచట మధ్యమపురుషక్రియయే లేదు కాన ఇచట అరగాగమము ౩౬-వ సూత్రమునననుసరించి నిత్యమే వికల్పముకాదు అన్నలు మిమ్ము నడిగెద' నని యుండరాదు

## అదంతంబయి దీర్ఘపూర్వలోపధంబయిన మహత్తువాఁది విభక్తిలకారంబునకు రేఫంబగు ౩౮

బాలురు-బాలురను-బాలురచేతను, నృపాలురు-నృపాలురను-నృపాలురచేతను దయాళుశబ్దంబున కిట్లు రేఫంబు గానంబడియెడి దయాళురు-దయాళురను - దయాళురచేతను.

౩౮ హ్రస్వమగు అకారము చివరనియుండఁగల్గి ఆ అకారమునకు ముందు లకారముండి ఆ లకారమునకు ముందు దీర్ఘముగల మహద్వాచకశబ్దమునకుఁ దరువాతనున్న బహువచన ల' కారమునకు రేఫము ఆదేశముగా వచ్చును అనఁగా దీర్ఘము-లకారము-హ్రస్వమగు అకారము చివరిభాగమున

వరుసగానున్న మహద్వాచక శబ్దముయొక్క బహువచనములలోని ల ర'గా మాఱునని యర్థము

(బాల+లు=) బాలురు బాలశబ్దము మహత్తు దాని చివఱ హ్రస్వమగు అకారము కలదు దానికిముందు లకారమును దానికిముందు దీర్ఘము (బా అని బకారముమీఁద)ను కలవు. కాన దీని బహువచన లు' రు' గా మాఱినది ఇది పుంలింగమును మహత్తును కనుక ౨౧-వసూత్రముచే అకారము కారమయి (బాల బాలుగా మాఱి) బాలురు' అయినది బాలురచేతను అనుచోట బహువచనమున ౩౧-వ సూత్రముననుసరించి వచ్చిన ల ' ర' గా మాఱినది) నృపాలురు' మున్నగునవియు నిట్టే

దయాళుశబ్దంబు—దయాళుశబ్దము అదంతము కాదు-అనఁగా దాని చివఱ ఉకార మున్నదికాని అకారములేదు కావున దానికిఁ బరముగానున్న బహువచనమునందలి లకారము రేఫముగా మాఱుట విరుద్ధము. అయినను దయాళురు దయాళురను ' మున్నగు ప్రయోగములు కనఁబడుచుండుటచే ఆ 'దయాళు' శబ్దవిషయమునమాత్రము రేఫాదేశము వచ్చునని చెప్పవలసి యున్నది

## అమహన్నపుంసకముల కదంతములకు మువర్ణకంబగు. ౩౯.

వృక్షము - ఋక్షము దైవము-కళత్రము - అపత్యము, క్లీబంబులు మిత్రాదు లనుసూత్రంబునఁ బాక్షికంబుగం బుంలింగత్వం బతిదేశించుటం జేసి మిత్రాదిశబ్దంబులకు ద్వైరూప్యం బెఱుంగునది ఉ-మిత్రుఁడు - మిత్రము, శరణుఁడు - శరణము

౩౯ హ్రస్వమగు అకారము కడపటఁగల అమహద్వాచకములకును, హ్రస్వమగు అకారము చివఱ గల నపుంసకలింగములకును ప్రథమావిభక్తియందు (ఏకవచనమున) ము' ప్రత్యయమువచ్చును

[తిర్యక్కులు జడములును అమహత్తులని యిదివఱకే చెప్పఁబడినది. నపుంసకలింగములు సంస్కృతమున ప్రసిద్ధములు కొన్ని మహత్తులు మహతీ వాచకములునుకూడ నపుంసకలింగము లగుచుండును ]

వృక్ష' శబ్దము అమహత్తు దానికి ము' చేరి వృక్షము' ఐనది ఇట్లే తక్కినవి యెఱుంగుడు కళత్ర శబ్దమునకు భార్య యని యర్థము కాన అది మహతీవాచకము కాని నపుంసకలింగమగుటచే దానికి ము' ప్రత్యయమువచ్చి కళత్రము' ఐనది

క్లీబంబులు——కాపరిచ్ఛేదములోని ౧౮-వ సూత్రముచే హ్రస్వాకారాంతములై నపుంసకలింగములైన మిత్ర' మన్నగువానికి వికల్పముగా పుంలింగత్వమును సంభవించును నపుంసకత్వ మున్నపుడు మిత్రము' అనియు, పుంలింగత్వమున్నపుడు మిత్రుఁడు అనియు మిత్ర' శబ్దమునకు రూపములు ఇట్లే తక్కినవియును అతిదేశించుట=నియమించుట ద్వైరూప్యంబు=రెండు రూపము లుండుట.

## వానికి మువర్ణకేతరం బయినవిభక్తి పరంబగునపుడు ముగాగమంబగు ౪౦.

వృక్షములు-వృక్షమును-ఋక్షములు-ఋక్షమును

౪౦ వానికి=హ్రస్వమగు అకారము తుదినిగల అమహత్తులకును, నపుంసకలింగములకును మువర్ణకేతరంబగువిభక్తి=ప్రథమావిభక్తిలోని యేకవచనమువచ్చు విభక్తికంటె వేరైనవిభక్తి-ప్రథమాబహువచనము మొదలుకొని చివరి సప్తమీబహువచనము వఱకును గల విభక్తులలో నేదైన నొకటి ముగాగమంబు=ఆగమరూపమైన ము' అనునది

[ ము' ప్రత్యయము ప్రథమయందు ఏకవచనమునకు వచ్చుప్రత్యయము కాన తద్భిన్నమగువిభక్తి ప్రథమాబహువచనము మొదలగు విభక్తి యగును ]

హ్రస్వాకారాంతములగు మహత్తులకును నపుంసకములకును ప్రథమా బహువచనాదిప్రత్యయములు పరమగునపుడు, ఆప్రకృతిప్రత్యయములకు నడుమ ము' అనునది చేరుచుండునని భావము

వృక్ష' అనునది అమహత్తు దానికి లు' (ప్రథమాబహువచనము) చేరినపిదప ఈసూత్రముచే ము' ఆగమముగావచ్చి వృక్షములు' అయినది. ఇట్లే మిగిలినవియును

**ము వర్ణకంబునకు విధించుకార్యము ముగాగమంబునకు నగు ౪౧**

ము వర్ణకంబునకు విధించు లోపాదేశాదికార్యములు ముగాగమమునకు సహితము వచ్చునని యర్థము.

౪౧ ప్రత్యయమైన ము' కు ఏకార్యములు వచ్చునని చెప్పఁబడునో, అవియన్నియును ఆగమ ము' వర్ణమునకును వచ్చును లోపము=అక్షరము కానరాకుండపోవుట ఆదేశము=ఒకదానిస్థానమున నింకొక యక్షరమువచ్చుట

**ము వర్ణకంబునకు మామ్మిడియేనిం బూర్ణబిందుపూర్వకబువర్ణంబేని విభాషనగు ౪౨.**

వృక్షమ్ము - వృక్షంబు ఋక్షమ్ము - ఋక్షంబు పూర్వసూత్రముచేత ముగాగమమునకీకార్యంబగు వృక్షమ్ములు - వృక్షంబులు ఋక్షమ్ములు-ఋక్షంబులు

౪౨ మామ్మిడి=(ॅ)మావత్తు పూర్ణబిందుపూర్వక బువర్ణంబు=నిండుసున్న ముందుగాఁగల బు (ంబు) అనునది ము' ప్రత్యయమునకు వికల్పముగా 'ॅ' గాని ంబు' గాని గావచ్చును (వృక్షము=) వృక్షమ్ము వృక్షంబు. (ఇచట మావత్తు ఆగమముగను ంబు' ఆదేశముగను వచ్చునని తెలియనగును)

౪౧-వ సూత్రముచే ముగాగమమునకుఁగూడ నివి రావచ్చును గనుక 'వృక్షమ్ములు వృక్షంబులు' అనియు రూపము లగును

### లు-ల-న-లు పరంబుగునపు డొకానొకచో ముగాగమంబునకు లోపంబును దత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాషనగు ౪౩.

వజ్రాలు-వజ్రాలను - వజ్రాన పగడాలు - పగడాలను - పగడాన ఒకానొకచోట ననుటచే నీకార్యంబునకుం బ్రయోగవైరళ్యంబు సూచింపంబడియె.

౪౩ లు ల న' అనునవి పరముగా ఉన్నప్పుడు ఆగమ ము' కారమునకు కొన్నిచోట్ల లోపము వికల్పముగా నగును ఆరీతి ము' లోపించినప్పుడు దానికి ముందున్నహ్రస్వము దీర్ఘముగా మాఱును.

(వజ్రము + లు=) వజ్రాలు (వజ్రము + లను=) వజ్రాలను (వజ్రము + న=) వజ్రాన మీఁది యుదాహరణములలో వజ్రము' అనుదానికి లు-ల-న' లు పరముగానున్నవి కాన ఆగమముగావచ్చిన 'ము' లోపించి దానికిముందున్న హ్రస్వమునకు దీర్ఘము వచ్చినది-అనఁగా జ్ర' అనునది జ్రా' గా మాఱినది

ఈకార్యము వికల్పము ఇది రానపుడు వజ్రములు వజ్రములను, వజ్రమున' అనియు నుండును పగడాలు' మున్నగునవియు నిట్లే

ఈసూత్రములో నీకార్యము ఒకానొకచో' వచ్చునని చెప్పఁబడినది కాన ఇట్టిప్రయోగములు చాల తక్కువగా నుండునని తెలియుచున్నది

### ఇగ్లౌరాయుగంతంబుల ప్రథమైకవచనంబునకు లోపంబగు ౪౪.

ఇకారాంతములకు గ్లౌరైశబ్దంబులకు మఱి యుగాగమాంతంబులకుం బ్రథమైకవచనలోపంబగు హరి - గిరి-శ్రీ-ధీ

ఇగ్లౌరాయుగంతంబులు=ఇకారాంతములు గ్లౌ, రై శబ్దములు

ఉగాగమము చివఱఁగలవి-(ఉకారము ఆగమముగా కలవి) అనువీనికి పరముగా నుండు ప్రథమావిభక్తిలోని ఏకవచనము లోపించును

[డు-ము-వు ప్రథమైకవచనము ఇక్కడి ఇకారాంత' పదముచే ఇ, ఈ లను రెండింటిని గ్రహింపవలెను]

ఉదా— హరి గిరి (ఇకారాంతములు) శ్రీ ధీ (ఈకా రాంతములు)

## ఇత్తునకు బహువచనంబు పరంబగునపు డుత్వంబగు ౮౫.

హరులు-గిరులు-కవులు-రవులు-యామినులు - భామినులు. తపరకరణంబుచే దీర్ఘంబున కుత్వంబులేదు శ్రీలు - స్త్రీలు - లక్ష్మీలు.

౮౫ ఇత్తు=హ్రస్వమైన ఇకారము బహువచనము పరముగా నున్న పుడు హ్రస్వమగు ఇకారము ఉకారముగామాఱును (హరి + లు=) హరులు, తపరకరణంబుచే = ఇకారము తరువాత త' కారమును చేర్చి ఇ' త్తని చెప్పుటచే [తకారము ఏ అచ్చుతోఁజేరియుండిన దానికేగాని తక్కిన యచ్చునకు గ్రాహకము కాదు ఇత్తనఁగా హ్రస్వమైన ఇకారమునే గ్రహింప వలెను దీర్ఘమును గ్రహింపరాదు]

ఈసూత్రమున ఇ' త్తనుదానివలన హ్రస్వమునే గ్రహింపవలెను. కాన ఈకారము ఉకారముగా మాఱదు శ్రీలు' అనునది 'శ్రులు' గాను, 'స్త్రీలు' స్త్రు' గాను మాఱవు.

## వికృతియం దికారాంతముల యుపోత్తమేత్త్వంబునకు బహువచనము పరంబగునపు డుత్వంబగు. ౮౬.

ఇచ్చట వికృతిశబ్దముచే సంస్కృతసమేతరంబు గ్రహింప వలయు కలికి-కలుకులు-ములికి-ములుకులు-చెలిమి-చెలుములు -

బలిమి - బలుములు. ఉపోత్తమేత్వంబున కనుటంజేసి జిగి నిసి ఇత్యాదులం దుత్వంబులేదు. జిగులు-నిసులు.

౮౬. వికృతియందు = దద్భవ దేశ్యరూపమగు నాచ్ఛికమునందు ఉపోత్తమేత్వంబునకు = కడపటిదానికి ముందున్న ఇకారమునకు [మూఁడు ను అంతకు ఎక్కువయు నగు నక్షరములు గలపదముల చివఱియచ్చునకు ఉత్తమము' అని పేరు దానికి సమీపముగా నున్నది—ఎడమప్రక్కనున్నది ఉపోత్తమము ]

మూఁడచ్చులుకలిగియున్న అచ్ఛికపదములకు బహువచనము పరమగు నపుడు ఆశబ్దములోని కడపటియచ్చునకు ముందున్న ఇకారము ఉకారమగును

(కలికి+లు=) కలుకులు ఇచట కలికి మూఁడచ్చులపదము అందలి కి' ఉత్తమము లి' ఉపోత్తమము దీనికి బహువచనముపరముగా నున్నందున 'ల' లు' గా మాఱినది ౮౫-వ సూత్రముచే కి కు' గా మాఱినది ఇట్లే తక్కినవియు ఈసూత్రమున ఉపోత్తమముయొక్క ఇకారము' అని చెప్పఁ బడుటచే జిగి నిసి' అనువానికి బహువచనము పరమగునపుడు ఉత్వము రాలేదు కాన జుగులు నుసులు' అను అసాధురూపములు కాలేదు ఇవి రెండక్షరముల పదములు కావున ఈసూత్రమున కిచట ప్రసక్తియే లేక

## ర ల డోపధసంఖ్యార్థాదులయుపోత్తమేత్వంబున కుత్వంబు గలుగదు ౮౭.

పందిరి-పందిరులు పిడికిలి-పిడికిళులు రాపిడి-రాపిడులు, తొమ్మిది-తొమ్మిదులు.

౮౭ చివఱియక్షరమునకు ముందున్నయక్షరమునకు ఉపధ యని పేరు. బహువచనము పరముగానున్నపుడు ర-ల-డ' లు ఉపధగాఁగల శబ్దముల యొక్కయుఁ, తొమ్మిది' మున్నగు నర్థము (సంఖ్యార్థము) గల పదముల

యొక్కయు ఉపోత్తమముల ఈకారము ఉకారముగా మాఱదు. [ఇయ్యది ౪౬-వ సూత్రమునకు బాధకము ]

పందిరి—దీనివర్ణక్రమము ప్ అంద్ ఇర్ ఇ ఇందలి యంత్యరేఫము దీని ఉపోత్తమము-దకారముమీఁది ఇకారము ఈశబ్దమునకు బహువచనము పరముగానున్నపుడు( పందిరి+లు' అని యున్నపుడు) ఆ ఉపోత్తమేకారము ఉకారముగా మాఱనందున డి' దు' గా మాఱదు. కాన పందురులు అని కాదు ఇట్లే పిడికిళులు రాపిడులు' అగునవి పిడికుళులు'. రాపుడులు గా మాఱవు. అట్లే తొమ్మిది' అను నర్థమిచ్చుశబ్దము బహువచనమున 'తొమ్ముదులు' గా మాఱదు. సంఖ్యార్థకమగు ఎనిమిది' బహుత్వమున ఎనిముదులు' గా మాఱదు [ఈచోట్ల బహువచనము పరమగునప్పుడు శబ్దము చివఱి యికారము ఉకారముగా మాఱుట కెట్టి యాటంకమును లేదు ]

## ఉకారాంత గోశబ్దంబుల కంతట వువర్ణకంబగు ౪౭.

తరువు - ధేనువు-మధువు - గోవు అంతట ననుట స్త్రీలింగ ప్రథమైకవచనలోపబాధనార్థము

౪౭ హ్రస్వమగు ఉకారము చివఱఁగల శబ్దములకును గోశబ్దమునకును అన్నిలింగములందును వు' ప్రత్యయము ప్రథమైకవచనమునఁ జేరును.

ఉదాహరణములందలి ధేను గోశబ్దములురెండును స్త్రీలింగములు కాన వానికి ముందు రాఁబోవు ౨౭ వ సూత్రముచే ప్రథమైకవచనలోపము రానుండ గా-ఆలోపము రాకుండుటకయి ఈసూత్రమున అంతట' అను విశేషము చేయఁబడినది కాన స్త్రీలింగములకుఁ ప్రథమైకవచనమున వు' ప్రత్యయమువచ్చినచో అది లోపింపదని తెలుచున్నది

ఉకారాంతముల కన్నిలింగములందును వు' వచ్చును- తరువు' పుంలింగమున కుదాహృతి ధేనువు' స్త్రీలింగమునకును మధువు' నపుంసకలింగమునకును ఉదాహృతులు

## వువర్ణకేతరవిభక్తి పరమగుచో నుకారాంతంబులకు బహుళంబుగా గోశబ్దంబునకు నిత్యంబుగా వుగాగమంబగు ౪౯.

తరువులు-తరులు-ధేనువులు-ధేనులు. గోవులు

౪౯ వువర్ణకేతరవిభక్తులు= వు' వర్ణకమువచ్చు విభక్తికంటె నితరమైన విభక్తి-ప్రథమాబహువచనము మొదలు లక్కినవిభక్తులలో నొకటి బహుళము గాను=ఇచ్చవచ్చినట్లును

ఉకారాంతశబ్దములకు ప్రథమాబహువచనాదివిభక్తులు పరముగా ఉన్నపుడు ఉకారాంతములకు వు' అనునది బహుళముగా ఆగమమగును గోశబ్దమునకు వు' నిత్యముగా ఆగమమగును (తరు+లు =) తరువులు' ఇచట లు' వువర్ణకేతరవిభక్తి అది పరముగా నున్నందున ఉకారాంతమగు తరు' శబ్దమునకు వు' ఆగమముగా వచ్చెను ఇది బహుళము కాన వు' రానప్పుడు తరులు' అగును గోశబ్దమునకు నిత్యమని చెప్పుటచేత గోవులు' అనియే యగుఁగాని గోలు' కాఁజాలదు

## ఉకారాంతం బగు మహత్తునకు వువర్ణకము బహుళముగా నగు ౫౦.

విష్ణువు-విష్ణుఁడు శంభువు-శంభుఁడు వసువు-వసుఁడు.

౫౦ ఉకారాంతములగు మహద్వాచకములకు వు' ప్రత్యయము బహుళముగా నగును వు' రానపుడు ౨౨-వ సూత్రముచే డుజ్ఞు' వచ్చును. (వు) విష్ణువు (డు) విష్ణుఁడు. ఇట్లే శంభువు' మున్నగునవియును.

## కద్రువ నాగమాత ౫౧.

కద్రువ-కద్రువలు కద్రువను-కద్రువలను.

౫౧ నాగులకుతల్లి' అనునర్థమున కద్రూశబ్దము సంస్కృతమున ఊకారాంతము ౫౪-వ సూత్రముచే దాని దీర్ఘము హ్రస్వమగును పిదప

౪౦-వ సూత్రముచే వు ప్రత్యయమువచ్చి 'క్రద్రువు' అని కావలసియుండఁగా అరీతిని కాదనియు 'క్రద్రవ' అని యుండుననియు ఈసూత్రము నియమించుచున్నది ఒకవిధమైనరంగు అర్థముఁగాఁగల 'క్రద్రు' శబ్దము పుంలింగ మొకటి యున్నది దానికి 'క్రద్రువు' అను రూపము కావచ్చును

## ఋకారాంతంబున కత్వంబును స్త్రీవద్భావంబునగు ౫౨.

భ్రాత-జామాత-కర్త-భర్త-హర్త-గంతె-హంత.

౫౨. ఋకారాంతములగు శబ్దములచివఱి ఋకారము అకారముగా మాఱును మఱియు నాశబ్దములు స్త్రీలింగములతో సమానములగును అవి స్త్రీవద్భావముపొందుటచే ౫౭వ సూత్రముచే ప్రథమైకవచనము లోపించును.

ఉదా-(భ్రాతృ) భ్రాత తక్కినవియు నిట్లే

## విధాతృ ధాతృ దాతృ సవితృ నేతృ శబ్దంబులకు మహత్తుల కత్వ స్త్రీవద్భావంబులు విభాషనగు. ౫౩

విధాత-విధాతృఁడు-ధాత-ధాతృఁడు-దాత - దాతృఁడు - సవిత-సవితృఁడు- నేత- నేతృఁడు

౫౩ మహద్వాచకములును ఋకారాంతములునగు 'విధాతృ' మున్నగుశబ్దముల ఋకారమకారముగా మాఱుట వికల్పము వానికి స్త్రీసమత్వము వికల్పము. అత్వ స్త్రీత్వములు వచ్చునపుడు 'విధాత' మున్నగునవి యగును లేనపుడు(౨౨-వ సూత్రముచే) డుజ్ఞువచ్చి 'విధాతృఁడు' మున్నగు రూపము లగును

## నామంబులతుదిదీర్ఘంబునకు హ్రస్వంబగు ౫౪

రమా-రమ-వనితా-వనిత - విద్యా-విద్య - లక్ష్మీ - లక్ష్మి సేనానీ - సేనాని. ఇట్లు కృతహ్రస్వములకు హ్రస్వాంతములకుఁబోలెఁ గార్యంబగు లక్ష్ములు-సేనానులు-సిరులు.

౧౪ సంస్కృతశబ్దముల చివఱ దీర్ఘములున్నచో అవి తెలుఁగున హ్రస్వము లగును (సం) రమా (తె) రమ

౧౭-వ సూత్రమునుబట్టి దీని ప్రథమైకవచనమునకు లోపము ఇట్లే తక్కినవియును.

ఇట్లు కృతహ్రస్వములకు — దీర్ఘములు హ్రస్వములైనపిదప ఆహ్రస్వములకు హ్రస్వములకు విధింపఁబడు కార్యములు వచ్చును కావున (లక్ష్మీ+లు=) 'లక్ష్ములు' అనుచో (౪౧-సూ) ఇకారము ఉకారమైనది సేనానులు మున్నగునవియు నిట్లే

## ఏకాక్షరంబులకు హ్రస్వంబు లేదు ౧౫.

క్ష్మా-మా-భా-శ్రీ-స్త్రీ-హ్రీ-ధీ-భీ-భ్రూ-వు.

౧౫ ఒక్క యక్షరమే గలపదముల దీర్ఘము హ్రస్వముగా మాఱదు. ఉదా - క్ష్మా (ఇచట అక్షర మనఁగా అచ్చు' అని యర్థము) భ్రూవు' అనుచో వు' (౪౦-సూ) వచ్చినది.

## వృద్ధాదుల డుజ్జునకు లోపము విభాషనగు. ౧౬.

వృద్ధు-వృద్ధుఁడు-మూర్ఖు-మూర్ఖుఁడు-నీచు-నీచుఁడు-గృహస్థు-గృహస్థుఁడు-చార్వాకు-చార్వాకుఁడు

౧౬ వృద్ధ' మున్నగుశబ్దముల డుజ్జు' వికల్పముగా లోపించును.

వృద్ధ' శబ్దమునకు (౨౧-సూ) ఉత్త్వమును (౨౨-సూ) డుజ్జును వచ్చి వృద్ధుఁడు ఐనది అందలి డు' ఈసూత్రముచే వికల్పముగా లోపింపఁగా వృద్ధు' ఐనది లోపము లేనపుడు వృద్ధు-డు' అగును ఇట్లే మూర్ఖు-మూర్ఖుఁడు' మున్నగునవియును.

## స్త్రీలింగంబుల ప్రథమైకవచనంబునకు లోపంబు నగు. ౧౭.

రమ-క్షమ-వనిత-ఘనత-విద్య-దేవత-మీనన్రేత్ర.

౧౭ రము' తొలుత రమూ' గా ఉండినది. ౧౪-వ సూత్రముచే దీర్ఘము హ్రస్వమై ఈసూత్రముచే ప్రథమైకవచనము లోపించినది తక్కిన వియం విష్టే.

## చరిత్రాదుల మువర్ణకంబునకు లోపంబు బహుళంబుగా నగు. ౧౮.

చరిత్ర-చరిత్రము - చరిత - చరితము, అలక - అభిలాష - అక్షత-ఘోష-తరంగ - భ్రమ-విజృంభణ - వధ - వేగ - స్ఫురణ - హంస - ఇత్యాదులు చరిత్రాదులు బాహుళకమువలన దర్భాదులకు ములోపంబు నిత్యంబు దర్భ-పనస-ఇత్యాదులు

౧౮ చరిత్ర' మున్నగుశబ్దముల ము' ప్రత్యయము బహుళముగా లోపించును

చరిత్ర' మున్నగువానికి (౩౯-సూ) ము' ప్రత్యయముచేరి చరిత్రము' మున్నగురూపములైనవి ము' బహుళముగా లోపింపగా చరిత్ర' మున్నగురూపములును అగును బహుళమగుటచే ఈలోపము కొన్నిటికి నిత్యముగా రావచ్చును కాన దర్భ పనస మున్నగుచోట ము' నిత్యముగా లోపించును. దర్భము పనసము' అని వాడరాదు

## స్వర్గివాచిదేవసురశబ్దంబు లేకత్వబహుత్వంబులం బ్రయోగింపంబడు ౧౯.

దేవుండు-సకల[illegible]యగుటచే భూదేవులు- భూసురుఁడను [illegible] లబోధకంబులయ్యె

౧౯ స్వ[illegible] నుండువారు' అనునర్థమున 'దేవుడు' దేవ' శబ్దము ఏకవచనమునం దే యుండును అయర్థము నే తెల్పు సురో శబ్దము బహువచనమునందే యుండును.

దేవుఁడు (ఏక) సకలసురలు' (బహు) బ్రాహ్మణులు' అనునర్థమును చెప్పునపుడు దేవశబ్దము బహువచనమునందును సురశబ్ద మేకవచనమునందును కూడ ఉండవచ్చును భూదేవులు (బహు) భూసురుఁడు (ఏక) భూదేవుఁడు, భూసురులు' అనియుం నుండును

**సురశబ్దంబు నిత్యంబుగా నసురశబ్దము వైకల్పికముగా స్త్రీతుల్యంబులగు సంస్కృతసమాసంబునఁ గావు ౭౦.**

సురలు - అసుర - అసురుఁడు. నిఖిలసురులు - రావణాసురుఁడు ' ఎల్లసురలు-ఎల్లయసురలు-ఎల్లయసురులు

౭౦ సుర' శబ్దము నిత్యముగా స్త్రీసమమగును అసురశబ్దము వికల్పముగా స్త్రీసమమగును కాని సంస్కృతసమాసములలోమాత్రము ఇవి స్త్రీసమములు కావు [స్త్రీసమము లగునపుడు వీని ప్రథమైకవచనము లోపించునని యిదివఱకే చెప్పఁబడినది ]

ఉ సురలు ( సురులు' అనికాదు ) అసుర-అసురుఁడు (రెండువిధములుగాను ఉండును.) సంస్కృతసమాసములలో స్త్రీసమత్వము లేనందున నిఖిలసురులు' అనియే యుండును ( నిఖిలసురలు' అని కాదు.) అట్లే రావణాసురుఁడు' ( రావణాసుర' అని యుండదు )

తెలుఁగుసమాసములలో ఈశబ్దములకు స్త్రీసమత్వముండును కాన 'ఎల్లసురలు' అనియు ఎల్లయసురలు ఎల్లయసురులు' అనియుం రూపము లుండును

**దూతాదులకు స్త్రీత్వంబు బహుళంబుగనగు ౭౧.**

దూత-దూతుఁడు-యోధ-యోధుఁడు-శుంఠ - శుంఠుఁడు బహుళగ్రహణముచే సమహత్త్వంబునందు స్త్రీత్వంబు నిత్యంబు సింగంబుదూత యగుజంబుకంబు.

౬౧ దూత' మొదలగుశబ్దములకు స్త్రీత్వము బహుళముగా నుండును స్త్రీత్వ ముండునపుడు ప్రథమైకవచనము లోపించి దూత' అగును లేనపుడు ఉత్వడుజ్ఞులు (౨౧ ౨౨-సూ) వచ్చి దూతుఁడు' అగును యోధ యోధుఁడు' మున్నగునవియు నిట్లే

ఈసూత్రమున బహుళము' అని చెప్పుటచేఁ గొన్నియెడల స్త్రీత్వము నిత్యము అమహద్వాచకములందు అది నిత్యము ఉ సింగంబు దూతయగు జంబుకంబు' ఇట సింగంబు దూతుఁడగుజంబుకంబు' అని చెప్పరాదు

## పృథ్వీవాచిభూశబ్దంబునకు భువియగు ౬౨.

భువి-భువ్రులు-భువిని-భువ్రులను

౬౨ భూమి' అనునర్థమునుదెల్పు భూ' శబ్దమునకు భువి' యనునది నామవాచకమగును భూ శబ్దమునకు ౪౦-వ సూత్రముచే వు' వచ్చి భూవు' అని యగుచుండఁగా ఆరీతిని అసాధురూపము కాకుండుటకయి ఈ సూత్రము వ్రాయఁబడినది దీనింబట్టి భువి' అనునదియే సాధురూపమని తెలియుచున్నది

దీనికి ౪౪-వ సూత్రముచే ప్రథమైకవచనము లోపింపఁగా భువి' అగును భువి+లు' అనియుండఁగా ౪౫-వ సూత్రముచే ఇకార ముకార ముగా మాఱి భువులు' అగును. 'భూవి+ను' అనియుండఁగా ౨౬-సూత్రముచే ను' లోని ఉకారము ఇకారముగా మాఱి భువిని' అగును భువి+ను' అని యుండగా బహువచనమున 3౧-చే లడాగమము ౪౬-చే ఉత్వమును వచ్చి. భువ్రులను' అయినది అర్థాంతరమున భూ' శబ్దమునకు వు' రావచ్చును ఉ ఆత్మభువు స్వయంభువు

## నౌశబ్దంబునకు నావ యగు. ౬3.

నావ - నావలు మహానావ. కొందఱు నావి యనియు నాదేశం బగునంద్రు.

౬౩ నాశబ్దమునకు నావ' నామముగా నగును ఇది స్త్రీలింగమగుటచే ౫౭ చే ప్రథమైకవచనము లోపించి నావ' అగును.

కొందఱు నా' కు బదులు నావి' అగునని చెప్పుదురు అది ఈవ్యాకర్తకు సమ్మతముకాదు.

## రైగ్లౌశబ్దంబుల కోత్వంబు విభాషనగు ౬౪.

ఇగ్లౌసూత్రముచేతం బ్రథమైకవచనమునకు లోపంబు -

రో-రై-గ్లో-గ్లౌ.

౬౪ రై గ్లౌ శబ్దములు రెండును వికల్పముగా ఓకారాంతములగును వానికి ౪౪-వ సూత్రముచే ప్రథమైకవచనము లోపించును. కాన రో రై— గ్లో, గ్లౌ అని యగును

## ఐకారంబీతుల్యంబు ౬౫.

రైని - రైకి - కైని - కైకి - పైని - పైకి

౬౫ ఐకారము ఈకారముతో సమానమగును అనఁగా ఈకారాంతములకు వచ్చుకార్యము ఐకారాంతములకు నగునని యర్థము రై+ను=రైని ౨౬-సూ ఉకారమున కికారము) రై+కు=రైకి ఇట్లే తక్కినవియును.

## కంధరాదులు క్లీబతుల్యంబులు బహుళంబుగానగు ౬౬

కంధరము - కంధర విధాశబ్దమునకుఁ గ్లీబతుల్యత్వంబు నిత్యంబు-విధము కంధరా నాసికా భిక్షా దంష్ట్రా గ్రీవా పాదుకోలా ప్రభృతులు కంధరాదులు

౬౬. 'కంధర' మున్నగుశబ్దములు బహుళముగా నపుంసకలింగసమానములగును. కంధరా' శబ్దము సంస్కృతమున స్త్రీలింగము ౪౪-వ సూత్రముచే దీర్ఘము హ్రస్వమైనది దాని కీసూత్రముచే నపుంసకత సిద్ధింపఁగా కంధరము' ఐనది క్లీబత్వము లేనప్పుడు కంధర' యగును (౫౭ సూ విభక్తిలోపము.) ఈ

సూత్రము బహుళము' అని యుండుటచే గొన్నింటికి నపుంసకత్వము నిత్య మని తెలియుచున్నది కాన విధా శబ్దమునకిది నిత్యము కాఁగా విధము' అనియే యగును విధ' యనిరూపముండదు

## ఇంక హలంతప్రకరణము

ఇంక—ఇంతవఱకును సంస్కృతమునందలి అనంతశబ్దములు తత్సమములుగా మాఱునపుడు జరుగుకార్యములు వివరింపఁబడినవి ఇఁక మీఁద హలంతములు (పొల్లులు చివఱఁగల శబ్దములు) తత్సమములగునపుడు జరుగు కార్యములు తెలుపఁబడును హలంతములఁగూర్చి చెప్పెడి భాగము హలంతప్రకరణము.

**హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యంబిందునామంబగు ౬౭**

రుక్-రాట్-మరుత్-వీరుత్-కర్మ-వర్మ శ్వశబ్దంబు దప్ప నకారాంతంబు లెల్లం బ్రథమైకవచనతుల్యంబులే యగునని యెఱుంగునది

౬౭ సంస్కృతమున హలంతశబ్దములకు ప్రథమైకవచనాంతరూపము ఎట్లుండునో తత్సమములలో అదియే ప్రాతిపదికయై యుండును

రుక్-రాట్-మరుత్-వీరుత్ మున్నగునవి హలంతముల ప్రథమైకవచనములు. కర్మ వర్మ' అనునవి కర్మన్, వర్మన్' అనునకారాంతశబ్దముల ప్రథమైకవచనరూపములు వాంతములలో ఒక్క శ్వన్' శబ్దమును విడిచి తక్కిన వన్నియు ప్రథమైకవచనతుల్యములే యిట నామములగును [శ్వన్' శబ్దమునకుమాత్రము ౨౦-వ సూత్రముచే ద్వితీయాంతతుల్యత్వము కల్గి శ్వానమ్' అనునది నామమగును.]

**ఉగాగమంబును ద్విత్వంబును దుదిహల్లునకగు ౬౮.**

ఉగాగమాంతంబుల కిగ్గొసూత్రముచేఁ బ్రథమైకవచనలోపంబగు. రుక్కు - రాట్టు - మరుత్తు - వీరుత్తు ఉగాగమంబు

లేమింజేసి యిచట నాంతంబుల కస్త్రీలింగంబులకుం బ్రథమైక వచనలోపంబులేదు కర్మము - వర్మము- చర్మము - సుధన్వుఁడు. సుత్రాముఁడు

౬౮ (మీఁదిరీతిని సిద్ధించిన ప్రాతిపదికల) చివఱిహల్లులు ద్విత్వమును పొందును ఆహల్లునకు ఉగాగమునగును (అనఁగాఆహల్లులచివఱ ఉకారము చేరును)

రుక్—ద్విత్వము ఉత్వమును—రుక్కు ఇది ఉగంతమగుటచే ౮౮-వ సూత్రము ననుసరించి ప్రథమైకవచనలోపము రాఁగా రుక్కు' అని యుండును. ఇట్లే రాట్టు మరుత్తు, వీరుత్తు' లును. కర్మ వర్మ చర్మ' మున్నగునవి నాంతములు అవి నపుంసకలింగములు అవి యుగంతములు (ఆగమమై ఉ చివఱవచ్చినవి) ను కావు కాని వాని ప్రథమైకవచనమునకు లోపములేదు వానికి ౩౯-వ సూత్రముచే ము' ప్రత్యయముచేరి కర్మము వర్మము చర్మము' అను రూపములేర్పడినవి

సుధన్వా' సూత్రామా' అనునవి నాంతములగు పుంలింగముల ప్రథమైకవచనరూపములు ౫౮-వ సూత్రము ననుసరించి వానితుదిదీర్ఘములు హ్రస్వములై (౨౧ ౨౨-వ సూత్రములచే) ఉత్వము డుజ్జువచ్చి సుధన్వుఁడు, సూత్రాముఁడు అనురూపము లైనవి

దీర్ఘంబుమీఁది హల్లునకు ద్విత్వంబుబహుళంబుగానగు. ౬౯

వాక్కు - వాకు స్వరాట్టు - స్వరాటు.

౬౯ దీర్ఘమునకుఁ దరువాతవచ్చు హల్లునకు ద్విత్వము బహుళముగా నగును వాక్కు (ద్విత్వము) వాకు (ద్విత్వములేమి) ఇట్లే స్వరాట్టు, స్వరాటు' లును ఈసూత్రమునుబట్టి ద్విత్వము బహుళముగాని ఉగాగమము బహుళము కాదనియుఁ అది నిత్యముగా వచ్చునదియే యనియు తెలియుచున్నది కావుననే వాకు స్వరాటు' అనునవి సిద్ధించుచున్నవి

## మతుబాదికంబు ద్వితీయైకవచనాంతతుల్యంబు నామంబగు ౨౦

శ్రీమంతమ్-గుణవంతమ్ - విద్వాంసమ్ - అనడ్వాహమ్ శ్వానమ్ - ఉపానహమ్ - అప్సరసమ్ - ఇత్యాదులు.

౨౦ మతుబాదికంబు= కలవాఁడు కలది' అను అర్థమిచ్చు మతుప్ ప్రత్యయము చివఱఁగలవియు మఱికొన్నియును. సంస్కృతమున మతుప్ప్రత్యయము చివఱవచ్చు వానియొక్కయుం మఱికొన్ని శబ్దములయొక్కయుం ద్వితీయావిభక్తిలోని ఏకవచనరుపము తెలుఁగున నామమగుచుండును

శ్రీమంతమ్ గుణవంతమ్' అనునవి మతుబంతముల ద్వితీయైక వచన రూపములు తక్కినవి యితరశబ్దముల ద్వితీయైకవచనాంతములు.

## దానియంతిమమకారంబునకు లోపంబగు. ౨౧.

శ్రీమంత్ర-గుణవంత-విద్వాంస - అనడ్వాహ - ఇత్యాది వీని కజంతములకుం బోలె డుజాదులు యథాయోగ్యంబుగ నగు. అతఁడు శ్రీమంతుఁడు - ఇతఁడు గుణవంతుఁడు - వానివంశము శ్రీమంతము-వీనివంశము గుణవంతము విద్వాంసుఁడు - విద్వాంసము. అనడ్వాహము - శ్వానము - అప్సరస వక్ష్యమాణలక్షణంబుచే స్త్రీత్వంబున మతుబాదులు ఙ్యంతంబులే యిందు గ్రహింపంబడు. శ్రీమతి-గుణవతి-విదుషి-యని మహతివాచ్యంబగునపుడు శ్రీమంతురాలు - గుణవంతురాలు - విద్వాంసురాలనియుఁ బ్రయోగింపఁదగు

౨౧ ద్వితీయైకవచనాంతములకు మతుబాదికముల చివఱి మకారము ఇచట లోపించును.

శ్రీమంతమ్' మున్నగువాని మకారము' లోపింపఁగా శ్రీమంత' మున్నగురీతి నగును తరువాత వీనికి అజంతశబ్దములకువలె (౫౧, ౫౫-సూ)

ఉత్వము దుక్కు రాఁగా శ్రీమంతుఁడు గుణవంతుఁడు' మున్నగురూపము లగును (వానివంశము) శ్రీమంతము (వీనివంశము) గుణవంతము' అనుచోట్ల మకారము లోపించినపిదప ఇవి అమహత్తులు కావున ము' ప్రత్యయమువచ్చి మీఁదిరూపము లైనవి విద్వాంసుఁడు విద్వాంసము అనునవియు నిట్లే

అనడ్వాహమ్' అనుచోట మకారము లోపించి అమహత్తగుటచే 'ము' వచ్చి అనడ్వాహము' అయినది. శ్వానమ్' అనుచోటను మకార లోపము ము' వచ్చి శ్వానము' అయినది అప్సరసమ్' అనుదాని మకారము లోపించి' అది స్త్రీలింగమగుటచే ప్రథమైకవచనమును లోపించి అప్సరస' అయినది

వక్ష్యమాణ—ఇందలి ౭౫-వ సూ అనుసరించి స్త్రీలింగములన్నియు వానివానికి నియతములైన స్త్రీప్రత్యయముతో (టీప్ ఙీష్ ఙీన్ చాప్, ఆప్ డాప్ అనువానితో) కూడియే శబ్దములందు వ్యవహరింపఁబడవలసి యుండుటచే ఈకారములు చివఱఁగలమతుబంతములనే మతుబాది శబ్దముచే గ్రహింపవలెను అవియే యిచ్చట ప్రాతిపదిక లగును శ్రీమతీ గుణవతీ, విదుషీ శునీ' అనునవి సంస్కృతమున ఙ్యంతములు(అనఁగా ఙకారము ఇత్తుగా గల ఈకారాంతస్త్రీప్రత్యయము చివఱ గలవి వాని చివఱిదీర్ఘము ౫౪-వ సూత్రముచే హ్రస్వములై ౪౪-వ సూత్రముచే ప్రథమైకవచనలోపము రాఁగా శ్రీమతి గుణవతి విదుషి శుని అని యైనవి.

ఇత్యాది స్త్రీలింగములవిషయము స్త్రీలింగములుకాక మహతీవాచకము లైనపుడు (శ్రీమంత+అలు' అని యుండునపుడు సంధి ౩౧-వ సూ అనుసరించి, ఉత్వ, రుగాగమములువచ్చి శ్రీమంతురాలు' అగును

## ముదాదులకుఁ బ్రథమైకవచనలోపంబు లేదు ౭౨

ముదము-ఉపానహము-స్రజము

౭౨. 'ముద' మున్నగువానికిఁ బరముగానుండు ప్రథమైకవచనము లోపింపదు

ముత్' అనుదానికి ముదమ్' అనునది సంస్కృతమున ద్వితీయైక వచనము అదియే తెలుఁగున నామమగును దాని చివరి మకారము' నకు లోపమురాఁగా ముద' అగును ఈశబ్దము స్త్రీలింగమగుటచే ౫౭-వ సూత్రముచే ప్రథమైకవచనమునకు లోపము వచ్చుచుండఁగా ఆలోపము రాదని యీసూత్రముచే విధింపఁబడుచున్నది

ఈశబ్దము అమహత్తుగాన ౩౯-వ సూత్రముచే ము' ప్రత్యయము వచ్చి ముదము' అయినది ఉపానహము స్రజము' అనునవియు నట్లే [అవి యును స్త్రీలింగములే వానికిని ప్రథమైకవచనలోపము లేదు ము' వచ్చినది]

## ఋత్విగాదులు ద్వితీయైకవచనాంతతుల్యంబులు విభాషనగు ౭౩.

ఋత్విజుఁడు - ఋత్విక్కు - నీవృతము - నీవృత్తు. ఋత్విగాదికం బాకృతిగణంబు

౭౩ ఋత్విక్' మున్నగుశబ్దములు ద్వితీయైకవచనాంతతుల్యములు తెలుఁగులో వికల్పముగా నామంబులగును కాఁగా అవి ప్రథమైకవచనాంత తుల్యములుకూడ నామములు కావచ్చును

ఋత్విజమ్ ఋత్విక్' అనునవి రెండును నామము లగును

ఋత్విజమ్' అనునది నామమైనప్పుడు మకారలోపము, ఉత్వము, డుజ్జునవచ్చి ఋత్విజుఁడు' అని యగును ఋత్విక్' నామమగునపుడు ద్విత్వము, ఉగాగమునువచ్చి ఋత్విక్కు' అగును. ఇట్లే తక్కినవియును.

ఆకృతిగణము = ఇట్టిరూపములు కలపదములు కల్గినగుంపు—అనఁగా నీరీతిని రెండువిధములగురూపములును ఉన్నపదముల నన్నింటి నిందుఁ జేర్ప వగుననుట.

ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాషనగు. ౨౮.

హనుమానుఁడు - హనుమంతుఁడు - భగవానుఁడు - భగవంతుఁడు - ఇత్యాది

౨౮ కొన్నిచోట్ల మహద్వాచకములందు మతుప్ప్రత్యయముయొక్క తకారమునకు ఆన అనునది వికల్పముగా ఆదేశమగును

హనుమత్' అనునది మతుప్ప్రత్యయాంతము మహద్వాచకము దాని మతుప్తకారమునకు ఆన' ఆదేశమురాఁగా హనుమ+ఆన' అని యుండును పిదప సంధి ౧౧-వ సూత్రముచే సంధివచ్చి హనుమాన' అగును ఉత్వ, డుజ్ఞులువచ్చి హనుమానుఁడు' అగును ఇయ్యది వికల్పమగుటచే ఆన' రానపుడు హనుమంతుఁడు' అగును (౨౦-సూ ద్వితీయాంతతుల్యత—హనుమంతమ్ ౨౧-వమకారలోపము ఉత్వ డుజ్ఞులు) భగవానుఁడు భగవంతుఁడు' నిట్టే

విశ్వకర్మాదులకు స్త్రీత్వంబగు. ౨౯.

స్త్రీలింగత్వాతిదేశంబుచేత నుత్వడుజ్ఞులు లేవని యెఱుంగునది విశ్వకర్మ - కృష్ణవర్మ - అశ్వత్థామ - యువ - యజ్వ ఇత్యాదులు.

౨౯ విశ్వకర్మ' మున్నగుశబ్దములకు స్త్రీలింగతుల్యత్వము కలుగును. 'విశ్వకర్మన్' మున్నగుశబ్దములు సంస్కృతమున నాంతములు మహత్తులు; వాని ప్రథమైకవచనము విశ్వకర్మా' మొదలగునవి అవియే తెలుఁగున నామములగును వాని (౫౮-వ సూ) దీర్ఘము హ్రస్వమయి విశ్వకర్మ' మున్నగు రీతి నగును

ఇవి మహత్తులు కాన ఉత్వ డుజ్ఞులను పొందవలసియుండఁగా అవి రాకుండ స్త్రీత్వము కల్పింపఁబడినది. కాన (౫౭-సూ) ప్రథమైకవచన లోపము కల్గి విశ్వకర్మ' మున్నగురూపము లగును

## మహద్వాచకమయి పుంలింగంబగు బ్రహ్మశబ్దమునకు స్త్రీత్వంబగు ౨౬.

బ్రహ్మ - ఈశబ్దము చతుర్ముఖ ఋత్విగ్విప్రులకు వాచకంబు తత్త్వ తపోవేదయోగవాచకంబగునేని బ్రహ్మము నాఁబడు

౨౬ మహద్వాచకమును పుంలింగమునయిన బ్రహ్మశబ్దము స్త్రీసమమగును కాన (౫౭-సూ) ప్రథమైకవచనము లోపించి బ్రహ్మ అగును. దీనికి ప్రక్రియ విశ్వకర్మ కువలెనే గమనించునది

తత్త్వము తపస్సు మున్నగునర్థములలో బ్రహ్మ' శబ్దము నపుంసకలింగము దానిప్రథమైకవచనము బ్రహ్మ' అదియే యిట నామము దానికి (౩౮-సూ) ము' చేరి బ్రహ్మము' అయినది

## ఆత్మేమనిజంతంబులకు నాంతము లగుమనుజసంజ్ఞలకు స్త్రీత్వంబు బహుళంబుగా నగు. ౨౭

ఆత్మ-ఆత్మము - ఆత్ముఁడు మహిమ-మహిమము అణిమ - అణిమము గరిమ-గరిమము లఘిమ-లఘిమము దేవశర్మ - దేవశర్ముఁడు

౨౭ ఆత్మన్' శబ్దమునకును ఇమనిచ్' ప్రత్యయము కడపటవచ్చు వానికిని నకారాంతములై మనుష్యులసంజ్ఞలను (ప్రత్యేకనామములను) తెల్పుశబ్దములును బహుళముగా స్త్రీసమము లగును.

ఆత్మన్' శబ్దము పుంలింగమునందును నపుంసకలింగమునందునుగూడ కలదు శరీరము మనస్సు మున్నగునర్థములలో అది నపుంసకలింగమగుచున్నది ఆత్మన్' శబ్దమునకు స్త్రీత్వము వచ్చునపుడు ప్రథమైకవచనము లోపించి 'ఆత్మ' అగును [దీనికి నామము ప్రథమాంతమగు ఆత్మ' యే నపుంసక

మగునపుడు ము' చేరి అత్మము' అగును బహుళగ్రహణముచే స్త్రీత్వము రానిపక్షమున ఉత్వ డుజ్ఞులు (౨౧ ౨౨-సూ) వచ్చి అత్ముఁడు' అగును

మహిమన్' శబ్దము ఇమనిచ్' ప్రత్యయాంతము మహిమా' ప్రథమైకవచనాంతము అదియే యిచట నామము దానిదీర్ఘమునకు హ్రస్వము (౫౪-సూ) స్త్రీవద్భావమున ప్రథమైకవచనలోపము (౫౭-సూ) కాన మహిమ' ఐనది స్త్రీత్వము రానిపక్షమున అమహద్వాచకమగుటచే దీనికి 'ము' వచ్చి (౩౯-సూ) మహిమము' అయినది అణిమ అణిమము' మున్నగునవియు నిట్లే యని యెఱుంగునది

దేవశర్మన్' మనుష్యనామము మహత్తు దేవశర్మా' ప్రథమైకవచనాంతము అదే యిచట నామము దీనిదీర్ఘమునకు (౫౪-సూ) హ్రస్వము స్త్రీత్వమువలన (౫౭-సూ) ప్రథమైకవచనలోపము. దేవశర్మ' అగును స్త్రీత్వము లేనపుడు (౨౧ ౨౨-సూ) ఉత్వ డుజ్ఞులు—'దేవశర్ముఁడు' అగును

## మహత్త్వంబున స్వార్థపరంబగు రాజశబ్దము రాజన్నాఁబడు. ౭౮.

రాజు-ఖగరాజు అమహత్త్వంబునందు రాజము - వృక్షరాజము ఉపసర్జనత్వంబునందు - హతరాజుఁడు పరశురాముఁడు.

౭౮ మహద్వాచకమగు రాజశబ్దము (వేఱొకదానికి విశేషణము కాకుండ) ప్రధానముగా నుండునపుడు రాజు' అని యుండును.

రాజు' మహత్తు ప్రధానము. ఖగరాజు' (ఖగములకు రాజు కావున నిదియును ప్రాధాన్యమును విడువలేదు) రాజశబ్దము అమహత్తగునపుడు 'రాజు' అనికాదు అపుడు రాజన్' ప్రథమైకవచనాంతతుల్యమగుట రాజా' అని యుండఁగా దీర్ఘము హ్రస్వమై ౩౯-వ సూత్రముచే ము' వచ్చి రాజము' అగును ఇట్లే వృక్షరాజము' ను.

(ఉపసర్జనత్వంబునందుఁ) అప్రాధాన్యమునందు రాజు' అని కాదు, 'పరశురాముఁడు హతరాజుఁడు (చంపఁబడిన రాజులుకలవాఁడు)' అనియే యగును గాని హతరాజు' కాదు

హతరాజుఁడు' అనుదానికి హతరాజ' శబ్దము ప్రథమైకవచనాంతము నామము (౨౧ ౨౨-సూ) ఉత్వ ఁ డుజ్జులువచ్చి హతరాజుఁడు' అయినది.

ఖగరాజు' అనునపుడు రాజశబ్దము మహద్వాచకమును, ప్రభుత్వ ద్యోతకమును కాన రాజు' అయినది వృషరాజ' మనునపుడు రాజ శబ్దము శ్రేష్ఠతావాచక మగుటచే అమహత్తయిఁ యమహత్కార్యములను పొందినది.

జగదింద్రజిత్తులతకారంబునకు లోపంబు విభాష నగు. ౨౯.

జగము - జగత్తు ఇంద్రజితు - ఇంద్రజిత్తు బుత్వాగాది యగుటంజేసి యింద్రజితుండనియు వాడంబడు.

౨౯ జగత్. ఇంద్రజిత్' అనుశబ్దముల తకారము వికల్పముగా లోపించును. జగత్ ప్రథమైకవచనము తెలుఁగున నిదియే నామము. దీని తకారము లోపించినపిదప ము' చేరి (ఇది అమహత్తగుటవలన) జగము' అగును. తకారలోపము రానప్పుడు ద్విత్వము ఉగాగమము (౭౮ సూ) వచ్చి జగత్తు' అగును (౪౪-సూ విభక్తిలోపము) ఇంద్రజిత్' లోని తకారము లోపింపఁగా ఇంద్రజి అగును దీనికి ఇగ్లౌరా' సూత్రముచే (౪౪-సూ.) ప్రథమైకవచము లోపించును

తకారలోపము రానపుడు ద్విత్వమును ఉగాగమమునువచ్చి ఇంద్రజిత్తు' అగును మఱియు నీశబ్దము బుత్వాగాదులలో నున్నందున (౨౩-సూ.) ద్వితీయైకవచనాంతతుల్యతకల్గి ఇంద్రజితమ్ అనునది నామమగును (౨౧-వ సూత్రమున నుసరించి) మకారము లోపించి (౨౧ ౨౧-సూ) ఉత్వ డుజ్జులు రాగా ఇంద్రజితుఁడు' అనియును అగును.

## సాంతంబులతుది సకారంబునకు లోపంబు బహుళంబుగా నగు ౧౦.

ఉరము - ఉరస్సు - వక్షము - వక్షస్సు - అర్చి - అర్చిస్సు - ధనువు - ధనుస్సు - ఆయువు - ఆయుస్సు బహుళగ్రహణంబునం జేసి పయఃప్రభృతుల సకారంబునకు లోపంబు లేదు. పయస్సు - వయస్సు-సరస్సు

౧౦ అమహత్తులగు సకారాంతశబ్దముల తుదిసకారమునకు లోపము బహుళముగా నగును

౪౦-వ సూత్రము ననుసరించి హలంతములన్నింటికిని ద్విత్వము ఉగాగమమునకు నిత్యముగా వచ్చుచుండఁగా, దానిని వారించుట కీసూత్రమారంభింపఁబడినది

ఉరస్'—సకారములోపమువచ్చి (ఇది యమహత్తగుటవలన) ము' చేరి ఉరము' అయినది లోపము రానపుడు ద్విత్వోగాగమములువచ్చి 'ఉరస్సు' ఐనది ఇట్లే తక్కినవియును.

పయస్' మున్నగువానికి సకారములోపమువచ్చి పయము' మున్నగు రూపములు కావు. పయస్సు' మున్నగునవియే అగును బహుళగ్రహణముచేనఁట సకారలోపము రాదు.

## మహద్వాచకంబులగు సాంతంబుల కంతలోపంబేని ద్వితీయైక వచనాంతతుల్యత్వంబే నగు. ౧౧

అంగిరుఁడు - అంగిరసుఁడు - ఉగ్రశ్రవుఁడు - ఉగ్రశ్రవసుఁడు - ప్రచేతుఁడు - ప్రచేతసుఁడు - ఊర్ధ్వరేతుఁడు - ఊర్ధ్వరేతసుఁడు.

౧౧ మహత్తులగు సకారాంతశబ్దముల తుదియక్షరము (సకారము)నకు లోపమైనను కల్గును లేదా దానిద్వితీయైకవచనరూపమైన తెలుఁగున నామ మగును

అంగిరస్' సకారాంతమహద్వాచకము దీని సకారము' లోపిం
పగా ఉత్వ దుజ్ఞులువచ్చి (౭౧ ౨౨-సూ) అంగిరుఁడు' అగును ద్వితీ
యాంతతుల్యతవలన అంగిరసమ్ నామముకాఁగా 'మకారము' లోపించి,
ఉత్వ దుజ్ఞులువచ్చి అంగిరసుఁడు' అగును ఇట్లే తక్కినవియును

వేధ పురోధ పురోధసుఁడు ౭౨

వేధశ్శబ్దమునకు నిత్యంబుగాఁ బురోధశ్శబ్దమునకు
వైకల్పికముగా సలోపస్త్రీవద్భావంబులు దీనిచే నిపతింపం
బడియె

౭౨ వేధస్' సాంతమహత్తు పైసూత్రము ననుసరించి దీనికి
'వేధుఁడు' అనిగాని వేధసుఁడు' అనిగాని రూపము కలుగవలసియున్నది.
అట్లుకాక వేధ' అనియే యుండునని యీసూత్రము నియమించుచున్నది.
[అనఁగా వేధశ్శబ్దమునకు సకారలోపమును స్త్రీవద్భావమును నిత్యముగా
నియమింపఁబడుచున్న వనుట స్త్రీవద్భావముచే ౧౬-వ సూత్రమున ప్రథమైక
వచనలోపము ]

పురోధశ్శబ్దమునకు సలోప స్త్రీవద్భావములు వికల్పముగా విధింపఁ
బడుచున్నవి అవి వచ్చినపుడు పురోధ' అగును రానపుడు ద్వితీయైకవచ
నాంతతుల్యత్వము విహితము అపుడు పురోధసమ్' లోని మకారము' లో
పించి ఉత్వ దుజ్ఞులు రాఁగా 'పురోధసుఁడు' అనియు నగును

మనఃప్రభృతులసకారంబునకు ద్విత్వంబు విభాషనగు. ౭౩.

మనసు-మనస్సు-శిరసు-శిరస్సు - సదసు - సదస్సు - సలోపం
బయ్యెనేని - మనము - శిరము - సదము.

౭౩. మనస్' మున్నగుశబ్దముల సకారమునకు ద్విత్వము వికల్పముగా
నగును ౬౨-వ సూత్రముచే ద్విత్వము నిత్యముగా వచ్చుచుండఁగా అట్లు
రాకుండుట కీసూత్రము చెప్పఁబడినది ఉగాగమముమాత్రము నిత్యము కాన

మనసు మనస్సు' అని రెండువిధములరూపము లగును మఱియు ౧౦ వ సూత్రముచే సకారలోపము రాఁగా ము' చేరి మనము'అని 3-వ రూపము నగును తక్కినవి నిట్లే

## ద్యుహ్వాచ్ఛబ్దంబులకు దివి హ్వృది యగు. ౮౪.

దివి-దివులు-హ్వృది-హ్వృదులు.

౮౪ ద్యుహ్వాచ్ఛబ్దంబులకు= దివ్ హ్వృక్ అనుశబ్దములకు దివ్'కు 'దివి' అనియుం హ్వృత్' కు హ్వృది' యనియు నామము లగునని యర్థము ద్యుహ్వాచ్ఛబ్దముల సప్తమ్యేకవచనములరూపములు తెలుఁగున నామము లగు వనిభావము దివి హ్వృది' అనువానికి ౪౪-వ సూత్రముచే (ప్రథమైకవచ నము లోపింపఁగా దివి హ్వృది అనియే రూపము లుండును దివి+లు హ్వృది+లు' అని యుండఁగా (౪౫-వ సూ) ఇకార ముకారముగా మాఱి 'దివులు హ్వృదులు' అనురూపము లేర్పడును.

## స్త్రీలింగంబులెల్ల స్వస్వనియతంబులగు స్త్రీప్రత్యయంబులం గూడి యిందుఁ బ్రవర్తిల్లు ౮౫.

| నామము | | స్త్రీప్రత్యయాంతము | | తత్సమము |
|---|---|---|---|---|
| కర్తృ | | కర్త్రీ | ... | కర్త్రి. |
| జనయితృ | .. | జనయిత్రీ | ... | జనయిత్రి. |
| భాగ్యశాలిన్ | . | భాగ్యశాలినీ | .. | భాగ్యశాలిని. |
| బుద్ధిశాలిన్ | ... | బుద్ధిశాలినీ | . | బుద్ధిశాలిని |
| మతిమత్ | ... | మతిమతి | .. | మతిమతి. |
| గుణవత్ | .. | గుణవతీ | ... | గుణవతి |
| విద్వస్ | ... | విదుషీ | ... | విదుషి. |

| | | | | |
|---|---|---|---|---|
| వనజముఖ | ... | వనజముఖీ | ... | వనజముఖి. |
| | | వనజముఖా | ... | వనజముఖ. |
| మీననేత్ర | ... | మీననేత్రా | .. | మీననేత్ర. |

అంగాదులకుఁ దప్ప సంయోగోపధంబులకు ఙీప్ప్రత్యయంబు
లేమిం జేసి మీననేత్రి-పద్మనేత్రి ఇత్యాదు లసాధువులు.

౨౫ సంస్కృతమునందున్న స్త్రీలింగశబ్దములెల్ల వానివానికి స్త్రీత్వము నందుఁగల్గిన (స్త్రీ) ప్రత్యయములతోఁగూడియే తెలుఁగునకువచ్చునని భావము.

కర్తృ' శబ్దమునకు కర్త్రీ' స్త్రీప్రత్యయాంతము అదియే తెలుఁగున నామము దానిదీర్ఘము (౧౪-వ సూ) హ్రస్వమయి ఇగ్గౌరా' (౪౪) సూత్రముచే ప్రథమైకవచనము లోపించి కర్త్రి' యగును ఇట్లే తక్కినవి యును వనజముఖ మీననేత్ర' అనువానికిమాత్రము ౧౬ వ సూత్రముచే ప్రథమైకవచనలోపము.

అంగాదులకు—హల్ సమూహము ఉపధయందుఁగల అఙ్గ' మొదలగు శబ్దములకే ఙీప్ప్రత్యయము (అందు మిగులునది ఈ మాత్రమే) వచ్చునని నియమముకలదు నేత్ర' శబ్దము ఉపధయందు హల్సముదాయము కలదే యైనను అఙ్గాదుల' లోఁ చేరనందున-(బహువ్రీహిసమాసమునందలి) ఆ పదము చివర ఈ కారముచేరదు ఆకారమే చేరును కాన మీననేత్ర, పద్మనేత్ర' అనియే యుండవలెను.

[చివరినుండి లెక్కించినచో పదములోని రెండవయక్షరము ఉపధ యని వివరింపఁబడినది]

మహతీతరంబులగు స్త్రీలింగంబులవిశేషణంబులకుఁ
గ్లీబత్వంబు విభాషనగు ౨౬.

పద్మలత మనోహారి-పద్మలత మనోహారిణి - హృద్యంబగు విద్య హృద్యయగువిద్య మొదవులలోఁ గపిల వరిష్ఠంబు-కపిల వరిష్ఠ.

౧౬ మహతులు (స్త్రీలింగములు) కానట్టి స్త్రీలింగశబ్దములవిశేషణములకు నపుంసకలింగత్వము వికల్పముగా నగును.

పద్మలత' స్త్రీలింగము కాని మహతీవాచకముకాదు. అందుచే దాని విశేషణము వికల్పముగా నపుంసకలింగమయి మనోహరి 'అగును ఈవిధి వికల్పమగుటచే మనోహారిణి' అని స్త్రీలింగరూపమును కావచ్చును తక్కినయుదాహరణములు నిట్లే

## భవచ్ఛత్రాదుల కిందుఁ బ్రయోగంబు లేదు ౧౭.

భవదాదులగు హలంతసర్వనామములకును, శతృరేఫాంతాదులకును దెనుఁగుభాషయందు వ్యవహారంబు లేదని యర్థము. సమాసంబులం దొలుతం గదిసి యిందుం బ్రయుక్తంబులగు భవద్గుణంబులు - త్వదాశ్రయము - మత్ప్రణామము - లసద్రూపము - భవిష్యత్కాలము - ధూర్వహము - ఇత్యాదు లెఱుంగునది.

౧౭ భవత్, త్వత్ మత్' మున్నగుహలంతములగు సర్వనామములకును, లసత్, భవిష్యత్' మున్నగు శతృప్రత్యయాంతములకును ధూర్' మున్నగు రేఫాంతములకును తెలుఁగులోఁ బ్రత్యేకప్రయోగములు లేవు అని సమాసములందు పూర్వ (మొదటి) పదములుగాఁ బ్రయోగింపఁబడును భవద్గుణము' అను (తత్పురుష) సమాసములో భవత్' తొలిపదము సర్వనామము ఇట్లే తక్కినవి. లసద్రూపము' అను (కర్మధారయ) సమాసములో తొలిపదము లసత్' శత్రంతము. ధూర్వహము' లో మొదటిపదమగు 'ధూర్' అనునది రేఫాంతము.

ఇది తత్సమపరిచ్ఛేదము

---

# ఆచ్ఛికపరిచ్ఛేదము ౪

సంస్కృతసమేతరంబయిన యీభాష యచ్ఛ యనంబడు ౧.

స్పష్టము.

అచ్చతెనుఁగుపదములనుగూర్చి తెలుపుభాగము ఆచ్ఛికపరిచ్ఛేదము'

౧. సంస్కృతసమేతరంబు = సంస్కృతసమ (తత్సమ) పదములకంటె వేఱైనది తద్భవదేశ్యములుకలది

తద్భవ దేశ్యపదములుగలభాష యచ్చ (అచ్చతెలుఁగు) అనఁబడును

ఆచ్ఛికశబ్దంబులెల్లం దఱచుగ
స్త్రీసమంబులుం గ్లీబసమంబు లయియుండు. ౨.

స్త్రీసమత్వాతిదేశంబుచేఁ బ్రథమైకవచన లోపాదికంబును గ్లీబసమత్వాతిదేశంబుచే మువర్ణకంబు నగునని యెఱుంగునది. అన్న-మిన్న-అద్ద-గద్ద-జాణ-గాణ-ఓడ-గోడ-ఇత్యాదులు స్త్రీసమంబులు బియ్యము-నెయ్యము-అల్లము-మొల్లము-సున్నము-సన్నము-ఇత్యాదులు క్లీబసమంబులు. తఱచుగ ననుటచేఁ బుంలింగతుల్యంబులుం గొండొక కలవని తాత్పర్యము కొమరుఁడు-చందురుఁడు-జముఁడు-కందుఁడు-ఇత్యాదులు

౨ అచ్చతెనుఁగుశబ్దములన్నియుఁ సాధారణముగా స్త్రీలింగసమములు గాఁగాని, నపుంసకలింగ సమములుగాఁగాని యగుచుండును స్త్రీలింగసమాన ము

-లగునపుడు ప్రథమావిభక్త్యేకవచనలోపము మున్నగునవి వచ్చును. ఉ అన్న, మిన్న అద్ద గద్ద జాణ మున్నగునవి నపుంసకలింగసమాసములగునపుడు ము' ప్రత్యయమగును ఉదా—బియ్యము, నెయ్యము అల్లము మున్నగునవి.

అచ్చ తెలుఁగుపదములు కొన్ని పుంలింగతుల్యములయి డుజ్' ను పొందుటయుఁగలదు ఉదా కొమరుఁడు చందురుఁడు

## బల్లిదాదులు సంస్కృతతుల్యంబులు 3.

మహత్త్వంబున వీనికుత్వడుజాదులు నమహత్త్వంబున ముఁవర్ణకాదులును స్త్రీత్వంబునం దాలుశబ్దముతోడ సమాసంబునుం గలుగునవి యెఱుంగునది. బల్లిదుఁడు - బల్లిదము - బల్లిదురాలు. బల్లిద - అక్కజ - కావల - బెట్టిద - బెడిద - మిసిమింత-మొక్కల-ఇత్యాదులు బల్లిదాదులు

3 బల్లిద' మొదలగుశబ్దములు సంస్కృతశబ్దములతో సమానములయి యుండును అవి మహత్తులగునపుడు ఉత్వ డుజ్లులు (తత్స ౨౧ ౨౨) వచ్చును స్త్రీత్వమునందు ఆలు' తో సమాసమును ఉత్వ రుగాగమములను (సంధి 3౧) పొందుచుండును అమహత్తు లగునపుడు వీనిచివఱ ము' చేరు చుండును.

## మహత్తులగుమగాదులకుం గయిరాదులకును డుజ్జగు నుత్వంబు గాదు ౪.

మగఁడు - మనుమఁడు - కయిరఁడు - కత్తళఁడు - మగ - మనుమ - రాయ - పాప - ప్రే - జే - ఈ - క్త్వా ప్రత్యయాంతంబులు - ఇత్యాదులు మగాదులు కయిర - కత్తళ - జన్న-నిల - ఇత్యాదులు కయిరాదులు.

౪ మహద్వాచకములగు మగ' మున్నగువానికిని అమహత్తులగు

'కయిర' మున్నగువానికిని డుజ్ఞు' మాత్రము వచ్చును. (౨౧-సూ) ఉత్వము రాదు. ఉత్వము రానందున మగఁడు కయిరుఁడు' మున్నగు సరూపముల కావు మగఁడు కయిర డు' మున్నగునవియే యగును.

ఈ కా ప్రత్యయాంతములు=కా ప్రత్యయాంతములు (తద్ధిత-౧౫) న కా ప్రత్యయాంతములు (తద్ధిత-౧౧) ను

మగాదులు మహత్తులు వానికి ఉత్వ డుజ్ఞులు వచ్చుచున్నవి కయి రాదులమహత్తులు వానికి డుజ్ఞురాలేదు కావున రెండుగణములకును కేవలము డుజ్ఞు వచ్చుటకు ఈ కీసూత్రము వ్రాయఁబడినది

## పగతాదుల బహువచనలకారంబునకు రేఫంబగు ౫

పగతురు - అల్లురు - నెయ్యురు - బలియురు - మార్తురు.

౫ మహద్వాచకములగు పగత మున్నగుశబ్దముల బహువచనలకారమునకు రేఫ మగును

(పగత+లు)= పగతురు' (తత్స ౨౧-ఉత్వము) ఇట్లే మిగిలినవి యగును.

## కొన్ని డుమంతంబుల బహువచనలకారంబునకు రేఫంబును, దానికి ముందు పూర్ణబిందుపూర్వక డకారంబు నగు. ౬.

గండండ్రు - మిండండ్రు - ఇత్యాదులు

౬. డుజ్ఞువచ్చు కొన్నిశబ్దముల బహువచనలకారము రేఫముగా మాఱుచు దానికిముందు బిందుసున్నతోఁగూడిన డకారము (ండ్)ను అగును. కాఁగా అట్టివాని బహువచనము ండ్రు' గా అగుననుట (గండ+లు=) గండండ్రు'

**కా ప్రత్యయంబుమీఁది బహువచనలకారంబునకు లఘ్వలఘురేఫంబులును, లఘురేఫంబునకు ముందు బిందుపూర్వక డకారంబునగు ౭**

విలుకాండ్రు - విలుకాఱు - వేటకాండ్రు - వేటకాఱు - వేడుకకాండ్రు - వేడుకకాఱు

౭ మతుబర్థమున (కలవాఁడు కలది అనునర్థమున) మహత్తులకు కా ప్రత్యయము చేరునని (తద్ధిత-౧౫) ముందుఁజెప్పఁబడును. ఆ ప్రత్యయము మీఁది బహువచనలకారమునకు ఱ వచ్చును లేదా బిందుపూర్వక డకార పూర్వలఘురేఫము (ండ్ర) అయినను వచ్చును.

(విలు+కా+లు=) విలుకాఱు విలుకాండ్రు ఇక్కానయు నిట్టే.

**జే ప్రభృతులబహువచనమునకు ముందు దుజ్జగు ౮.**

జేఁదులు - జేండ్లు

౮ జే మున్నగుశబ్దముల బహువచనమునకు (లు కు) ముందు దుజ్జు చేరును (జే+లు జే+దు+లు)= జేఁదులు ఆచ్ఛిక ౧౨-వ సూత్రమున ఉకారలోపము రాఁగా జే+డ్+లు అయి ౧౫-వ సూత్రమున అఱసున్న నిండుసున్నగా మాఱఁగా జేండ్లు అనియుం నగును

**కూఁతుశబ్దము ప్రథమైకవచనంబునకు రువర్ణంబగు ౯.**

కూఁతురు కూఁతులు కూఁతురులు - కూఁతుళ్లు కూఁతురి నిత్యాదిరూపంబులు గ్రామ్యంబులని యెఱుంగునది

౯ కూఁతురు ఏకవచనము. కూఁతులు బహువచనము. రు ఏకవచనమునందే వచ్చును బహువచనమున రాదు కాన కూఁతురులు కూఁతుళ్లు కూఁతురిని మున్నగురూపములు తప్పులు

చెయువు బహువచనలకారంబున కలఘురేఫంబు విభాషనగు ౧౦.

చెయువుఱు - చెయువులు - చెయువుఱను - చెయువులను

౧౦ చెయుంవు' అనుశబ్దముయొక్క బహువచనలకారమునకు అలఘు రేఫము (ఱ) వికల్పముగా ఆదేశమగును చెయుంవుఱు' అలఘురేఫము రానప్పుడు చెయుంవులు అనియు నగును

ఆల్వాదుల బహువచనలకారంబునకు రేఫంబును ముందఱి లువర్ణంబునకు బిందుపూర్వకడకారంబు నగు ౧౧.

ఆండ్రు - ఆండ్రను. ఆలు - చెలియలు - చెల్లెలు - కోడలు - మఱఁదలు - ఇవి యాల్వాదులు.

౧౧. ఆలు' మున్నగుశబ్దముల బహువచనలకారమునకు రేఫమగును, ఆరేఫమునకు ముందున్న లు' అనుదానికి ండ్' ఆదేశ మగును (ఆలు+లు= ఆలు+రు)= ఆండ్రు' అని యగును తక్కినవియు నిట్టే ఆల్వాదులు=ఆలు మొదలగునవి

బహువచనము పరంబగునపుడు డ-ల-ట-ర-ల యుత్వంబునకు లోపంబు బహుళంబుగానగు. ౧౨.

గుండ్లు - గుండులు గిండ్లు - గిండులు. కాళ్లు - కాలులు- మొసళ్లు - మొసలులు గొంట్లు - గొంటులు తుంట్లు - తుంటులు. గోర్లు-గోరులు సీవిర్లు - సీవిరులు బ్రహ్మాశగ్రహణముచే విల్లులు-పల్లులు - పులు లిత్యాదులందు లోపంబులేదు తత్సమంబులం గోటి పిప్పలిశబ్దంబుల కీకార్యంబు చూపట్టెడు. కోట్లు - కోటులు - పిప్పళ్లు - పిప్పలులు.

౧౨ బహువచనమునకు ముందున్న డ-ల-ట-ర అనునక్షరములమీఁద నున్న ఉకారము బహుళముగా లోపించును (గుండు+లు=) గుండ్లు' ఉకారము లోపించనపుడు గుండులు' అనియు నగును (గిండి+లు=) గిండ్లు' (తత్సమ ౪౫-ననుసరించి ఇకారమున కుత్వము ఈసూత్రముచే ఆ ఉకారమునకు లోపము ) లోపము రానపుడు గిండులు' అగును కాలు+లు' అని యుండఁగా ఉకారము లోపించి ౧౪-వ సూత్రముచే నిత్యముగా లకారమున కలఘులకార మాదేశము కాఁగా కాళ్లు' అగును ఉకారలోపము రానపుడు కాలులు' అని యుండును ౧౩-వ సూత్రముచే అలఘులకారము వికల్పముగా రాఁగా కాళులు' అనియు రూపముండవచ్చును మొసళ్లు మొసలులు' కూడ నిట్లే విల్లు+లు పిల్లు+లు పులు+లు' అనుచోట్ల ఉకారము లోపింపఁగా అసాధురూపము లగును కాన అచ్చట లోపము రాదు అట్టియెడల లోపము రాకుండుటకే యీసూత్రమున బహుళము' అని చెప్పఁబడినది

మీఁది ఉకారలోపము అచ్ఛిక్కములకే విధింపఁబడుచున్నను తత్సమములలోకూడ ఉకారము కోట్లు పిప్పళ్లు' మున్నగుచోట్ల కనఁబడుచున్నది. దీనికిని బహుళగ్రహణమే కారణము

బహువచనము పరంబగునపు డసంయుక్తంబులయి
యుదంతంబులయిన డ-ల-ర-ల కలఘులకారంబు
బహుళంబుగానగు ౧౩.

త్రాళులు-త్రాడులు గుమ్మళులు-గుమ్మడులు మొగిళులు-మొగిలులు పిడికిళులు - పిడికిలులు ఊళులు - ఊరులు. పందిళులు - పందిరులు

౧౭ అసంయుక్తములయి (ఉకారలోపము రానివయి యని భావము.) హ్రస్వమగు ఉకారము చివరఁగలశబ్దముల డ-ల-రలకు (ఉకారము

నకు ముందున్నవానికి) బహువచనము పరమగునపుడు అలఘులకారము (ళకారము) బహుళముగా నగును

త్రాడు+లు' అనునపుడు డు' అసంయుక్తమయినది దాని ఉకారమునకు లోపము లేదు దానికి బహువచనము పరముగా నున్నందున అలఘులకారము (డ-కు ళ ఆదేశమయినది కాన త్రాళులు' అయినది ఈ యాదేశము బహుళమగుటచే నిది రాని పక్షమున త్రాడులు' అని యుండును ఇట్లే గుమ్మళులు గుమ్మడులు' లకారమునకు మొగిళులు మొగిలులు పిడికిళులు పిడికిలులు' అని యుదాహరణము రేఫమునకు ఊళులు ఊరులు — పందిళులు పందిరులు' అనునవుడుదాహృతులు

బహువచనశ్లిష్టంబులయి యద్విరుక్తంబులయిన డకార లకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు ౧౪.

త్రాళ్లు - గుమ్మళ్లు - మొగిళ్లు - ముసళ్లు - విళ్లు - సిళ్లు.

౧౪ బహువచనసంశ్లిష్టంబులు = బహువచనముతో సంయోగము బొందినవి అనఁగా ౧౭-వ సూత్రముచే ఉకారలోపమునుపొంది బహువచనముతోఁగూడినవి అద్విరుక్తంబులు = సహజముగా ఒత్తక్షరములు చివర లేనట్టివి

బహువచనముతో సంశ్లేషమునుపొంది తొలుత ద్విత్వములు కాని డ-ల లకు అలఘులకారము (ళ) నిత్యముగా నగును త్రాడు+లు అనునపుడు ౧౭-వ సూ) ఉకారలోపము రాఁగా త్రాడ్లు' అయినది ఈ సూత్రముచే డకారము ళగా మాఱినది త్రాళ్లు అయినది ఇట్లే గుమ్మళ్లు మొగిళ్లు మున్నగునవి లకారము ళకారముగా మాఱుట కుదాహృతులు

సమాసపదంబునందు సంయోగంబు పరంబగునపు డెల్లచో ఖండబిందునకుం బూర్ణంబగు ౧౫.

అనఁటులు - అనంట్లు. పనఁటులు - పనంట్లు గోఁటులు -

గోంట్లు తేఁటులు-తేంట్లు ఏఁడులు-ఏంఢ్లు. కాఁడులు-కాంఢ్లు. ఏంఢ్లు - కాంఢ్లిత్యాదులందు డాకు ఢాదేశంబు కొందఱు వక్కాణించిరి తెనుఁగున బిందుపూర్వకస్థిరంబు లేమింజేసి యది గ్రాహ్యంబుగాదు

౧౫ సమానపదము = ఏకపదము-అనఁగా సమాసవశమున రెండుపదములుచేరి ఏర్పడిన పదముగాక ఒకేపదమయినది

ఏకపదమునందు ౧౨-వ సూత్రముచే ఉకారలోపముకలిగినపుడు సంయుక్తాక్షరములకుముందు హ్రస్వమున్నను దీర్ఘమున్నను కూడ అఱసున్న నిండుసున్నగా మాఱును

అనఁటులు' అనుదానిలో టకారమునఁ గల ఉకారము లోపింపఁగా 'అనఁట్లు' అని యగును ట్లు' సంయుక్తాక్షరము కాన దానికి ముందున్న అఱసున్న నిండుసున్నగా మాఱి అనంట్లు' అగును. (సంజ్ఞా ౧౮-సూత్రమునుబట్టి పూర్ణబిందువు వికల్పముగా విధింపఁబడఁగా దానికి బాధకముగా నిచ్చట నిండుసున్న నిత్యముగా విధింపఁబడుచున్నది) పనంట్లు' ఇట్లే 'గోంట్లు' మున్నగునవన్నియు దీర్ఘముమీఁద నిండుసున్న వచ్చుట కుదాహరణములు (సంజ్ఞా ౧౫-సూత్రమునుబట్టి యిట్టిచోట్ల నిండుసున్న కవకాశమే లేదు కావున వానిమీఁదకూడ నీసూత్రముచే నిండుసున్న నిత్యముగా విధింపఁబడుచున్నది)

కాంఢ్లిత్యాదులు— కాంఢ్లు' మున్నగువానియందు ౧౮-వ సూత్రము ననుసరించి డకారమునకు అలఘులకారముచేసి కొందఱు కాంళ్లు ఏంళ్లు అని యుండవచ్చునని తెల్పిరి కాని (౧౫-సంజ్ఞా) పరుషసరళములను విడిచి తక్కినయక్షరములకు ముందు బిందు వుండమిం జేసి యిట్టి చోట్ల డకారమునకు అలఘులకారము నాదేశముచయుంట కుదురదని గమనింపవలెను.

## ఔపవిభక్తికంబుల లివర్ణసలలువర్ణంబులకు బహువచనంబు పరంబగునపుడు పూర్ణబిందుపూర్వక డువర్ణంబు బహుళంబుగానగు ౧౬.

కొడవలి-కొడవండులు ఉల్లోపంబు-కొడవండ్లు - పక్షంబునం దలఘులకారంబు - కొడవళులు - కొడవళ్లు - కొడవలులు. రోఁకలి ప్రభృతుల కిట్లు రూపంబు లెఱుంగునది. ఇల్లు-ఇండులు-ఇండ్లు-ఇల్లులు ఇట్లు-కల్లు-పల్లు-ముల్లు విల్లు-శబ్దంబులకు రూపంబులు తెలియునది. మద్యనిమ్నార్థకంబులయిన కల్లు - పల్లు - శబ్దంబులును తెల్లు ప్రభృతశబ్దంబులు ననౌపవిభక్తికంబు లగుటం జేసి వాని కీకార్యంబు లేదు.

౧౬ ఔపవిభక్తికంబులు= ఇ-టి తి' అనునవి ఆగమాదేశరూపముగా వచ్చుశబ్దములు-ఔపవిభక్తికములలక్షణము ౭౪-వ సూత్రమునఁ జెప్పఁబడును. లివర్ణ సలలు పరంబులు= లి' యును, లకారము పోఁగూడిన లు యును (ల్లు) పూర్ణబిందుపూర్వకడువర్ణంబు= ండు'

ఔపవిభక్తికశబ్దముల తుదినిగల లి-ల్లు-అనువానికి బహువచనము పరమగునపుడు ండు' అనునది బహుళముగా ఆదేశ మగును

కొడవలి' ఔపవిభక్తికము లి' కి బహుత్వమున ండు' ఆదేశముగా రాఁగా కొడవండులు' అగును ౧౨-వ సూత్రముచే దకారముమీఁది ఉకారమునకు లోపమురాఁగా కొండవండ్లు' అగును ఉకారలోపము బహుళమగుటచే అది రానిపక్షమున ౧౩-వ సూత్రముచే అలఘులకారమాదేశముగా రాఁగా కొడవళులు' అగును ఉకారలోపము వచ్చినపుడు ౧౪-వ సూత్రముచే అలఘులకారము రాఁగా కొడవళ్లు అగును.

కొడవలి+లు' అని యున్నపుడు ండు ఆదేశము బహుళమగుటవలన, అది రానిపక్షమున తత్సమ ౪౧-వ సూత్రము అనుసరించి ఇకారమునకు

ఉకారము ఆదేశముగా రాఁగా కొడవలులు అగును ఇట్లు బహువచనమున కొడవలి' కి ఐదురూపము లగును రోఁకలి' మున్నగువానికిని ఇట్లే రోఁకండులు రోఁకండ్లు రోఁకటులు రోఁకట్లు రోఁకలులు' అని యయిదేసిరూపము లగును

ఇల్లు శబ్దమునకు బహువచనము పరమగునపుడు ండు' రాఁగా ఇండులు' అగును (౨౧-సూ ౫) దకారముమీఁది ఉకారము లోపింపఁగా ఇండ్లు' అగును ండు' రానపుడు ఇల్లులు' అగును ఇట్లు మువ్విధములగురూపములు దీనికివలెనే కల్లు' మున్నగువానికిని గల్గును

మద్యనిమ్నార్థ—మద్యము అనునర్థముకల కల్లు శబ్దమును నిమ్నము అనునర్థమునిచ్చు కల్లు' శబ్దమును తెల్లు మున్నగుశబ్దములును ఔపవిభక్తికములు కానందున వానికి ఈకార్యము రాదు కాన వానికి బహువచనమున కండులు పండులు తెండులు' మొదలగురూపములుండవని భావము

### ఒకానొకచో నామంబు సంశ్లిష్టబహువచనాంతతుల్యంబయి బహువచనంబు నెనయు ౧౭

కొడవండ్లులు-కొడవండ్లులను-కొడవళ్లులు-కొడవళ్లులను
ఇట్లు ప్రయోగదృష్టంబులు గ్రహించునది

౧౭ సంశ్లిష్టబహువచనాంతతుల్యంబయి = బహువచనముతోఁగూడుకొనిన (ప్రాతిపదికలోని తుది) హల్సంయోగము కలదయి ఎనయున్ = పొందును

కొన్నిచోట్లయందు ప్రాతిపదికచివఱిహల్లుతో సంయోగమునుపొందిన బహువచనరూపమే (అనఁగా బహువచనరూపమే) నామమయి మఱల బహువచనమును పొందుటగలదని భావము.

కొడవండ్లు' అనునది బహువచనశ్లిష్టంబైన రూపము. అదియే యిచట నామముగా గ్రహింపఁబడుటచే దానిపయి బహువచనముచేరి కొడవండ్లులు' అయినది ఇట్లే తక్కినరూపములును

ఈరీతిని మఱల బహువచనము చేయుట ప్రయోగముల సాధుత్వ సిద్ధికిమాత్ర మనుసరింపఁదగినది స్వతంత్రించి క్రొత్తవానిని కల్పింపరాదని యభిప్రాయము.

**కలన్వాదుల నువర్ణంబు కుజ్జగు, బహువచనము పరంబగునపుడు నిత్యముగా నగు. ౧౮.**

కలఁకు-కలను-కలఁకులు కలను-కెలను - కొఱను- కొలను- గవను-నెఱను-ప్రాను-వరను-వలను ఇవి కలన్వాదులు.

౧౮ కలను' మున్నగుశబ్దముల ను' కు ఏకవచనమున కుజ్' ఆదేశము వికల్పముగా నగును. బహువచనమున మాత్రము ఈయాదేశము నిత్యము జిత్తు బిందుపూర్వకంబగు' ననునియమముచే కు' కు ముందు బిందువు చేరుచుండును (ఏక) కలను—కలఁకు (కుజాదేశము వికల్పమగుట రెండురూపములు) కలఁకులు' (బహు) (ఇచట నీయాదేశము నిత్యము)

**అట్లు రేను గోను శబ్దంబుల నువర్ణంబు గుజ్జగు ౧౯.**

రేఁగు-రేను-రేఁగులు గోఁగు-గోను గోఁగులు.

౧౯ అట్లు = పయిరీతినే అనఁగా ఏకవచనమున వికల్పముగాను బహువచనమున నిత్యముగాను అనుట గుజ్జుకూడ జిత్తగుటచే బిందుపూర్వక మయియే వచ్చును (ఏక) రేఁగు రేను (బహు) రేఁగులు ఇట్లే గోఁగు - గోను - గోఁగులు' ను

**బహువచనంబు పరంబగునపుడు చేను పేను మీనుశబ్దంబుల నువర్ణంబు లోపించు ౨౦.**

చేను-చేలు పేను-పేలు మీను మీలు.

౨౦ బహుత్వమున చేను పేను మీను' అను శబ్దముల ను' నిత్యముగా లోపించును చేలు' (చేనులు కాదు) ఇట్లే తక్కినవియును

**బహువచనంబు పరంబగునపుడు రేయి ప్రభృతుల తుదియక్షరంబు లోపించు ౨౧**

రేయి-రేలు తాయి-తాలు. వేయి-వేలు వ్రాయి-వ్రాలు ఇత్యాదులు ఈలోపంబు సమాసంబులందుం జూపట్టెడు. రేరాజు-మగతాపతకము-వేవెలుఁగు

౨౧ బహుత్వమునందు 'రేయి' మొదలగు శబ్దముల చివరియక్షరము లోపించును (వి) రేయి (బ) రేలు ('రేయులు' అని యుండదు)

ఈయంత్యాక్షరలోపము సమాసములకును జెల్లును రేయి+రాజు = రేరాజు (తత్పురుషము) మగతాయి+పతకము = మగతాపతకము (తత్పురుష) వేయి+వెలుఁగు=వేవెలుఁగు (బహువ్రీహి)

**బహువచనంబు పరంబగునపు డావు ప్రభృతుల**
**తుదియక్షరంబునకు లోపంబు విభాషనగు ౨౨**

ఆవు-ఆలు-ఆవులు జాము - జాలు - జాములు చుట్టము - చుట్టలు-చుట్టములు మీసము-మీసలు-మీసములు

౨౨ బహుత్వమునందు ఆవు మున్నగుశబ్దముల కడపటియక్షరము వికల్పముగా లోపించును (వి) ఆవు (బ) ఆలు ఆవులు ఇట్లే తక్కినవి యగును

**ఇయకు మాఱుగా నామాంతంబున కెత్వంబు**
**బహుళంబుగా నగు. ౨౩.**

కన్నియ-కన్నె-జన్నియ-జన్నె వన్నియ - వన్నె. కొంచియము - కొంచెము కొండియము - కొండెము బహుళగ్రహణముచే సందియము కాఱియ మొదలగు శబ్దంబులం దెత్వము లేదు. ఇయశబ్దంబునం దికారలోపంబు కొందఱు వక్కాణించిరి అయ్యది ప్రయోగంబులందు మృగ్యంబు ముత్తియ శబ్దంబునందు మాత్ర మిత్వలోపంబు గానంబడియెడి ముత్తియము-ముత్తెము-ముత్యము

౭3 నామాంతంబునకు = పేరి చివరకు (ఆచ్ఛిక) శబ్దముల తుది యందు ఇయ' అనుదానికి ఎ' అనునది బహుళముగా ఆదేశమగును

సూత్రములో బహుళము' అని చెప్పుటవలన కొన్నిచోట్ల ఎ' రాక పోవచ్చును సందియము సందెము' కాదు కాటియ కాటె కాదు

ఇయ' అనుదానిలోని ఇకారము లోపించునని కొందరు చెప్పుదురు. కాని అట్టి లోపముగల రూపములు ప్రయోగములందుఁ గానరాకున్నవి. ముత్తియ శబ్దములోమాత్రము ఇకారము లోపించి ముత్యము'అగుట కలదు. కాన ఆశబ్దమునకు (1) ముత్తియము (2) ముత్యము (3) ముత్తెము అని మూఁడురూపము లుండును

## సర్వనామప్రకరణము

సర్వనామప్రకరణము—నామవాచకమునకు బదులుగా వాడబడు నవి సర్వనామములు వానినిగూర్చి తెల్పుభాగము సర్వనామప్రకరణము

### అన్ని ప్రభృతులు సర్వనామంబులు ౭౪.

అన్ని-ఇన్ని-ఎన్ని-కొన్ని-పెక్కు పలు-ఆ-ఈ-ఏ-నీ-నా-మన-తా-సంఖ్యావాచకంబులు - అన్ని ప్రభృతులు వీనికిం బ్రథమాంతరూపంబు లుదాహరించెద. వీనిలో డుమంతంబుల కెల్ల న్యాగమంబు పూర్వోక్తంబు స్మరించునది. బహువచన లకారంబునకు రాదేశంబును బూర్వాగమంబును బ్రథమాబహువచనంబునకుం బోలె నెఱుంగునది. విశేషాకారంబులు గలిగె నేని గొండొకచో ద్వితీయవఱకును గొండొకచోఁ దృతీయయందొక్క రూపంబువఱకును రూపభేదంబులు వక్కాణించెద. శేషంబూహించునది. అన్ని మొదలగుశబ్దంబు లాఱును ద్విప్రభృతిసంఖ్యావాచకంబులును మహదర్థంబులు బహువచనాంతంబులగు - అమహదర్థంబు లేకవచనాంతంబులగు ఇందు నీ మొదలగు నాలుగుశబ్దంబులు సర్వార్థంబులం దుల్యరూపంబు లయియుండు

మ - అనునది మహదర్థమనుటకు, అ - అనునది యమహదర్థమనుటకు ప్ర - మొదలయినవి ప్రథమాదివిభక్తులకును సంకేతములుగా నిందు గ్రహించునది

మ అ.

సర్వతావదర్థకము

ప్ర. { అందఱు / అందోఱు } . అన్ని

ఇయదర్థకము

ప్ర. ఇందఱు .. ఇన్ని.

కియద్యావదర్థకము.

ప్ర ఎందఱు .. ఎన్ని

కతిపయార్థకము

ప్ర. కొందఱు ...కొన్ని

బహ్వర్థకము

ప్ర. { పెక్కండ్రు / పెక్కుగు } { పెక్కు - దీనికి బహువచనముం గలదు పెక్కులు.

ఈశబ్దంబు లౌపవిభక్తికంబు లగుటం జేసి - అన్నిటి-అన్నింటి-ఇన్నిటి - ఇన్నింటి - ఎన్నిటి - ఎన్నింటి-కొన్నిటి - కొన్నింటి - పెక్కిటి - పెక్కింటి - యను రూపంబులు ద్వితీయా ద్యేక వచనంబులు పరంబు లగునపు డమహత్త్వంబునం దగునని తెలియునది

బహ్వర్థకము.

ప్ర { పలుగురు / పలుగుండ్రు } అమహత్త్వంబున దీనికి వ్యస్త ప్రయోగంబు లేదు

మ

తదర్థకము

ప్ర. వాఁడు { వారు / వారలు / వాండ్రు }

ద్వి. వానిని... { వారిని / వారలను / వాండ్రను }

అ.

ప్ర.
- అది . అవి.
- అద్ది .. అవ్వి
- ఆయది .. ఆయవి.
- అయ్యది ..అయ్యవి

ద్వి
- దానిని
- ఆదానిని
- అద్దానిని

...వానిని

మ.

ఇదమర్థకము.

ప్ర. వీఁడు . వీరు, వీరలు, వీండ్రు

ద్వి. వీనిని .. వీరిని, వీరలను, వీండ్రను.

అ.

ప్ర
- ఇది .. ఇవి.
- ఇద్ది ...ఇవ్వి
- ఈయది .. ఈయవి
- ఇయ్యది .. ఇయ్యవి.

ద్వి.
- దీనిని
- ఈదానిని
- ఇద్దానిని

. వీనిని.

మ.

యత్కిమర్థకము.

ప్ర
- ఏఁడు — ఏరు.
- ఏవాఁడు — ఏవారు. ఏవారలు ఏవాండ్రు
- ఎవ్వాఁడు — ఎవ్వారు ఎవ్వారలు ఎవ్వాండ్రు
- ఎవ్వఁడు — ఎవ్వరు ఎవ్వండ్రు
- ఎవఁడు — ఎవరు ఎవండ్రు

ద్వి
- ఏనిని — ఏరిని
- ఏవానిని — ఏవారిని ఏవారలను ఏవాండ్రను
- ఎవ్వానిని — ఎవ్వారిని ఎవ్వారలను ఎవ్వాండ్రను
- ఎవ్వరిని — ఎవ్వరిని ఎవ్వండ్రను.
- ఎవనిని — ఎవరిని ఎవండ్రను.

అ

| | | | | | |
|---|---|---|---|---|---|
| ప్ర | ఎది | ...ఎవి | ద్వి | దేనిని | .. వేనిని |
| | ఏది | .. ఏవి | | ఏదానిని | .. ఏవానిని |
| | ఎద్ది | . ఎవ్వి | | ఎద్దానిని | .. ఎవ్వానిని |
| | ఏయది | . ఏయవి | | | |
| | ఎయ్యది | ..ఎయ్యవి | | | |

<u>మహతి</u> వాచ్యంబగుచో నేకత్వంబున యత్కిమర్థక శబ్దంబు-ఎవ్వరిత-ఎవ్వర్త-ఎవ్వత-ఎవరిత - ఎవర్త-ఎవత - ఎవ్వరితి - ఎవ్వర్తి ఎవ్వతి-ఎవరితి-ఎవర్తి-ఎవతి-ఎవ్వరితె-ఎవ్వర్తె - ఎవ్వతె - ఎవరితె-ఎవర్తె-ఎవతె ఎవ్వర్తుక-ఎవ్వతుక- ఎవ్వర్తుక-ఎవతుక - అని యిరువది రెండురూపంబులు వడయు

<u>తదాదులు</u> మూఁడు మహద్వాచకంబు లేకత్వంబునం బూజవివక్షించునపుడు - అతఁడు - ఆతఁడు ఇతఁడు - ఈతఁడు ఎతఁడు - ఏతఁడు - అనురూపంబులు వడయు. మహతీవాచకంబులు-ఆమె-ఆపె-ఆకె ఈమె-ఈపె-ఈకె ఏమె-ఏపె-ఏకె; అనురూపంబులు వడయు.

| యుష్మదర్థకము | | | అస్మదర్థకము | | |
|---|---|---|---|---|---|
| ప్ర. | నీవు, ఈవు | మీరు, మీరలు, ఈరు, ఈరలు | ప్ర | నేను, ఏను | ... మేము, నేము, ఏము |
| ద్వి. | నిన్నును | .. మిమ్మును | ద్వి | నన్నును | ...మమ్మును |
| తృ | నీచేతను | .. మీచేతను | తృ. | నాచేతను | ...మాచేతను |

ఉభయార్థకము

నిత్యబహువచనాంతము.

ప్ర మనము

ద్వి మనలను.

తృ మనచేతను-మనలచేతను.

ఆత్మార్థకము

ప్ర. తాను ... { తాము. / తారు / తమరు

ద్వి. తన్నును .. తమ్మును

తృ తనచేతను తమచేతను

ఇంక సంఖ్యావాచకంబులు వక్కాణించెదము

ఏకార్థకశబ్దము

ప్ర

ఒకఁడు .. { ఒకరు. / ఒకండ్రు

ఒకోఁడు .. { ఒకోరు / ఒకోండ్రు

ఒక్కఁడు ... { ఒక్కరు / ఒక్కండ్రు

ఒక్కోఁడు ... { ఒక్కోరు / ఒక్కోండ్రు

ఒకరుఁడు .. { ఒకరులు / ఒకళులు / ఒకళ్లు

ఒకోరుఁడు ... { ఒకోరులు / ఒకోళులు / ఒకోళ్లు.

ఒక్కరుఁడు { ఒక్కరులు. / ఒక్కళులు / ఒక్కళ్లు.

ఒక్కోరుఁడు . { ఒక్కోరులు. / ఒక్కోళులు. / ఒక్కోళ్లు

ఒకరువుఁడు ఒకరువులు

ఒకోరువుఁడు ఒకోరువులు

ఒక్కరువుఁడు ఒక్కరువులు

ఒక్కోరువుఁడు ఒక్కోరువులు

ఒరుఁడు ఒరులు.

ఒరువుఁడు ఒరువులు

ఒండు .. { ఒండులు / ఒండ్లు

ఒడ్డు .. { ఒడ్డులు / ఒడ్లు

ద్వితీయాది విభక్తిరూపంబు-లూహించుకొనునది

అ

ప్రథమైకవచనాంతములు

ఒకటి - ఒకొటి - ఒక్కటి - ఒకొక్కటి - ఎక్కటి - ఒకఁడు - ఒకొఁడు-ఒక్కఁడు-ఒకొక్కఁడు- ఒండు ఈ శబ్దంబునకు సంఖ్యా వాచకంబునకు బహువచనంబు లేదు

దీనికి మహతి వాచ్యం బగునపు దేకత్వంబున వక్ష్యమాణ రూపంబు లెఱుంగునది

మహత్యర్థకము

ఒకరిత-ఒకర్త - ఒకర్తు - ఒకర్తుక-ఒకత - ఒకతుక - ఒకొరిత ఒకొర్త - ఒకొర్తు - ఒకొర్తుక- ఒకొత - ఒకొతుక - ఒక్కరిత - ఒక్కర్త-ఒక్కర్తు - ఒక్కర్తుక- ఒక్కత-ఒక్కతుక - ఒకొక్కరిత- ఒకొక్కర్త ఒకొక్కర్తు - ఒకొక్కర్తుక-ఒకొక్కత -ఒకొక్కతుక-ఒకరితి -ఒకర్తి - ఒకతి - ఒకొరితి - ఒకొర్తి - ఒకొతి - ఒక్కరితి - ఒక్కర్తి ఒక్కతి - ఒకొక్కరితి- ఒకొక్కర్తి-ఒకొక్కతి - ఒకరితె- ఒకర్తె - ఒకతె - ఒకొరితె ఒకొర్తె-ఒకొతె-ఒక్కరితె-ఒక్కర్తె- ఒక్కతె ఒకొక్కరితె-ఒకొక్కర్తె- ఒకొక్కతె - ఓర్త - ఓర్తి-ఓర్తు- ఓర్తుక

ఇంక ద్విప్రభృతి సంఖ్యా వాచకంబులు ప్రథమాంత రూపంబులు వక్కాణించెద.

మ. అ

ప్ర

ఇద్దఱు<br>ఇరుగురు } ... రెండు

మూగురు<br>ముగ్గురు<br>ముగురు } . మూడు

నలుగురు . నాలుగు

అయిదుగురు .. అయిదు.

ఏగురు . ఏను.

ఆఱుగురు . ఆఱు.

ఏడుగురు . ఏడు.

ఎనమండ్రు .. ఎనిమిది

తొమ్మండ్రు ...తొమ్మిది.

| | |
|---|---|
| పదుఁగురు<br>పదురు<br>పదుగుండ్రు<br>పదుండ్రు | . పది |
| పదునొకరు | ...పదునొకటి |

ఇచ్చట నేకశబ్దార్థరూపంబులెల్ల నర్థానురూపంబుగఁ గూర్చుకొనునది.

| | |
|---|---|
| పదునొకరు | పదునొకటి |

ఇత్యాదులు

| | |
|---|---|
| పన్నిద్దఱు<br>పన్నిరుగురు | పండ్రెండు. |
| పదుమూఁగురు<br>పదుముగ్గురు<br>పదుముఁగురు | పదుమూఁడు |
| పదునలుగురు | పదునాలుగు. |
| పదునయిదుగురు | పదునయిదు |
| పదునేగురు | పదునేను |
| పదునాఱుగురు | పదునాఱు |
| పదునేడుగురు | పదునేడు |
| పదునెనమండ్రు | పదునెనిమిది. |
| పందొమ్మండ్రు | పందొమ్మిది |
| ఇరువండ్రు | ఇరువది |
| ఇరువదియొకరు | ఇరువదియొకటి |

ఇత్యాదు లూహ్యంబులు

| | |
|---|---|
| ముప్పండ్రు | ముప్పది |
| నలువండ్రు | నలువది. |
| ఏఁబండ్రు | ఏఁబది |
| అఱువండ్రు | అఱువది. |
| డెబ్బండ్రు | డెబ్బది |
| ఎనుబండ్రు | ఎనుబది. |
| తొంబండ్రు | తొంబది. |
| నూఱుగురు | నూఱు |
| వేగురు | వేయి |
| పదివేగురు | పదివేలు |

రెండు మొదలగునవి యాపవిభక్తిక శబ్దంబు లగుటం జేసి ద్వితీయాది విభక్తులు పరంబు లగునపుడు టింటు లగునని యెఱుంగునది. రెండిటిని - రెండింటిని - రెంటిని మూఁడిటిని - మూఁడింటిని - మూఁటిని - ఇత్యాదులు. ఏకశబ్దమునకు - ఒంటి - ఒకానొకఁడు - ఒకానొకటి - ఒకానొకరిత - ఒరిమ - ఒండొకరు - ఓరట్ట - అనురూపంబులును - ద్విశబ్దార్థంబునకు -

ఇనుమడి - ఈరాలు - అనురూపంబులు సద్విశేషంబులం జూపట్టెడు.

౨౮ అన్నిప్రభృతులు = అన్ని' మున్నగునవి అన్ని' మొదలగు వానికి సర్వనామము లని పేరు. సంఖ్యావాచకంబులు = ఒకటి రెండు మూఁడు ఒకరు ఇద్దఱు ముగ్గురు మొదలగునవి.

వీనిలో — ఈసర్వనామములలో డు' చివఱవచ్చుశబ్దముల కన్నింటి కిని వెనుకటిశబ్దములకువలెనే (రాముని మున్నగువానివలె) ని' ఆగమము వచ్చి అతనివి వానిని' మున్నగురూపము లగుటను గమనింపవలెను (ని+ఆగ మము = న్యాగమము )

ఆరీతినే బహువచనమున లకారమునకు రేఫ మాదేశమయి (వా+లు=) వారు' మున్నగునవి యగుటయు బిందుపూర్వక ఉకారము ఆదేశమయి 'వాండ్రు మున్నగునవి యగుటయు గమనింపఁదగును ఇచట సామాన్యముగా ప్రథమాంతములే ఉదాహరింపఁబడును కాన ద్వితీయాదులును అప్రథమాంత ములందుఁబోలె రేఫాదేశము ఆగమము మున్నగునవి కలుగునని గుర్తింపవలెను

చెప్పినరూపములకంటె విశేషరూపము లున్నయెడల కొన్నిచోట్ల ద్వితీయావిభక్తివఱకును కొన్నిచోట్ల తృతీయావిభక్తియం దొక్కరూపము వఱకును రూపములు చూపఁబడును తక్కినదాని నూహించుకొనవలయును

అన్ని మొదలగు — అన్ని ఇన్ని ఎన్ని కొన్ని పెక్కు పలు - అను నవియు రెండు మొదలగుసంఖ్యావాచకములును మహద్వాచకము లగునపుడు బహువచనాంతములుగానే యుండును.

అనఁగా వానికి — అందఱు ఇందఱు ఎందఱు, కొందఱు పెక్కురు పలువురు' ఇద్దరు అను బహువచనరూపములే యుండును, అందఁడు ఇద్దఁడు' మున్నగు అసాధురూపము లుండవని భావము అన్ని' మున్నగునవి అమహత్తు లగునపుడు ఏకవచనములందే యుండును బహువచనమునం దుండవు.

అనఁగా అవి అన్ని ఇన్ని, రెండు అనురీతిగానే యుండునుకాని 'అన్నులు ఇన్నులు రెండులు' అనురీతి బహువచనములను పొందవని యర్థము.

నీ - నా - తా - మన' అనువాని శబ్దములును మహద్వాచకములైనను మహతీవాచకములైనను అమహద్వాచకములైనను ఎట్టిమార్పును చెందక సమాసమున నుండును.

సంకేతములు = చిహ్నములు—గుర్తులు సర్వతావదర్థకము = అందఱు లేక అన్నింటిని బోధించునది.

ఇయదర్థకము = ఇందఱు లేక ఇన్ని అనునర్థమును బోధించునది.

కియదర్థకము = ఎందఱు లేక ఎన్ని అనునర్థమును బోధించునది.

కతిపయార్థకము = కొందఱు లేక కొన్ని యనునర్థమును బోధించునది.

బహ్వర్థకము = పెక్కుఱు లేక పెక్కు అనునర్థమును తెల్పునది.

ఈశబ్దంబులు = అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - పెక్కు అనునవి; ఇయ్యవి ఔపవిభక్తికము లగుటచే వీని చివఱ టి' చేరుచుండును ఉదా .. అన్నిటి అన్నింటి ఇన్నిటి ఇన్నింట మున్నగునవి. అమహద్వాచకము లగునప్పుడు వీనికి ఔపవిభక్తికమగు టి' ద్వితీయ మొదలైనవిభక్తులందు ఏకవచనమునకు మాత్రము వచ్చును

అమహత్త్వంబున .. పలు' శబ్దము మహత్తులను బోధించునపుడు 'పలుగురు పలుగుండ్రు' అనురూపము లుండును అమహద్వాచకమగునపుడు వేఱొకపదముతోఁ జేరియే పలు' ప్రయోగింపఁబడుచుండును. ఉదా — పలుతెఱంగులు పలువిధములు వ్యస్తముగా (ప్రత్యేకముగా) పలు' ప్రయోగింపఁబడదని భావము.

తదర్థకము = అది లేక వాఁడు' అనునర్థ మిచ్చునది

ఇదమర్థకము = ఇది లేక వీఁడు' అనునర్థమును బోధించునది.

యత్కిమర్థకము = ఏది, ఎవఁడు' అను నర్థమును బోధించునది. ఈ

యత్కిమర్థకశబ్దములు స్త్రీలను బోధించునపుడు ఏకవచనమునందు ఎవ్వరిత, ఎవ్వర్తె' యున్నగు ౨-౩ రూపములను బొందును

తదాదులు—తదర్థకమగు ఆ' శబ్దమును ఇదమర్థకమగు ఈ' శబ్దమును యత్కిమర్థకమగు ఏ' శబ్దమును మహద్వాచకములగునపుడు - గౌరవమును దెల్పుచో ఏకవచనమున (1) అతఁడు ఆతఁడు (ఆ' శబ్దము) (2) ఇతఁడు ఈతఁడు (ఈ శబ్దము) (3) ఎతఁడు ఏతఁడు (ఏ' శబ్దము) అను రూపములను బొందును పయిశబ్దములు మహతీవాచకములై గౌరవమును దెల్పుచుఁ ఏకవచనమున (1 ఆ - శబ్దము) ఆమె ఆపె ఆకె (2 ఈ శబ్దము) ఈమె ఈపె ఈకె (3 ఏ శబ్దము) ఏమె ఏపె ఏకె' అను రూపము లుండును యుష్మదర్థకము = నీవు' అనునర్థమును దెల్పునది అస్మదర్థకము = నేను అనునర్థమును బోధించునది ఉభయార్థకము = మన అను నర్థ మిచ్చునది

నిత్యబహువచనము = ఎల్లపుడును బహువచనమునందే యుండునది
ఆత్మార్థకము = తాను' అను నర్థము కలది
ఏకార్థకము = ఒక' అనునర్థ మిచ్చునది

దీనికి మహతి— ఒక శబ్దము స్త్రీలను గూర్చి తెలుపునపుడు ఏకవచనమున ఒకరిత మొదలగు చెప్పబోవురూపము లుండును

ద్విప్రభృతిసంఖ్యావాచకంబులు = రెండు మున్నగుసంఖ్యలను తెలుపునవి. ఇచ్చట- పది మున్నగువానిపయి ఒక అనునర్థ మిచ్చుపదములను చేర్చునపుడు వానివానియర్థములకు (మహదర్థకము-మహత్యర్థకము అమహదర్థకము) అనుకూల మగునట్లు వర్ణములను జేర్చుకొనవలెనని యర్థము (అనఁగా మహదర్థకమగునపుడు పదునొకరు' అనియుం అమహదర్థకమగునపుడు పదునొకటి' అనియుం నీరీతి గమనింపవలెనని భావము.)

రెండు మొదలగునవి—రెండు మున్నగుశబ్దములు ఔపవిభక్తికములు. వానికి ద్వితీయ మున్నగువిభక్తులందు టి-ంటి' అనువవి (ఆగమముగను, ఆదేశముగను) వచ్చును (ఆగమము) రెండిటిని రెండింటిని (ఆదేశము) రెంటిని (సంధి ౩౭-అంటయిఁక-చుఁడు-సూత్రము ననుసరించి- రెంటిని' అని యుండునుగాని రెఁటిని కాదు) మూఁడు' అనుదానికి నిట్లే దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేనందున మూంటిని' కాదు

ఏకశబ్దమునకు— ఒక' శబ్దమునకు ఒంటరి' అను నర్థవిశేషమున ఒంటి' అని యుండును నిశ్చయములేనిమగవాఁ డనునర్థమున ఒకానొకఁడు' అనియుం అనిశ్చితమైన అమవాత్తును తెల్పునపుడు ఒకానొకటి అనియు, అట్టియర్థముననే స్త్రీని తెల్పునపుడు ఒకానొకరిత' అనియు నుండును. వేరొక యనునర్థమున ఒరిమ' అని యుండును పరస్పరము' ననునర్థమున ఒండొకరు' అని యుండును ఒక' అనునర్థమున ఓరట్ట' యని యుండును రెండు' అనుదానికి రెండురెట్లను నర్థమున ఇనుమడి' అనియుఁ పన్నెండు' అనునర్థమున (రెండాఱులను నర్థమున) ఈరాఱు' అనియు రూపము లుండును

## సంఖ్యకుం బూరణార్థంబునం దవగాగమంబగు. ౨౭.

రెండవవాఁడు - రెండవది - మూఁడవవాఁడు - మూఁడవది.

౨౭ సంఖ్యావాచకమగుశబ్దమునకు పూర్తిచేయుట' అనునర్థమున 'అవక్' అనునది ఆగమముగా వచ్చును (అవక్' లో అవ' అనునదియే నిలుచును అది సంఖ్యావాచకము చివఱఁజేరును)

రెండు+అవవాఁడు=రెండవవాఁడు (ఉకారసంధి)

ఇద్దఱు మనుష్యులున్నచో ద్విత్వసంఖ్యను బూర్తిచేయుట కిద్దఱును కర్తలుగా నుందురు వారిలో నెవ్వఁడు సంఖ్యలోఁ దుదిని లెక్కింపఁబడునో వాఁడు ఆసంఖ్యను పూర్తిచేయునట్లు వివక్షింపఁబడును వానిని జెప్పునట్టి

సంఖ్యావాచకముపయి అవ' అనునది చేరును. ఉదా— రామలక్ష్మణులలో లక్ష్మణుఁడు రెండవవాఁడు' ఇచ్చట ద్విత్వసంఖ్యాపూర్తిచేయుటకు రామ లక్ష్మణు లిరువురునుకర్తలే అయినను లెక్కలో లక్ష్మణుఁడు కడపటివాఁడుగా వివక్షింపఁ (చెప్ప) బడినందున పూరణార్థము కటచే అతనిని బోధించు రెండు అనుసంఖ్యావాచకమునకు అవ చేరి రెండవవాఁడు' అయినది ఇట్లే తక్కిన యుదాహరణములను గ్రహించునది

సర్వనామక్రియాపదంబుల బహువచనంబు
మహత్తునకుంబోలె మహతికగు. ౨౬.

వారిద్దఱు రుక్మిణీసత్యభామలు - వీరు మువ్వురు శ్రీభూనీళలు.

౨౬ సర్వనామములయొక్కయు క్రియాపదములయొక్కయు బహువచనరూపము మహద్వాచకముల కెట్లుండునో అట్లే మహతీ (స్త్రీ) వాచకములకును ఉండును అనఁగా మహద్వాచకములగు సర్వనామముల బహువచనరూపములే స్త్రీవాచకములకును ఉండునని ప్రస్తుతవిషయమున గ్రహింపవలెను

వారిద్దఱు రుక్మిణీసత్యభామలు' ఇచ్చట వారు-ఇద్దఱు' అనునది మహద్వాచకము సర్వనామము బహువచనము రుక్మిణీసత్యభామలు' మహతీవాచకము ఈమహతీవాచకమునకును మహద్వాచకమునకువలెనే 'వారు ఇద్దఱు' అను రూపములు వాడబడినవి

ఏకవచనమున మహత్తునకు వాఁడు' అనియు మహతికి ఆమె లేక అది' అనియు వేర్వేఱు సర్వనామము లుండును. బహువచనమున మాత్రము ఈరెండింటికిని ఒక్కరీతి సర్వనామము వారు' అని యుండును. ఇట్లే తక్కినయుదాహరణములు

**అపదాద్యంబయి యసంయుక్తంబయిన గకారంబునకు వకారంబు విభాషనగు. ౨౭.**

పలుగురు - పలువురు - ఇరుగురు - ఇరువురు - వేగురు - వేవురు - తోఁగ - తోఁవ - పగలు - పవలు

౨౭ అపదాద్యంబు=పదముయొక్క మొదటలేనిది అసంయుక్తంబు=వేఱొకహల్లుతోఁ గూడుకొననిది

పదమునకు మొదటనుండనట్టిదియు వేఱొకహల్లుతోఁ గూడనట్టిదియు నగుగకారమునకు వకారము వికల్పముగా ఆదేశమగును

నలుగురు' అనుచోఁ గకారమునకు వకార మాదేశమై నలువురు' అయినది అది వికల్పముకాన వకారము రానప్పుడు నలుగురు' అనియు నుండును. ఇట్లే తక్కినవియును

## ఔపవిభక్తిక ప్రకరణము

ఔపవిభక్తిక ప్రకరణము-విభక్తికి సమీపమున (ముందుగా) ఉండునది ఉపవిభక్తి ఉపవిభక్తినివచ్చు (ఇ టి-తి) వర్ణములు ఔపవిభక్తికములు, ఔపవిభక్తికములుగల పదములును ఔపవిభక్తికములు అట్టిపదములనుగూర్చి తెలుపుగ్రంథభాగము ఔపవిభక్తిక ప్రకరణము'

**ఇ-టి-తి-వర్ణంబులు వక్ష్యమాణంబు లౌపవిభక్తికంబులు. ౨౮.**

విభక్తినిమిత్తకంబులయి యాదేశాగమాత్మకంబులయిన ఇ - టి - తి - అను వర్ణంబు లౌపవిభక్తికంబు లనంబడు.

౨౮ వక్ష్యమాణంబులు=ముందు చెప్పఁబడనున్నవి ఆయాసూత్రములచే నాయాశబ్దములకు విధింపఁబడు ఇ-టి-తి' అనునవి ఔపవిభక్తికములు.

ఈయాపవిభక్తికములు ద్వితీయ మున్నగువిభక్తులు కారణములుగా వచ్చుచుండును ఇయ్యవి కొన్నియెడల శబ్దముల తుదియక్షరముల కాదేశములుగాను కొన్నిచోట్ల ఆగమములుగాను వచ్చుచుండును

ఇవి ద్వితీయాద్యేకవచనంబులు పరంబులగునపుడు నామంబులకుం గొన్నింటికిం బ్రాయికంబుగ నగు ౨౯

కాలు - కాలిని - కాలిచే. నాఁగలి - నాఁగటిని - నాఁగటిచే. నేయి - నేతిని - నేతిచే. ద్వితీయైకవచనంబు పరంబగునపు డౌపవిభక్తికంబులు రావని కొందఱు వక్కాణించిరి. అయ్యది లక్ష్యలక్షణవిరుద్ధంబగుటం జేసి యనాదరణీయంబు

౨౯. ఇ టి-తి' అను నీయాపవిభక్తికములు ద్వితీయ మొదలుకొని అన్నివిభక్తులయందును ఏకవచనములు పరమగునపుడు కొన్నిశబ్దములకు తఱచుగా వచ్చుచుండును

కాలు' అనుశబ్దమునకు ద్వితీయైకవచనమున కాలు+ను' అని యుండఁగా ఇ' ఆగమముగా చేరి కాలు+ఇ+ను' అని యుండఁగా సంధియై 'కాలి+ను' అగును పిదప (తత్సమ. ౨౬౦ సూ చే) ను'నిగామాఱి కాలిని' అగును

నాఁగటిని—నాగటిచే అనునవి టి కిని నేతిని, నేతిచే' అనునవి 'తి' కిని ఉదాహరణములు ( టి-తి' అనునవి ఇచట ఆదేశములు.)

అయ్యది లక్ష్యలక్షణ—లక్ష్యములను శాస్త్రమునుబట్టి చూడఁగా ద్వితీయైకవచనమునందును ఈయాపవిభక్తికములు చేరుచుండుట కనఁబడుచున్నది. కాన ఇయ్యవి ద్వితీయలో రావని కొందఱు చెప్పినమాటను అంగీకరింపరాదు

**ఊరు మొదలగువాని కిత్వంబగు. ౩౦.**

ఊరు - ఊరిని - కాలు - కాలిని - మ్రాను - మ్రానిని నోరు - నోరిని - చోటు - చోటిని

౩౦ ఊరు' మొదలగుశబ్దములకు ఇ' ఆగమముగా వచ్చును (అనఁగా - ఇది శబ్దమునకును విభక్తిప్రత్యయమునకును నడుమ జేరునని యర్థము)

ఊరు + ఇ + ను —సంధిరాఁగా ఊరి+ను - తత్సమ ౨౬-సూ అను సరించి ను' ని గామాఱ గా ఊరిని' అగును ఇట్లే తక్కినవియును.

**టివర్ణంబు గొన్నింటి యంత్యాక్షరంబున కాదేశంబును గొన్నింటి కంత్యాగమంబును గొన్నింటికిం బర్యాయంబున రెండును బ్రాయికంబుగ నగు ౩౧.**

ఆదేశము.—త్రాడు - త్రాటిని కాడు - కాటిని, నోరు - నోటిని ఏఱు - ఏటిని ఆగమము —అన్ని - అన్నిటిని ఎనిమిది - ఎనిమిదిటిని వేయి - వేయిటిని ఉభయము.—ఏమి - ఏటిని - ఏమిటిని పగలు - పగటిని - పగలిటిని మొదలు - మొదటిని మొదలిటిని రెండు - రెంటిని - రెండిటిని మూఁడు-మూఁటిని-మూఁడిటిని నూఱు - నూటిని - నూఱిటిని

౩౧ టి' అనునది కొన్నిశబ్దములచివఱియక్షరమునకు ఆదేశముగా వచ్చును కొన్నిటికి ఆగమముగావచ్చును కొన్నిటికి ఆగమముగను ఆదేశముగనుకూడ వచ్చును ఉదాహరణములు స్పష్టముగ నున్నవి. మూఁడు' శబ్దమున ఆదేశమునకు మూఁటిని అనియు ఆగమమునకు మూఁడిటిని' అనియు ఉదాహరణములు ఇట్లే నూఱు' శబ్దమునకును

**హ్రస్వముమీఁది టివర్ణకంబునకు ముందు పూర్ణబిందువు బహుళముగా నగు. ౩౨.**

అన్నింటిని - ఎనిమిదింటిని - పగంటిని - పగలింటిని, రెండింటిని - మూఁడింటిని

32 హ్రస్వము చివఱఁగల శబ్దమునకు ఔపవిభక్తికమగు టి పరముగా నున్నయెడల ఆ రెండిటికిని నడుమ నిందుసున్న బహుళముగాఁ జేరును అన్నింటిని' మున్నగునవి యుదాహరణములు నిందుసున్నరానిపక్షమున అన్నిటిని' మున్నగురూపములును ఉండును

## పదాద్యంబగు హ్రస్వంబుమీఁది టివర్ణంబునకు ముందు పూర్ణబిందువగు. 33.

కన్ను - కంటిని మిన్ను - మింటిని ఇల్లు - ఇంటిని పల్లు - పంటిని

33 పదము మొదటిహ్రస్వమునకుఁ దరువాత టి ఉన్నయెడల ఆ - 'టి' కిముందుగా నిత్యముగా నిందుసున్న వచ్చును

కంటిని మున్నగనవి ఉదాహృతులు వీనిని కటిని' మున్నగురీతిని వాడరాదు

## అట్టు మొదలగు శబ్దముల కంతాగమంబు తివర్ణంబును రేఫంబున కొక్కటికి లోపంబు నగు 34.

అఱ్ఱు - అఱితిని అఱ్ఱు - కఱ్ఱు-కొఱ్ఱు - గొఱ్ఱు - మిఱ్ఱు వఱ్ఱు-ఇవి యఱ్ఱు మొదలయినవి.

34 అఱ్ఱు' మున్నగుశబ్దములకుఁ దుదిని తి అనునది ఆగమముగా వచ్చును ఆ తి' వచ్చునపుడు దానికి ముందున్న ద్విత్వ రేఫములోని ఒక రేఫము లోపించును ఉదా - అఱ్ఱు - అఱితిని అఱ్ఱు + తి + ను' అనియుండ గా మీఁదినియమమున ఒక రేఫములోపించి అఱు తి ను' అని యుండును విభక్తిపరిచ్ఛేదములోని 36-వ సూత్రముచే తి' కి ముందున్న ఉ కారము ఇకా

రముగా మాఱి ఆఱితిను అగును పిదప తత్సమ ౧౬ వ సూత్రము నను
సరించి ను' నిగా మాఱును ఇట్లే తక్కినవానినికూడ గ్రహించునది

**విభక్తిపరంబగునపుడు గోయిప్రభృతుల తుదియక్షరంబు తి-వర్ణకంబగు ౩౫.**

గోయి - గోతులు - గోతిని - గోతులను. గోయి-చేయి-దాయి-నూయి-నేయి-హాయి - రోయి ఇత్యాదులు.

౩౫ విభక్తిప్రత్యయములకు ముందున్న గోయి' మున్నగుశబ్దముల
తుదియక్షరమునకు తి నిత్యముగా ఆదేశమగును ప్రథమావిభక్తిలోని ఏక
వచనము ఇకారాంతశబ్దములమీఁద లోపించునుగాన అచ్చటమాత్రము తి'
రాదు. ప్రథమా బహువచనము మొదలు ప్రతివిభక్తియందును ఏకవచన -
బహువచనములు రెండింటియందును ఈ ఆదేశమువచ్చును [ఇ - టి - అను
నవి మాత్రము ద్వితీయావిభక్తుల ఎకవచనములందుమాత్రము వచ్చును.]

గోయి+లు తి - గోతి+లు తత్సమ - ౪౫ - వ సూత్రముచే తి'
తుగా మాఱును గోతులు' అగును ఇట్లే తక్కినవియును

**టి-తి-వర్ణంబులు పరంబులగునపు డుత్వంబున కిత్వంబగు ౩౬.**

రెండిటికి - మూఁడిటికి - నాలుగిటికి - పగలిటికి - మొద
లిటికి - పెక్కిటికి కొండొకచో నుత్వంబున కిత్వంబు చూప
ట్టదు నెత్తుటికి.

౩౬ టి-తి' అను నాపవిభక్తికవర్ణములు పరమగునపుడు వానికి ముం
దున్న ఉకారము ఇకారముగా నిత్యముగా మాఱును

రెండు+టి కి' అనియుండఁగా నీసూత్రము ననుసరించి దు' డిగా
మాఱి రెండిటికి' అయినది మూఁడిటికి' మున్నగునవియు నిట్లే

నెత్తుటికి మున్నగు కొన్నిచోట్లమాత్రము ఈ ఇకారాదేశము కాన
రాదు అందువలన నెత్తిటికి' అని యుండదు.

**టి వర్ణంబు పరంబగునపుడు క్రిందు మీఁదు ముందు పు-వర్ణంబుల కత్వంబగు ౩౨.**

క్రిందు - క్రిందటిని మీఁదు - మీఁదటిని ముందు ముందటిని మాపు-మాపటిని అప్పుడు-అప్పటిని.

౩౨ టి కి ముందున్న క్రిందు మీఁదు ముందు' శబ్దముల చివరి ఉకారము అకారముగా మాఱును ఇట్లే పు చివఱగలపదముల తుది ఉకారము అకారముగా మాఱును (క్రిందు)-క్రిందటిని ఇట్లే తక్కినవియగును.

**ఔపవిభక్తికముల తృతీయాసప్తముల కత్వం బాదేశంబు బహుళంబుగా నగు ౩౩.**

గోరను గీఱెను ఊర నున్నాఁడు. గొడ్డట నఱికెను ఇంట లేఁడు. వలుతఁ గలిసె కెలుతఁ దూలె. పక్షంబునందు గోరిచేత-నూరియం దిత్యాదులు.

౩౩ ఔపవిభక్తికములయొక్క తృతీయావిభక్తికిని సప్తమీవిభక్తికిని అకారము బహుళముగా నాదేశమగును ఈయాదేశము విభక్తినంతటిని కొట్టివేసి దానిస్థానమున వచ్చును.

గోరిచేత గీఱెను - గోరను గీఱెను' గోరు+చేత+ను' అనియుండఁగా 'చేత' కు అదేశముగా అ' వచ్చి సంధినిపొంది గోరను' అయినది అత్వము రానప్పుడు గోరిచేత' అనియుండవచ్చును

ఇట్లే తక్కినవానిని గ్రహించునది

ఇది యాచ్ఛికపరిచ్ఛేదము.

---

# కారకపరిచ్ఛేదము

---

## ప్రాతిపదికసంబోధనోక్తార్థంబులం బ్రథమయగు ౧.

ప్రాతిపదికార్థమునందు:—రాముఁడు-రావణుఁడు నియతోపస్థితికము ప్రాతిపదికార్థము. సంబోధనమునందు,—ఓరాముఁడ - ఓరావణుఁడ ఉక్తార్థమందు:—రాముఁడు రావణుని సంహరించెను. ఉక్తమనఁగాఁ జెప్పఁబడినది. ఈవాక్యమందు నాఖ్యాతము కర్తను జెప్పినదిగావునఁ దద్వాచకమగు రామశబ్దమునకుఁ బ్రథమ యయ్యె రామునిచే రావణుఁడు సంహరింపఁబడియె ఈవాక్యమం దాఖ్యాతము కర్మమును జెప్పినది గావునఁ దద్వాచకంబగు రావణశబ్దంబునకుం బ్రథమయయ్యె నని యెఱుంగునది.

కారకపరిచ్ఛేదము—క్రియతో అన్వయమును పొందునదిగాని, క్రియతో అన్వయమును కలిగించునది కని కారకము కారక మనఁగా విభక్తి. ప్రథమాదివిభక్తుల కన్నింటికిని క్రియతో సంబంధ మున్నది ) కారకములనుగూర్చి తెల్పుగ్రంథభాగము కారకపరిచ్ఛేదము

ఇదివఱకు ప్రథమాదివిభక్తులలో వచ్చురూపములే చూపఁబడినవి కాని వివేయర్థములలో నామావిభక్తులువచ్చునో చెప్పఁబడలేదు ఈప్రకరణమున ఆవిషయము తెల్పఁబడును కాన దీనిని విభక్త్యర్థప్రకరణము అనియుఁ జెప్పవచ్చును

౧ ప్రాతిపదికార్థమునందును సంబోధనార్థమునందును ఉక్తార్థము

వందును ప్రథమావిభక్తి యగును అనఁగా నైయర్థములు గలశబ్దములకు డు-ము-వులు' చేరుట మున్నగు కార్యములు జరుగుననుట

నియతోపస్థితికము=నియమమైన స్ఫురణముకలది శబ్దము ఉచ్చరించినతోడనే ఏయర్థమునకు తప్పక స్ఫురణకలుగునో అయ్యదియే ప్రాతిపదికార్థమని భావము

ఉదా — రాముఁడు రావణుఁడు

ఇచట రాముఁడు' అని యుచ్చరింపఁగానే దశరథుని పెద్దకొడుకు అనునర్థమును రావణుఁడు' అని పల్కఁగానే పులస్త్యుని పెద్దకొడుకు అను నర్థమును వెంటవెంటనే స్ఫురించుచున్నది కాన నివి ప్రాతిపదికార్థములైనందున ప్రథమావిభక్తివచ్చినది

సంబోధన మనఁగా పిలుపు-ఆహ్వానము ఆహ్వానమునందును ప్రథమ వచ్చునుగాన ఓరాముఁడ ఓరావణుఁడ ' అని రెండుచోట్లను ప్రథమ వచ్చినది

ఉక్తార్థమనఁగా చెప్పఁబడినయర్థము కర్త కర్మ మున్నగునవి ఆఖ్యాతాదులచే చెప్పఁబడినచో ఆయర్థమున ప్రథమవచ్చును అనగా క్రియాపదము ననుసరించి ఎవఁడు ఎవరు, ఏది ఏవి' అని ప్రశ్నింపఁగా సమాధానములుగా వచ్చుకర్త కర్మ మున్నగువానికి ప్రథమావిభక్తికార్యములువచ్చునని భావము ఉదా- రాముఁడు రావణుని సంహరించెను — ఇచట సంహరించె' నను క్రియనుబట్టి ఎవఁడు'? అని ప్రశ్నింపఁగా రాముఁడు' అని జబాబువచ్చినది కావున క్రియచే రాముఁడు' (కర్త) చెప్పఁబడిన దన వలెను ఆపదమునకుఁ బ్రథమావిభక్తివచ్చినది

రావణుఁడు రామునిచే సంహరింపఁబడెను' అనుచోట క్రియ ననుసరించి ఎవఁడు?' అని ప్రశ్నింపఁగా "రావణుఁడు' అని జబాబువచ్చినది. కాన రావణుఁడు' (కర్మ) యిచట చెప్పఁబడినందున ప్రథమవచ్చినది ఆఖ్యాతము=క్రియాపదము

## కర్మంబున ద్వితీయ యగు 2

ధాత్వర్థఫలాశ్రయంబు కర్మము నాఁబడు. దేవదత్తుఁడు వంటకమును వండెను. ఇట వండె ననుమాటకు వంటచేసెనని యర్థము వంట ఫలము చేయుట వ్యాపారము-వంట యనఁగాఁ బాకము-పాకమున కాశ్రయము కావుటంజేసి వంటకము కర్మం బయ్యె నని యెఱుంగునది.

2 ధాత్వర్థమగు ఫలమున కాశ్రయమగునది కర్మ ఆకర్మార్థమున ద్వితీయావిభక్తి యగును దేవదత్తుడు వంటకమును వండెను' అను నపుడు వండెను' అనునది వ్యాపారము-పని వండెను' అనఁగా వంటచేసెనని అర్థముకదా ఆపనికి (వండుటకు ఫలము వంట' ఆఫలమునకు ఆశ్రయమైనది-వండబడునది వంటకము' కాన దానికి ద్వితీయావిభక్తిరాఁగా ను' చేరినది

గోపాలుఁడు కృష్ణునిఁ గొట్టెను —ఇచట కొట్టుట వ్యాపారము (పని) దెబ్బ' ఫలము ఆఫలమున కాశ్రయమైనవాఁడు (దెబ్బతిన్నవాఁడు) కృష్ణుఁడు కావున ద్వితీయవచ్చి కృష్ణుని' ఆయినది]

## చేతవర్ణకంబు కర్తకగు. 3.

ధాత్వర్థవ్యాపారాశ్రయంబు కర్తనాఁబడు దేవదత్తుని చేత వంటకము వండఁబడియె - వండబడియెననగా వంటచేయఁబడియె నని యర్థము చేయుటకాశ్రయుఁడగుటంజేసి దేవదత్తుండు కర్త యయ్యె

3 ధాతువున కర్థమైనపనికి ఆధారమగునది కర్త ఆకర్తృవాచకమునకు తృతీయావిభక్తిలోని చేత' ప్రత్యయము చేరును.

దేవదత్తునిచేత వం[illegible]వండఁబడియె[illegible] వండఁబడుట' వ్యాపారము (పని) ఆపనికి ఆశ్రయమైనవాఁడు - వంటచేసినవాఁడు దేవదత్తుఁడు' కాన ఆపదమునకు తృతీయావిభక్తిలోని చేత' వచ్చి[illegible]

[ధాత్వర్థఫలమున కాశ్రయ మెప్పుడునుకర్మ. ధాత్వర్థవ్యాపారమున కెల్లపుడును కర్తయే ఆశ్రయమని గమనింపవలెను]

## చేతవర్ణకంబు హేతుకరణంబులకు గ్రహ్యాదియోగజం బగుపంచమికిని బహుళంబుగానగు ౮.

ఫలసాధనయోగ్యం బగుపదార్థంబు హేతువు క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు కరణంబు. హేతువునకు—ధనముచేత సౌఖ్యంబు గలుగు విద్యచేత యశంబుగలుగు.-పక్షంబున వలన వర్ణకంబగు కరణంబునకు—ఖడ్గంబుచేత ఖండించె కోలచేతఁ గాలనేసె పక్షంబునం దోడవర్ణకంబగు. గ్రహ్యాదియోగంబునందు—జరాసంధుఁడు రాజులచేతఁ గప్పంబు గొనియె. మైత్రుండు చైత్రునిచేత ఋణంబుఁ గొనియె ఈయర్థంబును నీచేత నెఱింగితి ఈవృత్తాంతంబు వానిచేత వింటి - పక్షంబున వలన వర్ణకంబగు ఇత్యాదికంబు లెఱుంగునది.

తృతీయావిభక్తిలోని 'చేత' కర్తకేకాక మఱి దేనికి వచ్చునో యిందుఁ జెప్పఁబడుచున్నది

హేత్వర్థము (కారణమనునర్థము) నందును కరణార్థము (సాధనము అనునర్థము) నందును 'గ్రహించుట' మున్నగు ధాత్వర్థములతో సంబంధించు పంచమీవిభక్తియొక్క అర్థమునందును 'చేత' ప్రత్యయము బహుళముగా వచ్చును

ఫలసాధనయోగ్యంబు = ఫలమును సాధించుటకు (సంపాదించుటకు) తగినది —ఫలమును పొందుటకుఁ దగిన కారణము హేతువని భావము

ధనముచేత 'సౌఖ్యంబుగలుగు' అనునప్పుడు సౌఖ్యమనుఫలమును సంపాదించుటకు తగినపదార్థము (కారణము) ధనము కాన దానికి 'చేత' వచ్చినది (ఇచట ధనరూపమగుకారణచే సౌఖ్యమనుకార్యముసిద్ధించినదని

గ్రహింపనగును.) ఈవిధి బహుళముగాన ఇది రానప్పుడు ౯-వ సూత్రముచే వలన్ వచ్చి ధనమువలన సౌఖ్యంబుగలుగు' ననియును అగును ఇట్లే రెండవ యుదాహరణమును

క్రియాసిద్ధిం బ్రకృష్టోపకారకంబు = పనిని సాధించుటయందు మిగుల నుపకరించునది — కార్యసిద్ధికి మిక్కిలి అనుకూలమైన సాధనము (పనిముట్టు) కరణ మనఁబడును ఖడ్గంబుచేత ఖండించె' అనునప్పుడు నఱుకుట' అనుపనిని సాధించుటలో ఇతరసాధనములకంటె మిగుల నుపకరించిన సాధనము ఖడ్గము కాన అది యిచట కరణమైనందున చేత' వచ్చినది చేత' రానపుడు ౪-వ సూత్రముచే తోడ వచ్చి ఖడ్గంబుతోడ ఖండించె నవియు నగును. ఇట్లే రెండవ యుదాహృతియు

జరాసంధుఁడు రాజులచేత గప్పంబుగొనియె' ననుచో కప్పంబును గ్రహించుట రాజులవలన నయ్యెంగాన - గ్రాహ్యాదియోగంబున రాజు' లకు చేత' సిద్ధించెను ఇయ్యది రానప్పుడు ౯-వ సూత్రముచే వలన' వర్ణకము వచ్చి జరాసంధుఁడు రాజువలనఁ గప్పంబుగొనియె' నవియు నగును. మైత్రుండు చైత్రునిచేత ఋణ ఋ కొనియె' ననునదియు నిట్లే

సూత్రములోని గ్రహ్యాదియోగజంబు' అనునెడగల ఆది' పదముచే గ్రహించుటతోఁబాటు ఎఱుఁగుట వినుట మున్నగువానిని గ్రహింపవలెను. ఈయర్థంబును నీచేత నెఱింగితి' ననునపుడు అర్థము నెఱుఁగుట' నీ' వలన నయ్యెఁగాన నీ' శబ్దమునకు చేత' వచ్చినది ఈ వృత్తాంతము వానిచేత వింటిని అనుచో వినుట' వాని' వలన జరిగినందున ఆ' శబ్దమునకు చేత' వచ్చినది చేత రానపుడు ౯ వ సూత్రముచే వలన' వచ్చి నీవలన నెఱింగితి వానివలన వింటిని' అనియు నగును

కరణ సహార్థ తుల్యార్థ యోగంబులం దృతీయకుం
దోడవర్ణకం బగు. ౫

కరణంబునందు:—కోలతోడఁ గూలనేసె సహార్థంబునందు:—రాజు సేనలతోడవచ్చె - సేనాసహితుండయి వచ్చెనని యర్థము. తుల్యార్థయోగంబునందు:—చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు - తృతీయకనుటం జేసి చైత్రునకు మైత్రుండు తుల్యుండని తుల్యార్థయోగంబున షష్ఠియు నగు.

౫ కరణము (గొప్పసాధనము) అనునర్థమునందును 'కూడ' అను నర్థమునందును 'సమానము' అనునర్థమునందును తృతీయావిభక్తికిఁ 'తోడ' ప్రత్యయ మగును

కోలతోడఁ గూలనేసె అనుచో కోలకరణము 'రాజు సేనలతోడ వచ్చె' ననుచోట సేనలతోఁగూడ' అని అర్థము 'చైత్రునితోడ మైత్రుండు తుల్యుండు' అనుచో సమానార్థము కాన మూఁడుచోట్లను 'తోడ' వచ్చినది.

తోడ ఎల్లప్పుడును తృతీయకే వచ్చును ఇచ్చట 'తోడ' అని మాత్రము చెప్పక 'తృతీయకు' అనియుఁ జేర్చుటచేత-తృతీయ వివక్షింపఁబడినపుడే సమానార్థమునందు 'తోడ' వచ్చుననియు, లేనప్పుడు షష్ఠివచ్చుననియు నభిప్రాయము కావున 'చైత్రునకు మైత్రుండు తుల్యుండు' అనునపుడు షష్ఠి వచ్చెను

వచ్యర్థాముఖ్యకర్మంబునకుఁ దోడకువర్ణకంబులు ప్రాయికంబుగా నగు. ౬.

మైత్రుండు చైత్రునితోడ నిట్లనియె-మైత్రుండు చైత్రున కిట్లనియె. ప్రాయికం బనుటచే నొకానొకచో ద్వితీయయు నగు.

౬ అను 'పలుకు' మున్నగునవి వచ్యర్థకములు వీనిలో నముఖ్యమగు (అప్రధానమగు) కర్మమునకు 'తోడ' 'కు' అను ప్రత్యయములు కలుగుచుగా నగును.

[ 'అను' మున్నగుధాతువులు ప్రయోగించునపుడు కర్మలు ముఖ్యము లనియు అముఖ్యములనియు రెండువిధములుగ నుండును ద్వితీయయే గాని ఇతరవిభక్తులను పొందఁదగనిది ముఖ్యకర్మము సందర్భానుసారముగా ద్వితీయా తృతీయా షష్ఠీవిభక్తులను పొందఁదగినది అముఖ్యకర్మము ]

మైత్రుండు చైత్రునితోడ ఇట్లు అనియెను' అను నిచట 'అనియె' నను నది వచ్యార్థకము ఇట్లు అనునది ముఖ్యకర్మవాచకము అనినది చైత్రునిఁగూర్చి గాన చైత్రపద మిచ్చట అముఖ్యకర్మమును చెప్పునది కాన దానికిఁ దృతీయ లోని 'తోడ' ప్రత్యయమువచ్చెను ఇచట షష్ఠీవిభక్తిలోని 'కు' వచ్చినపుడు 'మైత్రుఁడు చైత్రున కిట్లనియె' అనియు నగును

'తలఁచుగ' నని చెప్పుటచేఁ గొన్నిచోట్ల ౨-వ సూత్రము ననుసరించి ద్వితీయయు రావచ్చునని తెలియనగును ఉదా — 'కుంతీసుతాగ్రణి సంయమీంద్రుఁ బలికె నిట్లు' (ఇచట 'సంయమీంద్రునితోడ' అని కాక 'సంయమీంద్రు నిన్' అని ద్వితీయవచ్చినది.)

## ఉపయోగంబునం దాఖ్యాతకుం దోడవర్ణకంబగు ౭.

నియమపూర్వకవిద్యాస్వీకారం బుపయోగం బనంబడు. రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి - సాందీపుని వలన నని యర్థము

౭ ఉపయోగము = నియమము ననుసరించి విద్యను గ్రహించుట ఆఖ్యాత = విద్యను బోధించు గురువు

నియమముగా విద్య నభ్యసించుట అర్థముగాఁగలవాక్యమున - విద్యాబోధకుని (గురువును) తెలుపుపదమునకు తోడ ప్రత్యయము కల్గును

రామకృష్ణులు సాందీపునితోడ వేదంబులం జదివిరి' అనుచో రామకృష్ణులు నియమపూర్వకముగా విద్యనేర్చుకొనిరని తెలియుచున్నది. వారి విద్యాగురువును తెల్పు 'సాందీప' శబ్దమునకు 'తోడ' ప్రత్యయము కలిగినది.

రామకృష్ణులు సాందీపునితోఁగలిసి చదివిరనియు అతఁడు వారిసహాధ్యాయి యనియు భ్రాంతిపడకుండుటకయి సాందీపునివలన నని యర్థము' అని వివరింపఁబడినది

## సంప్రదానంబునకుం జతుర్థి యగు. ౮.

త్యాగోద్దేశ్యంబు సంప్రదానంబు నాఁబడు జనకుండు రామునికొఱకుఁ గన్య నిచ్చెను కొన్నియెడల నుద్దేశ్యమాత్రంబు కగు. పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు. చతుర్థికి మాఱుగా షష్ఠియె తఱచుగాఁ బ్రయోగంబులం గానంబడియెడి. జనకుఁడు రామునకుం గన్య నిచ్చెను. పురుషార్థంబునకు యత్నింపవలయు.

౮ త్యాగోద్దేశ్యంబు = ఎవ్వనికి దానమీయఁదలఁచునో అతఁడు దానమును గ్రహించువాఁడని భావము

ఎవనికొఱకు దాన మీయఁబడునో యతఁడు సంప్రదాన మనఁబడును. ఆసంప్రదానమును తెల్పుపదమునకు చతుర్థీవిభక్తి యగును. అనఁగా 'కొఱకు' ప్రత్యయము వచ్చుననుట 'జనకుండు రామునికొఱకు కన్య నిచ్చెను' - ఇచట కన్యాదానమున కుద్దేశింపఁబడిన రాముఁడు సంప్రదానము కాన నతనిని దెలుపుపదమునకు (రామశబ్దమునకు) చతుర్థి (కొఱకు) వచ్చినది

కొన్నిచోట్ల త్యాగము (దానము) లేకున్నను ఉద్దేశింపఁబడిన (తలఁపఁబడిన) దియే సంప్రదానమై చతుర్థిని పొందుటకలదు 'పురుషార్థంబుకొఱకు యత్నింపవలయు' ననుచోట త్యాగములేదు పురుషార్థము ఉద్దేశ్యమైనందున దానికి 'కొఱకు' ప్రత్యయము కలిగినది.

ఉద్దేశ్యమునకు చతుర్థి విధింపఁబడినను - తఱచుగ నిట్టియెడల చతుర్థికి మాఱుగ షష్ఠీవిభక్తియే కనఁబడుచున్నది. 'జనకుండు రామునికొఱకుఁ గన్య నిచ్చె' ననుటకంటె 'జనకుండు రామునకుఁ గన్యనిచ్చె' ననుటయే ప్రసిద్ధము-

## అపాయ భయ జుగుప్సా పరాజయ ప్రమాదగ్రహణ భవనత్రాణవిరామాంతర్ధి వారణంబు లెద్దానినగు దానికి వలనవర్ణకం బగు ౯.

అపాయము-విశ్లేషము భయము-వెఱపు జుగుప్స-ఏవ. పరాజయము - డయ్యుట ప్రమాదము-పరాకు గ్రహణము - కొనుట - ఎఱుంగుట - వినుట ఇత్యాది భవనము - పుట్టుట. త్రాణము - కాచుట విరామము - విరమించుట అంతర్ధి-మఱుఁగుట వారణము - వారించుట అపాయంబునకు— మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె భయంబునకు —చోరునివలన భయపడియె జుగుప్సకు -పాపంబువలన నేవగించె పరాజయమునకు.-అధ్యయనమువలన డస్సె ప్రమాదంబునకు.-పాడివలనం బరాకుపడియె గ్రహణంబునకు -మైత్రునివలన ధనంబుగొనియె. భవనంబునకు:-మనువువలనం బ్రజలు పుట్టిరి త్రాణంబునకు— చోరునివలనం గాచె. విరామంబునకు —భోగంబులవలన విరమించె అంతర్ధికి కృష్ణుండు తల్లివలన డాఁగె వారణంబునకు:- శోకంబువలన వారించె ఈపంచమికి షష్ఠియుం గొండొకయెడల నగు - చోరునకు వెఱచె పాపంబునకేవగించె - అధ్యయనంబునకు డస్సె-పాడికిం బరాకుపడియె మనువునకు నిక్ష్వాకుండు పుట్టె ఇత్యాదు లూహించునది

౯ దేనివలన అపాయము భయము మున్నగునవి కలుగునో దానికి 'వలన' ప్రత్యయమగును అపాయాదులను బోధించుశబ్దమునకు పంచమీ విభక్తిరాని వలన చేరునని భావము

అపాయము=విశ్లేషము - ఎడఁబాటు పరాజయము=డయ్యుట - అలసిపోవుట విరామము=విరమించుట మానుట అంతర్ధి=మఱుఁగుట-దాఁగుకొనుట వారణము=వారించుట-మఱలించుట

'మైత్రుండు రాజ్యంబువలన భ్రష్టుండయ్యె' అనుదాహృతిలో మైత్రునకును రాజ్యమునకు ఎడఁబాటు (అపాయము) కలిగెనని భావము దానిని బోధించు 'రాజ్య' పదమునకు 'వలన' కలిగినది ఇట్లే తక్కినవానిని గ్రహించునది

కొన్నియెడల పంచమీవిభక్తికి బదులుగా షష్ఠీవిభక్తి వచ్చుట కలదు 'చోరునివలన వెఱచె' ననుటకు బదులు 'చోరునకు వెఱచె' అనుట ప్రసిద్ధము ఇట్లే తక్కినవియును

**ఉండీపదం బొకానొకచో వలనవర్ణకంబున**
**కనుప్రయుక్తంబగు ౧౦.**

హిమగిరివలననుండి గంగవొడమె - నాకంబువలననుండి నారదుండు వచ్చె

౧౦ అను ప్రయుక్తంబు=అనుసరించి (వెంటనంటి) ప్రయోగింపఁబడినది. మీఁదిసూత్రముచే విధింపఁబడిన 'వలన' తోఁ జేరి (ఉండుధాతువు క్త్వార్థకంబగు) 'ఉండి' అనుసమాపకక్రియాపదము వచ్చుట కలదని భావము

'హిమగిరవలననుండి గంగ వొడమె' ననుచో 'వలన' తోఁ జేరి 'ఉండి' ప్రయోగింపఁబడుట స్పష్టము ఇట్లే తక్కినదియు

**ఉండీశబ్దము పరంబగునపుడు వలనకు ద్వితీయాసప్తములు**
**ప్రాయికంబుగ నగు. ౧౧**

వనమునుండివచ్చె వనమందుండివచ్చె - ఊరినుండి వచ్చె - ఊరనుండివచ్చె వనమునుంచి దనమునుంచి యని యుంచిశబ్దానుప్రయోగంబుతోఁ గొందఱు వ్యవహరించెదరు గాని యది సాధుకవిప్రయోగారూఢంబు గాదని యెఱుంగునది.

౧౧ వలన కనుప్రయుక్తమైన 'ఉండి' పరమగునపుడు 'వలన' కు బదులుగా ద్వితీయగాని సప్తమిగాని సాధారణముగా నగును అనఁగా 'ఉండి'

కి ముందున్న పంచమికి బదులు ద్వితీయావిభక్తిగాని సప్తమీవిభక్తిగాని సాధారణముగా వచ్చునని యర్థము

వనమువలన నుండివచ్చె అని యుండఁగా ఉండి కి ముందున్న 'వలన' పోయి దానిస్థానమున ద్వితీయ (ను) రాఁగా (వనమును+ఉండి) 'వనమునుండివచ్చె' నని యైనది. తక్కినయుదాహరణములు నిట్లే

కొందఱు ఉండి కి బదులు ఉంచి' అని వాడుదురు అది సాధువు కాదు కాన అట్లు వాడరాదు

కంటెవర్ణకం బన్యార్థాదియోగజం బగుపంచమి కగు. ౧౨.

రామునికంటె నన్యుండు ధానుష్కుండు లేఁడు - లోభంబుకంటె నితరంబు దోషంబులేదు. ఇచట షష్ఠియు నగు- రామున కన్యుండు ధానుష్కుండు లేఁడు అన్యము-ఇతరము - పూర్వము-పరము - ఉత్తరము-ఇత్యాదు లన్యాదులు

౧౨. అన్యార్థాదియోగజంబు = అన్యము మున్నగువర్థములు గలపదములతోడి యన్వయముకలది

అన్య' మున్నగుపదములతో సంబంధముగల పంచమీవిభక్తికి కంటె' అనుప్రత్యయము కలుగునని భావము

రామునికంటె నన్యుండు ధానుష్కుండులేఁడు' అనుచో అన్యుండు' అను అన్యార్థముతో సంబంధమున్నందున రామపదమునకు కంటె వచ్చినది.

ఇట్టిచోట్లలో కంటె' కు బదులు షష్ఠీవిభక్తియు వచ్చును అప్పుడు 'రామున కన్యుండు ధానుష్కుండు లేఁడు' అనియుంఁ గావచ్చును

కంటెవర్ణకంబు నిర్ధారణపంచమి కగు. ౧౩.

ఎచ్చట నిర్ధార్యమాణంబు జాత్యాదులచే భేదంబు కలిగియుండు నచటం బంచమియగు ఆ పంచమికిం గంటె వర్ణ

కంబగు నని యర్థము జానపదులకంటె నాగరులు వివేకులు.
మానహానికంటె మరణము మేలు.

౧౩ నిర్ధారణము = నిశ్చయము—వేఱుచేయుట (అయ్యది జాతి, గుణ క్రియలవలన నగును)

వేర్వేఱుజాతులలో నొకజాతికిఁగాని గుణములలో నొకగుణమునకు గాని క్రియలలో నొకక్రియకుఁగాని వేఱుపాటు కలుగునపుడు —దేనినుండి వేఱుచేయఁబడునో ఆశబ్దమునకు కంటె' (పంచమీప్రత్యయము) అగును నిర్ధార్యమాణము=నిశ్చయింపఁబడినది జానపదులకంటె నాగరులు వివేకులు' అనుచోట నాగరులు నిర్ధరింపఁబడిరి (వేఱుచేయఁబడిరి) వీరు వేఱుచేయఁబడుట కవధిభూతులు జానపదులు కాన జానపద' పదమునకు కంటె వచ్చినది ఇయ్యది జాతినుండి జాతి వేఱుచేయఁబడుట కుదాహరణము

మానహానికంటె మరణము మేలు అనుచోట మరణక్రియ మానహానియను క్రియకంటె వేఱుచేయఁబడినది

## పట్టివర్ణకంబు హేతువులగు గుణక్రియల కగు ౧౪

జ్ఞానముఁబట్టి ముక్తుఁడగు - నీవువచ్చుటంబట్టి ధన్యుఁడనయితి ఇచట వలనవర్ణకంబు నగు-జ్ఞానమువలన ముక్తుఁడగు

౧౪ హేతు వనఁగా కారణము హేతువులైన గుణ క్రియావాచక శబ్దములపయి పట్టి' ప్రత్యయ మగును

జ్ఞానముఁబట్టి ముక్తుఁ డగును' అనుచోట ముక్తుఁడగుటలో కారణము జ్ఞానము కావున దానిని తెల్పుపదమునకు పట్టి' కలిగినది ఇట్లే తక్కిన యుదాహృతియును.

ఇట్టిచోట్ల పట్టి' కి బదులు వలన' యను ప్రయోగింపఁబడుచుండుట ప్రసిద్ధముగాన జ్ఞానమువలన ముక్తుం డగు" నని యుంఁ గావచ్చును

## శేషషష్ఠికి యొక్కయు నగు. ౧౫.

ఇచట శేషంబనఁగా సంబంధంబు - రామునియొక్కగుణములు - నాయొక్కమిత్త్రుఁడు - వానియొక్క తమ్ముఁడు. కువర్ణకంబును గొన్నియెడల సంబంధంబునం దగు. నాకుం దమ్ముఁడు - మీకు నెచ్చెలి.

౧౫. కర్మ కరణ సంప్రదానాదులగు నర్థములందు ద్వితీయ, తృతీయ చతుర్థి మున్నగువిభక్తులు విధింపఁబడినవి ఇఁక మిగిలినది సంబంధార్థము మిగిలినవిభక్తియు షష్ఠి శేషార్థమును (మిగిలినసంబంధార్థమును) తెల్పుషష్ఠి శేషషష్ఠి ఆ శేషషష్ఠికి యొక్కయును ('యు' అనునముచ్చయముచే) కొన్నియెడల 'కు' యును కలుగునని భావము

'రామునియొక్కగుణములు' అనఁగా 'రామునిసంబంధములైన గుణములు' అని యర్థము. కాన ఇఁట సంబంధార్థమున 'యొక్క' వచ్చినది. ఇట్లే తక్కినవియును

కొన్నియెడల (ప్రయోగానుసారముగ) 'కు' వచ్చును 'నాయొక్క తమ్ముఁడు' అనుటకు బదులు 'నాకుం దమ్ముఁడు' అనియు నుండును 'మీకు నెచ్చెలి' అనునదియు నిట్టే

## నిర్ధారణషష్ఠికి లోపలవర్ణకంబగు ౧౬.

జాతి గుణక్రియా సంజ్ఞలచేత సముదాయంబునుండి యేకదేశంబునకుం బృథక్కరణంబు నిర్ధారణం బనంబడు ఎద్దానివలన నిర్ధారణంబగు నచ్చోటిషష్ఠికి లోపలవర్ణకం బగు నని యర్థము. మనుష్యులలోపల క్షత్త్రియుండు శూరుండు - గోవులలోపలఁ గపిల బహుక్షీర - అధ్వగులలోపలం బాఱువాఁడు శీఘ్రగామి - ఛాత్త్రులలోపల మైత్త్రుండు సమర్థుండు.

ఇట సప్తమియుంగలదు - మనుష్యులయందు క్షత్రియుండు శూరుండు. ఇత్యాదు లెఱుంగునది

౧౬. నిర్ధారణము (వేఱుచేయుట) ను బోధించుషష్ఠికి లోపల' అను ప్రత్యయము వచ్చును

సముదాయము = సమూహము ఏకదేశము = (సమూహములో) అంతర్భూతమైనవస్తువు పృథక్కరణము = వేఱుచేయుట

జాతి-గుణ-క్రియా సంజ్ఞల ననుసరించి సమూహమునుండి యేకదేశమును (ఒకభాగమును) వేఱుచేయుట నిర్ధారణము ఏసమూహమునుండి యది వేఱుచేయఁబడునో ఆసమూహమును చెప్పుశబ్దము షష్ఠికి లోపల' అనునది యగును

మనుష్యులలోపల క్షత్రియుండు శూరుండు' అనునప్పుడు మనుష్యులనుండి ఆజాతిలోనే చేరిన (అందు ఏకదేశమైన) క్షత్రియుఁడు క్షత్రియత్వ జాతి ననుసరించి వేఱుచేయఁబడుచున్నాఁడు. కాన దేనినుండి వేఱుచేయఁబడెనో ఆసమూహమును దెల్పు మనుష్య' శబ్దమునకు ఇట లోపల' కలిగినది.

గోవులలోపలఁ గపిల బహుక్షీర' అనుచోట గోవుల (గుంపు) నుండి కపిలత్వరూపగుణముననుసరించి కపిల వేఱుచేయఁబడుచున్నది ఈవేఱు చేయుట గోసముదాయమునుండి కాన తద్వాచకమగు గో' శబ్దమునకు 'లోపల' వచ్చినది

అధ్వగులలోపలం బాఱువాఁడు శీఘ్రగామి అనుచోట అధ్వగు' నుండి పాఱుట యనుక్రియ ననుసరించి నిర్ధారణము జరిగినందున (వేఱు చేయుట జరుగుటచే) అధ్వగ' శబ్దమున కిచట లోపల' వర్ణము వచ్చినది

ఛాత్రులలోపల మైత్రుండు సమర్థుండు అనుచోట శిష్యులగుంపు

నుండి 'చైత్ర' అనుసంజ్ఞ ననుసరించి చైత్రుఁడనువాఁడు వేఱుచేయఁబడు చున్నాఁడు అట్లు వేఱుచేయఁబడుటకు అవధిభూతులు ఛాత్రులు కాన వారిని తెల్పుపదమునకు లోపల' వచ్చినది

ఈ లోపల' ప్రత్యయము వచ్చుస్థలములలో సప్తమీవిభక్తియు వచ్చుట కలదు కావున మనుష్యులయందు స్త్రీయందు శూరుండు' మున్నగురూపములును ఉండును

## అధికరణంబునకు సప్తమి యగు ౧౭.

అధికరణంబునా నాధారంబు ఔపశ్లేషికంబు వైషయికం బభివ్యాపకం బని యాధారంబు త్రివిధంబు ఘటమందు జలమున్నది - మోక్షమం దిచ్ఛగలదు అన్నింటియం దీశ్వరుండు గలండు

౧౭ ఆధారము (ఆశ్రయము)ను దెల్పుటకు సప్తమీవిభక్తి లోని అందు' అగును ఆధారము ౩ విధములు ౧ ఔపశ్లేషికము (దగ్గఱ కూడికకలది) ౨ వైషయికము (విషయసంబంధముకలది-అనఁగా తన్మూలమున ప్రయోజనముకలది) ౩ అభివ్యాపకము (అంతటను వ్యాపించియుండునది) ఔపశ్లేషికమున కుదాహృతి ఘటమందు జల మున్నది' ఇచట జలము సంయోగ (కలిసియుండు) సంబంధముచే ఘటమును ఆధారముగాఁ జేసికొని యున్నది కాన ఆధారవాచకమగు ఘట' శబ్దమునకు అందు' వచ్చినది

వైషయికమున కుదాహృతి- మోక్షమం దిచ్ఛ గలదు' అనుచోట విషయసంబంధముచే ఇచ్ఛ' మోక్షము నాధారముగాఁ జేసికొన్నందున 'మోక్ష' శబ్దమునకు సప్తమికల్గినది అభివ్యాపకమున కుదాహృతి- అన్నింటియం దీశ్వరుండు' గలఁడు అనుచోట ఈశ్వరుఁడు సర్వపదార్థములయందును

వ్యాపించియున్నాఁడని యర్థము అభివ్యాపకసంబంధముచే ఈశ్వరుఁడు అన్నింటిని' ఆధారముచేసికొనుటచే అన్ని' కి అందు' కల్గెను

### ఉకారాంత జడంబునకు నవర్ణకం బగు. ౧౮.

ఘటంబున జలంబున్నది-దేవదత్తునకు మోక్షమున నిచ్ఛ గలదు.

౧౮ ఉకారాంతమగు జడవాచకశబ్దమునకు (జ్ఞానములేనిదానికి) సప్తమియందలి న' ప్రత్యయము వచ్చును

ఘటమున జలం బున్నది అనుచోట ఘటశబ్దము జడవాచకము ఉకారాంతము. కాన సప్తమ్యేకవచన-ఆధారవాచకమగు నిశబ్దమునకు వచ్చినది

### విశేష్యంబునకుంబోలె విశేషణంబునకు లింగవిభక్తివచనంబు లగు ౧౯.

నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు - దేవకీపుత్త్రు వారిని నుతింతునెపుడు-శుభవిధాయుల రామకృష్ణుల భజింతు - భువనవంద్యను రుక్మిణిఁ బొగడుచుందు.

౧౯ విశేష్యము=నామవాచకము ఆయానియమముల ననుసరించి విశేష్యమునకు ఏలింగము ఏవిభక్తి ఏ వచనము నుండునో వానివిశేషణములకుఁగూడ ఆయాలింగ-విభక్తి వచనములే కలుగునని యర్థము [అనఁగా విశేష్యము ఎట్లు క్రియ తో నన్వయించునో, దానివిశేషణముకూడ అట్లే క్రియతో నన్వయించునని భావము]

నందతనయుండు కృష్ణుండు నాకు దిక్కు' అనుచోట విశేష్యము కృష్ణుఁడు ఇది పుంలింగము ప్రథమావిభక్తి ఏకవచనము కాన దానివిశేషణమైన నందతనయుండు' అనునదియును పుంలింగమైనది ప్రథమైకవచనముకల్గియున్నది దేవకీపుత్త్రు వారిని నుతింతు నెపుడు' అనుచోట విశేష్యము

'హరిని'. అది పుంలింగము ద్వితీయాంతము ఏకవచనము కాన దానివిశేష ణముకూడ దేవకీపుత్త్రు' అనునది అయాలింగ విభక్తి వచనములలోనే ఉన్నది.

స్త్రీసమంబులగు విశేషణంబులయు
మువర్ణకాంతవిశేషణంబులయు,బహువచనంబున
కేకవచనంబు బహుళంబుగా నగు. ౨౦.

మాటలుపెక్కేల - మాటలు పెక్కులేల - కులిశధార ల్కుంఠితంబయ్యె - కులిశధారల్కుంఠితంబు లయ్యె - ఇష్టమగు పదార్థములు-ఇష్టములగు పదార్థములు.

౨౦ ప్రథమైకవచనము లోపించిన పదములన్నియుం స్త్రీసమము లగు అట్టి స్త్రీసమములు విశేషణములగునప్పుడును ము' ప్రత్యయము చివఱగలపదములు విశేషణము లగునప్పుడును అట్టివిశేషణముల బహువచన మునకు ఏకవచనము బహుళముగా నగును

మాటలు పెక్కేల'—ఇచట పెక్కు' విశేషణము అది స్త్రీసమము. కాన దానిబహువచనమునకు ఏకవచనము బహుళముగా నైనది [౧౯-వ సూత్రముచే ఇచట విశేష్యమునకుంబోలె బహువచనము రావలసియుండఁగా ఏకవచనము ఈసూత్రముచే విధించఁబడినది] ఇది బహుళముగాన ఏకవచ నము రానప్పుడు బహువచనమువచ్చి మాటలు పెక్కులేల?' అనియగును అగును.

కులిశధారల్కుంఠితంబయ్యె' అనుచో కుంఠితంబు అనునది మువర్ణ కాంతవిశేషణము కాన అచ్చట బహువచనమునకు బదులు ఏకవచనము వచ్చినది పక్షంబున కులిశధారల్ కుంఠితంబులయ్యె' ననుబహువచనరూపము నుండును ఇట్లే కక్కిన యుదాహరణమును

### ఒకానొకచో నొకవిభక్తికి మఱియొక విభక్తియు నగు ౨౧.

మైత్రుండు గృహమును వెడలెను - గృహమునుండి యని యర్థము వాఁడు వాహనమును దిగెను - వాహనము నుండి యని యర్థము వారు సుఖమున్నారు - సుఖముతో నని యర్థము ఇత్యాదు లెఱుంగునది

౨౧ వ్యాకరణనియమము ననుసరించి యొకవిభక్తి రావలసియుండఁగా అదిరాక దానిస్థానమున మఱియొకవిభక్తివచ్చుట కొన్నిచోట్లఁ గాన నగును. ఉదా — మైత్రుండు గృహమునుండి వెడలెను' అని సప్తమి రావలసియుండఁగా దానికిబదులు ద్వితీయవచ్చి 'గృహమును వెడలెను' అని వచ్చినది ఇట్లే తక్కినవియును ఇట్టివానిని ప్రయోగముల ననుసరించి గ్రహించునది

### జడంబు తృతీయాసప్తములకు ద్వితీయ బహుళంబుగా నగు. ౨౨. 22

రాముఁడు వాలినొక్కకోలంగూలనేసె - కోలతో నని యర్థము లంకం గలకలంబు పుట్టె - లంకయందని యర్థము. బాహుళకంబుచే నిక్కార్యం బుదంతంబునకు బహుత్వమందె యగు. అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె - బాణములచే నని యర్థము మీనంబు జలంబులనుండు-జలంబులందని యర్థము

౨౨ అచేతనములగు జడపదముల చివరనున్న తృతీయావిభక్తికిని సప్తమీవిభక్తికిని ద్వితీయావిభక్తి బహుళముగా నాదేశమగును

రాముఁడు వాలి నొక్కకోలతోఁ గూలనేసె' అనియుండునపుడు తృతీయకుబదులు ద్వితీయవచ్చి 'రాముఁడు వాలి నొక్కకోలఁ గూలనేసె' యయినది లంకయందుఁ గలకలంబుపుట్టె ననుచో సప్తమికి ద్వితీయ యాదేశమయి 'లంకం గలకలంబుపుట్టె'నని యైనది

ఈసూత్రమున బహుళము' అనిచెప్పుటచే-తత్సూత్రమున - ఉకారాంతశబ్దముల బహువచనమునందే యీయాదేశము వచ్చుననియు తక్కిన వానికి ఏకవచన బహువచనములు రెండింటను వచ్చుననియు నిశ్చయించుకొనవలెను కావుననే అర్జునుండు శత్రుసేనలను బాణంబులను రూపుమాపె' ననిబహువచనమునందే తృతీయార్థమున ద్వితీయవచ్చినది ఇచట -శత్రుసేనలను బాణంబును-రూపుమాపె' నని యుండదను అనఁగా ఏకవచనమున - తృతీయకు ద్వితీయ ఆదేశముగారాదు బాణంబుతో" అనియే ఉండవలెను. ఇట్లే తక్కిన యుదాహరణములు

## ఉదంతజడంబు తృతీయకు నవర్ణకంబగు ౨౩

రాము. డొక్క బాణంబున వాలిం గూలనేసె - బాణముచే నని యర్థము

౨౩ ఉకారాంతమైన జడవాచకశబ్దము తృతీయకు ఏకవచనమున న' ప్రత్యయము వచ్చును

రాముఁ డొక్క బాణంబుచే వాలిఁ గూలనేసె అనుచో తృతీయా విభక్తిప్రత్యయమగు చే' అనుదానికి న' ఆదేశమయి రాముఁ డొక్క బాణంబున వాలిం గూలనేసె' అని యైనది

## జడంబు ద్వితీయకుం బ్రథమ బహుళంబుగానగు ౨౪.

వాఁడు పూవులు దెచ్చె-వాఁడు పూవులను దెచ్చె. ఆకె సొమ్ములు దాల్చె - ఆకె సొమ్ములను దాల్చె వాఁడిల్లువెడలె - వాఁడింటిని వెడలె బాహుళకముచేఁ దృతీయాసప్తములకు విధించినద్వితీయకుం బ్రథమరాదు

౨౪ వాఁడు పూవులు దెచ్చె' అనుచో పూవులు' అను ప్రథమ 'పూవులను' అను ద్వితీయార్థమున వచ్చిన ఇట్లే తక్కినవియును ఈ కార్యము లోలుతనుండియు ద్వితీయగా నున్నదానికేవచ్చును కాని తృతీయా

సప్తములకు ఆదేశముగావచ్చిన ద్వితీయకుఁ గలుగదు కాన లంకయందు' అనునర్థమున లంకను' అనివచ్చిన ద్వితీయను ప్రథమగా మార్చి లంక కలక లంబు పుట్టె' అని చెప్పరాదని యర్థము

కాలాధ్వములకుం బ్రాయికంబుగాఁ బ్రథమయగు. ౨౫.

వాఁడు నిన్నవచ్చె-వీఁడు నేఁడు వోయె - మాపు నిలు వ్రము-రేపు పోమ్ము వారు క్రోశము నడచిరి - వీ రామడ వోయిరి

౨౫ కాలాధ్వములకు = కాలవాచకములకును మార్గవాచకముల కును ప్రాయికముగా = కఱచుగా

కాలమును మార్గమును దెల్పుశబ్దములు సాధారణముగా ప్రథమా విభక్తియందే యుండునని భావము

ఉదాహరణములలోని నిన్న నేఁడు మాపు రేపు క్రోశము, ఆమడ' అనునవి ప్రథమాంతములు. సూత్రమునఁ బ్రాయికముగా' ననుటచేఁ గొన్ని యెడల సప్తమియుం రావచ్చునని తెలిసికొనవలెను ఉదా — వాఁడు నేఁటి యుదయమున వచ్చె'

సర్వనామ సంఖ్యాభిధాన తద్విశేష్యంబులయం దెయ్యది ముందు ప్రయోగింపంబడు దానిద్వితీయాదులకుం బ్రథమ బహుళంబుగా నగు. ౨౬

అన్ని గుఱ్ఱములకు - అన్నింటికిగుఱ్ఱములకు - గుఱ్ఱము లన్నింటికి-గుఱ్ఱములఁ కన్నింటికి - సాహిణులుముగ్గురు రెండు గుఱ్ఱములకు-రెండింటికి గుఱ్ఱములకు - గుఱ్ఱములు రెండింటికి - గుఱ్ఱములకు రెండింటికి - సాహిణులు నలుగురు. లక్షగుఱ్ఱము లకు-లక్షకుగుఱ్ఱములకు - గుఱ్ఱములులక్షకు- గుఱ్ఱములకులక్షకు- రవుతులులక్ష-ఇత్యాదు లెఱుంగునది

౨౬. సంఖ్యాభిధానము = సంఖ్యావాచకము. తద్విశేష్యములు = సర్వనామవిశేష్యములు సంఖ్యావాచకవిశేష్యములును.

సర్వనామములు వానివిశేష్యములు అను నీరెండింటియందును వాక్యమున ఎయ్యది ముందు చెప్పఁబడునో దాని ద్వితీయాదివిభక్తులకుఁ బ్రథమావిభక్తి బహుళముగా నగును. అట్లే సంఖ్యావాచకములును వానివిశేష్యములును అనువీనిలో నెయ్యది ముందు ప్రయోగింపఁబడునో దాని ద్వితీయాదివిభక్తులకుఁ బ్రథమావిభక్తి బహుళముగా నగును.

ఉదా—(1) అన్నిగజ్జములకు సాహిణులు ముప్వురు' ఇట 'అన్ని' యనుసర్వనామము ముందు చెప్పఁబడినది. దానివిశేష్యము గజ్జములకు అనునది. ఆవిశేష్యము ననుసరించి వచ్చినషష్ఠికి ప్రథమ ఆదేశమయి (అన్నింటికి - అనిలేక) 'అన్ని' అని యయినది. ప్రథమబహుళముగాన అది రానప్పుడు (2) 'అన్నింటికి గజ్జములకు సాహిణులు ముప్వురు' అని 'అన్ని' శబ్దమునకు షష్ఠివచ్చినది. (చూ ౧౯ సూ) (3) 'గజ్జము లన్నింటికి సాహిణులు ముప్వురు' అనుచో విశేష్యమగు 'గజ్జములు' ముందుగాఁ బ్రయోగింపఁబడినది కాన దానిషష్ఠికి ప్రథమవచ్చినది. ఈ ప్రథమ బహుళము కావున నది రానప్పుడు షష్ఠివచ్చి (4) 'గజ్జముల కన్నింటికి సాహిణులు ముప్వురు' అని యైనది.

'రెండుగజ్జములకు సాహిణులు నలుగురు' అనుచో సంఖ్యావాచకము ముందు ప్రయోగింపఁబడినందున దానిషష్ఠికిఁ బ్రథమవచ్చినది. ప్రథమ రానప్పుడు షష్ఠివచ్చి 'రెండింటికి గజ్జములకు' అని యైనది.

'గజ్జములు రెండింటికి ' అనుచో విశేష్యము ముందువచ్చినందున దానిషష్ఠికి బ్రథమయైనది. అది రానప్పుడు షష్ఠివచ్చి 'గజ్జములకు రెండింటికి' అనియైనది. ఇట్లే తక్కినవియును.

## ఒకానొకచో విశేషణంబుల షష్ఠికిం బ్రథమ విభాషనగు. ౨౭.

సుగుణాభిరాముఁడు రామునకు జోహారు వొనర్చెద.
సుగుణాభిరామునకు రామునకు జోహారు వొనర్చెద.

౨౭ విశేష్యము షష్ఠ్యంతమయి ఉన్నప్పుడు దానివిశేషణమును షష్ఠ్యంతమైనదిగా ఉండవలసియున్నది కాని కొన్నిచోట్ల విశేషణము యొక్క షష్ఠికి బదులు వికల్పముగా ప్రథమవచ్చునని యర్థము

ఉదాహరణమున సుగుణాభిరాముఁడు' అనునది విశేషణము దాని షష్ఠికి వికల్పముగ ప్రథమవచ్చి సుగుణాభిరాముఁడు' అయినది అది రానప్పుడు సుగుణాభిరామునకు' అని షష్ఠియువచ్చినది

సూత్రమునందు ఒకానొకచో' అనుటచే పెద్దల ప్రయోగముల ననుసరించియే యీవిధిని ప్రవర్తింపఁజేయవలయునని తెలిసికొన నగును

## భవత్యర్థవ్యవహితంబులగు విశేషణంబులకుం బ్రథమ యగు ౨౮.

అగు మొదలగునవి భవత్యర్థములు విద్యాశాలియగు పురుషుని సకలజనులు సన్మానింతురు భూతదయాళు వగుమహాత్ములకు శ్రేయంబు గలుగును. అతిమానుష మత్యద్భుత మతి దుష్కర మయిన కేశవార్జునకృతిన్.

౨౮ విశేషణ విశేష్యములను వేఱుచేయుచు వానినడుమ అగు' ధాత్వర్థకములైన పదములు చేరునపుడు విశేషణమునకుఁ బ్రథమావిభక్తి యగును విద్యాశాలియగుపురుషుని సకలజనులు సన్మానింతురు' అనుచోట విద్యాశాలి' విశేషణము పురుషుని విశేష్యము వీనికి నడుమ నీరెంటిని వేఱుపఱుచుచు అగు' చేరినందున విశేషణమునకు విశేష్యమునకుఁ బోలె ద్వితీయరాక ప్రథమయే వచ్చినది అగు' ధాత్వర్థకపదము వీనినడుమఁ జేరనపుడు విద్యాశాలినిఁ బురుషుని సకలజనులు సన్మానింతురు' అని యగును.

భూదయాపరగుమహాత్ములకు శ్రేయంబుగలుగును' అనుచోట విశేషణమునకు విశేష్యమునకుంబోలె షష్ఠిరాక ప్రథమయే వచ్చెను

విశేషణము లొకటికంటె ఎక్కువగా నున్నయెడలను వానికన్నింటికిని ప్రథమయేవచ్చును- అతిమానుష మత్యద్భుత మతిదుష్కరమయిన కేశవార్జునకృతిన్ అనుచో కేశవార్జునకృతి' విశేష్యము- దానివిశేషణములు మూండింటికిని ప్రథమవచ్చినది అగు అవు ఔ అయిన (వ్యతిరేకార్థకమగు) కాని' మున్నగునవి భవత్యర్థకములు

## భవత్యర్థకంబు సన్నిహితవిశేషణంబునకును దానిముందు విశేషణంబుల కయిపదంబును బహుళంబుగా ననుప్రయుక్తంబగు. ౨౯.

అతులుండయి యప్రమేయుండౌ హరిని గొలుతు.

౨౯ భవత్యర్థకంబు = అగు మున్నగువానిలో నొకటి సన్నిహితవిశేషణంబునకు = విశేష్యమునకు దగ్గఱగానున్న విశేషణమునకు అనుప్రయుక్తంబు = చేర్చి ప్రయోగించబడినది

విశేషణములు పెక్కులున్నపుడు వానిలో విశేష్యమునకు సమీపమున నున్న విశేషణము (పూర్వమున నున్నవిశేషణము) నకు అగు అవు ఔ మున్నగువానిలో నేదేని చేరును తక్కినవిశేషణములకు అయి' అనునది చేరును అనంగా చాలవిశేషణముల పిదప విశేష్య మున్నపుడు అవిశేష్యము ప్రక్కనున్నవిశేషణమునకు మాత్రము భవత్యర్థకముచేరును తక్కినవానిచివఱ అయి' చేరునని భావము అతులుండయి యప్రమేయుండౌ హరిని గొలుతు' ననుచోట హరి' విశేష్యము. దానికి దగ్గఱగానున్న విశేషణము అప్రమేయుండు' దానికి ఔ' చేరినది తక్కినవిశేషణమగు అతులుండు' అనుదానికి 'అయి' చేరినది

**అయిపదానుప్రయోగంబు లేనిచోఁ దుదివిశేషణంబునకేని విశేషణంబు లన్నింటికేని మీఁద సముచ్చయార్థంబు విభాషం బ్రయోగింపంబడు. 30.**

అద్యుఁ డప్రమేయుఁడు నగుహరిని గొలుతు. అద్యుఁడు నమేయగుణుఁడు నౌహరిని గొలుతు. అద్యుఁ డప్రమేయుం డగు హరిని గొలుతు.

30 తుదివిశేషణంబునకేని = ('అగు' అనునది చేరి) విశేష్యమునకు ముందున్న విశేషణమునకయినను సముచ్చయార్థంబు = యుం నులలో నొకటి

'అగు' మున్నగువానితోఁ గూడి విశేష్యమునకు ముందున్న విశేషణమునకు ముందున్న యితరవిశేషణముల చివర 'అయి' అనునది చేరకుండునప్పుడు విశేషణము లన్నింటికిని చివర సముచ్చయార్థకము చేరును లేదా చివరి విశేషణమునకయినను (భవత్యర్థకము చేరిన చివరి విశేషణమునకైనను) సముచ్చయమగును ఇట్లు విశేషణము లన్నింటికిని సముచ్చయము చేరురూప మొకటి చివరిదానికే సముచ్చయము చేరురూప మొకటి (నియమము వికల్పమగుటచే) దేనికిని సముచ్చయము రానిరూప మొకటియు మొత్తముపై మువ్విధము లగురూపము లిచట ఉదాహరింపఁబడుచున్నవి

౧ అన్నివిశేషణములకును సముచ్చయము వచ్చుట కుదాహరణము 'అద్యుఁడు నమేయగుణుఁడు నౌహరిని గొలుతు' - ఇచట చివరివిశేషణము - 'అమేయగుణుఁడు' దానికే అగు చేరినది దానికి ముందున్న విశేషణము 'అద్యుఁడు' దానికి 'అయి' అనుప్రయుక్తము కాలేదు కావున రెండు విశేషణములకును 'ను' అను సముచ్చయము చేరినది

౨ చివరి విశేషణమునకుమాత్రము సముచ్చయముచేరుట కుదాహరణము — 'అద్యుఁ డప్రమేయుఁడు నగుహరిని గొలుతు' ఇచట చివరివిశేషణమగు 'అప్రమేయుఁడు' అనుదానికే సముచ్చయముచేరినది 'అద్యుఁడు' అను తొలివిశేషణము 'అయి' లేనిదయినను దానికి సముచ్చయము చేరలేదు.

౩ సముచ్చయము రాకుండుట కుదాహృతి. ఆద్యుఁ డప్రమేయుఁ డగువారిని గొలుతు' ఇచట రెండువిశేషణములచివఱను సముచ్చయము చేరలేదు

**ధాతుజవిశేషణవ్యవధానంబున విశేషణంబు లన్నింటి కయిపదం బనుప్రయుక్తంబగు. ౩౧**

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడు దేవుని నభినుతింతు ఇచట మఱియుం బ్రయోగ వైచిత్ర్యంబు గల దది ప్రయోగంబుల నెఱుంగునది.

౩౧ ధాతుజవిశేషణవ్యవధానంబున=(ఉకారాంతములయి ధాతువుల వలనఁబుట్టిన విశేషణములు ధాతుజవిశేషణములు అట్టి) ధాతుజవిశేషణములచే వేఱుచేయఁబడినప్పుడు

విశేషణములకు, విశేష్యమునకు వేఱుచేయుచు వానినడుమఁ గ్రియాజన్యవిశేషణ మున్నచో—దానికి ముందున్న విశేషణము లన్నింటి చివఱను 'అయి' చేరుచుండును

ఆద్యుఁడయి యప్రమేయుఁడై యఖిలసేవ్యుఁడై యొసంగెడుదేవుని నభినుతింతు' అనుచోట 'ఒసంగెడు' ధాతుజవిశేషణము అది విశేష్యమగు 'దేవుని' ని 'ఆద్యుఁడు' మున్నగువిశేషణములను వేఱుచేయుచున్నది కావున విశేషణముల కన్నింటికిని 'అయి' చేరినది

ఇచట మఱియు—పయిరీతినిగాక కొన్నివిశేషణములకుమాత్రమే 'అయి' చేరి మఱికొన్నిటికిఁ జేరకుండుట మున్నగువిచిత్రప్రయోగములను పెద్దలు వ్రాసినగ్రంథములనుండి గ్రహింపనగును

'ఆద్యుఁ డప్రమేయుఁ డఖిలసేవ్యుఁడునయి, యొసఁగెడుదేవుని నభినుతింతు' అనుచోట 'అఖిలసేవ్యుఁడు' అను ఒక్కవిశేషణమునకే 'అయి' చేరుట కానవగును ఇట్టి ప్రయోగములను గ్రహింపనగును.

**భావార్థకాదియోగంబునం గర్తకుం బ్రథమ యగు. 32.**

రాముఁడు వచ్చుట - రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె - రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు రాముఁడు పట్టిన ప్రతిన వారింపం దరంబుగాదు.

32 భావార్థకాదియోగంబున=భావార్థకము మున్నగు పదములతోడి యన్వయమున [ధాత్వర్థమును బోధించు ప్రత్యయములు-ట అక ఇన ఇ మున్నగునవి]

భావార్థకాదులగుపదములతోడి యన్వయమున క్రియగుపదముకు ప్రథమావిభక్తియగును భావార్థకాదులకుఁ గర్తయై వానితో నన్వయించెడు దానికిఁ బ్రథమావిభక్తి యగునని భావము ఇట్లగుట నిత్యము

రాముఁడువచ్చుట-' ఇచట వచ్చుట' భావార్థకము ట' ప్రత్యయాంతము దానికిఁ గర్తయగు రామశబ్దమునకు బ్రథమవచ్చినది

రాముఁడు రాఁగా లక్ష్మణుఁడు గాంచె అనుచో రాఁగా' భావార్థకము. తత్కర్తకుఁ బ్రథమవచ్చి రాముఁడు అయ్యె రాముఁడు విల్లందినం ద్రిలోకంబు లాకులంబులగు'-ఇచట అందిన' భావార్థకము దానికర్త 'రాముఁడు' అశబ్దమునకు ప్రథమవచ్చినది

రాముఁడు పట్టిన ప్రతినవారింపందరంబు గాదు'-ఇచట పట్టిన' భావార్థకము తత్కర్తయగు రామ' శబ్దమునకుఁ బ్రథమవచ్చినది.

రాముఁడు వండక మునుపు రాముఁడు వండమి'-మున్నగుప్రయోగములు నిట్టే యని గ్రహించునది.

**ప్రథమాంతంబు లగు యుష్మదస్మద్విశేషణంబుల కేకత్వంబున వు-ను-లును బహుత్వంబున రు-ము-లు నంతాగమంబులు ప్రాయికంబుగ నగు. 33.**

33 యుష్మదస్మద్విశేషణంబులకు= నీ-నా' శబ్దములవిశేషణములకు ప్రథమాంతములైన యుష్మదేకవచనంబుల విశేషణములకు వు' అనునదియు

అస్మదేకవచనవిశేషణములకు ను' అనునదియు చివఱ ఆగమములుగావచ్చును, అట్లే యుష్మద్బహువచనవిశేషణములకు రు' అనునదియు అస్మద్బహువచన విశేషణములకు ము' అనునదియును సాధారణముగా చివఱసాగమముగా చేరును ఈనియమము ప్రథమాంతములకే చెల్లును

## ఈయాగమంబులు పరంబులగునపు డుత్వంబున కత్వంబగు 38.

నీవు ధన్యుఁడవు-నేను ధన్యుఁడను - మీరు ధన్యులరు-మేము ధన్యులము. ఇకారంబుమీఁది ఉ - ను - వు - క్రియావిభక్తులయుత్వంబున కిత్వంబగు ననుసూత్రముచేత వునుల కిత్వంబగు నీవు సుకృతివి - నేను సుకృతిని - ఆర్తిహరుఁడ వౌ నినుఁ గొల్తు నంబుజాక్ష. గర్వగరిష్ఠుండగు నన్ను-మీరలు పెద్దలు-ఇత్యాదులు ప్రాయికగ్రహణముచే రక్షితంబులయ్యె.

38. ఈయాగమంబులు = వు - ను - రు - ము - అనునవి యయియాగమములు పరమగునప్పుడు వానికి ముందున్న ఉకారము అకారముగా మాఱును.

౧ (నీవు ధన్యుఁడు+వు=) నీవు ధన్యుఁడవు' ఇచట నీవు' యుష్మచ్ఛబ్దము ప్రథమైకవచనాంతము ధన్యుఁడు' అనునది దాని విశేషణము కాన అవిశేషణమునకు (33 - సూ) వు' అంతాగమమయినది (38. సూ) పిదప వు' కు ముందున్న ఉకారము (డులోనిది) అకారమైనది

౨ (మీరుధన్యులు+రు) మీరు ధన్యులరు' మీరు' యుష్మచ్ఛబ్ద ప్రథమాబహువచనాంతము కాన దానివిశేషణమగు ధన్యులు' అనుదానికి (33-సూ) రు' అంతాగమమై (38-సూ) లు' లోని ఉకారము అకారముగా మాఱినది.

3 (నేను ధన్యుఁడు+ను=) నేను ధన్యుఁడను' ఇట నేను' అస్మచ్ఛబ్ద

ప్రథమైకవచనాంతము దాని విశేషణమగు ధన్యుఁడు' అనుదానికి (33-సూ) ను' అంతాగమమయి, పిదప (3౪ సూ) డు లోని ఉకారము అకారముగా మాఱినది.

౪ (మేము ధన్యులు+ము) మేము ధన్యులము' మేము' అస్మచ్ఛబ్ద ప్రథమాబహువచనాంతము దాని విశేషణమగు ధన్యులు' అనుదానికి (33-సూ) ము'అంతాగమమయి పిదప దానికిముందున్న లు' లోని ఉకారమునకు (3౪-సూ) అకారమువచ్చినది (నీవు సుకృతి+వు)=నీవు సుకృతివి' అను చోట తి' తరువాతి వు' వి' గా మాఱినది దానికి ఇత్వము తత్సమ-౭౬-వ సూత్రముచే వచ్చినదని గ్రహింపవలె

(నేను సుకృతి+ని=) నేను సుకృతిని అనునప్పుడును మీఁదిరీతినే గ్రహించునది

ఆర్తిహరుఁడవౌ నినుగొల్తు నంబుజాక్ష' అనునపుడు ఆర్తిహరుఁడు' అను ప్రథమైకవచనాంతవిశేషణమునకు వు' వచ్చినది దానివిశేష్యము నిను' అను యుష్మచ్ఛబ్దద్వితీయాంతము విశేష్యము ద్వితీయాంతమైనను విశేషణము ప్రథమాంతమగుటచేత నిచ్చట వు' అంతాగమమయినదని గ్రహింపనగును.

ఈ యాగమములు ప్రాయికముగా (సాధారణముగా) వచ్చునని చెప్పఁబడుటచే నివి రానివియుఁ గలవని తెలియనగు. గర్వగరిష్ఠుం డగు నిన్ను' అనుచోట గర్వగరిష్ఠుండవు అగునిన్ను' అని కాలేదు మీరుపెద్దలు అనుచోట మీరు పెద్దలరు' అనియుఁ గాలేదు.

**ఆదిశబ్దంబునకు వు ను లు పరంబు లగునపుడును సంబోధనంబునందును దాన యనునాదేశం బగు. 3౫.**

నీవు చిన్నదానవు-నేను చిన్నదాన-ఓ చిన్నదాన.

3౫ మీఁది 33 - వ సూత్రముచే యుష్మచ్ఛబ్దమునకు 'వు' అస్మచ్ఛబ్దమునకు ను' వచ్చుచున్నట్టుల - ఆ వు ను' లకు ముందున్న (మహతీవాచకమగు) అది' శబ్దమునకు దాన' ఆదేశమగును అట్లే యుష్మదస్మచ్ఛబ్దములకు సంబోధనమున వచ్చిన అది' శబ్దమునకును దాన' ఆదేశముగా నగును

(నీవు చిన్న+అది+వు=) నీవు చిన్నదానవు' - ఇచట వు' కు ముందున్న అది' శబ్దమునకు స్త్రీ వాచకమునకు దాన' ఆదేశమైనది (నేను చిన్న+అది+ను=) నేను చిన్నదానను' అనుచో ను' కు ముందున్న అది' 'దాన'గా మారినది

(ఓ చిన్న+అది=) ఓ చిన్నదా' - అనుచో సంబోధనమునందు 'అది' కి దాన' ఆదేశమయినది

## అన్యయుష్మదస్మత్కార్యంబులం దుత్తరోత్తరంబు బలీయంబు 3౬.

వారును మీరును ధన్యులరు మీరును మేమును ధన్యులము.

3౬ అన్య యుష్మ దస్మత్కార్యంబులు=ప్రథమ-మధ్యమ ఉత్తమ పురుషములకగు కార్యములు ఉత్తరోత్తరంబు = (క్రమముగా) ఒకదానికంటె దానికరువాతిది బలీయంబు = ప్రబలము ప్రథమ మధ్యమోత్తమపురుష కార్యములకు ఒక్కయెడ సమావేశము కలిగినపుడు వానిలో మొదటిదానికంటె రెండవది దానికంటె మూఁడవది బలముకలదగు అనఁగా-ఒకవాక్యమునందు ప్రథమ మధ్యమపురుషములకుఁ జేరిక కల్గినపుడు క్రియావిధేయ మధ్యమపురుషలో ఏకీభవించును మధ్యమోత్తమపురుషము లున్నప్పుడు క్రియ యుత్తమపురుషమై యుండును

వారును' మీరును ధన్యులరు' అనుచో వారును' అను ప్రథమ పురుషముకంటె మీరును' అనుమధ్యమపురుషము ప్రబలమగుటచేఁ క్రియకు మారువచ్చిన విధేయవిశేషణమునకు మధ్యమపురుషమువచ్చినది. మీరును, మేమును ధన్యులము' అనుచోట మధ్యమపురుషమగు మీరు' కంటెను ఉత్తమ

పురుషమగు 'మేము' ప్రబలమగుటచే క్రియను దెల్పు విధేయవిశేషణము 'ధన్యులు' అనుదాని కుత్తమపురుషము కలిగినది

**ఏకవాక్యంబునం దొకానొక్కఁడు తక్క సర్వపదంబులు క్రమనిరపేక్షంబుగం బ్రయోగింపంజను. 32.**

పూర్వమిది పరమిది యను నియమ మపేక్షింపక వాక్యమం దెల్లపదంబులు వలచినట్లు ప్రయోగింపందగును - ఏని ప్రభృతిశబ్దంబులు కొన్ని నియమ సాపేక్షంబు లయియుండు
గాలి చల్లగా వీచెను-వీచెనుజల్లగా గాలి-చల్లగా గాలి వీచెను వీచెను గాలి చల్లగా - గాలి వీచెను జల్లగా-చల్లగా వీచెను గాలి

32 ఏకవాక్యంబునందు = కర్త కర్మ క్రియలుగల ఒకవాక్యమున; ఒకానొక్కండుతక్క = ఏదో ఒకపదము (ఎని ప్రభృతులలో నొకటి) విడిచి క్రమనిరపేక్షంబుగ = ఇది ముంద ఇది వెనుక అనునియమము లేక

అఖండవాక్యమున ఎని మొదలగు కొన్నిటినివిడిచి తక్కినపదముల నెల్ల నిచ్ఛవచ్చినరీతిని ప్రయోగింపవచ్చును పూర్వపదము=ముందుండవలసిన పదము పరపదము = వెనుకనుండవలసినపదము వలచినట్లు = కోరినట్లు ఎని ప్రభృతిశబ్దములు = ఏని పోలె వలె మున్నగుశబ్దములు నియమసాపేక్షములు = నియమమును కోరినవి - ఇది ముందు ఇది వెనుక' అను క్రమము గలవి

'గాలి చల్లగా వీచెను' అనువాక్యములోని పదములను ముందువెనుకలు చేసి ఎట్లయినను వాడవచ్చును ఉదాహరణములు విపులముగ నీయఁబడినవి 'చంద్రునివలె ముఖము ప్రకాశించు' ననుచో 'వలె' ముందుంచి 'వలె చంద్రునిముఖము ప్రకాశించు'నని చెప్పరాదు ఏని వలె మున్నగువానిని పదములకుముందు స్వతంత్రముగాఁ బ్రయోగింపరాదు.

ఇది కారకపరిచ్ఛేదము

# సమాసపరిచ్ఛేదము ౬

**సమర్థంబులగుపదంబు లేకపదంబగుట సమాసంబు ౧.**

పృథగ్భూతంబులగు నర్థంబుల కేకార్థీభావంబు సామర్థ్యంబు పృథక్ప్రసిద్ధార్థంబులగు పదంబుల కేకార్థంబునందు వృత్తి సామర్థ్యము.

సమాసపరిచ్ఛేదము—ఒకదానికంటె ఎక్కువపదములు సమాసముగా (సంక్షేపముగా) ఒక్కపదమగుట సమాసము సమాసములంగూర్చి తెలుపు గ్రంథభాగము సమాసపరిచ్ఛేదము

౧ సమర్థంబులగు పదంబులు = (ఏకార్థీభావరూపమగు) సామర్థ్యము గల పదములు ఏకపదంబగుట = ఒక్క (అఖండ) పదమగుట రెండునుగలిసి ఒకపదమగుటకుఁ దగిన సామర్థ్యముగల పదములుచేరి ఒక్కపదముగామారుట సమాసమని అర్థము.

సామర్థ్యము రెండువిధములు ( ) వ్యపేక్ష (2) ఏకార్థీభావము. వీనిలో వ్యపేక్ష సామాన్యముగా వాక్యములయం దుండును ఏకార్థీభావ సామర్థ్యముమాత్రము సమాసములం దుండును

రాజుయొక్కపుత్రుఁడు' అను వాక్యమున పుత్రుఁడు' అని చెప్పిన తోడనే ఎవరియొక్కపుత్రుఁడు?' అను నాకాంక్ష (ప్రశ్న) కలుగఁగా రాజుయొక్క' అను పదార్థము సమాధానముగా వచ్చుచున్నది, కావున పుత్ర' పదము నర్థమునకును 'రాజ' పదము నర్థమునకును పరస్పరము ఆపేక్షవలన సంబంధముకలదు తమతమ యర్థములను దెలియజేయు పదములకు ఆకాంక్ష వలనఁ బరస్పరముగల సంబంధము వ్యపేక్ష' అను లక్షణ మిచట సరిగా సరిపోయినది

సమాసమునకు సంబంధించిన సామర్థ్యము వ్యపేక్షకాదు మఱి ఏకార్థీభావసామర్థ్యము దానిలక్షణమే 'పృథగర్థకంబులగు' అనువాక్యమునఁ జెప్పఁబడినది పృథగర్థకంబులగు నర్థంబులు=వేర్వేఱుగా నున్నయర్థములు, కలయికలేక ఎవాని కవి వేఱుగా నున్న యర్థములు కలసి, ఏకార్థమగుట (ఏకార్థీభావ) సామర్థ్యము 'రాజుకొడుకు' అను సమాసమున వేర్వేఱుగాఁ దమతమయర్థములను దెలుపుచున్న 'రాజు' 'కొడుకు' అనురెండుపదములు కలవు ఈరెండుపదములయర్థములును గలిసి యేకార్థీభావసామర్థ్యమున 'రాజుయొక్క కొడుకు' అను నొకేయర్థమును బోధించుచు న్నది కావున నిది సమాసమైనది [సమాసమునందు విభక్తులకు లోపమగును ఇక్కడ 'రాజుయొక్క కొడుకు' అని తొలుతనుండఁగా 'యొక్క' కు [సమాసమున లోపము కలిగినది ]

పృథక్ప్రసిద్ధార్థంబుల — సామర్థ్యమునకుఁ బయిరీతిని లక్షణము చెప్పినను మొదలఁ గొన్నిచోట్ల కుదురకున్నది. 'పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుపన్పిని' అనుచోట 'ధర్మసుతుపన్పు' అనునది సమాసము ఇక్కడ 'పార్థివప్రాగ్రసరుండు' ధర్మసుతుఁ డగునుగాని 'ధర్మసుతుని పన్పు' కాదు అర్థము కుదురుటకయిపుయివిశేషణమును 'ధర్మసుతుపన్పు' అనుసమాసములోని భాగమగు (ఏకదేశమగు) ధర్మసుతు నితో అన్వయింపవలెను ఇచ్చట ఏకార్థీభావమే గాక, వ్యపేక్షకూడ నున్నది కావుననే ఇట్టివానిని సాధించుటకొఱకుఁ గొన్నిచోట్ల రెండువిధములగుసామర్థ్యమును సమాసమునం దంగీకరింపఁబడు' నని తెలుపుచు సామర్థ్యమునకు మఱియొకలక్షణము వ్రాయఁబడుచున్నది

పృథక్ప్రసిద్ధార్థంబు లగుపదంబులకు=వేఱుగాఁ బ్రసిద్ధములైన యర్థమును దెలియఁజేయుపదములకు ఏకార్థంబుగాను వృత్తి=ఒకే యర్థమునందు ఉనికి-వివిధపదార్థములను బోధించుచు స్వతంత్రములై వెలయు శబ్దములు కలిసి ఏకపదార్థ బోధకములగుటయు సామర్థ్యమని భావము

పయిరీతిలక్షణము నంగీకరించుటచే పార్థివప్రాగ్రసరుండు ధర్మసుతుని యొక్క పుత్రుఁ అనువాక్యమునందువలె ధర్మసుతుపుత్రుఁ అనుసమాసమునందును పార్థివప్రాగ్రసరుండు' అనునది ధర్మసుతు' తో విశేషణవిశేష్యభావముతోఁ గలుగుచున్నది ఇచట వేర్వేఱుగానున్న పార్థివప్రాగ్రసర, ధర్మసుత' పదములు కలసి పార్థివప్రాగ్రసరుఁ డగుధర్మసుతు' డను నేకార్థమును బోధించుచున్నవనుట స్పష్టమేకదా

## సాంస్కృతికాచ్ఛికమిశ్రభేదంబుచే సమాసంబు త్రివిధంబు ౨.

సాంస్కృతికంబని యాచ్ఛికంబని మిశ్రంబని సమాసంబు త్రివిధంబు అందు సాంస్కృతికంబు సిద్ధంబని సాధ్యంబని ద్వివిధంబు కేవల సంస్కృతశబ్దంబులసమాసంబు సిద్ధంబు నాఁబడు. రాజాజ్ఞ-తటాకోదకము - లక్ష్మీవల్లభుఁడు. సంస్కృతసమంబుల సమాసంబు సాధ్యంబునాఁబడు రాజునాజ్ఞ - తటాకంబునుదకము - లక్ష్మివల్లభుఁడు. తక్కిన తెనుఁగుల సమాసం బాచ్ఛికం బనంబడు తేనియానలి-చెలువునీరు-సిరిచెలువుఁడు - ఉభయంబులు గూడినది మిశ్రంబనంబడు రాజుముదల-చెలువునుదకము-సిరివల్లభుఁడు.

౨ సమాసము మూఁడువిధములు—

(1) సాంస్కృతికము (2) అచ్ఛికము (3) మిశ్రము

కేవల సంస్కృతపదములకుఁగాని కేవల తత్సమపదములకుఁగాని కలుగు సమాసము సాంస్కృతికము సంస్కృతపదముల కగు సమాసము సిద్ధము. (ఉదా— రాజాజ్ఞ మున్నగునవి-ఇందు సమాసము చివరమాత్రము తెలుఁగుప్రత్యయములు చేరుచుండును)

తత్సమపదముల కగుసమాసము సాధ్యము. (ఉదా— రాజు నాజ్ఞ

మున్నగునవి (ఇట రాజు' ఆజ్ఞ అనుపదములు రెండును తత్సమములు. వానికి సమాసముకల్గినది ) అచ్చ తెనుఁగుపదముల కగుసమాసము ఆచ్ఛికము. ఉదా — చేనియానతి' మున్నగునవి (ఇట సమాసముపొందినపదములు రెండును ఆచ్ఛికములె )

ఉభయములు=తత్సమము ఆచ్ఛికమును —తత్సమములకును ఆచ్ఛికములకును గలుగుసమాసము మిశ్రము. (ఉదా — రాజుముదల' ఇచట 'రాజు' తత్సమము ముదల' ఆచ్ఛికము ఈరెండిటికిని ఇచట సమాసమైనది )

## తత్పురుషాదులకు లక్షణంబు ప్రాయికంబుగ సంస్కృతోక్తంబ యగు. 3.

తత్పురుష బహువ్రీహి ద్వంద్వంబులని సమాసంబులెల్లం ద్రివిధంబులయియుండు అవి ప్రాయికంబుగా నుత్తరాన్యోభయపదార్థప్రధానంబు లయియుండు అందుఁ దత్పురుషంబు వ్యధికరణంబని సమానాధికరణంబని ద్వివిధంబు ద్వితీయాదులకు మీఁదిపదంబుతోడ సమాసంబు వ్యధికరణంబు నాఁబడు. నెలతాల్పు - నెలతక్కువవాఁడు - దేవరమేలు - దొంగభయము - రామునిబాణము - మాటనేర్పరి. విశేషణంబునకు విశేష్యంబుతోడ సమాసంబు సమానాధికరణంబు నాఁబడు ఇదియె కర్మధారయంబు నాఁబడు సరసపువచనము - తెల్లగుఱ్ఱము-మంచిరాజు ఇది సంఖ్యాపూర్వంబు ద్విగువునాఁబడు ముజ్జగములు - ముల్లోకములు. బహువ్రీహి - ముక్కంటి-చలివెలుఁగు ద్వంద్వము - తల్లిదండ్రులు - అన్నదమ్ములు ప్రాయికంబుగా ననుటచే సంస్కృతలక్షణంబు దొడరని సమాసంబుం గలదని సూచింపంబడియె దానంజేసి చిగురుఁగేలు - జుంటి

మోవి యిత్యాదులయిన యుపమాన పూర్వపదకర్మధారయం బులు గ్రాహ్యంబులు ముఖపద్మము - చరణకమలములు - ఇట్టి యుపమానోత్తరపదంబులు గలవుగాని విపరీతంబులు సిద్ధం బులు లేవని యెఱుంగునది సిద్ధంబు సర్వంబు గ్రాహ్యంబు-రాజ పురుషుఁడు - నీలోత్పలము - పీతాంబరుఁడు - రామలక్ష్మణులు కేవలసంస్కృతశబ్దము వికృతిశబ్దముతోడ సమసింపదు దానం జేసి యనేకమాఱు లల్పదం డిత్యాదులు దుష్టములని తెలియు నది.

3 తత్పురుషాదులకు=తత్పురుష మన్నగుసమాసములకు- తత్పురుష-బహువ్రీహి-ద్వంద్వము' అనుమూఁడింటికిని ప్రాయికంబుగ=సాధారణముగా సంస్కృతోక్తంబు=సంస్కృతమునందుఁ జెప్పినట్టుగానే తెలుఁగనను సం స్కృతమునందువలె సమాసములు మూఁడువిధములుగా నున్నవి అవి- తత్పు రుష-బహువ్రీహి ద్వంద్వము' అనునవి. తత్పురుషాదులకు సంస్కృతవ్యాకర ణమునందే లక్షణములు చెప్పఁబడియున్నవో తెలుఁగునందును సాధారణ ముగా ఆలక్షణములే యుండునని భావము ఆలక్షణము లిట్లున్నవి

సమాసమును బొందుపదములలో రెండవపదము ప్రధానముగాఁ గలది తత్పురుషము ఆతత్పురుషము (1) వ్యధికరణతత్పురుషము (2) సమానాధి కరణతత్పురుషము అని రెండువిధములు

ద్వితీయ మొదలు సప్తమివఱకుఁగలవిభక్తులను మీఁదిపదములతోఁ గల్గు సమాసము వ్యధికరణ మనఁబడును. (నెలను+తాల్పు) (తాల్చినవాఁడు) = నెలతాల్పు ఇచట ద్వితీయకు తాల్పు' అను నుత్తరపదముతో సమాసము

[వ్యధికరణ మనఁగా వేర్వేఱు ఆధారములుకలది ఇందు పేరదము యొక్క అర్థము ఆపదమునందే నిలిచియుండు నెలతాల్పు' అనుచోట నెల అనుపదముయొక్క అర్థము నెలయందును తాల్పు' పదముయొక్క యర్థము

తాల్చినవానియందును నిలిచియున్నది కాని 'నెల' యొక్కయర్థము
'తాల్పు' పైనిగాని 'తాల్పు' అర్థము 'నెల' పైనిగాని ఆధారపడియుండ
లేదు కాన ఈరెండిటి యాధారములును విభిన్నములైనవి ఇట్లేవిభక్తుల కగు
సమాసము లన్నింటియందును వ్యధికరణమే యుండును ]

(నెలచే+తక్కువవాఁడు=) 'నెలతక్కువవాఁడు' తృతీయ కుదా
హృతి (దేవరకొఱకు+మేలు=) 'దేవరమేలు' చతుర్థి కుదాహరణము

(దొంగవలన+భయము=) 'దొంగభయము' - పంచమి కుదాహృతి

(రామునియొక్క+బాణము=) 'రామునిబాణము' - షష్ఠి కుదా
హరణము (మాటయందు+నేర్పరి=) 'మాటనేర్పరి' - సప్తమి కుదాహృతి

విశేషణము విశేష్యముతోఁ గలియుసమాసము సమానాధికరణము
ఉదా — 'సరసపువచనము' ఇచట 'సరసము' విశేషణము 'వచనము' విశేష్య
ము వీని కగుసమాసము సమానాధికరణ మనఁబడును.

[సమానమైన (భేదములేని) ఆధారముకలది సమానాధికరణము

'సరసపువచనము' అనుచోట 'సరసము' పదముయొక్క యర్థమును
'వచనము' అనుపదముయొక్క యర్థమును 'వచనము' నందే ఆధారపడి
యున్నది. 'సరసత్వము' వచనము నాశ్రయించియే యుండవలెను గాని
స్వతంత్రముగా నుండఁజాలదుకదా ఇట్లే విశేషణ విశేష్యభావ మున్న
చోట్లన్నింటను సమానాధికరణ మని గ్రహించునది

సమానాధికరణమునకు 'కర్మధారయము' అనిపేరు వ్యధికరణమునకు
'తత్పురుషము' అనువ్యవహారము ప్రసిద్ధము. 'తెల్లగుఱ్ఱము' 'మంచిరాజు'
అనునవియును కర్మధారయకే ఉదాహృతులు

ఇది = సమానాధికరణము సంఖ్యాపూర్వంబు=పూర్వపదము సంఖ్యా
వాచకము గాఁగలది సంఖ్యావాచకమగువిశేషణముతో విశేష్యము సమసించు
నేని ద్విగుసమాస మనఁబడును (మూఁడు+జగములు=) 'ముజ్జగములు' అనుచో
విశేషణమగు 'మూఁడు' శబ్దము సంఖ్యావాచకము ఇట్లే 'ముల్లోకములు' ను.

మీఁదఁ జెప్పఁబడిన తత్పురుష - కర్మధారయ - ద్విగు' సమాసములు మూఁడింటను ఉత్తరపదమే ప్రధానము ఎట్లన— నెలతాల్పు' సరసపు (వచనము మజ్జగములు' అనుచోట్ల మనకు ముఖ్యమైనవి తాల్పు వచనము జగములు ను నెల' మున్నగునవి అప్రధానములు

బహువ్రీహిసమాసము ఇతరపదము ప్రధానము గాఁగలది —అనఁగా అందు సమాసమును బొందుపదములలో నేదియుచు ప్రధానముకాదు వాని కంటె వేఱగుపదము ముఖ్యమైయుండును

(మూఁడు+కన్నులు కలవాఁడు=) ముక్కంటి ఇచ్చట మూఁడు' కన్నులు, అనుపదములు రెండును సమాసమును బొందుచున్నవి. కాని అవి ప్రధానములు కావు. విలయన మూఁడైన కన్నులు' ఇచ్చట కోరఁబడ లేదు. మూఁడుకన్నులు గలవ్యక్తి శివుడు ఇచట ముఖ్యము అపదము సమాసమునుబొందుపదములు రెండింటికంటెను వేఱైనది

[సమాసము మొత్తముమీఁద కలవాఁడు కలవారు కలది కలవి అను యర్థములు వచుశబ్దములు లేకయే వచ్చినయెడల బహువ్రీహిసమాసమని తెలియనగును ] [చలి+వెలుఁగు (కలవాఁడు)=] చలివెలుఁగు' అనునదియు నిట్లే

ఉభయపదార్థప్రధానము ద్వంద్వము అనఁగా ద్వంద్వమున సమాసమునుబొందు పదములన్నియును ప్రధానము లయియుండును.

(తల్లియు+తండ్రియు=) తల్లిదండ్రులు.' తల్లిదండ్రులు వచ్చిరి' అనునపుడు వారిద్దఱును వచ్చిరని యర్థము వారిద్దఱిలో ఎవరో యొకరు వచ్చిరని అర్థముకాదు. కావున తల్లి తండ్రి' అనుపదములు రెండును ఇచట ముఖ్యములే. [ద్వంద్వసమాసమున సమాసము బొందుపదముల చివర సముచ్చయార్థకములగు యు. ను' అనునవి (వ్యాపేక్షయందు-వాక్యరూపముగ నున్నపుడు) చేరుచుండును ]

ప్రాయికంబుగా—తత్పురుషాదులకు లక్షణము తఱచుగా సంస్కృత మునకుఁబోలె ఉండుటచే సంస్కృతలక్షణముపొందని సమాసములును తెలుఁగునఁ గలవని తెలియుచున్నది సంస్కృతమున ఉపమానోత్తరపదకర్మ ధారయముగలవు కాని ఉపమానపూర్వపదకర్మ ధారయలు లేవు

[ఉపమానము రెండవపదముగాఁగలది ఉపమానోత్తరపదము] ఉదా - ముఖపద్మము చరణకమలము ఇచట ముఖము చరణము-'అనునవి ఉప మేయములు-వర్ణ్యములు-పోలికనుపొందునవి పద్మము కమలములు' ఉప మానములు-పోలికకాధారమైనవి. పయి ఉదాహరణములలో ఉపమేయము పూర్వపదములుగాను ఉపమానము లుత్తరపదములుగాను ఉన్నవి సంస్కృత మున ఇట్టి సమాసములే ఉండును

[ఉపమానము తొలిపదముగాఁగలది ఉపమానపూర్వపదములు ఉదా - చిగురుఁగేలు జొంటిమోవి'-ఇచట చిగురు జున్ను' అనునవి ఉపమానము అవి పూర్వపదము కేలు మోవి' అనునవి ఉపమేయములు ఉత్తరపద ములు ఉపమానము మొదటిపదముగాఁగల యీఁదిరీతిసమాసములు తెలుఁగు లోనే గాని సంస్కృతమున లేవు

విపరీతంబులు=ఉపమానపూర్వపదంబులు సిద్ధంబులు=సంస్కృత వ్యా కరణము ననుసరించి సిద్ధించునవి ఇట్టివానిని తెలుఁగున వాడవచ్చునని ఉదా హరింప బడుచున్నది (రాజుయొక్క+పురుషుఁడు=) రాజపురుషుఁడు' ఇది వ్యధికరణమున (తత్పురుష) కుదాహృతి, నీలమైన+ఉత్పలము=) నీలోత్ప లము' ఇది సమానాధికరణమున (కర్మధారయ) కుదాహరణము

(పీత+అంబరము (కలవాఁడు=) పీతాంబరుఁడు'-ఇది బహువ్రీహి కుదాహృతి (రాముఁడును లక్ష్మణుఁడును=) రామలక్ష్మణులు'-ఇది ద్వంద్వ మున కుదాహరణము

కేవల—తత్సమములకే ఆచ్ఛికములతో సమాసముగునుగాని కేవల సం స్కృతశబ్దములకు సమాసముగలుగదు కావుననే-'అనేకమాఱులు అల్పదండు

మున్నగునవి అసాధువులు ఇచట అనేక అల్ప అనునవి సంస్కృతశబ్దములు వానికి మాఱులు దండు' అను నచ్చతెలుఁగు పదములతో సమాసము చేయ రాదు

## ఆ ఈ ఏ యను సర్వనామంబులు త్రికంబు నాఁబడు. ౮.

౮ త్రిక మనఁగా మూఁడింటిసమూహము ఆ-ఈ-ఏ అను మూఁడు సర్వనామశబ్దములకును త్రికము' అని సంజ్ఞ.

## కర్మధారయంబు త్రిక స్త్రీసమ ముగంత ధాతుజవిశేషణ పూర్వపదంబయి యుండు ౯.

ఆచందము - ఈచిందము - ఏబ్బందము - వాఁడిమాట - పోఁడిపాట - బెడిదపుటడిదము - మడిసెడుపడములు. ఈనియమముచే బల్లిద్దుఁడు-మల్లుఁడు - కావలుఁడు - రావణుఁడు-ఇత్యాద్యుల సమాసంబులేదు

౯. కర్మధారయము=విశేషణ విశేష్యముల కగుసమాసము త్రికము= ఆ ఈ ఏ-అను సర్వనామములు స్త్రీసమము=ప్రథమైకవచనము లోపించిన అచ్చతెలుఁగుశబ్దము ముగంతము=తత్సూ ౪౦-సూ అనుసరించి ముగాగమమువచ్చిన శబ్దము ధాతుజవిశేషణము=ధాతువులవలన నేర్పడినవిశేషణ-ములు-'ఎడు' మున్నగునవి చివరఁజేరునవి.

కర్మధారయసమాసమున విశేషణముగానుండు మొదటిపదము త్రికమైనను కావలెను స్త్రీసమమయినను కావలెను ము' చివరవచ్చునదియైనను కావలెను లేక ధాతుజవిశేషణమయినయైన నుండవలెను అట్టివిశేషణమునకే విశేష్యముతో సమాసము కలుగునని భావము.

ఆచందము, ఈచిందము ఎబ్బందము' అనుమూఁడును త్రికము విశేషణముగా నుండుటకు ఉదాహరణములు.

'వాఁడిమాట పోఁడిపాట' అనునవి స్త్రీసమములు విశేషణము లగుట

కుదాహృతులు (బెడిదము + అడిదము=) బెడిదపుటడిదము' అననది ముగంత విశేషణమున కుదాహరణమని గ్రహింపవలెను ముగంతపదముచే ము' ప్రత్యయమునుగూడ గ్రహింపవలెనని యీ ఉదాహరణమునుబట్టియే తెలియఁ చున్నది. [ బెడిదము' లోని ము' ప్రత్యయముకాని ముగాగమము కాదు ] ఈ ముకారమునకు సంధి-3౭-సూత్రమున పు' ఆదేశమును ౫౮ సూత్రముచే టు' గాగమమును వచ్చినవి బెడిదపుటడిదములు' అనుబహువచనాంతమగు ఉదాహరణమున విశేషణము ముగంతమగును ఎలయన -బహువచనమున ము' ప్రత్యయముకాదు (మడియు + ఎడు + దదములు=) మడిసెడుపదములు' అనుచో మడిసెడు' అనునది ఎడు' అంతమైన ధాతుజవిశేషణము

ఈనియమముచేఁ కర్మధారయమునఁ బూర్వపదమగు విశేషణము త్రికాదులలో నొకటి యయియుండవలయు ననునియమము చేయుంటంబట్టి బల్లిదుఁడు మల్లుఁడు' అనుచో బల్లిదుఁడు' విశేషణమైయున్నను త్రికాదులలోఁ జేరమింజేసి ఉత్తరపదముతో సమాసము పొందలేదు. ఇట్లే కావలుఁడు రావణుఁడు' అనుచోటను సమాసములేదు మీఁదివి ముమ్మతములు

స్త్రీసమఘటితంబ యొకానొకండు బహువ్రీహి
చూపట్టెడు. ౬

ముక్కంటి-వేగంటి-చలివెలుఁగు - వేవెలుఁగు-మోటబరి -
ఇత్యాదులు వ్యవహారసిద్ధంబులు గ్రాహ్యంబులు.

౫ స్త్రీసమఘటితంబు = స్త్రీసమముతోఁ గూర్చ బడినదియే సమాసములోని విశేషణవిశేష్యములమీఁది ప్రథమైకవచనములోపించిన బహువ్రీహి యొకానొకటి కనఁబడుచున్నదనిభావము.

(మూఁడు + కన్ను(లు) + (కలవాఁడు=) ముక్కంటి) ఇచట మూఁడు, కన్నులు' అనుపదములు రెండును స్త్రీసమములు ఈ పరిచ్ఛేదములోని ౧౪ - వ సూత్రముచే మూఁడు' లోని డు' పోయి కన్ను' లోని క'

క్క' గా మాఱును ౧3 - వ సూత్రముచే మా' హ్రస్వముగా మాఱి ము అగును. ౨౨-వ సూత్రముచే న్న' కు టి' అగును అచ్ఛిక 33 - వ సూ అనుసరించి టి' కి ముందు నిండుసున్న చేరును (వే+కన్నులు కల వాఁడు=) వేఁగంటి' (వే అనుదానికి సమాసములో వేయి' అని యర్థము) ఇచటను సమాసముఁబొందు రెండుపదములును స్త్రీసమములు తక్కిన ప్రక్రియ మీఁదివలెనే గ్రాహ్యము (చలి+వెలుఁగు+(కలవాఁడు)=) చలివెలుఁగు' (వే+వెలుఁగు(లు కలవాఁడు)=) వేవెలుఁగు' అనునవియునిట్టే

మోట+బరువు+(కలవాఁడు=) మోటబరి' ఇచట ౨౨ - వ సూత్రముచే ఇ' వచ్చి వు లోపించి (బరు+ఇ=) బరి అయి మోటబరి' అని యేర్పడినది

మీఁది యన్నింటను అన్యపదమే ప్రధానము పయిరీతిసమాసములను కవులప్రయోగముల ననుసరించియు వ్యవహారము ననుసరించియు గ్రహింప వగును.

## ఆచ్ఛికశబ్దంబుతోడ స్త్రీసమంబు ప్రాయికంబుగా ద్వంద్వంబగు.(2.)

అన్నదమ్ములు - తల్లిదండ్రులు - ఊరువల్లెలు - ఆలుమగలు, మగఁడును బిడ్డలును - పల్లమును - గ్లైమును-ఇత్యాదులు సమసింపవని యీనియమంబున నెఱుంగునది.

2 సాధారణముగా ద్వంద్వసమాసమున మొదటిశబ్దము స్త్రీసమము గాను తర్వాతిశబ్ద మాచ్ఛికశబ్దముగాను ఉండునని భావము.

(అన్న+తమ్ముఁడు=) అన్నదమ్ములు' ఇచట అన్న' స్త్రీసమము తమ్ముఁడు' అచ్ఛికము. కావున నీరెండిఁటికిని సమాసమైనది తల్లిదండ్రులు' మున్నగునవియు నిట్టే.

మగఁడును బిడ్డలును' అనుచో మగ' శబ్దము స్త్రీసమము కాదు డుమంతము. కల్లమును గల్లెమును' అనుచో కల్లము' ము ప్రత్యయాంతము కాని స్త్రీసమముకాదు కాన వీనికి సమాసము కాలేదని గ్రహింపవలెను

## సర్వశబ్దంబులు సంబంధంబునందు దచ్ఛబ్దంబులోడ సమసించు. ౮.

నావాఁడు - నాయది - ఇంటివాఁడు - ఇంటిది - రాముని వాఁడు-రామునిది.

౮ సర్వశబ్దములు = శబ్దములన్నియుఁను తచ్ఛబ్దంబులోడ = ఆ శబ్దములోడ అది అవి వాఁడు వారు మున్నగువానితో సమసించు సమాసమును పొందును అనఁగా—అన్నిశబ్దములును సంబంధార్థమునందు తచ్ఛబ్ద పర్యాయములగువ నితో సమాసమునుపొందునని భావము

(నాయొక్క + వాఁడు=) నావాఁడు' ఇచట నాసంబంధమైనవాఁడు' అని యర్థము కాన నా' శబ్దముతో తచ్ఛబ్దమైన వాఁడు' సమాసమును పొందినది ఇట్లే తక్కినయు.

నాయది' అనుదానికి నాది' అనురూపాంతరముండును (చూ సంధి. ౪౫) రామునిది' అనుచోటను అకార లోపము సంధి. ౪౫-వ సూత్రము చేతనే యనుగ్రహించునది.

## ధాతుజవిశేషణంబులకు విభక్తి వివక్షించునపుడు తచ్ఛబ్దంబను ప్రయుక్తం బగు. ౯.

వచ్చినవాఁడు - వచ్చినది - రానివాఁడు - రానియది.

౯. క్రియాజన్యవిశేషణములకుఁను విభక్తి చెప్పఁదలఁచినప్పుడు 'వాఁడు అది' మున్నగు తచ్ఛబ్దములను - విభక్త్యంతమును గూడి ప్రయోగింపఁబడును. అవిశేషణములకుఁ బ్రత్యేకప్రయోగార్హత లేదని భావము

వచ్చినవాఁడు' మున్నగుచోట్ల వచ్చిన' మున్నగుధాతువిశేషణములకు వాఁడు' మున్నగుతచ్ఛబ్దము లనుప్రయుక్తము లగుటను గమనించునది.

**ఎల్లయెడల ధాతుజవిశేషణంబుల కట్టి యనుపదంబు విభాష ననుప్రయుక్తంబగు. ౧౦.**

వచ్చినట్టి రాముఁడు-వచ్చినరాముడు - వచ్చునట్టివాఁడు-వచ్చువాఁడు

౧౦. అన్నిచోట్లను క్రియాజన్యవిశేషణములకు వికల్పముగా 'అట్టి' అనుపదము అనుప్రయుక్తమగును అనఁగా ఆవిశేషణముతోఁ జేరి 'అట్టి' అను పది ప్రయోగింపఁబడును ఉదాహరణములు స్పష్టము.

**యుష్మదస్మదాత్మార్థకంబుల కుత్తరపదంబు పరంబగునపుడు దుగాగమంబు విభాషనగు. ౧౧.**

నీదుకరుణ - నీకరుణ నాదునేరిమి - నానేరిమి. తనదు రూపు-తనరూపు

౧౧ యుష్మదస్మదాత్మార్థంబులకు = నీ - నా - తన' శబ్దములకు, ఉత్తరపదంబు = రెండవ (వెనుక) పదము

వెనుకపదము పరముగానున్నప్పుడు దానికిముందున్న నీ - నా - తన' శబ్దములకు దుక్' (ఇందు మిగులునది దు') ఆగమముగా వచ్చును. ఆయాగమము నీ - నా - తనశబ్దములచివరఁ జేరును ఈయాగమము వికల్పము.

నీదుకరణ' అనుచో నీ' యుష్మదర్థకము ఉత్తరపదము కరుణ' ఆయుత్తరపదము పరమగుటచే నీ' అనుదానిచివర దు' చేరినది ఈ ఆగమము వికల్పమగుటచే ఇది రానప్పుడు నీకరణ' అనియు నగు. ఇట్లే తక్కినయుదాహృతులును.

**గుణవచనంబులగు నల్లామలకుం గర్మధారయంబునందు నిగాగమంబు బహుళంబుగా నగు ౧౨.**

నల్లనిగుఱ్ఱము - నల్లగుఱ్ఱము. నల్ల-తెల్ల-పచ్చ-ఎఱ్ఱ-చామ-తియ్య-కమ్మ-పుల్ల-విన్న-తిన్న-అల్ల-ఇత్యాదులు నల్లాదులు

౧౨ గుణములను దెల్పునట్టి 'నల్ల' మొదలగు శబ్దములకు కర్మధారయ సమాసమునందు 'నిక్' అనునది ఆగమముగా - బహుళముగా నగును (ఇందు 'ని' మాత్రము నిల్చును.) (నల్ల + ని + గుఱ్ఱము =) 'నల్లనిగుఱ్ఱము' ఇది కర్మధారయము 'నల్ల' గుణవాచకము కాన దానికి 'ని' చేరినది ఇది బహుళము కాన ఇదిరానిరూపము 'నల్లగుఱ్ఱము' అనియు నుండును తక్కినవానికిని ఇట్లే యని గ్రహించునది

## ద్విరుక్తంబగుహల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వంబగు ౧౩

౧౩ ద్విరుక్తంబగు హల్లు = ద్విత్వాక్షరము ఆచ్ఛికంబగుదీర్ఘంబునకు = అచ్చ తెలుఁగుపదము దీర్ఘమునకు ద్విత్వాక్షరము పరమగుచో దానికి ముందున్న ఆచ్ఛికపదదీర్ఘము హ్రస్వమగును.

## త్రికంబుమీఁది యసంయుక్తహల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు ౧౪.

అక్కన్య-ఆకన్య. ఇక్కాలము-ఈకాలము ఎల్లోకము - ఏలోకము. అయ్యశ్వము - ఆయశ్వము. బాహుళకముచే నూష్మ రేఫంబులకు ద్విత్వంబు గలుగదు. ఆరూపము-ఈశబ్దము-ఏషండము-ఆసుకృతి-ఆహాయము

౧౪ త్రికంబు = ఆ ఈ ఏ' అనుసర్వనామములు అసంయుక్తంబగుహల్లు = వేఱొకహల్లుతో సంయోగముపొందని-ఒంటరిగా నున్నహల్లు

త్రికంబునకుఁ దర్వాత ఒంటరిగా నున్నహల్లునకు ద్విత్వము బహుళముగా నగును.

(ఆ + కన్య =) అక్కన్య ఆకన్య'

ఇచట ఆ' త్రికము కన్య' లోని క' అసంయుక్త మగుహల్లు. కాన దానికి ద్విత్వమువచ్చి (అ+క్క్-న్య-అయి) నది పిదప ౧౩-వ సూత్రమునను సరించి ఆ (దీర్ఘము) అ' (హ్రస్వము) అయినది ఈవిధిబహుళమగుటచే, పక్షమున ఆకన్య' అనియును నుండును

సూత్రములో బహుళముగా' అని చెప్పఁబడినందున ర-శ-ష-స-హ' లకు ద్విత్వమురాదని యెఱుఁగవలెను కాన అరూపము ఈశబ్దము' మన్నకునది అర్రూపము ఇశ్శబ్దము' మన్నగుటేని కావు

## కృతహ్రస్వంబగు త్రికంబుమీఁది చోటుశబ్దంబునోత్వంబున కత్వహ్రస్వంబులు విభాషనగు ౧౫

అచ్చోటు - అచ్చటు - అచ్చొటు ఇచ్చోటు-ఇచ్చటు-ఇచ్చొటు ఎచ్చోటు - ఎచ్చటు ఎచ్చొటు వీని ద్విత్వంబునకు వక్ష్యమాణవిధిచేఁ బాక్షికంబుగ లోపంబగు అచటు - అచొటు-ఇచటు-ఇచొటు - ఎచటు - ఎచొటు ముచ్చోటులు - ముచ్చటులు-ముచ్చొటులు - అనురూపంబులు ప్రయోగంబులం గానంబడియెడి.

౧౫ కృతహ్రస్వం బగు త్రికంబుమీఁది=౧౩-వ సూత్రముచే హ్రస్వమైన అ ఇ ఎ' శబ్దములకుఁ దరువాతనున్న చోటుశబ్దంబు నోత్వంబునకు= 'చోటు' లోని చకారముమీఁది ఓకారమునకు అత్వహ్రస్వములు= అ ఒ' లు

హ్రస్వములైన త్రికముమీఁద చోటు' ఉన్నచో చో' అనునది 'చ' అనియు చొ' అనియుఁగూడ వికల్పముగా మాఱునని భావము

(అ+చోటు=) అచ్చటు అచ్చొటు అచ్చోటు' (మూఁడ్విధము లగును)

ఇచట (౧౪-వ సూ) చోటు' లోని చో కు ద్విత్వమువచ్చినది. ౧౩-వ సూత్రముచే ఆ' అ' గా మాఱినది పిదప ఈ ౧౫-వ సూత్రముచే

ఓ' కారము అకారము' గా మాఱి అచ్చటు అయినది ఓ' హ్రస్వముగా మాఱి ఒచ్చోటు' అయినది ఈవిధి వికల్పముగాన అచ్చోటు' అనియు నున్నది ఇట్లే ఎచ్చోటు' మున్నగునవియు ఆచ్చోటు' మున్నగువానిద్విత్వమునకు ప్రకీర్ణపరిచ్ఛేదము ౧౨ వ సూత్రము ననుసరించి లోపము వికల్పముగా రాఁగా అచటు, అచోటు' అనియు నగును —

ముచ్చోటులు — ఈసూత్రము ననుసరించి హ్రస్వమైన త్రికము మీఁదనుండు చోటు' శబ్దముయొక్క ఓకారము' నకే అత్వ హ్రస్వములు విధింపఁబడెను కాన మూఁడు + చోటులు' అని యుండునపుడు మూఁడు శబ్దముమీఁది చోటు' శబ్దమునకు అత్వహ్రస్వములు రాకపోవుచున్నవి ప్రయోగములందుమాత్రము ముచ్చటులు ముచ్చోటులు' అను నవి కానఁబడుచున్నవి ఇట్టివానిని ప్రయోగముల ననుసరించి నిర్ణయింపవలె నని భావము

## ఉత్తరపదంబగు చోటశబ్దముటాక్షరమునకు లోపంబు విభాషనగు ౧౬.

చోటుశబ్దం బౌపవిభక్తికంబు గావున దానియంతిమాక్షరంబు సప్తమ్యాదేశమయిన యకారంబుతోడం బాక్షికంబుగ లోపించునని యర్థము అచ్చోనున్నాఁడు - అచ్చోట నున్నాఁడు. ఒకచోనుండె-ఒకచోటనుండె.

౧౬. చోట శబ్దము టాక్షరమునకు=సప్తమియందు ఔపవిభక్తికములకువచ్చు అత్వమాదేశమయి టు' ట' గా మాఱిన చోట' లోని టకారమునకు

సమాసమునందు చోటు శబ్దము ఉత్తరపదమై యున్నప్పుడు దాని సప్తమ్యేకవచనరూపమగు చోట' లోని ట' కారమునకు లోపము వికల్పముగ నగును.

అంతిమాక్షరంబు=చివఱియక్షరము పాక్షికంబుగ=వికల్పముగా

అచ్చోనున్నాఁడు'- ట' లోపించినరూపము అచ్చోటనున్నాఁడు'- ట'-లోపింపనిరూపము ఒకచోనుండె'- ట లోపించినరూపము ఒకచోట నుండె'- ట' లోపింపనిరూపము పయియుదాహరణములలో ఆ ఒక' అను నవి పూర్వపదములు చోటు' ఉత్తరపదము

సమానాధికరణం బగునుత్తరపదంబు పరంబగునపుడు
మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబును
మీఁదిహల్లునకు ద్విత్వంబునగు ౧౨.

మూఁడుజగములు-ముజ్జగములు - మూఁడులోకములు - ముల్లోకములు

౧౨ సమానాధికరణంబు=సమానమైన ఆధారముకలది-ఒకే ఆధారము కలది.

సమానాధికరణమగు ఉత్తరపదము పరమగునపుడు మూఁడు' లోని డు' లోపించును దానితరువాతియక్షరమునకు ద్విత్వమును కలుగును

(మూఁడు + జగములు=) ముజ్జగములు'.

ఇచట మూఁడు జగములు' అనుపదములయర్థముల రెండింటికిని జగములు' ఆధారము దాని తెప్పు జగము' శబ్దము పరముగా నున్నందున 'మూఁడు' లోని డు' లోపించి జ' కు ద్విత్వమువచ్చి మూ' హ్రస్వమయి (౧౩ సూ) ముజ్జగములు ఐనది ఇట్లే తక్కినవియును.

ద్విగువున కేకవచనంబు ప్రాయికంబుగానగు
మిశ్రంబునకుఁ గాదు ౧౪.

ముచ్చిచ్చు-ముక్కారు-ముప్పాతిక - ముత్త్రోవ - ముద్విదములు.

౧౪ తొలిపదము సంఖ్యావాచకముగాఁ గల కర్మధారయమే ద్వి

గువు ఆద్వగు వెల్లపుడును సామాన్యముగా ఏకవచనాంతమయియుండును మిశ్రసమాసమైనపుడుమాత్రము బహువచనాంతమై యుండును

(మూఁడు + చిప్పలు =) ముచ్చిప్ప'

ఇచట ౧౭-వ సూత్రముచే డు' లోపించి చి' కి ద్విత్వమగును. ౧౩-వ సూత్రమునుబట్టి మూ' హ్రస్వమయి ఈసూత్రముచే ఏకవచనము కలుగును.

ముక్కారు' మున్నగునవియు నిట్టే.

(మూఁడు + విధములు =) మువ్విధములు'-ఇచట తక్కినవంతయు సమానమే కాని యిది మిశ్రసమాసమగుటచే ( మూఁడు' తెలుఁగు విధములు' తత్సమము.) ఏకవచనము రానందున 'మువ్విధము' అని కాదు

**కొండొకచో సమాసంబులందు నామ్వాది కనుమ్వాదుల ము వర్ణంబులు పఞ్వర్ణంబు లగు. ౧౯.**

నాఁపచేను-పాఁపతేఁడు కనుపపులు - జనుపనార. నాము - పాము-ప్రేము-వేము-అమ్ము-ఎమ్ము-ఇవి నామ్వాదులు. కనుము - ఇనుము-ఉదుము-ఎనుము-జనుము - మినుము - ఇత్యాదులు కనుమ్వాదులు.

౧౯ కొండొకచో=కొన్నిచోట్ల నామ్వాదికనుమ్వాదులు= నాము' మున్నగునవియు కనుము' మున్నగునవియును

కొన్నిచోట్ల సమాసములందు నాము' మున్నగువాని ము' వర్ణమునకు పఞ్' వచ్చును [ఇది జిత్తు ఇందు ప' మిగులును జిత్తుబిందుపూర్వంబగు' ననునియమముచే ముందు అనుస్వారము వచ్చుచుండును ]

కనుము' మున్నగువానికి ముకారమునకు ప' ఆదేశమగును.

(నాము + చేను =) నాఁపచేను' ఇచట ము' కారమునకు ప' వచ్చినది. అది జిత్తగుటచే ముందు అఱసున్నతో వచ్చినది దీర్ఘముమీఁద సాధ్య

పూర్ణము నిషిద్ధముగాన నిండుసున్న రాలేదు ఇట్లే పాఁపఱేఁడు (కసము + పులు=) కసపపులు' అనుచో కసము' లోని ము' కు ప' వచ్చి నది జనుపహార' మున్నగునవియు నిట్టే.

## నిక్కాలాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౨౦.

నిక్కాల-కవ్వడి-పువ్విలుకాఁడు. ఇత్యాదులు.

౨౦. నిక్కాల' మొదలగుసమాసములందయిన వర్ణలోపము, వర్ణ ద్విత్వము మున్నగునవి ప్రయోగముల ననుసరించియే గ్రహింపఁదగియున్నవి కాని ఒకనియమముచే వానిని దెలుప నవకాశములేదని సూత్రాభిప్రాయము. (నిక్కము+కల=) నిక్కాల' ఇది కర్మధారయము ఇందు మొదటిపదమున మొదటియక్షరమే మిగిలి ఉత్తరపదము తొలియక్షరమునకు ద్విత్వమైనది. (కవ+వడి+) (కలవాఁడు=) కవ్వడి'-బహువ్రీహిసమాసము జంట (చేతుల) వడిగలవాఁడని యర్థము ఇచట కవ' లోని క' మిగిలి రెండవపదము తొలి యచ్చునకు ద్విత్వము వచ్చినది

(పువ్వు+విల్లు+కాఁడు=) పువ్విలుకాఁడు'-అనుచో తొలిపదమున ఆద్యక్షరశేషమును ఉత్తరపదాద్యక్షరమునకు ద్విత్వము నగుటయేకాక విల్లు' లోని ల్లు' అనుసంయుక్తవర్ణములోని ఒకలకారము లోపించినది

ఇట్టివానిని ప్రయోగానుసారముగా గ్రహింపనగునని భావము.

## ఆకారంబున కామ్రేడితంబునకుం దదర్థకంబున కయి యాయి యనుశబ్దంబులు విభాషనగు. ౨౧.

వక్ష్యమాణవిధిచేత నయి యనుదానికై కారాదేశంబునగు. ఆయయికాలము - ఆయాయికాలము-అయ్యయికాలము - అయ్యాయికాలము - అయైకాలము - అయ్యైకాలము - ఆయా కాలము - ఆయక్కాలము - అయ్యాకాలము-అయ్యక్కాలము.

౨౧. తదర్థకంబునకు=('ఆ' అను) తచ్ఛబ్దము అర్థముగాఁగలదానికిఁ ద్విరుక్తపదముయొక్క రెండవరూపము ఆమ్రేడితము

తచ్ఛబ్దముయొక్క అర్థముకల్గి ఆమ్రేడితమైన అకారము నకు అయి ఆయి అనుశబ్దములు వికల్పముగా ఆదేశములగును అందు అయి'అను దానికి (క్రియా ౧౦౩-వ సూ) బహుళముగా ఐకారము' ఆదేశమగును. వక్ష్యమాణవిధిచే=ముందుఁ జెప్పఁబడఁబోవునియమము ననుసరించి అ+అ+ కాలము' అనియుండఁగా ఇందు రెండవ అకారము' ఆమ్రేడితమగుటను అది తచ్ఛబ్దార్థక మగుటచేతను దానికి అయి' ఆదేశమై సంధి 3-వ సూత్రముచే యడాగమముకల్గి (1) అయయికాలము' అయినది ఆమ్రేడితమునకు ఆయి' ఆదేశమురాఁగా యడాగమముపొంది (2) అయాయికాలము' అయినది

ఆమ్రేడితము (రెండవ అకారము') నకు అయి, ఆయి' ఆదేశము లైనపిమ్మట యడాగమమువచ్చి సమాస. ౧౪-వ సూత్రముచే ద్విత్వమును, ౧౩-వ సూత్రముచే మొదటి అకారమునకు హ్రస్వమును గలుగఁగా (3) అయ్యయికాలము (4) 'అయ్యాయికాలము' అని యగును.

క్రియా ౧౦౩-సూత్రముచే అయి' అనుదానికి ఐకారమాదేశమయి, యడాగమము రాఁగా (5) అయైకాలము' అగును ఆ యై'కారము నకు ౧౪-సూత్రముచే ద్విత్వమును ౧౩-వ సూత్రముచే దానిముందున్న అకారము నకుహ్రస్వమును రాఁగా (6) అయ్యైకాలము' అని యగును

ఈ అయి ఆయి' ఆదేశములు రానిపక్షమున రెండు అకారము'ల నడుమ యకారముచేరి (ఆమ్రేడితమునకు యడాగమమువచ్చి) (7) అయాకాలము' అగును. ఇందలి యా'కు ౧౪, సూత్రముచే ద్విత్వము దాని ముందున్న అకారమునకు ౧౩-వ సూత్రముచే హ్రస్వమును రాఁగా (8) అయ్యాకాలము' అని యగును.

'అయూకాలము' అని యుండఁగా 'యూ' మీఁది 'కకారము' నకు ౧౪-సూత్రముచే ద్విత్వమును, 'యూ' కు ౧౩-సూత్రముచే హ్రస్వమును కలుగఁగా (9) 'అయుక్కాలము' అగును. 'అయుక్కాలము' లోని 'యు'కారము నకు ౧౪-చే ద్విత్వమును, 'అకారము' నకు ౧౩-చే హ్రస్వమును కాఁగా (10) 'అయ్యుక్కాలము' అనియుఁ నగును.

## బహువ్రీహిని సమాసాంతకార్యంబులుం గానంబడియెడి. ౨౨.

ముక్కంటి-కడలిరాచూలి-నలువ-గట్టువిలుతుఁడు.

౨౨. బహువ్రీహిసమాసముల తుదిని వర్ణాదేశము మున్నగు కొన్ని కార్యములు కలుగుట ప్రయోగములనుబట్టి కాన నగునని భావము.

మూఁడు+కన్ను (లుకలవాఁడు)='ముక్కంటి' ఇచట 'టి' అను నది 'న్ను' కుఆదేశమైనది; అచ్చిక. ౩౩-సూత్రముచే 'టి' కి ముందు నిండు సున్నవచ్చినది. ౧౭-సూత్రముచే 'మూఁడు' లోని 'డు' లోపించి 'కన్ను' లోని కకారమునకు ద్విత్వమువచ్చి, ౧౩-వ సూత్రముచే 'మూ' హ్రస్వముగా మాఱినది.

కడలిరాజు+చూలు (కలది) = 'కడలి రాచూలి.' ఇచట 'చూలు' లోని లకారముమీఁది ఉకారమునకు సమాసాంతకార్యమగు ఇకారము కలిగినది. సమాసమున 'రాజు' లోని 'జు' లోపించెను. (నాలుగు+వాయిలు (కలవాఁడు)=) 'నలువ'—ఇచట 'నాలుగు' అనుదానికి 'నాలు' అనియు, 'వాయి' లోని ఇకారమునకు లోపమును కలిగినవి. పిదప 'నలువా' లోని వకారముమీఁది దీర్ఘమునకు సమాసాంతకార్యమగు హ్రస్వమైనది. (గట్టు+విలు+(కలవాఁడు)=) 'గట్టువిలుతుఁడు'—ఇచట 'త' సమాసాంతకార్యము ఆగమమైనది. ఈసమాసపదమునకు 'శివుఁడు' అర్థము. కాన ఇది మహద్వాచక మగుటచే డుజ్ఞును, తకారమునకు ఉత్వమును కలిగినవి.

బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకుఁ బోఁడియగు. ౨౩.

అలరుఁబోఁడి - ననఁబోఁడి - పూఁబోఁడి - విరిఁబోఁడి.

౨౩. బహువ్రీహిని = బహువ్రీహిసమాసమునందు; స్త్రీ. వాచ్యంబగుచో = అఁదుది చెప్పఁబడినపుడు; పోఁడియగు = 'పోఁడి' అనునది ఆదేశముగా వచ్చును.

బహువ్రీహిసమాసము స్త్రీని దెలియఁజేయునపుడు ఉపమానవాచకమగుశబ్దమునకుఁ దరువాతనున్న 'మేను' శబ్దమునకు 'పోఁడి' అనునది ఆదేశముగావచ్చునని భావము.

(అలరు+మేను+(కలది)=) 'అలరుఁబోఁడి' - అలరుఁబోఁడి అనఁగా పూవువంటిదేహముకల స్త్రీ యని యర్థము. ఇది బహువ్రీహి; కాన ఈసమాసము స్త్రీని తెల్పుచున్న దనవలెను. 'అలరు' ఉపమానవాచకము; కాన దానికిఁ దరువాతనున్న 'మేను' 'పోఁడి' గామాఱినది. పిదప సంధి. ౨౧ - వ సూత్రముచే నుగాగమమువచ్చి, పిదప ద్రుతకార్యమయి, బ-బ గా మాఱినది. నిందునున్నవచ్చి 'అలరుంబోఁడి' అనియుఁ గావచ్చును. 'ననఁబోఁడి' మున్నగునవియు నిట్టే.

ద్వంద్వంబునందు ఋకారంబునకు రవర్ణంబు విభాషనగు. ౨౪.

మాత్రపితలు మాతాపితలు - ఇత్యాదులు.

౨౪. ద్వంద్వసమాసమున మొదటిపదము చివరనున్న ఋకారమునకు 'ర' అనునది వికల్పముగా నగును.

(మాతృ+పితలు=) 'మాత్రపితలు', ఇందు 'మాతృ' తొలిపదము. దాని చివరి ఋకారము రేఫముగా మాఱినది. ఇది వికల్పము కాన, ఇది రానపుడు సంస్కృతవ్యాకరణమర్యాద ననుసరించి ఋకారమునకు ఆకారము ('అనఙ్' రాఁగా అందు ఆకారమే మిగులును.) రాఁగా 'మాతాపితలు' అనియును నగును.

సమాసవిభక్తికి లోపంబగు లట్టునకుఁ గాదు. ౨౫.

రామునిబాణములు - సరసపువచనములు- వేవెలుఁగు-గుణ ముల ప్రోక.

౨౫. సమాసము జరుగునపుడు (అంతకుఁబూర్వము) పదముల కు లోపము తద్ధితవృత్తియందును గల్గును. చివఱనున్న విభక్తులు లోపించును. కాని తత్సమ. ౩౧ - సూత్రముచే విధింపఁబడిన బహువచనప్రత్యయమగు లట్టునకు ('ల' కు) మాత్రము లోపముండదు. (రామునియొక్క+బాణములు=) 'రామునిబాణములు'

ఇది షష్ఠీతత్పురుషసమాసము; ఈసమాసమున మొదటిపదముచివఱనున్న 'యొక్క' యు, రెండవపదము చివఱనున్న 'లు' ను లోపించి 'రామునిబాణము' అని యుండఁగా పిదప మొత్తము మీఁద 'లు' ప్రత్యయము, వచ్చి 'రామునిబాణములు' అయినది. 'రాముని' అనుచోటఁగల 'ని' విభక్తి ప్రత్యయము కానందున దానికి లోపమురాలేదు; అట్లె 'బాణము' లోని 'ముగాగమము' నకును (అది ప్రత్యయము కానందున) లోపమురాలేదని గ్రహింపవలెను.

(సరసము+వచనములు=) 'సరసపువచనములు' అనుచోట 'సరసము' లోని 'ము' కు 'పు' ఆదేశమయినది; మువర్ణకమునకు సమాసమునందు పు, ంపులు ఆదేశముగా విధింపఁబడుటచే తత్సామర్థ్యమున మువర్ణకమునకు లోపమురాలేదని గ్రహింపవలెను; తక్కినప్రక్రియ 'రామునిబాణములు' వలెనే యని యెఱుఁగునది. ఇట్లే (వే+వెలుఁగులు+(కలవాఁడు=)'వేవెలుఁగు' అనునదియుఁను; ఇట సమాసమున విభక్తి లోపమువచ్చిన పిదప మొత్తముపయి (సూర్యుఁడని యర్థమగుటచే) ఏకవచనాంతము [illegible] ౨ - సూత్రముచే స్త్రీసమత్వము కల్గినదగుట ప్ర[illegible]

'గుణముల ప్రోక' అను[illegible] 'ము' ప్రత్యయముకానందున లోపింప లేదు. 'ల' లోపింపకపో[illegible] [illegible] కారణము.)

**కర్త్రాదులకుఁ బ్రాధాన్యవివక్షయందు ధాతుజవిశేషణంబులు కర్తతోడంబోలె వానితోడ సమసించు. ౨౬.**

రాముఁడు రక్షించినభృత్యుఁడు - రాముఁడు వాలినేసిన బాణము-రాముఁడు గోవునిచ్చినవిప్రుఁడు - రాముఁడు వెడలిన వనంబు - రాముఁడు వసించినపర్ణగృహము - రాముఁడు వసించిన చోటు.

౨౬. తెలుఁగున ధాతుజవిశేషణములకుఁ గర్తతోడనే ముఖ్యసంబంధ ముండును; కాని కర్త్రాదులతో సంబంధముండదు. కాని కర్తకువలె కర్త్రాదులకుఁ బ్రాధాన్యమును చూపునపుడు ధాతుజవిశేషణములు కర్తతో సమాస మునుపొందినట్లు కర్మ మున్నగువానితోఁగూడ సమసించును.

'రాముఁడు రక్షించిన భృత్యుఁడు—' ఇచట 'భృత్యుని రక్షించిన రాముఁడు' అని యర్థము. రక్షించిన రాముఁడు కర్త. రక్షణమునుపొందిన—రక్షింపఁబడిన భృత్యుఁడు కర్మ; కర్త ప్రధానమగుటచే 'రక్షించిన' అను ధాతుజవిశేషణము దానితోనే సమసించుచున్నది. 'రాముఁడు రక్షించినభృత్యుఁడు' అనునపుడు కర్మకును ప్రాధాన్యము వివక్షింపఁబడినందున దానికిఁ బ్రథమవచ్చినది; ధాతుజవిశేషణము ఆకర్మతో సమసించినది.

'రాముఁడు వాలినేసినబాణము'—అనుచో 'రాముఁడు బాణముచే నేసినవాలి' అనునది మొదటివాక్యము. ఇచట బాణము కరణము; దానికిఁ బ్రాధాన్యవివక్షయందు బ్రథమవచ్చి 'ఏసిన' అనుధాతుజవిశేషణ మాకరణముతో సమసించినది. 'రాముఁడు గోవునిచ్చినవిప్రుఁడు—'అనుచో విప్రుని కొఱకు గోవు నిచ్చినరాముఁడు' అనునది సహజవాక్యము. ఇచట సంప్రదానమగువిప్రునకుఁ బ్రాధాన్యము వివక్షింపగా దానికి ప్రథమవచ్చి 'ఇచ్చిన' అను ధాతుజవిశేషణము దానితో సమసించినది.

'రాముఁడు వెడలిన వనంబు—' అనువెడ వనమునుండి వెడలిన

రాముఁడు' అని తొలుకటివాక్యము. ఇచట అపాదానమగు (విడువడుటకు అవధియగు) వనమునకుఁ కర్తకువలె ప్రాధాన్యము చూపునపుడు ఆశబ్దమునకు ప్రథమవచ్చినది. 'వెడలిన' అనుధాతుజవిశేషణము 'వనము' శబ్దముతో సమ ప్రథమవచ్చినది.

'రాముఁడు వసించినపర్ణగృహము' అనుదానికి పర్ణగృహమునందు వసించినరాముఁడు అనునది సమాజవాక్యము. ఇచట ఆధారమగు పర్ణగృహమునకుఁ ప్రాధాన్యవివక్షయందుఁ బ్రథమవచ్చినది: 'వసించిన' అనుధాతుజ విశేషణము ఆయాధారమునుచెప్పుశబ్దములోడనే సమసించినది. 'రాముఁడు వసించినచోటు' అనుచోడ 'చోటున వసించినరాముఁడు' అనునది సమాజ వాక్యము. అధికరణమగు 'చోటు' నకుఁ ప్రాధాన్యవివక్షయందుఁ బ్రథమయును 'వసించిన' అను ధాతుజవిశేషణముతోడి సమాసమును కలిగినవి.

ఇది సమాసపరిచ్ఛేదము

---

# తద్ధిత పరిచ్ఛేదము.

## తనవర్ణకంబు త్వార్థంబునందగు. ౧.

త్వార్థంబనఁగా భావంబు - ప్రకృతిజన్యబోధంబునందుఁ బ్రకారంబు భావంబు. రామునితనము - రాముతనము-మనుమనితనము-సీతతనము-గొప్పతనము - కొఱతనము-నల్లఁదనము - పుల్లదనము.

తద్ధితపరిచ్ఛేదము—విభక్త్యంతము లగుశబ్దముల (నామవాచకముల) పైని భావార్థము, మతుబర్థము మున్నగునర్థములందు విధింపబడు ప్రత్యయములు తద్ధితములు; వానినిగూర్చి వివరించుభాగము తద్ధితపరిచ్ఛేదము.

౧. త్వార్థంబు = భావము—ప్రాతిపదికార్థములయొక్క ధర్మము; అనఁగా ప్రాతిపదికార్థములయొక్క ధర్మమును బోధించునపుడు 'తన' అగునని భావము. ప్రకృతిజన్యబోధంబునందు = ప్రాతిపదికచేఁ దెలుపఁబడు పదార్థమునందు; ప్రకారము = ధర్మము. త్వార్థంబనఁగా భావంబు=అధర్మమే త్వార్థమగును. (సంస్కృతమున ధర్మమును బోధించునపుడు 'త్వ' వచ్చుచుండును.) (రామత్వం = రామునిధర్మము.) కావున త్వార్థ మనఁగా ధర్మమని గ్రహింపనగును.

(రామునియొక్క+తనము=) 'రామునితనము'—(రాముని ధర్మము.) ఇచట త్వార్థమున 'తన' రాఁగా సమాస. ౨౫-వసూత్రము ననుసరించి విభక్తిప్రత్యయమగు 'యొక్క' లోపించినది. 'తన' చివర 'ము' చేరినది. ఇట్లే తక్కినవియును.

'నల్లఁదనము, పుల్లఁదనము' అనుచోట్ల 'తన' ప్రత్యయము పరమగుటచే సంధి. 3౫ - సూత్రముచే నుగాగమమును, పిదప ద్రుతకార్యమును జరిగెనని యెఱుఁగునది.

## ఇట విశేషంబుత్సర్గంబునకు విభాషను బాధకంబగు. ౨.

స్పష్టము.

౨. విశేషంబు = అపవాదశాస్త్రము-క్రింద వివరింపఁబడు తాద్ర్థిక నియమసూత్రములు; ఉత్సర్గంబునకు = సామాన్యశాస్త్రమునకు; క్రిందఁజెప్పఁ బోవు విశేషవిధులు తొలుత 'తనవర్ణకము' ను విధించెడిసామాన్యశాస్త్రమును వికల్పముగా బాధించునని యర్థము. కాఁగా తొలుత విశేషవిధివచ్చి, అది వికల్పముగా బాధకమగుటచే అది రానపుడు సామాన్యశాస్త్రమువలనఁగల్గు 'తన' ప్రత్యయమును కల్గునని భావము.

## చిన్నాదులకు ఱికవర్ణకంబగు. 3.

చిన్నఱికము - కన్నెఱికము. చిన్న - కన్నె - చుట్టము - దొంగ-పేద-మిండ-లంజె-ఇత్యాదులు చిన్నాదులు.

3. 'చిన్న' మున్నగుశబ్దములకు తాద్ర్థమున 'ఱిక' ప్రత్యయము వచ్చును. (చిన్న + ఱిక + ము=) 'చిన్నఱికము ఇచట మొదటిసూత్రముచే 'తన' వచ్చుచుండఁగా దానిని బాధించి 'ఱిక' వచ్చినది. ఇట్లు బాధించుట విభాషకాన-బాధలేనపుడు 'చిన్నతనము' అనియుం నగును.

'చుట్టము+ఱికము' అనుచో సమాస. ౨౫ సూత్రము ననుసరించి 'ము' లోపము. 'ఱిక' రానపుడు 'ము' వర్ణము లోపింపదు; సంధి. 3౭-సూ. అనుసరించి 'పు' ఆదేశమయి, సంధి ౨౫-సూత్రముచే నుగాగమమువచ్చి ద్రుతకార్యమయి 'చుట్టపుఁదనము' మున్నగురూపము లగును.

'కన్నెఱికము' మున్నగునవి 'చిన్నఱికము' వలెనే యని గ్రహింప వగును.

ఉత్వంబున కత్వంబు ఱికము పరంబగునపుడగు. ౪.

తొత్తఱికము - పెద్దఱికము - పెజ్జఱికము.

౪. 'ఱిక' కు ముందున్న (పదము చివఱి) ఉకారము అకారముగా మాఱును. (తొత్తు+ఱికము=) 'తొత్తఱికము'. తక్కినవియు నిట్లే.

పేర్వాదుల కిమివర్ణకంబగు. ౫.

పేరిమి-కడిమి. పేరు-కడు-మ్రుచ్చు - మేలు - చెలి-పోఁడి-వాఁడి-వేఁడి-ఇత్యాదులు పేర్వాదులు.

౫. త్వార్థమునందు 'పేరు' మున్నగువానికి 'ఇమి' ప్రత్యయ మగును. (పేరు+ఇమి=) 'పేరిమి' ఇట సంధి. ౧౧-సూత్రముచే సంధి నిత్యముగా నగును. తక్కినవియు నిట్లే.

నవర్ణకంబు గుణవచనంబులగు నల్లాదులకగు. ౬.

నల్లన - తెల్లన. నల్ల-తెల్ల-పచ్చ-ఎఱ్ఱ-చామ - తియ్య-కమ్మ-పుల్ల-చప్ప-విన్న - తిన్న - అల్ల-ఒయ్య - తిమ్మ-చక్క-ప్రేక-ఇత్యాదులు నల్లాదులు.

౬. త్వార్థమునందు గుణమును దెల్పు 'నల్ల' మున్నగువానికి 'న' అగును. (నల్ల+న=) 'నల్లన.' 'న' రానపుడు 'తనము' రాఁగా సంధి. ౨౫-సూత్రముచే నుగాగమమయి, ద్రుతకార్యమువచ్చి 'నల్లఁదనము' మున్నగు రూపము లగును తక్కినవియు నిట్లే

ఇకవర్ణకం బగ్గలాదులకగు. ౭.

అగ్గలిక - ఒమ్మిక. అగ్గలము - ఒమ్ము

౭. 'అగ్గలము' మున్నగువానికి త్వార్థమునందు 'ఇక' ప్రత్యయ మగును. (అగ్గలము+ఇక=) 'అగ్గలిక'. ఇట సమాస; ౨౫. సూత్రముచే 'ము' లోపము. (ఒమ్ము+ఇక=) 'ఒమ్మిక'. సంధి. ౧౧-చే సంధి.

**మగఁటిమ్యాదులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు. ౮.**

మగఁటిమి-మగతనము - పేదఱిమి-ఒజ్జనము - కోటరము - కోడంట్రము-కోడంట్రికము - కోడఱికము - కోమలికము - చెలికారము-తెలుపు-ఎఱుపు - పసుపు-నలుపు. ఱికాదులు రానిపక్షమందుఁ దనప్రత్యయం బన్నింటికగు. చిన్నతనము - ముచ్చుఁదనము-నల్లఁదనము-అగ్గలంపుఁదనము-ఒజ్జతనము.

౮. 'మగఁటిమి' మొదలగుశబ్దములకుఁ గల్గెడి తద్ధితప్రత్యయములు ఒకనియమము ననుసరించినవి కావు. ప్రయోగముల ననుసరించి వాని కేయే ప్రత్యయములు వచ్చినదియుఁ గ్రహింపవలెనని భావము.

మగ+ఁటిమి = మగఁటిమి; పేద+ఱిమి= పేదఱిమి; ఒజ్జ+న+ము= ఒజ్జనము: కోడలు+టర+ము=కోటరము; కోడలు+ంట్ర+ము=కోడంట్రము; కోడలు+ంట్రిక+ము = కోడంట్రికము; కోడలు+ఱిక+ము=కోడఱికము; కోమలి+క+ము=కోమలికము; చెలి+కార+ము=చెలికారము; తెల్ల+పు= తెలుపు; ఎఱ్ఱ+పు=ఎఱుపు; పచ్చ+పు=పసుపు; నల్ల+పు=నలుపు'

ఈరీతిని ప్రత్యయములు రానపుడు అన్నింటికిని తాదర్థమున 'తన' అగును.

**అరమరాదులకు స్వార్థంబునం దికవర్ణకంబగు. ౯.**

అరమరిక-ఆమిక. అరమర-ఆము - అల్లిబిల్లి - గండి - నడపడి-నాడు - నివ్వాళి - పొత్తి-మాన-మెలి - వాలు-ఇత్యాదు లరమరాదులు.

౯. స్వార్థము=తనకు నియతమైనయర్థము-ప్రాతిపదికార్థము. (అనఁగా ఈప్రత్యయము చేరినను పదమునకుఅంతకుఁబూర్వమందున్న యర్థమే ఉండునని భావము.)

(అరమర+ఇక=) 'అరమరిక'. ఇట 'అరమర' అనిన ఏమి యర్థమో, 'అరమరిక' అన్నను అదేయర్థము. 'ఆమిక' మొదలగునవియు నిట్లే.

ఉకవర్ణకంబు చిఱుతాదులకు స్వార్థంబునందగు. ౧౦.

చిఱుతుక-నాతుక. చిఱుత-నాతి-నెలఁత-మెలఁత-పడఁతి-మడఁతి-పొలఁతి-వెలఁది-నిప్పు-ఎమ్ము-ఇత్యాదులు చిఱుతాదులు.

౧౦. 'చిఱుత' మున్నగువానికి 'ఉక' అనునది ప్రాతిపదికార్థమున వచ్చును.

(చిఱుత+ఉక=) 'చిఱుతుక.' 'నాతుక' మున్నగునవియు నిట్లే.

కాకత్తియవర్ణకంబులు పుంస్త్వస్త్రీత్వంబుల మతుబర్థంబునం దాటాదులకగు. ౧౧.

కాప్రత్యయాంతంబునకు మగాదిగణగణనంబునం జేసి డుజ్ఞగు-ఆటకాఁడు-ఆటకత్తియ ఆట-అడపము-ఎమ్మె-ఒయారము-కటారి-కొల్ల-చెలిమి-చేరువ-చొరవ-జట్టి-జాజర-జూదము-తిండి-తేర-దొద్ద-సీటు-నేస్తము-బేరము-వగ-విలు-వెచ్చము-సొగసు-ఇత్యాదు లాటాదులు.

౧౧. పుంస్త్వస్త్రీత్వంబుల = పురుషధర్మమునందును, స్త్రీధర్మమునందును; మతుబర్థంబునందు='కలిగియుండు' ననునర్థము చెప్పునపుడు; 'ఆట' మున్నగుశబ్దములకుఁ బురుషుఁడర్థమైనచో 'కా' అనుప్రత్యయమును, ఆఁడుది యర్థమైనచో 'కత్తియ' అనుప్రత్యయమును మతుబర్థమునం దగునని సూత్రార్థము.

'కా'ప్రత్యయాంతములు 'మగ'మున్నగుశబ్దముల పట్టికలో నున్నందున అచ్ఛిక. ౪.వసూత్రముచే డుజ్ఞువచ్చును. కావున (ఆట+కా+డు=) 'ఆటకాఁడు' అగును. (ఆట+కత్తియ=) 'ఆటకత్తియ'. (అడపము+కా+డు=) 'అడపకాఁడు'-ఇట సమాస. ౨౫. సూత్రముచే 'ము' లోపము.

**కాకత్తియల కకారంబునకు గకారంబు కొండొకచోఁ గానంబడియెడి. ౧౨.**

అందగాఁడు - అందగత్తియ - కొండెగాఁడు - కొండెగత్తియ-బేరగాఁడు-బేరగత్తియ-ఇత్యాదులు.

౧౨. కొండొకచో = ఒకానొకచోట. (అంద+కా+డు=) 'అందగాఁడు', అందగత్తియ' మున్నగునవియు నిట్టే.

**కాకత్తియలు కొండొకవానికి స్వార్థంబునం జూపట్టెడు. ౧౩.**

చెలికాఁడు - చెలికత్తియ. హెగ్గడికాఁడు - హెగ్గడికత్తియ.

౧౩. 'కా, కత్తియ' ప్రత్యయములు మతుబర్థమునందేగాక, కొన్ని శబ్దములకు స్వార్థము (ప్రాతిపదికార్థము)నందును గనఁబడుచున్నవని యర్థము.

చెలి = మిత్త్రుఁడు; చెలికాఁడు = మిత్త్రుఁడు; చెలి = మిత్త్రురాలు; చెలికత్తియ = మిత్త్రురాలు; ఇట్టే తక్కినవియును.

**కావర్ణకంబు తిర్యక్కులకుం గానంబడియెడి. ౧౪.**

ఇబ్బందిగాఁడు - ఒంటిగాఁడు - కొమ్ముకాఁడు-పరికాఁడు. ఇత్యాదులు మృగవిశేషవాచకంబులు.

౧౪. 'కా' ప్రత్యయము ౧౧ సూత్రమునుబట్టి మహద్వాచకములకే కల్గునట్లు తెలియుచున్నది. అట్లుకాక అమహత్తులగు మృగాదులను దెల్పుపదములకును ఈ ప్రత్యయము కలుగుచుండుట కొన్ని ప్రయోగములనుబట్టి కనఁబడుచున్నదని భావము.

'ఇబ్బందిగాఁడు, ఒంటిగాఁడు' అనుచోట్ల ౧౨-వ సూత్రముచే కకారము గకారముగా మాఱినది.

**అటమటాదులకు మతుబర్థంబునం దీవర్ణకంబు పుంస్త్వంబునం దగు. ౧౫.**

ఈప్రత్యయాంతంబు మగాదిగణంబు. ఆటమటీఁడు - కమ్మతీఁడు. ఆటమటము-కమ్మతము - కన్నడము-కొంచెము - బాన సము-బూటకము-మందడి - మన్నెము సుంకము. ఉక్కివంబునకు వలోపంబునగు. ఉక్కీఁడు-ఇత్యాదులు.

౧౫. మతుబర్థము ('కలవాఁడు, కలది' అనునర్థము) న 'ఆటమట' మున్నగువానికి-మగవారిని తెలుపునపుడు <u>'ఈ'</u> ప్రత్యయమగును.

(ఆటమటము+ఈ+ఁడు=) 'ఆటమటీఁడు'. 'ఈ' ప్రత్యయాంతములు 'మగ' మున్నగువానిగుంపులోనివి కాన ఆచ్ఛిక. ౮-వ సూత్రముచే దుజ్ఞు వచ్చును. 'ఆటమటము' లోని మువర్ణకమునకు సమాస. ౨౫-సూత్రముచే లోపము. 'కమ్మతీఁడు' మున్నగునవియు నిట్లే.

(ఉక్కి+వము ఈ+ఁడు=) 'ఉక్కీఁడు' అని (వకారము లోపించి) అగును. ('ఉక్కివీఁడు' అని మాత్రము కాదు.

## ఈప్రత్యయంబు కొన్నింటికి స్వార్థంబునందగు. ౧౬.

మొక్కలీఁడు - కల్లరీఁడు.

౧౬. 'ఈ' ప్రత్యయము మతుబర్థమునందేగాక స్వార్థము (ప్రాతిపదికార్థము) నందును కొన్నింటి కగును.

(మొక్కలి+ఈ+ఁడు=) 'మొక్కలీఁడు' ఇచట 'మొక్కలి' యనినను, 'మొక్కలీఁడు' అనినను శూరుఁడనియే యర్థము; అట్లే 'కల్లరి' కల్లరీఁడు' అనురెండుపదములకును అసత్యవాది యనియే యర్థము. ఇచట 'మొక్కలి, కల్లరి' అనువానికి ఈప్రత్యయము పరమగునపుడు సంధి-౧౧-వ సూత్రము ననుసరించి నిత్యసంధి 'ఈ' ప్రత్యయాంతములగు వైశబ్దములకు ఆచ్ఛిక. ౮-సూత్రముచే దుజ్ఞువచ్చును.

## అరివర్ణకంబు మతుబర్థంబున జాలాదులకగు. ౧౭.

జాలరి-ఒఱపరి. జాల - ఒఱపు - కల్ల-చదువు - జూదము-

టక్కు-తగవు-తీరుపు - తెంపు-తెరవు - నేరుపు - మతకము-వెరవు-వేట-సిగ్గు-సుంకము-ఇత్యాదులు.

౧౭. 'కలవాఁడు, కలది' అనునర్థమున 'జాల' మొదలగుశబ్దములకు 'అరి' అను ప్రత్యయము కలుగును.

(జాల+అరి=) 'జాలరి.' ఇచట సంధి, ౧౧ వ సూత్రముచే నిత్య సంధి. 'ఒఱపరి' మున్నగునవియు నిట్టే.

జూదము, మతము, సుంకము మున్నగువానికి 'అరి' పరమగునపుడు 'ము' లోపము సమాస. ౪౫. సూత్రముచేతనే యని యెఱుంగునది.

### ఇవర్ణకం బోయారాదులకు మతుబర్థంబునందగు. ౧౮.

ఓయారి - అక్కసి. ఓయారము - అక్కసము - కడలు-చాగము - జోగము - తమకము - తుటారము - బండారము - బిత్తరము - బిటారము - బేహారము - మచ్చరము - మిటారము-విన్నాణము-వెక్కసము-ఇత్యాదులు.

౧౮. 'ఓయారము' మున్నగువానికి మతుబర్థమునందు 'ఇ' ప్రత్యయమగును. (ఓయారము+ఇ=) 'ఓయారి.' ఇచట సమాస. ౪౫-సూత్రముచే 'ము' లోపించును; పిదప సంధి ౧౧-సూత్రముచే నిత్యసంధి. ఇట్టే 'అక్కసి' మొదలైనవియును.

### తవర్ణకంబు కులవాచకంబునకు స్త్రీవాచ్యం బగునపుడు మతుబర్థంబునందగు. ౧౯.

కోమటిత - చాకిత. కోమటి - చాకి - బోయ - వాని వ్రే-సాలె-ఇత్యాదులు కులవాచకంబులు.

౧౯. కులమును దెల్పుచు, నందు స్త్రీని బోధించునపుడు మతుబర్థమునందు 'త' ప్రత్యయ మగును.

(కొఱవ+త=) కొఱవత, అనఁగా కొఱవజాతికలస్త్రీ యని యర్థము. ఈశబ్దము జాతిని, అందు స్త్రీని దెలుపుచుండుటచే 'త' వర్ణకము వచ్చినది. 'చాకిత' మున్నగునవియు నిట్లే.

**తవర్ణకంబు పరంబగుచో నొకానొకచో**
**నెత్వంబు చూపట్టెడు. ౨౦.**

చెంచెత - మాలెత.

౨౦. జాతివాచకమై, స్త్రీని దెల్పు 'త' ప్రత్యయము పరముగా నున్నపుడు కొన్నిచోట్ల శబ్దము తుదియచ్చునకు 'ఎ' కారము ఆదేశముగా నగును.

(చెంచు+త=) 'చెంచెత' ఇచట 'చు' లోని ఉకారము ఎకారమైనది. ఇట్లే (మాల+త=) 'మాలెత.'

**యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత**
**ముట్టుతలు నాఁబడుదురు. ౨౧.**

స్పష్టము.

౨౧. సంస్కృతమున 'యువతి' అనుదానికి తెలుఁగున 'గుబ్బెత' అనియు, విటీ శబ్దమునకు 'మిండత' అనియు, 'రజస్వలా' శబ్దమునకు 'ముట్టుత' అనియు రూపములు కలుగును.

**వగాదులకు బహువచనాంతంబులకు స్త్రీవాచ్యం**
**బగునపుడు మత్వర్థంబునం ద్రాఁడివర్ణకంబగు. ౨౨.**

వగలాఁడి. వగ - చిన్నె - కులుకు - వన్నె-దొమ్మి-ఎమ్మె ఇత్యాదులు వగాదులు.

౨౨. బహువచనాంతంబులకు = ప్రథమాబహువచనము చివరగల వానికి; స్త్రీ. వాచ్యంబగునపుడు = ఇఁదుది బోధింపఁబడినపుడు; మత్వర్థంబు

నందు = మతుబర్థమన కలది' అనునర్థమున స్త్రీబోధింపఁబడుచో ప్రథమా బహువచనాంతములగు వగ' మున్నగుశబ్దముల (వగలు' మున్నగువాని) పయి - మతుబర్థమున ఆఁడి' అనుప్రత్యయ మగుచుండును.

(వగలు+ఆఁడి=) వగలాఁడి' వన్నెలాఁడి' మున్నగునవియు నిట్టే.

**వగాదులకు బహువచనాంతంబులకుఁ బుంస్త్వంబున మతుబర్థం బాకారంబగు. ౨౩.**

ఆప్రత్యయాంతంబు వగాదిగణంబు వగలాఁడు-చిన్నెలాఁడు.

౨౩ పురుషులను బోధించునపుడు ప్రథమాబహువచనాంతములగు వగ' మున్నగుశబ్దములకు మతుబర్థమున (కలవాఁడు' అనునర్థమున) ఆ' అను ప్రత్యయ మగును ఈప్రత్యయము చివఱ గలశబ్దములు వగ' మున్నగువాని గుంపులోఁ జేరియుండుటచే అచ్ఛిక ౪-వ సూత్రము ననుసరించి డుఙ్ఞు వచ్చును (వగలు+ఆ+ఁడు=) వగలాడు' (వన్నెలు+ఆ+ఁడు) వన్నె లాఁడు.'

**ముక్కులోనగువానికిం దదభావద్యోతకం బయి మతుబర్థంబునం దిడివర్ణకంబగు. ౨౪.**

ముక్కిడి - ముక్కు లేనివాఁడని యర్థము. ముక్కు వాలు-వెరవు-సిగ్గు-ఇత్యాదులు ప్రయోగంబుల నెఱుంగునది.

౨౪ దభావద్యోతకంబయి= అవిలేవు అనునర్థమును తెలుపునదయి; ముక్కు' లోనగుశబ్దములకంటె మతుబర్థమున ముక్కు మున్నగువాని లేమిని తెలుపుచు ఇఁడి' ప్రత్యయము అగును (ముక్కు+ఇఁడి=) ముక్కిఁడి' ఇచ్చట సంధి ౧౧-సూత్రముచే నిత్యసంధి ఈపదము స్త్రీసమమగుటచే ప్రథమైకవచనలోపము. వాలిఁడి' మున్నగునవియు నిట్టే

**మానార్థంబున కేకత్వంబునం దేఁడువర్ణకంబగు. ౨౫.**

తూమెఁడు - ముంతెఁడు - ౧త్తెఁడు - వీసెఁడు - జేనెఁడు- మూరెఁడు-కుండెఁడు-గంపెఁడు.

౨౫ మానము = పరిమాణము-కొలత పరిమాణార్థమునందు వచనమున ఎఁడు' ప్రత్యయ మగును (తూము+ఎఁడు=) తూమెఁడు సంధి ౧౧-వ సూత్రము ననుసరించి నిత్యసంధి ఇట్లే మూతెఁడు లోనగు నవియు

**ఎఁడువర్ణకంబు పరంబగునపుడు లివర్ణంబు లోపించు. ౨౬.**

కమికెఁడు - కొడిదెఁడు - దోసెఁడు - పిడికెఁడు - పుడిసెఁడు - సందెఁడు

౨౬ కొలతను దెల్పు మీఁది ఎఁడు' ప్రత్యయమునకు ముందున్న (ప్రాతిపదికములోనిదగు) లి లోపించును (కమికిలి+ఎఁడు=) కమికెఁడు' ఇచట లి లోపించి సంధియైనది కొడిదెఁడు' లోనగునవియు నిట్లే

**దఘ్నార్థంబున బంటికొలఁదులగు ౨౭**

మోఁకాలిబంటి - మోఁకాలికొలఁది. ఒమ్మబంటి - ఒమ్మకొలఁది.

౨౭ దఘ్నార్థంబున=లోఁతు అనునర్థమును దెల్పునపుడు లోఁతు' అనునర్థమును దెల్పునపుడు శబ్దములకు బంటి కొలఁది అను ప్రత్యయము లగును.

(మోకాలు+బంటి=) మోకాలిబంటి' (మోకాలు+కొలఁది=) 'మోకాలికొలఁది' (మోకాలిలోఁతనియర్థము) ఇచట మోకాలు' శబ్దమాపవిభక్తికము కావున ఇ' వచ్చి మోకాలి' అయినది

**అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహత్ప్రయోగంబుల నెఱుంగునది. ౨౮.**

మంటమారి-తిండిపోతు - తాచ్ఛీల్యంబున మారి పోతు వర్ణకంబులు అడప - తాంబూలకరండవాహి - మతుబర్థంబునం

ద ప్రత్యయంబు పెండ్లము - ఊఢ - పెండ్లిశబ్దంబునకు మతు బర్థంబునం దము ప్రత్యయంబు ఇత్యాదు లూహ్యంబులు.

౨౮ అర్థవిశేషంబుల = ఇంకను మిగిలిన విశేషార్థములందు వర్ణ కాంతరంబులును = ఇతరము లగు ప్రత్యయములును మహాత్ప్రయోగంబు లన్ = పెద్దల ప్రయోగముల ననుసరించి - అనఁగా మిగిలిపోయిన విశేషార్థ ములందు మిగిలిపోయిన ప్రత్యయములను మహాకవిప్రయోగముల ననుసరించి తెలిసికొనవలెనని యభిప్రాయము

తాచ్ఛీల్యంబున=దానిస్వభావము ననునర్థమున నుంటమారి అనుచో మందునట్టి స్వభావము కలది యనునర్థమున నుంట' కు మారి ప్రత్యయ మయ్యెను ఇట్లే తిండిపోతు' అడపము + అ = అడప' ఇచట తాంబూలపు పెట్టెకలవాఁడు' అనుమతుబర్థమున అ' ప్రత్యయము సమాస ౨౧-వ సూత్రము ననుసరించి ము' లోపము

పెండ్లి+అము = పెండ్లము ఇచట (ఊఢ) పెండ్లాడఁబడిన వనిత' అనునర్థము చెప్పుచు పెండ్లి' శబ్దమునకు మతుబర్థమున అము' అను ప్రత్య యము వచ్చినది. పిదప సంధి ౧౧ సూత్రమునుబట్టి సంధి

ఇత్యాదు లూహ్యంబులు' అనుటచే మఱికొన్ని యిట్టివి కలవని తెలియుచున్నది ఉదా— తేజంబు+న+వాఁడు = తేజంబునవాఁడు' అనఁగా తేజస్సుకలవాఁ డని యర్థము ఇచట కలవాఁడు' అనునర్థమున మతు బర్థమున న' అను ప్రత్యయ మయ్యె నని యెఱుఁగునది

ఇది తద్ధితపరిచ్ఛేదము

---

# క్రియాపరిచ్ఛేదము



## ధాతువునకు. ౧

ఇది యధికారసూత్రంబు - ఇంక నెయ్యది యుపక్రమింపంబడునయ్యది ధాతువున కగునని యెఱుంగునది.

క్రియాపరిచ్ఛేదము—పనిని దెలియఁజేయునవి క్రియలు ఆక్రియలనుగూర్చి తెలియఁజేయుగ్రంథభాగము క్రియాపరిచ్ఛేదము.

౧ క్రియకు మూలరూపము ధాతువు ఈ ధాతువునకు' అనునది అధికారసూత్రము ముందుఁ జెప్పఁబోవుసూత్రములతోఁ గలసి ప్రయోజనము పొందుసూత్రము అధికారసూత్రము ఇట్టి సూత్రములకు తా నున్నస్థలమున ప్రయోజనము ఉండదు

ఈసూత్రము ఈమీఁదిసూత్రములతో నన్వయించుచు ఆసూత్రముల వలన విధింపఁబడుకార్యము ధాతువునకు వచ్చు నని తెలియఁజేయుచుండును.

## వర్తమానంబున లట్టగు. ౨

వర్తమానక్రియావృత్తియగుధాతువునకు లడ్వర్ణకం బగు వర్తమానంబునాఁ బ్రారబ్ధాపరిసమాప్తంబు - అప్పటికి ముగియకుండునది

౨ వర్తమానము = జరుగుచున్నది వర్తమానార్థమును బోధించునపుడు ధాతువునకు లట్' అను ప్రత్యయ మగును ప్రారబ్ధాపరిసమాప్తము = ప్రారంభింపబడి యింకను ముగియకుండునది ఈదా — వచ్చుచున్నాఁడు—' ఇచ్చట వచ్చుట' ప్రారంభింపఁబడెనుగాని యింకను ముగియలేదు

## భూతంబున లిట్టగు 3.

భూతక్రియావృత్తియగు ధాతువునకు లిడ్వర్ణకంబగు భూతంబు నా విద్యమానధ్వంసప్రతియోగి - ముందుండియప్పటికి లేకుండునది

3 భూతక్రియావృత్తి = భూతకాలమందలి వస్తువుయొక్క క్రియయందున్నది అట్టి ధాతువునకు లిట్ ప్రత్యయ మగును జరిగిపోయిన (భూత) కాలమును దెల్పునపుడు ధాతువునకు లిట్టగును.

విద్యమానధ్వంసప్రతియోగి = (వాక్యప్రయోగకాలమునందు) ఉండిన నాశమునకు విరోధియైనది—అనఁగా పూర్వమునుండి యిప్పుడు లేనిదని యర్థము ఉదా — ఘటముండెను - వాక్యప్రయోగకాలమున ఘటము లేదనియు అంతకుముం దుండెననియు తెలియుచున్నది. ఇదివఱకుండి యిప్పుడు లేనిది ధ్వంసము.)

## భావిని ఌట్టగు. ౪. ([illegible])

భావిక్రియావృత్తియగు ధాతువునకు ఌడ్వర్ణకంబగు భావినా విద్యమానప్రాగభావప్రతియోగి - అప్పటికిఁ బుట్టకుండునది.

౪ భావి = భవిష్యత్తు - రాఁబోవునది భావిక్రియావృత్తి = రాఁబోవుకాలమునందలి వస్తువుయొక్క క్రియయందున్నది అట్టి క్రియయందున్న ధాతువునకు ఌట్ ప్రత్యయ మగును - (ముందు జరుగఁబోవు (భావి) క్రియను దెల్పునపుడు ధాతువునకు ఌట్టగును విద్యమానప్రాగభావప్రతియోగి = వస్తూత్పత్తికి ముందున్న అభావమునకు విరోధియైనది — అప్పటికి కలుగకుండుదాని విరోధి ఇఁకమీఁదఁ గలుగున దని భావము. (వస్తూత్పత్తికి ముందుండు అభావము - ఇదివఱకు లేనిది ప్రాగభావము) ఉదా - రాముఁడు రాఁగలఁడు ఇచట రాముఁ డిదివఱకు రాలేదనియు ఇఁక

మీఁద రాఁగలడనియుం రాఁగలడు' అనఁగని చెప్పుచున్నది కాన అది భవిష్యత్కాలము

### తద్ధర్మాదులందు లాట్టగు ౫.

తద్ధర్మాదిక్రియావృత్తియగు ధాతువునకు లాడ్వర్ణకంబగు తచ్ఛీలసంభావనా సంప్రశ్న సాతత్యవర్తమాన భావ్యాశీరాదు లాదిపదగ్రాహ్యంబులు

౫ తద్ధర్మము మున్నగువానియందలి వస్తువుయొక్క క్రియయందున్న ధాతువునకు లాట్' అనుప్రత్యయ మగును—(మీఁది మూఁడుకాలముల కంటెను వేఱయి వానిన నిఖర్మములు మున్నగువ నిని చెల్పునపుడు ధాతువునకు లా ట్టగును ) (తద్ధర్మాదు లన్నికాలములను బోధించును )

తచ్ఛీలము = దానిస్వభావము సంభావన = ఊహ సంప్రశ్నము = పృచ్ఛచేయుట - అడుగుట సాతత్యము = ఎల్లపుడును ఉండుట వర్తమానము = వాక్యప్రయోగకాలమున నుండుట భావి = వాక్యము ప్రయోగించుకాలమునకుఁ దరువాత నుండుట ఆశీరాదులు = దీవన మొన్నగునవి ఇవియన్నియును తద్ధర్మాదులందు అనుచోటఁ గల ఆది' పదముచే గ్రహింపఁబడుచున్నవి వీనికి ౨౭-సూత్రమునొద్ద ఉదాహరణము లీయఁబడును.

### ఆశీశ్శాపసంప్రార్థనవిధులందు లూట్టగు ౬.

ఆశీరాదులందు ధాతువునకు లూడ్వర్ణకంబగు

౬ ఆశీస్సు=దీవన శాపము=తిట్టుట సంప్రార్థనము=ప్రార్థించుట—కోరుట విధి=ఆజ్ఞాపించుట ఆశీరాదులగు నయినాల్గింటియం దున్న వస్తువుల వ్యాపారమున నుండు ధాతువునకు లూట్' అనుప్రత్యయ మగును వీనికి ఉదాహృతులు ౨౬-వ సూత్రమునొద్ద నీయఁబడును.

### వ్యతిరేకంబున లజీయగు ౭.

వ్యతిరేకవిశిష్టక్రియావృత్తియగుధాతువునకు లజీవర్ణకంబగు

౭ వ్యతిరేకంబు = ధాత్వర్థమునకు విపరీతమగు నర్థమున్న, వ్యతిరేకార్థముతోఁ గూడిన క్రియయందుండు ధాతువునకు లజ్ అను ప్రత్యయ మగును

**లకారంబునకు డు జ్రు వు రు ను ముఞ్గు. ౮.**

లడాది లకారంబులం దొక్కొక్కటికి డుజాదు లాదేశంబులగు. ఇందు ఞకారంబు ప్రత్యాహారార్థంబు

౮ లకారంబునకు = లట్టు మున్నగు వారింటిలో నొక్కొక్కదానికిని 'లట్ లిట్ లృట్ లాట్ లూట్ లజ్ అనునాఱును లకారపదముచే గ్రహింపఁదగియున్నవి ఈ యాఱింటికిని - అనఁగా ప్రతిలకారమునకును - డుజ్ రు వు రు ను ము-అనునవి ఆదేశములుగా నగును ఇందు ముఞ్' లోని ఞకారము ఇత్తు అది ప్రత్యాహారమునకై 'ము' తోఁ జేర్పఁబడినది

మొదటియక్షరము నొకదానిని దీసికొని చివఱివాల్లుతోఁ జేర్చి ఉచ్చరింపఁగా ఆ ఉచ్చరింపఁబడిన సంగ్రహాక్షరసమూహము ప్రత్యాహారము' అనఁబడును అది మొదటియక్షరమును చివరిహల్లునకును మొదటియక్షరము నకును నడుమఁగల యక్షరము లన్నింటినిఁ గూడ బోధించును

ఇచట డుజ్' లోని డు' తీసికొని ముఞ్' లోని ఞకారముతోఁ జేర్చి పలుకఁగా డుఞ్ అగుచున్నది ఇదే ప్రత్యాహారము. కాన డుఞ్' అని పలికినచో డు' ను దాని తరువాతి రు-వు-రు-ను-ము' లనునవియు గ్రహింపఁబడును కాఁగా- డుఞ్ అనఁగా డుజ్-రు-వు రు-ను-ము' లని యర్థము తేలుచున్నది

**అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు. ౯.**

డుజ్ - రు - ప్రథమము. వు-రు - మధ్యమము ను - ము-ఉత్తమము.

అందు = దుఙాదులాటింటిలో.

**వానిలో రు ము లు బహువచనంబులు**
**పెఱలేకవచనంబులు ౧౦**

౧౦ వానిలో=దుఙాదులాటింటిలో పెఱలు=మిగిలినవి- దు-వు-ను అనునవి ప్రథమపురుషైకవచనమున దు ప్రత్యయమును ప్ర బహువచనమున రు ను మధ్యమపురుషైకవచనమున వు ప్రత్యయము మ బహువచనమున రు ఉత్తమపురుషైకవచనమున ను ఉ బహువచనమున ము ప్రత్యయమును వచ్చుననుట

**నామయుష్మదస్మదర్థములందుం**
**బ్రథమమధ్యమోత్తమంబులగు ౧౧**

౧౧ యుష్మదస్మదర్థములకంటె వేఱైనది నామము ఎదుట నున్నవాఁడును తానును అర్థముకాని-ఎక్కడనో ఉన్న ఇతరుఁడు నామము ఆనామమున ప్రథమపురుషమును ఎదుటనున్నవానిని జెల్పునపుడు మధ్యమపురుషమును తన్ను తెల్పుచో ఉత్తమపురుషమును అగును

**అమహదర్థంబునందు దు ప్రు లకు దువు లగు నున్నాను**
**బంధంబుమీఁద దివి యగు ౧౨**

౧౨ ౧౦-వ సూత్రముచేఁ జెప్పఁబడిన దుఙ్ మున్నగునవి మహదర్థమునకుఁ మహాత్యర్థమునకును అమహదర్థమునకును సామాన్యముగఁ జెప్పబడియున్నను అందు దు రు అనునవి మహదర్థములకే సరిపడుచున్నవి అమహదర్థములకు సరిపడుటలేదు కాన ఈసూత్రమునందు అమహదర్థముల కెట్టివివచ్చునో తెలుపఁబడుచున్నది

అమహదర్థమును దు కుమాఱు దు అనునదియు రు కుబదులు వు అనునదియు నగును ఉన్న అనుదానితోఁగూడినపుడుమాత్రము దు కు 'ది' యును రు కు వి యు అగును.

అనుబంధము=అనుసరించియున్నది ఉన్నానుబంధము = (ధాతువును) అనుసరించి దానిప్రక్కనుచేరిన ఉన్న' అనునది

ఉదా — హంస కలదు (బహు) హంసలుకలవు ఉన్నానుబంధము మీఁద నుదాహృతి- మేఘము వర్షించుచున్నది మేఘములు వర్షించు చున్నవి.

ఉదంతంబునకు లట్టుపరంబగునపు
డున్నానుబంధంబగు ౧౩

ఉదంతంబయిన ధాతువునకు లట్టు పరంబగునపుడు ఉన్న అనుశబ్దం బనుప్రయుక్తంబగు

౧౩ హ్రస్వమగు ఉకారము చివఱఁగల ధాతువునకు లట్టు' పరమగు నపుడు ఉన్న' అనునది వచ్చును-అనఁగా ధాతువుతుదిని ఉన్న' అనునది చేరును

ఉన్నశబ్దంబు పరంబగునపుడు చువర్ణకంబగు ౧౪

౧౪ ఉన్న' అనునది పరముగా నున్నపుడు ధాతువుచివఱ చు' అను నది చేరును ఈ చు ప్రత్యయము

దివీతరంబగు డుఙ్ఞు పరంబగునపు డున్నానుబంధంబునకు దీర్ఘంబగు. ౧౫

ప్రథమము. వాఁడు వండుచున్నాఁడు - వారు వండు చున్నారు - అది వండుచున్నది - అవి వండుచున్నవి. మధ్య మము. నీవు వండుచున్నావు - మీఁరు వండుచున్నారు. ఉత్త మము నేను వండుచున్నాను - మేము వండుచున్నాము.

౧౫ లట్టునకు ఆదేశమగు డుఙ్ఞు (డుజ్-రు-వు-రు-ను-ము) పర మగునపుడు అనుబంధముగావచ్చిన ఉన్న' అనుదానికి దీర్ఘమగును కాని

'దుజ్, రు' లకు వరుసగా ది వి' అనునవి ఆదేశముగా వచ్చినప్పుడు మాత్రము ఉన్న' కు దీర్ఘమురాదు.

ప్రథమము=ప్రథమపురుషము వందుచున్నాఁడు' అనునది ఏకవచన రూపము

వందు' ధాతువునకు వర్తమానమున లట్టు' రాఁగా దానికి మహదర్థమున ప్రథమపురుషైకవచనమున డుజ్' వచ్చినది డుజ్జు జిత్తుకావున జిత్తుబిందుపూర్వంబగు' ననునియమముచే ముందు బిందువు నిడికొని వందు+డు' అని యుండినది పిదప-౧౩-వ సూత్రముచే ఉన్న' యును ౧౪-వ సూత్రముచే చు' వచ్చి వందు+చు+ఉన్న+ఁడు అయినది ౧౫-వ సూత్రముచే ఉన్న' కు దీర్ఘమురాఁగా వందుచున్నాఁడు' అయినది వందుచున్నాఁరు అనునది ప్రథమపురుషబహువచనరూపము దాని ప్రక్రియ 'వందుచున్నాఁడు' అనుదానివలెనే గ్రాహ్యము వందుచున్నది' అనునది అమహద్వాచకమున ప్రథమపురుషైకవచనమునకును వందుచున్నవి' అనునది అందే ప్ర బహువచనమునకును ఉదాహృతులు మొదటిదానిలో ది' రెండవదానిలో వి' పరమగుచో ఉన్న' అనుదానికి దీర్ఘము రాలేదని చూపుటకివి యుదాహరింపఁబడినవి తక్కిన ప్రక్రియ వందుచున్నాఁడు' అనుదానికిఁబోలె గ్రహింపవలెను.

మధ్యమము=మధ్యమపురుషము వందుచున్నావు' అనునది ఏకవచనమునకు ఉదాహరణము వందుచున్నారు' అనునది బహువచనమున కుదాహృతి ఉత్తమము. ఉత్తమపురుషము వందుచున్నాను' అనునది ఏకవచనమునకును వందుచున్నాము' అనునది బహువచనమునకును ఉదాహరణములు వీనికి ప్రక్రియ వందుచున్నాఁడు' అనుదానికివలెనే యని గ్రహించునది

లిడ్లాట్టుల డు జ్జున కెను నువర్ణంబు లగు ౧౬.

లిడాదేశంబగు డుజ్జునకు - ఎను - అనునదియు లాడాదేశంబగు డుజ్జునకు - ను - అనునదియు నాదేశంబు లగు.

౧౬. భూతకాలమునందు లిట్టునకు ప్రథమపురుషైకవచనమునందు వచ్చు (ఆదేశమగు) డుజ్జునకు ఎను' ఆదేశముగా వచ్చును తద్ధర్మమునందగు లాట్టు డుజ్జునకు ను' అనునది ఆదేశమగును

వందు + లిట్ అని యుండఁగా లిట్టునకు ౧-వ సూత్రముచే డుజ్జు వచ్చి (వందు + డుజ్) పిదప నీసూత్రముచే డుజ్జునకు ఎను ఆదేశమయి సంధియై వందెను అని సిద్ధించెను

తద్ధర్మమున వందు + డుజ్' అనియుండఁగా నీసూత్రముచే ను' ఆదేశమై వందును' ఐనది

భూతంబునం దిగాగమంబగు ౧౭.

భూతార్థవృత్తియగు ధాతువున కిగాగమంబగు.

౧౭ భూతకాలక్రియను బోధించు ధాతువు చివరి యక్షరమునకు హ్రస్వమగు ఇకార మాగమముగా నగును

వందు + రు' అనియుండఁగా పైసూత్రముచే వందు' నకు ఇక్ (ఇ) ఆగమమయి సంధివచ్చి వందు + ఇ + రు = వండి + రు అనియుండినది పిదప సప్తమ. ౨౬-సూత్రముచే రు' లోని ఉకారము ఇకారముగా మారి వండిరి' అయినది

లిట్టు పుష్షు పరంబగునపుడు తివర్ణకంబగు ౧౮.

ఇకారంబుమీఁది కు - ను - వు - క్రియావిభక్తుల యను సూత్రముచే నుష్షునకిత్వంబు-ప్ర వండను - వండిరి మ వండి తివి-వండితిరి. ఉ. వండితిని-వండితిమి.

౧౮. పుష్షు పరంబగునపుడు = వు రు ను ము' అనునవి పరమగు నపుడు భూతకాలమందలి మధ్యమపురుషమును ఉత్తమపురుషమును పరమగు నప్పుడు ధాతువు తుద తి' అనునది చేరును.

రుష్మునకు = రు వు రు ను ము' లకు ము = మధ్యమపురుషము = 'వందు+వు' అని యుండఁగా ఈసూత్రముచే లి' వచ్చినది ౧౭-వ సూత్రముచే ఇగాగమమువచ్చి సంధియై వండి+లి+వు' అని యుండఁగా తత్సమ. ౨౬ - వ సూత్రము చే వు' లోని ఉకారము ఇకారముగామాఱి వండిలివి' అయినది వండిలిరి' మున్నగునవియు నిట్లే ఉ = ఉత్తమపురుషము

కలజ్యనుబంధంబు ల్ఱట్టు పరంబగునపుడగు ౧౯.

ల్ఱట్టు పరంబగునపుడు ధాతువునకు కలజి - అనునది యను ప్రయుక్తంబగు

౧౯ ల్ఱట్టుపరమగునపుడు = భవిష్యదర్థకమగు ల్ఱట్టుపరముకాఁగా, కలజి అనుదానిలో కల' అనునదియే మిగులును జి ఇత్తు అగుటచే లోపించును

జిత్తుపరంబగునపు దుత్వంబున కత్వంబగు ౨౦.

జిత్తు పరంబగునపుడు ధాతువునుత్వంబున కత్వంబగు

౨౦ జి' ఇత్తుగాఁగలది జిత్తు అది పరమగుచో ధాతువుచివఱి ఉకారము అకారముగా మాఱును

కలజిపదుజులు పరంబులగునపుడు నుగాగమంబగు ౨౧

ద్రుతకార్యంబు ప్ర. వండఁగలఁడు - వండఁగలరు - వండఁగలదు - వండఁగలవు. మ వండఁగలవు - వండఁగలరు. ఉ. వండఁగలను-వండఁగలము.

౨౧ కలజి పదుజి అనునవి పరములగునపుడు ధాతువునకు అంతాగమముగా నుగాగమము (నకారము) అగును

వండు+ఁడు' అని యుండఁగా ౧౯-వ సూత్రముచే కలజి' (కల) అయి వండు+కల+ఁడు' అనియుండఁగా ౨౦-వ సూత్రముచే డు లోని

ఉకారము అకారముగా మారి వంద+కల+డు' అయినది ఈసూత్రముచే ధాతువునకు నుగాగమము దానికి ద్రుతకార్యము కలిగి 'వందఁగలఁడు' అయినది ఇట్లే 'వందఁగలరు' మున్నగునవియును

## లాట్టురుజ్ఞు పరంబగునపుడు దుగాగమంబగు ౨౭.

ప్ర. వందును - వందుదురు మ వందుదువు - వందుదురు ఉ. వందుదును - వందుదుము. లాదర్థంబులయం దోలి నుదాహరణంబులు వక్కాణించెద. తద్ధర్మంబు - కులాలుఁడు కుండలు వాసును తచ్ఛీలంబు - జ్వలనజ్వాలంబు లుప్పరం బెగయును సంభావన - ఇప్పుడు వాఁడింట నుండును. సంప్రశ్నము-ఉందునా - పోదునా. సాతత్యము - సర్వంబునం దీశ్వరుఁడుండును - సర్వంబీశ్వరునియందుండును. వర్తమానంబు - మేన నిప్పుడుం బులకలువొడమెడును. వక్ష్యమాణవిధిచేఁ బ్రాయికంబుగ వర్తమానంబునం దెడు గాద్యాగమంబు లగు భావి- వాఁడు తేఁపువచ్చును ఆశిస్సు - శుభంబగును వచ్యర్థంబుల కొకానొకచో భూతంబున లాట్టు గానంబడియెడును.

౨౭ లాట్టురుజ్ఞు = తద్ధర్మాదులను బోధించునపుడు వచ్చు 'రు వు, రు ను ము' అనునవి తద్ధర్మాదులను బోధించునపుడు ప్రథమపురుషబహువచనము మొదలుకొని తక్కినవన్నియును పరమగునపుడు ధాతువునకు దుగాగమము (దు) అగును ప్ర ఏక 'వందును' ప్ర బహు 'వందుదురు' మ. ఏక 'వందుదువు' బహు 'వందుదురు' ఉ ఏక 'వందుదును' బహు 'వందుదుము'

లాదర్థంబులయందు = తద్ధర్మాదులయందు ఓలి = క్రమముగా తద్ధర్మాదులకు వరుసగా నుదాహరణము లీయఁబడుచున్నవని యర్థము

తద్ధర్మము - 'కులాలుఁడు కుండలు వాసును' - కుండలు వాసుట తద్ధర్మ

వాని కులధర్మము కాన వాచును' అయినది తచ్ఛీలము- జ్వలనజ్వాల లుప్పరంబెగయును' - ఉప్పరంబెగయుట అగ్నిజ్వాలలకు స్వభావముకాన ఎగయును' అయినది సంభావన - ఇప్పుడు వాఁడింట నుండును -' ఇట వాఁడింటనుండవచ్చు నను ఊహ కాన ఉండును' అయినది.

ప్రశ్నించుట- ఉందునా? పోదునా?"-ఇచటి రెండు ఉదాహరణములును వక్తయొక్క ప్రశ్నమును దెల్పుచున్నవి (ఇట ఉందును పోదును' అనువానికి ప్రశ్నార్థమున ఆ చేరినది ) ఎల్లప్పుడు నుండుట- సర్వంబీశ్వరుని యం దుండును' ఇట నీశ్వరుఁ డెల్లప్పుడును సర్వజగంబును విడనాడక యుండునను అర్థము తోఁచుచున్నది కాన ఉండును' అను లాడ్రూపము వచ్చినది సర్వంబునం దీశ్వరుఁ డుండును' అను నుదాహృతియుం నిట్టే.

వర్తమానార్థము— మేన నిప్పుడుం బులకలు పొడమెడును—' ఇట 'ఒడలు గగిపొడుచుచున్న' దనునర్థము కావున నీయర్థమున పొడమెడును-' అను లాడ్రూపమైనది ఇదివఱకు నిరూపించిన ప్రక్రియనుబట్టి పొడమును-' అనియే యుండవలెను కాని పొడమెడును అని ఎట్లు అయినదని సందేహము కలుగవచ్చును దానికి సమాధానము వక్ష్యమాణవిధిచే అనుదానిచేఁ జెప్పఁబడుచున్నది ౨౩ సూత్రముచే వర్తమానార్థమున ఎదుక" (ఎదు) మున్నగు నాగమములు కలుఁగునని గ్రహింపవలయు నని భావము

భవిష్యదర్థము - వాఁడు రేపు వచ్చును' - ఇచట రేపు రాఁగలఁడను నర్థమున వచ్చును వచ్చినది దీవన - శుభం బగును' - ఇట శుభంబులు కలుగుఁగావుత' యని యర్థము అందు అగును' వచ్చినది

వచ్యర్థంబులకు - పైనిచెప్పిన యర్థములందే కాక అను - పలుకు - చెప్పు - అడు' మొదలగువచ్యర్థములకు (వచిధాతువున కర్థమైనవానికి) - అవి భూతకాలపు అర్థమును తెలుపుచో లాడ్రూపము- (ప్రథమపురుషైకవచనము) ప్రయోగింపఁబడుచున్నది దీనిని గొప్పకవులే వాడియున్నారు ఉదా —

అన నతడిట్లనన్ - ఇచట అనన్ అనుదానికి 'అనెను' అని (భూతకాలపు) అర్థము. ఆయర్థమున అనున్ అని లాడ్రూపము ప్రయోగింప బడినది

**లాట్టురుఙ్ఙు పరంబగునపు డెదగాగమంబును ప్రథమనువర్ణకంబు పరంబగునపు డెదుగెడిగాగమంబులును బహుళంబుగా నగు ౨౩.**

ప్ర. వండెదును-వండెడిని - వండెదరు. మ వండెదవు వండెదరు. ఉ. వండెదను వండెదము

౨౩ లాట్టురుఙ్ఙు = తద్ధర్మాదులయందలి ప్రథమపురుషబహువచనము మొదలుకొని తక్కినవన్నియు అనగా - రు - వు - రు - ను - ము' లు, ప్రథమనువర్ణకంబు = డుఙ్ఙు' న కాదేశమయిన ను' వర్ణకము

తద్ధర్మాదులందు డుఙ్ఙు పరమగునపుడు ధాతువునకు ఎదుక్' (ఎదు), 'ఎడిక్' (ఎడి) అనునాగమములు బహుళముగా నగును. తక్కినవి రు' మున్నగునవి పరమగునపుడు ఎదక్' (ఎద) అనునాగమము వచ్చును

వండు+డుఙ్' అనియుండగా ఈసూత్రముచే ఎదు ఎడి' అనునవి వచ్చును ౧౬ - సూత్రముచే డుఙ్ఙునకు ను' ఆదేశమగును వండు+ఎదు+ను'= వండెదును' అని ఒకరూప మేర్పడును వండు+ఎడి+ను' అనియున్నపుడు తత్సమ ౨౬ - సూత్రము ననుసరించి ను లోని ఉకారము ఇకారముగా మాఱగా వండెడిని' అగును.

వండు+రు' అనియుండగా ఈసూత్రముచే ఎద వచ్చి వండెదరు' అగును ఇట్లే వండెదము' మొదలైనవి ఈయాగమములు బహుళమగుటచే ఇవి రానపుడు వండును వండుదురు' మున్నగురూపములు నుండును

**లిఙ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు. ౨౪.**

వండితి-వండితివి. వండుదు-వండుదువు వండెదవు-వండెదు.

౨౮ భూత, తద్ధర్మాద్యర్థకములందు ధాతువుకంటె పరమగు వకారము మధ్యమపురుషైకవచన ప్రత్యయములోనిది వికల్పముగా లోపించును వండితివి' అనునది లిట్టులో మధ్యమపురుషైకవచనమునకు రూపము దాని వి' లోని వకారము లోపించి వండితి+ఇ=వండితి' (సంధి ౧౧ - సూత్రముచే నిత్యసంధి.) అయినది వకారము లోపింపనపుడు వండితివి' అని యుండును. లాట్టు' నందు వండుదువు' అనుచోట వు' లోని వకారము లోపింపఁగా 'వండుదు+ఉ=వండుదు' అగును. లేనప్పుడు వండుదువు' అని యుండును. వండెదవు' అనుచో వకారము లోపింపఁగా వండెద+ఉ' = వండెదు' అగును లోపము రానిపక్షమున వండెదవు' అని యుండును

## తిర్యగ్జడంబులు వాచ్యంబు లగునపుడు లిడ్లాట్టుల ప్రథమ బహువచనంబున కేకవచనంబగు. ౨౯.

చిలుకలు పలికెను - చిలుకలు పలుకును - చిలుకలు పలికెడును - మేఘములు గర్జిల్లెను - మేఘములు గర్జిల్లును - మేఘములు గర్జిల్లెడును.

౨౯ క్రియచే తిర్యక్కులు, జడములును బోధింపఁబడినపుడు వాని ప్రథమపురుషములో బహువచన మండవలసినచోట ఏకవచనము వచ్చును. లిట్టు - చిలుకలు పలికెను' ఇచట చిలుకలు' బహువచనమేయైనను క్రియాపదముమాత్రము ఏకవచనముననే కలదు చిలుక' తిర్యక్కుగాన ఏకవచనమైనది లాట్టునందును పలుకును, పలికెడును' - అయినవి మేఘములు గర్జిల్లును' మొదలైనవియు నిట్టే

## లూట్టుదుఙ్ఙున కెడుతవర్ణంబులు ద్రుతాంతంబులగు. ౩౦.

ఆశీస్సు-మీకు మేలుగలిగెడును - మీకు మేలుగలుగుతను. శాపంబు - నీకు రాక్షసత్వంబు గలిగెడును - నీకు రాక్ష

సత్వంబు గలుగుతను. సంప్రార్థనంబు - హరి ననుఁ గృపఁ గాంచె డును-హరి ననుఁ గృపఁగాంచుతను

౨౬. లోట్టుడుష్షు = ఆశీర్వాదసంప్రార్థనములందు వచ్చు డు - రు వు - రు - ను - ము లు లోట్టన కగుప్రత్యయముల కన్నింటికిని ద్రుతాంతములగు ఎడు - తు' లు - అనఁగా ఎడును తను' అనునవి ఆదేశములుగా వచ్చును.

మీకు మేలు కలిగెడును కలుగుతను' అనఁగా మీకు మేలు కలుగుఁగాక' అను దీవన స్పష్టమగుచున్నది నీకు రాక్షసత్వంబు కలిగెడును కలుగుతను' అనుచో రాక్షసత్వము కలుగుఁగాక' యనుశాపార్థము స్పష్టమగుచున్నది హరిననుఁ గృపఁ గాంచెడును కాంచుతను' అనునెడ కాంచుఁగాక' అను ప్రార్థనము వ్యక్తమగుచున్నది

## విధియందు లోట్టునకు మాఱుగా న్నదియనుతచ్ఛబ్దంబును ముందు నుగాగమంబునగు. ౨౭.

మైత్రుండు నానిర్దిష్టకార్యంబు చేయునది వానికి నీవు బాసటయయి యుండునది.

౨౭. లోట్టు విధియందును వచ్చును అందు లోట్టునకు మాఱుగా అది' అను తచ్ఛబ్దమును దానికి ముందు నుగాగమము (నకారము) అగును - అనఁగా లోట్టునకు బదులుగా నది' అని వచ్చునని భావము

మైత్రుండు నానిర్దిష్టకార్యంబు చేయునది' అనుచో చేయు+లోట్' అని యుండఁగా లోట్టునకు నది' రాఁగా చేయునది' అని సిద్ధించినది. ఇచట చేసితీరవలె' నను ఆజ్ఞ స్పష్టమగుచున్నది వానికి నీవు బాసటయయి యుండునది' అనుచో బాసటగా నుండితీరవలె' ననియే యభిప్రాయము

**ఎడుతలద్రుతంబునకచ్చు పరంబగునపుడుమకారంబగు ౨౮.**

**నీకు మేలుగలిగెడుమనియెను-నీకు మేలుగలుగుతమనియెను.**

౨౮ ఆశీరాద్యర్థములలో లూట్టునకు ఆదేశములగు ఎడును తను' అనువాని నకారము తరువాత అచ్చున్నయెడల ఆనకారము మకారముగా మాఱునని యర్థము నీకు మేలు కలిగెడును+అనియెను = నీకు మేలు కలిగెడు మనియెను' అనుచో ఎడు కు తరువాతనున్న నకారము మకారమైనది. 'మేలు కలుగుతను+అనియెను = మేలు కలుగుత మనియెను'

**లూణ్మధ్యమ పురుషకు ముడుజ్జులగు. ౨౯.**

ఆశీస్సు-దీర్ఘాయువగుము - దీర్ఘాయులరగుఁడు శాపంబు-రాక్షసుఁడవగుము - రాక్షసులరగుఁడు. సంప్రార్థనంబు - నన్ను రక్షింపుము - నన్ను రక్షింపుఁడు విధి - నాచెప్పినపనిచేయుము - నాచెప్పినపని చేయుఁడు

౨౯ ఆశీశ్శాపసంప్రార్థనవిధులందువచ్చు లూట్టు' యొక్క మధ్యమ పురుషమునందలి పు' కు ము' అనునదియు, రు' కు ముఁడ్' (ము) అను నదియు నాదేశము లగును

ఆశీస్సు - మధ్య ఏకవచనము - దీర్ఘాయువు అగు+వు' అని యుండఁగా 'వు కు ము' వచ్చి దీర్ఘాయు వగుము' ఐనది

మధ్య బహువచనము - దీర్ఘాయులరు అగు+రు' అని యుండఁగా డుజ్జు' దానితోఁబాటు అఱసున్నయుఁవచ్చి దీర్ఘాయుఁలరగుఁడు' అయినది.

శాపాదుల యుదాహరణములందును ఇట్లే ప్రక్రియను గమనించునది.

**ఉభయప్రార్థనంబున దుగాగమంబున కత్వంబగు ౩౦**

మనము వండుదము

**జీత్తుపరంబగునపు డుత్వంబున కత్వంబగునను సూత్ర**

ముచే లజీ పరంబగునపు డత్వంబు ప్ర వండఁడు - వండరు.
వండదు-వండవు మ వండవు-వండరు ఉ వండను - వండము.

3౦ ఉభయప్రార్థనము = ఎదుటివానిని తనతోఁ గలిసి పనిచేయుటకుఁ బ్రార్థించుట - పనియందు తానును ఎదుటివాఁడును కర్తలగుట

నీవు నేను' కర్తలగునపుడు ౨౨ - వ సూత్రముచే తద్ధర్మాదు లందు ధాతువునకు విధింపబడిన దుగాగమమునందలి ఉకారమునకు అకారము ఆదేశముగా నగును

మనము వండుదు+ము = మనము వండుదము' ఇచట మనము' అను నది ఉభయప్రార్థనము తెల్పుచున్నది కాన దుగాగమమునందలి ఉకార మకారమైనది

వండు' ధాతువునకు వ్యతిరేకార్థమున వండు+లజీ అని యుండఁగా ప్ర. పురు ఏక లో డుజ్ఞువచ్చి వండు+డు' అని యుండఁగా ౨౦ - వ సూత్రముచే ధాతువుతుది ఉకారమునకు అకారము ఆదేశమైనది కాన వండఁడు' అయినది ఈయంశమే డిత్తు పరంబగునపుడు' అనుదానిచే వివ రింపఁబడుచున్నది

వండరు' మున్నగుచోట్లను ఇట్టి ప్రక్రియయే అని యెఱుఁగునది

## మధ్యమ ముడుజ్ఞులు ముజ్ఞు నాఁబడు 3౧

3౧ లూ మధ్యమపురుషమునకు ఏక బహువచనములలోవచ్చిన ము, డుజ్ఞు' లకు ముజ్ఞు అని సంజ్ఞ (పేరు)

## వ్యతిరేకంబున ముజ్ఞు పరంబగునపుడు కుజీయగు 3౨

నీవు వండకుము - మీరు వండకుఁడు

3౨ వ్యతిరేకార్థమున నగులజీయందు మధ్యమపురుషమున ము, డుజ్ఞు' లు పరమగునపుడు ధాతువునకు కుజీ (కు) ప్రత్యయము అగును.

వండు+లజీ' అనియుండఁగా ప్రార్థనమునందు మధ్యమపురుషమున

'ము డుజ్జు' లువచ్చి వందు+ము వందు+డు' అని యగును పిదప ఈ సూత్రముచే కుక్ వచ్చును కుక్ ఇత్తగుటచే ౨౦-సూత్రముచే ధాతువు చివరి ఉకారము అకారమగునుగాన వందకుము వందకుఁడు' అనురూపము లయినవి.

## సంప్రార్థనంబుల ముజ్జున కదాదులు విభాష ననుప్రయుక్తంబులగు. 33.

వందుమ-వందుమా - వందుమి - వందుమీ - వందుఁడ- వందుఁడా - వందుఁడి - వందుఁడీ అ-ఆ-ఇ-ఈ-ఎ-ఏ-ఒ-ఓ-అమ్మ- అయ్య ఇత్యాదు లదాదులు.

33 సంప్రార్థనమున ము డుజ్జు లకు అదాదులు (అ - ఆ - మున్నగునవి) వికల్పముగా చేర్పఁబడును వందుము + అ = వందుమ ' ఇట్లే తక్కినవియు

## ఎదాదు లనుప్రయుక్తంబులగునపుడు ముజ్జునకు వుక్ రుక్ యగు. 34.

వినవె-వినవే-వినరె-వినరే - వినకువె - వినకువే - వినకురె - వినకురే.

34 ఎదాదులు = ఎ - ఏ - ఒ - ఓ - అమ్మ అయ్య అనునవి. ఎదాదు లాయిను అనుప్రయుక్తములగునపుడు వానిముందున్న ము' కు వుక్ (వు)' డు' కు రుక్ (రు)' అనునవి యాదేశములగును

విను+ము' (౨౮-సూత్రముచే వు' కు ము') అనియుండఁగా 33- సూత్రముచే ఎ' అనుప్రయోగము పిదప నీసూత్రముచే వుక్' రాఁగా విను + వు + ఎ' అని యుండును. పిదప ౨౦ - సూత్రముచే ను' లోని ఉకారమున అకారము కాఁగా వినవె' అగును ఏ అనుప్రయుక్తమగుచో వినవే' అగును వినరె వినరే' అనునవియు నిట్లే బహువచనములు కావున అచట

ఉక్' యగుట విశేషము వినకువె మున్నగువానియందు వ్యతిరేకార్థమున కుక్ అగుట విశేషము తక్కిన ప్రక్రియ వెనుకటివలెనే

వినవా వినవో వినరా వినరో వినవమ్మ వినరమ్మ వినవయ్య వినరయ్య' మున్నగునవి ఏదాదులలో మిగిలినవాని కుదాహృతులు

## టవర్ణకంబు భావంబునందగు ౩౧.

భావంబనఁగా ధాత్వర్థంబు-వండుట-పండుట - వినుట - కనుట

౩౧ భావంబు = ధాత్వర్థము - వ్యాపారమునందు ట ప్రత్యయమగును

## కజివర్ణకంబు పురార్థయోగంబున విభాషను భావంబునందగు ౩౨.

వండక మునుపు-వండుటకు మునుపు-చేయక మునుపు-చేయుటకు మునుపు మునుపు - ముందు-మున్ను-తొల్లి.

౩౨ పురార్థయోగంబున = మునుపు ముందు మున్ను తొల్లి' మున్నగువానితో అన్వయము తోఁచునపుడు

'ముందు' మొదలగువానితో సమన్వయము తోఁచనపుడు భావార్థమున కజి' అను ప్రత్యయము వికల్పముగా నగును

వంటచేయుటకుముందు వంటచేయకుండుటయే యుండునుగాన ముందు' మున్నగువాని యన్వయమున వ్యతిరేకరూపమే తోఁచుట సహజము వండకమునుపు-' అనుచో మునుపు' అనుదానియోగమున 'వండు' ధాతువునకు కజి ప్రత్యయమువచ్చి వండు+క్ అనియుండి ౨౦-సూత్రముచే ధాతువు చివరి ఉకారము అకారముగా మారినది ఇట్లె తక్కిన యుదాహరణములయెడను ప్రక్రియగ్రాహ్యము.

కజి ప్రత్యయము రానిపక్షమున వండుటకు మునుపు' అనియుండును

వ్యతిరేకభావంబున మిజీ యగు 32

వ్యతిరేకవిశిష్టక్రియాభిధాయిధాతువునకు మిజీ యగు - వండమి - పండమి

32 వ్యతిరేకభావంబున=వ్యతిరేకధాత్వర్థమునందు వ్యతిరేకవిశిష్ట క్రియాభిధాయి=వ్యతిరేకార్థముతోఁగూడిన క్రియను దెలియఁజేయునది

వంటచేయుట అనుదానికి వ్యతిరేకము వంటచేయకుండుట' కాన వంటచేయకుండుట' అనునర్థమున ధాతువు కు మిజీ (మి) అగును వండు + మి' అని యుండఁగా ౨౦-వ సూత్రముచే వండు లోని డకారముమీఁది ఉకారము అకారమై వండమి' అని రూపము సిద్ధించినది పండు + మి= పండమి'

సమానాశ్రయంబులం బూర్వకాలంబునం డివర్ణకంబగు 33.

ఏకాశ్రయంబులగు క్రియలలోపల నెయ్యది పూర్వకాలికం బగుం దద్వాచియగు ధాతువున కివర్ణకంబగు ఇదియె క్త్వార్థంబు నాఁబడు వండి - పండి - విని - కని సమానకర్తృకంబులనక సమానాశ్రయంబు లనుటం జేసి చైత్రునిచేత మైత్రుండు కొట్టంబడి మడిసె నిత్యాది సిద్ధం బయ్యె.

33 సమానాశ్రయంబులన్ = ఏకాశ్రయంబులగు క్రియలయందు పూర్వకాలంబునందు=ముందుజరిగిన క్రియయందు ఒకవస్తువు నాశ్రయించు క్రియలలో ఏది ముందుజరిగినదో-అట్టి (ముందుజరిగిన) క్రియను దెలుపు ధాతువునకు ఇ' అను ప్రత్యయ మగును. ఇట్టిదానినే ఇకారము చివరవచ్చిన దానినే క్త్వార్థ మందురు వండు+ఇ=వండి' ఇట్లే తక్కినవియును. 'రాముఁడు వండి యేతెంచెను' అనుచోట వండుట ఏతెంచుట' అనుపనులు రెండును ఒక్కనినే-రామునినే ఆశ్రయించియున్నవి ఇందు పూర్వకాలికము (మొదట జరిగినది) వండుట కావున దానికే ఇ' వచ్చినది

సమానకర్తృకంబులనగా—సంస్కృతవ్యాకరణములో ఏకకర్తృకము లైన రెండు క్రియలలో ముందుజరిగినక్రియపయిని 'క్త్వా' ప్రత్యయము (క్త్వాతెలుఁగున 'ఇ' ప్రత్యయమునకు సమానము) వచ్చునని చెప్పఁబడినది. ఆపద్ధతియే తెలుఁగునను అనుసరించినయెడల రాముఁడు వండి యేతెంచెను' అనునట్టిచోట్ల బాధలేదు. (ఇచటఁగల రెండుక్రియలకును రాముఁడే కర్త) కాని చైత్రునిచేత మైత్రుండు కొట్టఁబడి మడిసెను' మన్నగుచోట్ల కుదురదు. ఈవాక్యమునందు కొట్టుట మడియుట' అను రెండుక్రియలు కలవు కొట్టిన వాఁడు చైత్రుఁడు మడిసినవాఁడు మైత్రుఁడు కాన రెండుక్రియలకును కర్తలు వేర్వేఱయిరి అందుచే మూలములో సమానకర్తృకము' లని చెప్పక 'సమానాశ్రయంబు లని చెప్పఁబడినది ఇచట కొట్టఁబడుట మడియుట' అను రెండు క్రియలకును ఆశ్రయమైనవాఁడు మైత్రుఁడు కాన మొదటజరిగిన 'కొట్టబడు' అనుదానికంటె ఇ' ప్రత్యయము వచ్చినది

## కజి వ్యతిరేకక్త్వార్థంబునందగు. ౩౯

వండక - పండక - కొట్టక - తిట్టక

౩౯ క్త్వార్థముయొక్క వ్యతిరేకమును బోధింపవలసివచ్చినపుడు ధాతువునకు కజి (క)' అను ప్రత్యయ మగును వండు+క' అనియుండఁగా ౨౦-సూత్రముచే ధాతువు చివరి ఉకారము అకారముగా మాఱి వండక' అయినది. పండక' మన్నగునవియు నిట్టే.

## తుమర్థభావలక్షణంబులందు నుజి యగు. ౪౦.

భావలక్షణంబునా నన్యక్రియకు లక్షణభూతంబగు క్రియ తుమర్థంబందును భావలక్షణంబునందును ధాతువునకు నుజిప్రత్యయం బగు తుమర్థంబు - చైత్రుండు వండను బోయెను. పాకక్రియార్థము పోయెనని యర్థము. భావలక్షణము -

చైత్రుండు వండ నతిథి వచ్చెను ఇచట వంట లక్షణము - వచ్చుట లక్ష్యము

౪౦ తుమర్థము=ఏక్రియనిమిత్తము వేఱొకక్రియ జరుగునో ఆ క్రియ తుమర్థము భావలక్షణము=వ్యాపారములలో నొకదాని కొకటి సూచకమగునేని ఆసూచకవ్యాపారమును బోధించునది వ్యాపారములలో నొకవ్యాపార మెప్పుడు జరిగెనో తెలిసికొనుటకు ఆవ్యాపారమును బోధించు క్రియారూపము అవకాశ మీయనపుడు అపని యిట్టిసమయమున జరిగెనని గుర్తించుట కవకాశము నొసంగుక్రియ భావలక్షణము బాగుగఁ దెలియునట్టి కాలముగల క్రియ తెలియనికాలముగలక్రియకు బోధకమగునేని-అప్రసిద్ధ కాలముగల క్రియ భావలక్షణమని భావము ఈయంశమే భావలక్షణంబునా' ఇత్యాది వివరణముచే సూచింపఁబడినది తుమర్థమున కుదాహరణము-చైత్రుండు వండను బోయెను ఇచట తుమున్నర్థకమగు నుజ్ఙ్యంతమునకు (వండను అనుదానికి) వంటచేయుటకు-' అని యర్థము వండు' ధాతువున కీవిధిచే తుమున్నర్థమున నుజ్ (ను)' యందు ౨౦-సూత్రముచే ధాతువు చివరి ఉకారమునకు అకారమునువచ్చి వండను' అయినది

ఇచట పోవుట' అనుపని వంటచేయునిమిత్తమయియుండుటచే వండు ధాతువునకు నుజ్ వచ్చె నని గ్రహింపనగును భావలక్షణమున కుదాహరణము-చైత్రుండు వండ నతిథివచ్చెను' ఇచట వచ్చెను' అనుక్రియకు వండ' ననునది లక్షణము కావున వండ' ననునది భావలక్షణము ఇచట వచ్చెను' అనిర్ధారితక్రియ ఎప్పుడు వచ్చునో తెలిసికొనుటకు వండు అనుక్రియ సాధకమగుచున్నది కాఁగా చైత్రుఁడు వండగా అతిథివచ్చెనని స్పష్టమగుచున్నది కావున వండు' అనుదానికి నుజ్వచ్చి వండను' అయినది

చేదర్థంబునందు వృత్తంబగు భావలక్షణంబునందు
నవర్ణకంబు ద్రుతాంతంబగు ౪౧.

వానలుగురిసినం బంటలు పండును. వాఁడు రమ్మనినఁ బోయితిని.

౪౧. చేదర్థంబు=(సంస్కృతమునందలి చేత్ అనుదానికి తెలుఁగున ఎని చో అయిన మున్నగునది సమానములు కాన) ఎని చో అయిన మున్నగునది బోధించునర్థము కార్యకారణభావాదికము వృత్తం బగుభావలక్షణంబు=కడచినవ్యాపారమును బోధించుభావలక్షణక్రియ (భావలక్షణమనఁగా ఇతరక్రియకు లక్షణభూత మగుక్రియ యని యీవలకే చెప్పఁబడినది )

చేదర్థక మగుధాతువునకును కడచినవ్యాపారమును బోధించు భావలక్షణమగుక్రియకును ద్రుతము చివరఁగల న ప్రత్యయము ('నను' అనునది) అగునని సూత్రార్థము

'వానలు కురిసినం బంటలు పండును-' అనునది చేదర్థమున కుదాహృతి ఇచట పంటలు పండుట కార్యము దానికి 'వానలు కురియుట' కారణము. 'వానలు కురిసినచోఁ బంటలు పండును' అనియర్థము కాన కారణమయిన 'కురియు' ధాతువునకుం బై 'నను' వచ్చినది వృత్తంబగుభావలక్షణమున కుదాహృతి- 'వాఁడురమ్మనినం బోయితిని' ఇచట 'పోయితిని' అనుక్రియకు 'అనిన' అనునది లక్షణము కావున 'రమ్ము' ననునది భావలక్షణము 'రమ్ము' అని చెప్పినందున పోయితి ననుటవలన నిది వృత్తమగు (జరిగిపోయిన) భావలక్షణము 'పోయితిని' అనిర్థారితక్రియ ఎప్పుడుపోయెనో తెలిసికొనుటకు 'అను' అనుక్రియ సాధక మగుచున్నది కాఁగా వాఁడు రమ్మని పలుకఁగా 'నేను బోయితిని' అని స్పష్టమగుచున్నది కావున 'అను' అనుదానికి 'నను' చేరినది

**ఆనంతర్యంబున దువర్ణకంబు ద్రుతాంతంబగు. ౪౨.**

జాబిలి తోఁతెంచుడుం గువలయంబులు వికసిల్లె.

౪౨. (అంతరము=ఎడము అనంతరము=ఎడములేకుండుట ) ఆనంతర్యమున=వ్యవధిలేకుండుట తోఁచుచుండఁగా-వెంటనే అని భావము.

అవ్యవధానము తోఁచుచుండఁగా కారణ మగుక్రియావాచకము కంటె ద్రుతముతోఁగూడిన డు' అగును కారణము ప్రకాశితమయిన వెంటనే కార్యము కలిగెనేని ఆకారణమును దెల్పుక్రియావాచకమునకు డును' అను ప్రత్యయము అగునని భావము

జాబిలితోఁతెంచుడుంగువలయంబులు వికసించె'—ఇచటఁ గువలయములు వికసించుటకు జాబిల్లి ఉదయించుట కారణము చంద్రుఁ డుదయించిన వెంటనే కలువలు వికసించునుగాన నిచట ఆనంతర్యము స్పష్టము కావున ఉదయించుట' యనునర్థముగల తోఁతెంచు' అనునది ఆనంతర్యమునుదెల్పు కారణక్రియయగుటచే దానికి డును' ఐనది

**చువర్ణకంబు ద్రుతాంతంబు క్రియాన్వయంబున శత్రర్థంబునందగు 83.**

చూచుచుం బోవుచున్నాఁడు - చూచుచుం బోయెను- చూచుచుం బోవఁగలఁడు.

83 సంస్కృతమున శతృ' ప్రత్యయము వర్తమానార్థమునందు విధింపఁబడినది తెలుఁగున ఆశతృప్రత్యయార్థమున ద్రుతమంతమందుఁగల 'చు' అనుప్రత్యయము (చున్) ధాతువు చివఱవచ్చును ఈ చును' అసమాపకక్రియాబోధకము కాన-సమాపకక్రియతో నన్వయములేనిది ప్రత్యేకముగ నుండఁజాలదు కావుననే క్రియాసమన్వయంబున' అగునని చెప్పఁబడినది అనఁగా సమాపకక్రియతో అన్వయరూపమగు సంబంధమునం' దని యర్థము.

చూచుచుం బోవుచున్నాఁడు' ఇచట పోవుచున్నాఁడు' అను (సమాపక)క్రియతో చూచు'క్రియకు అన్వయము తోఁచుచున్నది. కావున దానికి శతృ ప్రత్యయార్థమున (వర్తమానార్థమున) చును' వచ్చి చూచుచును' అయినది సమాపకక్రియ వర్తమాన భూత భవిష్యత్కాలములలో దేనిని

బోధించుచున్నను దానితో నన్వయించుక్రియకు కర్త్రర్థమున ద్రుతాంత మగు చువర్ణకము కలుగవచ్చునని యభిప్రాయము. మీఁదిది వర్తమానకాల మున కుదాహృతి చూచుచుం బోయెను' అనునది భూతకాలమున నుదాహర ణము చూచుచుం బోవఁగలఁడు అనునది భవిష్యత్కాలమున నుదాహృతి.

## తృవర్ణకార్థంబునం డెడియెడువన్నియలగు. ౪౪

ప్రహారించెడివాఁడు - ప్రహరించెడువాఁడు ప్రహర్త యని యర్థము

౪౪ వన్నియలు = వర్ణకములు-ప్రత్యయములు సంస్కృతమున తృచ్' ప్రత్యయము కర్త్రర్థమున విధింపబడినది

కర్త్రర్థమునందు ధాతువునకు ఎడి ఎడు' అను ప్రత్యయములు వచ్చును

ప్రహరించు + వాఁడు = ప్రహరించెడివాఁడు ప్రహరించెడువాఁడు

ఇచట ప్రహరించు' ధాతువు కర్త యను నర్థమునందు దానికి ఎడి వచ్చి ప్రహరించెడివాఁడు' అనియు ఎడు' వచ్చి ప్రహరించెడువాఁడు' అనియు నైనది ఈప్రత్యయములు కర్త' అనునర్థమున వచ్చినవి. ప్రహరిం చెడి (డు) వాఁడనఁగా ప్రహరించుటకు కర్త' అని యర్థము.

ప్రహర్త' అనునది కర్త్రర్థమునవచ్చిన తృచ్' ప్రత్యయాంతము.

## వానికి లోపంబు బహుళంబుగానగు ౪౫.

ప్రహరించువాఁడు - ప్రహర్తయని యర్థము

౪౫ వానికి = ఎడి ఎడు' ప్రత్యయములకు వెనుకసూత్రముచే కర్త్రర్థమున విధింపఁబడిన ఎడి ఎడు' ప్రత్యయములు బహుళముగా లోపిం చును వానికి లోపము రాఁగా ప్రహరించు' అనియే యుండును అప్పుడు సమాస. ౯ - సూత్రముచే కర్త్రర్థమును తెలుపఁగల తచ్ఛబ్దముచేరి ప్రహ రించువాఁడు' అగును.

ఉన్న కలజె నవర్ణకంబులు
భవద్భావిశతృ క్తవదర్థంబులందగు. ౪౬.

ఉన్నవర్ణకంబు వర్తమానార్థక శతృర్థంబునందగు - కలజెవర్ణకంబు భవిష్యదర్థక శతృర్థంబునందగు - నవర్ణకంబు క్తవదర్థంబునందగు ఇవి సత్వాభిధానంబునం దగునని యెఱుంగునది సుబంతవాచ్యంబు సత్వంబునాఁబడు వండు చున్న వాఁడు-వండఁగలవాఁడు-వండినవాఁడు

౪౬. ఉన్నకలజె నవర్ణకంబులు = ఉన్న కలజె న - అను ప్రత్యయములు భవద్భావిశతృ క్తవదర్థంబులందు - భవద్భావిశతృ = వర్తమానార్థక శతృర్థమునందును భవిష్యదర్థకశతృర్థమునందును క్తవదర్థంబునందు=భూత కాలమును దెల్పు క్తవత్ప్రత్యయార్థమునందును. అనఁగా వర్తమానార్థకశతృర్థమునందు ధాతువుచివఱ ఉన్న అనునదియును భవిష్యదర్థకశతృర్థమునందు కలజె' అనునదియు భూతార్థక క్తవత్ప్రత్యయార్థమునందు న అనునదియు చేరునని సూత్రార్థము మఱియు(నీప్రత్యయములు) పదార్థములను బోధించునప్పుడే వచ్చును

సుబంతవాచ్యంబు = సుబంతముచేఁ జెప్పఁబడినది - డు - ము - వు మున్నగువిభక్తిప్రత్యయము చేరునది ఆట్టిదియే సత్వము - ద్రవ్యము - వస్తువు - పదార్థము రాముఁడు వృక్షము మున్నగునవి సుబంతములు ఉన్న-కలజె - నవర్ణకాంతములు నామవాచకములకు విశేషణములగుట సహజము కావున నవి సత్వమును (ద్రవ్యమును) దెల్పుచుండును.

వండుచున్నవాఁడు—' వండుధాతువునకు ఈసూత్రముచే వర్తమాన శతృర్థమున ఉన్న' వచ్చి ౧౪ - సూత్రముచే ఉన్నకు' ముందు చు' చేరి వండుచున్న' అనురూపము కలిగెను పిదప సమాస. ౯ సూత్రముచే తచ్ఛబ్దము అనుప్రయుక్తమైనది.

వండఁగలవాఁడు—' ఇచట వండు' ధాతువునకు భావికర్త్రర్థమున 'కలశే' ప్రత్యయమువచ్చి పిదప ౨౦ ౨౧ సూత్రములచే అత్వము నుగాగమమునువచ్చి వండఁగల' అయినది పిదప సమాస ౯-సూత్రముచే శచ్ఛబ్దమను ప్రయుక్తమైనది

వండినవాఁడు -' ఈ సూత్రముచే వండు' ధాతువునకు క్తవదర్థమున న వర్ణకమును, అది భూతార్థకమగుటచే ౧౭ - సూత్రముచే ధాతువునకు ఇగాగమంబును రాఁగా వండు+ఇ+న=వండిన' అయినది పిదప సమాస. ౯-సూత్రముచే శచ్ఛబ్దమను ప్రయుక్తమయినది

## వ్యతిరేక తృవర్ణకార్థంబున నిజి యగు ౪౭.

వండనివాఁడు - ఎడిప్రభృతివర్ణకాంతంబు లేదును ధాతుజవిశేషణంబులని ప్రాచీనులు వ్యవహరింతురు

౪౭ వ్యతిరే తృవర్ణకార్థంబున = కర్త్రర్థకవ్యతిరేకరూపమున వ్యతిరేకకర్త్రర్థకమున ధాతువునకు నిజి' (ని) అగును

వండు+ని+వాఁడు = వండనివాఁడు' ఇచట వ్యతిరేకార్థమున నిజి రాఁగా ౨౦ - సూత్రముచే ధాతువుచివఱి ఉకారము అకారముగా మాఱి, సమాస. ౯-సూత్రముచే శచ్ఛబ్దమను ప్రయుక్తమయినది

ఎడిప్రభృతి - ౪౪ - సూత్రముచే నగు ఎడి ఎడు' ౪౫ - సూత్రముచే వానిలోపము ౬౬ - సూత్రముచే ఉన్న - కలశే - న ౪౭ - సూత్రముచే నిజి వచ్చినవానిని ధాతుజవిశేషణములని యందురు (౧ ఎడి. ౨ ఎడు ౩ దీనిలోపము. ౪ ఉన్న. ౫ కల ౬. న ౭ ని)

## లకారాదులు సకర్మకంబునకుం గర్తృకర్మంబులందును లాఁతికిం గర్తయందునగు. ౪౮.

సకర్మకంబునాఁ గర్త్రాకాంక్షోత్థాపకంబు - అకర్మకంబునాఁ గర్త్రాకాంక్షానుత్థాపకంబు.

౪౦ లకారాదులు = లట్టు లిట్టు మొన్నగునవి సకర్మకంబునకు = కర్మతోఁగూడియున్న ధాతువునకు లాఁతికిన్ = ఇతరమునకు - కర్మతోఁ గూడియుండనిదానికి - అకర్మకమునకు లట్టు, లిట్టు లృట్టు లోట్టు లూట్టు లశ్ ట మొన్నగునవి సకర్మకధాతువులకు కర్త్రర్థమునందును కర్మార్థమునందును వచ్చును అకర్మకధాతువులకు (కర్మ లేనందున) కర్త్రర్థమునందు వచ్చును

సకర్మకంబునాఁ గర్మాకాంక్షోత్థాపకంబు = సకర్మకమనఁగాఁ గర్మకు ప్రశ్నము కలిగించునది - క్రియాపదము ననుసరించి ఎవనిని దేనిని వేనిని ఎవరిని' అనురీతి ప్రశ్నించుట కవకాశము కలిగించునది అకర్మకంబునాఁగర్మా కాంక్షానుత్థాపకంబు = అకర్మక మనఁగాఁ గర్మనిమిత్తమగు శంకను గలిగింపనిది— క్రియాపదము ననుసరించి ఎఁనిని ఎవరిని దేనిని వేనిని' అనురీతిని ప్రశ్నించుట కవకాశమునీయనిది

రాముఁడు పాఠములను చదివెను' - ఇచట చదివెను' అనఁగానే 'వేనిని చదివెను? అను ప్రశ్నకలుగును గాన చదువు' ధాతువు సకర్మక, మయ్యెనని యెఱుఁగునది ఇచటి క్రియాపదము కర్తనే బోధించుచున్నది, కావున (ఎవఁడు? = రాముఁడు - అని) కర్త్రర్థమునందు లిట్టు' కలిగెనని గ్రహించునది. ధాతురూపముచేఁగర్తచెప్పఁబడెనేని కర్త్రర్థమునందు లకారము (లడాదులు) కలుగుననియు కర్మచెప్పఁబడినచో కర్మార్థమున లకారము కలుగుననియు తెలిసికొనఁదగును అనఁగా క్రియాపదము ననుసరించి ప్రశ్నింపఁగా కర్త సమాధానమైనచో కర్త్రర్థకమనియు కర్మ సమాధానముగా వచ్చుచో కర్మార్థకమనియు గ్రహింపవలెనని భావము

రామునిచేఁ బాఠములు చదువఁబడెను' - ఇచట చదువఁబడెను' అను దానిచే చదువఁబడినపాఠములే బోధ్యములగుటచే నిట చదువు' ధాతువునకుఁ గర్మార్థమునందు లిట్టు' అయ్యెనని గ్రహింపవలెను కర్మార్థమున పడుక్' అనుబంధము ధాతువునకు అగునని తరువాతి (౪౯ - వ) సూత్రముచేఁ జెప్పఁ

బడుచున్నది. కావున ఇచటి కర్మార్థకధాతువునకు పడు' చేరి లిట్టున చదువఁబడెను' అని యయ్యెను

అకర్మకమున కుదాహరణము - దీపము వెలిఁగెను' ఇచట వెలిఁగెను' అను క్రియచే కర్తయే బోధ్యమగుచున్నది కర్మ బోధ్యము కాఁజాలదు ఇచట వెలిఁగెను' అను క్రియాపదము ననుసరించి ఎవనిని దేనిని' అని ప్రశ్నించుట కవకాశము లేదుగదా

పడుజ్యనుబంధంబు కర్మంబునందగు ౨౯

కొట్టఁబడుచున్నాఁడు - కొట్టఁబడుచున్నది - కొట్టబడుట - కొట్టఁబడనివాఁడు

౨౯ ధాతువునకుఁ గర్మార్థమునందు పడుజ్' (పడు) అనునది చేర్పఁబడును.

కొట్టఁబడుచున్నాడు—' అనుచోట కొట్టు' ధాతువునకు ౨౦ - సూత్రముచే వర్తమానార్థమునందు లట్టును కర్మార్థమున పడుజ్' యును ౩౦ - సూత్రముచే పడు' పరమగునపుడు ఉకారమునకు అకారమును ౩౧ - సూత్రముచే నుగాగమమును వచ్చినవి వర్తమానార్థమున అగు ఉన్న' అను బంధము చు ఉన్నకుదీర్ఘము మున్నగునవి వచ్చుట గ్రహించునది
(కొట్ట+పడు+చు+ఉన్నాఁడు = కొట్టఁబడుచున్నాఁడు )

అమహత్తున ౧౩ - సూత్రముచే ది' కాఁగా కొట్టఁబడుచున్నది' ఐనది

కొట్టఁబడుట—' అనునది కర్మార్థమున భావార్థక టప్రత్యయము వచ్చినరూపము. కొట్టఁబడనివాఁడు' అనునది కర్మార్థమున వ్యతిరేకార్థమునైన రూపము

**గురువిరహితంబులయి యయాంతంబులయిన**
**యేకస్వరద్విస్వరంబుల యించుగ్వక్రంబుల**
**కియుడాగమంబు విభాషనగు ౫౦**

ఏకస్వరధాతుద్విస్వరధాతువులమీ(ది యించుగ్వక్రంబుల కియుడాగమంబు విభాషనగు గురుమంతంబగు ధాతువునకును యాంతంబగు ధాతువుసకును మీ(ది యించుగ్వక్రంబుల కియుడాగమంబు రాదు భుజ్ - ఇయ్ - ఇంచు - భుజియించు - పక్షంబున - భుజించు గుణ - ఇయ్ - ఇంచు - గుణియించు-గుణించు యించుగ్వ్యవధానంబునం జేసి సంస్కృత ధాతువులు వక్రపరకంబులు లేవని యెఱుంగునది యాచ్ - అర్థ-ఇత్యాదులు గురుమంతంబులు వ్యయ - ఇది యాంతము. యాచించు-అర్థించు-వ్యయించు జి - ఇంచు - అనుచో నిత్యంబగుటంజేసి యయుగాగమంబు రా(గా యాంతంబగుటంజేసి యియుడాగమంబు లేదని యెఱుంగునది. కృతాకృతె ప్రసంగి నిత్యంబునా(బడు నగు - ఇయ్ - ఇంచు-నగియించు - నగించు-నగు-ఇయ్-ఎను - నగియెను - నగెను పడు - ఇయ్ - ఎను - పడియెను-పడెను ఇత్యాదు లెఱుంగునది

౫౦ గురువిరహితంబులు = గురువులగువర్ణములు లేనట్టివి —(దీర్ఘాక్షరములు, అనుస్వారమునకు(గాని విసర్గకు(గాని సంయుక్తాక్షరమునకు(గాని ముందున్న అక్షరములును గురువులు అయాంతంబులు = యకారాంతములు కానట్టివి ఎకస్వర ద్విస్వరంబులు = ఒక్కయచ్చుకలవియు రెండచ్చులు కలవియు నగుధాతువులయొక్క ఇంచుక్ = ౬౩-౭౦ సూత్రములచే విధింప(బడు ఇంచుక్' ఆగమమునకును వక్రంబులకు = వి ఓలకును, విభాష = వికల్పము.

గురువుకలుగనట్టివియు తుదను యకారము లేనట్టివియు నొకయచ్చు గాని రెండచ్చులుగాని గల్గినట్టివియు నగుధాతువులకంటెఁ బరములగు ఇంచుక్' లయొక్క యికారమునకు ముందు ఇయుట్' (ఇయు) ఆగమముగా వికల్పముగా నగును అట్టిధాతువులకుఁ బరమగు ఏ ఓలకును ఈ ఇయుట్ వికల్పముగా ఆగమమగును - అని సూత్రమున కర్థము

ఇయుట్' అనునది టకారము ఇత్తుగాఁగల (పోవునట్టి) ప్రత్యయమగుటచే ఇంచు' లోని ఇకారమునకును వక్రము (ఏ ఓ) లకును ముందే యగునని గ్రహింపవలెను

గురువుగలిగినట్టివియు యకారము తుదనుబొందినట్టివియు రెండిటికి మించిన అచ్చులుగల్గినట్టివియు నగుధాతువుల కియుడాగమము కలుగదని స్పష్టార్థము వివరింపబడెను ఏకస్వరధాతు ద్విస్వరధాతువులు = ఒక్కయచ్చుగలధాతువులు రెండచ్చులుగలధాతువులును ఇంచుగ్వక్రంబులకు = ఇంచుక్కునకును వక్రములకును - ఏ ఓ లకును గురుమంతంబులు = గురువు కలవి భుజ్ + ఇయ్ + ఇంచు = భుజియించు భుజించు—

ఇట భుజ్ అనునది సంస్కృతధాతువు దానికి ౬౩-వ సూత్రముచే ఇంచుక్ ఆగమమైనది. (ఇంచుక్కు కిత్తు కావున ధాతువు చివఱ జేరినది )

ఇయుడాదేశము రానిపక్షమున (వికల్పమగుటచే) భుజ్ + ఇంచు = భుజించు' అని యగును మీఁదిది ఏకస్వరధాతువున కుదాహృతి

గుణ + ఇయ్ + ఇంచు = గుణియించు గుణించు.' గుణ' సంస్కృత ధాతువు. దానికి ౬౩-వ సూత్రముచే ఇంచుక్' వచ్చినది ఈధాతువు గురువర్ణము లేనిదియు యకారాంతము కానిదియు నగుటచేతను దీని ఇంచుక్' నకు ఇయుడాగమము వచ్చినది ఇది రానపుడు గుణ + ఇంచు = గుణించు' అగును మీఁదిది రెండచ్చులధాతువునకు ఉదాహరణము.

ఇంచుగవ్యవధానంబు—సంస్కృతధాతువునకును ప్రత్యయసంబంధమైనవక్రమునకు నడుమ 'ఇక్' ఆగమముచేరుటచే ఆధాతువునకు వక్రము పరమగుట సంభవింపదు-సంస్కృత ధాతువులకుఁ బరముగా భూత తద్ధర్మార్థకములందగు ఎను-ఎడు-ఎడి-' అను ప్రత్యయముల సంబంధమైన ఎకారములకు ముందుగా-ధాతుప్రత్యయములకు నడుమ ౬౩-వ సూత్రముచే నిత్యముగా ఇంచు' చేరుచుండును కావున ధాతువునకు వక్రము పరమగుట ఎప్పుడును సంభవింపదని భావము. వక్రములకుఁ బూర్వ ముండుట తెలుఁగుధాతువులకే సంభవించుననుట

యాచ్+ఇంచు=యాచించు' ఇదిగురువుకలది (యా' గురువు)కాన దీనికి ఇయుండాగమంబు రాలేదు ఇట్లే అర్థ+ఇంచు=అర్థించు' అనుచోటను అ గురువగుటచే ఇయుట్' ఆగమము కాలేదు వ్యయ+ఇంచు=వ్యయించు'-అనునది గురుమంతము కాదు కాని యకారాంతమైన ధాతువు కావున దీనికిని ఇయుట్' రాలేదు

జి+అయ్+ఇంచు=జయించు'—అనుచోట జి ధాతువునకు ౬౩-వ సూత్రముచే ఇంచుగామము రాఁగా ౬౪-వ సూత్రముచే అయుగాగమము (అయ్) నిత్యముగా వచ్చినది (జి+ఇంచు'అనుచోట ౬౪-వ సూత్రముచే నిత్యముగ అయుక్' వచ్చుచున్నది ౫౦-వ సూత్రముచే వికల్పముగ 'ఇయుట్' వచ్చుచున్నది నిత్యవిధి వికల్పవిధిని బాధించును గావున ఇయుట్' ను త్రోసి అయుక్' అనునదియే యచట వచ్చినది) అయుక్' వచ్చినపిదపఁగూడ అవకాశమున్నచో ఇయుట్ రావచ్చును కాని అయుండాగమము రాఁగా ఇది యకారాంతమగుటచే ఇయుండాగము' నకు ప్రసక్తి లేకుండఁబోయినది.

కృతాకృతప్రసంగి నిత్యంబుగాఁబడు—ఇంచుక్కునకు ఇయుండాగమము' చేసినను జేయకున్నను జి' ధాతువునకు అయుక్కు' రావచ్చును, అయుక్కు' చేసినపిమ్మట జయ్' (జి+అయ్-సంధి) అనునది యాంతంబు

కావున ఇంచుక్కునకు ఇయుండాగమమురాదు. కనుక ఇయుండాగమము నిత్యముకాదు అయుగాగమమే నిత్యము కావుననే వికల్పమగు ఇయుట్టు' ను బాధించి నిత్యమగు అయుట్టు' జి' ధాతువునకు వచ్చినది

నగు+ఇయ్+ఇంచు=నగియించు నగించు'-ఇదివఱకు సంస్కృత ధాతువులమీఁద ఇయుట్టు వచ్చుటకే ఉదాహరణము లీయఁబడెను. ఇఁక తెలుఁగు ధాతువుమీఁదను వచ్చునని తెలుపుట కీయుదాహరణ మీయఁబడు చున్నది ఇచటి నగు ధాతువు గురువులేనిది యకారాంతము కానిది రెండచ్చులుకలది కావున దీనికంటెఁ బరమైన ఇంచుక్కు' నకు ఇయుట్' వచ్చినది ఇయుండాగమము రానపుడు నగించు' అయినది వక్రములకు ఇయుట్' వచ్చుట కుదాహృతి- నగు+ఇయ్+ఎను=నగియెను నగెను నగు' కంటెఁ బొలుత ద్రుజ్జు రాఁగా దానికి ఎను ఆదేశమయ్యెను అప్పుడీసూత్రముచే ఎనులోని ఎ' (వక్రము) అనుదానికి ఇయ్' ముందుగా ఆగమమయినది, ఇయుట్' రానపుడు నగు+ఎను=నగెను' అగును

## పడ్వాదుల నవర్ణకంబున కత్వంబును గడహల్లునకు ద్విత్వంబును విభాషనగు ౫౧

పడ్డ-పడిన-పడ్డను-పడినను - పడు - ఇడు - చెడు - తగు - అగు-కను-కొను-తిను-మను-విను-చను-ఇవి పడ్వాదులు

౫౧. పడు' మున్నగుధాతువుల న' ప్రత్యయమునకు హ్రస్వమగు అకార మాదేశమగును దానితోఁబాటు ధాతువుల చివఱిహల్లునకు ద్విత్వము నగును. ఈయత్వద్విత్వములు వికల్పము.

పడు' ధాతువుకంటె ౪౬-వ సూత్రముపట్టి భూతార్థమున న' ప్రత్యయ మగును. ౧౭-వ సూత్రముచే ధాతువునకు ఇగాగమ మగును 'పడు+ఇ+న=పడిన' అగును అప్పుడీసూత్రముచే న' హ్రస్వమగు అకారముగా మాఱి పడి' లోని డకారమునకు ద్విత్వము రాఁగా పడ్డి+అ' అగును

అపదాదిస్వరనిత్యసంధి (సంధి. ౧౧ సూత్రము) చేయఁగా పడ్డ' అగును. హ్రస్వాకారద్విత్వములు రానప్పుడు పడిన' అని యుండును పడ్డను పడి నను' అనునవియుఁ నిట్లే ఇచ్చట ౪౧-వ సూత్రము ననుసరించి ద్రుతాంతమైన న' వర్ణకము-అనఁగా ను' వచ్చినది పయిరీతిని ఇడిన ఇడ్డ-చెడిన-చెడ్డ-' మున్నగు రూపములను గ్రహించునది

## క్రియాఫలంబు కర్తృగామియగుచోఁ గొనుధాతు వనుప్రయుక్తంబగు ౫౨

ఇదియె యాత్మనేపదార్థంబని వ్యవహరింతురు - వండు కొనుచున్నాఁడు

౫౨ క్రియాఫలము=వ్యాపారముచే సిద్ధించెడి ఫలము కర్తృగామి= (పనిని చేయు) కర్తనే చెందినది వండుట' మొదలగు క్రియలయొక్క ప్రయోజనము కర్తనే చెందినదయినచో (ముఖ్య) ధాతువునకు కొను' అను నది చేర్పఁబడును

ఇదియె—ముఖ్యక్రియతో కొను' ధాతువు మేళవించుటయే యాత్మనేపదార్థమని వాడుదురు

(దేవదత్తుఁడు) వండుకొనుచున్నాఁడు ఇచట క్రియయైన వంటకు అంతిమప్రయోజనము భోజనము ఆఫలము దేవదత్తునే చెందునట్లు సూచింపఁ బడుచున్నది దేవదత్తుఁడు తాను భుజించుటకొఱకే వంటచేయుచున్నాఁడని చెప్పినప్పుడే ఈ కొను' ధాతు వనుప్రయుక్తమగును ఇతరులు భుజించుట కయి అతఁడు వండినచో వండుచున్నాఁడు అనియే యుండును

## కొనుధాతువు పరంబగునపు డిగాగమంబు బహుళంబుగానగు. ౫౩

వండికొనియె - వండుకొనియె బహుళం బనుటచే యాంతంబునకు నిత్యంబు చేసికొనియె.

౫౩ అనుప్రయుక్తమగు కొను ధాతువు పరమగునపుడు ధాతువు చివఱ ఇక్ (ఇ) అనునాగమము బహుళముగా నగునని సూత్రార్థము

వండు+ఇ+కొనియెను = వండికొనియెను వండుకొనియెను-'

ఇచట కొను పరము కాఁగా వండు' నకు ఇ' ఆగమమై సంధి ౧౧-సూత్రముచే సంధియైనది ఇగాగమము రానప్పుడు వండుకొనియె అగును కొన్నియెడల నిత్యముగా వచ్చుటయు బహుళము' నకు లక్షణము కావున యకారాంతధాతువులకు ఇగాగమము నిత్యమని యెఱుఁగవలెను

చేయు+ఇ+కొనియె = చేసికొనియె ఇచట ౫౪-వ సూత్రముచే యకారమునకు సకార మాదేశమయి నిత్యసంధి వచ్చినది

ఇకారవక్రంబు లుక్తంబులం దలివి పరంబులగుచో
యాకు సకారంబగు ౫౪.

చేయు - చేసిరి - చేసి - చేసికొను-చేసెను - చేసెడిని - ఇత్యాదు లెఱుంగునది

౫౪ ఇకారవక్రంబులు = ఇకారమును ఎకారమును ఉక్తంబులంద లివి = (ఇదివఱకు) చెప్పఁబడినసూత్రములందున్నవి పూర్వసూత్రములచే విధింపఁబడినవి

[ఇదివఱకు) ౧౭ సూత్రముచే భూతమున ఇగాగమము (ఇ) విధింపఁబడినది ౫౩ - సూత్రముచే కొనుధాతువు పరమగునపుడు ఇగాగమము (ఇ) విధింపఁబడినది ౩౮ - సూత్రముచే క్త్వార్థమున ఇకారము విధింపఁబడినది ౧౬ - సూత్రముచే ఎను' ౨౩ - సూత్రముచే ఎదగాగమమును ఎడుగాగమము ఎడిగాగమములు' ను ౨౬ - సూత్రముచే ఎదు' ప్రత్యయమును ౪౪ - సూత్రముచే ఎడి యెడు' లును విధింపఁబడినవి ఇచటి ఉక్తంబులంద లివి' అనుదానిచే పైవిధులచే నగు ఇకారమును ఎకారమును గ్రహింపవలయును ]

ఇదివఱకుఁ జెప్పఁబడినవిధులచేనైన ఇకార ఎకారములు పరమగు చుండఁగా యకారాంతధాతువుల చివఱియకారమునకు నిత్యముగా సకార మాదేశమగునని సూత్రార్థము

చేయు+ఇ+రు = చేసిరి' ఇది చేయుధాతువు భూతకాలికప్రథమ పురుషబహువచనరూపము చేయు' ధాతువుకంటె ౧౭ - సూత్రముచే ఇగాగమము వచ్చినది అది పరమగుచుండఁగా యకారమునకు సకార మాదేశమైనది చేసు+ఇ+రు' అని యుండఁగా తత్సమ ౭౬ - సూత్రము ననుసరించి రేఫమీఁది ఉకార మికారముగా (రు రి - గా) మాఱినది పిదప చేసు+ఇ' అనుచోట అపదాదిస్వరనిత్యసంధి (సంధి ౧౧ సూత్రము) వచ్చి చేసిరి' అనురూపము సిద్ధించినది

చేసి (చేయు+ఇ) ౩౦ సూత్రముచే క్త్వార్థమున ఇకారమువచ్చినది అది పరమగునపుడు యకారము సకారముగా మాఱి సంధివచ్చినది. చేయు+ఇ+కొను = చేసికొను' - ఇచట చేయు' నకు కొను' అనుప్రయుక్తము కాఁగా ౫౩ - చే వచ్చిననిగాగమము పరమగుచుండఁగా యకారమునకు సకార మాదేశమయి సంధివచ్చినది

చేయు+ఎను = చేసెను' ఇది ధాతువునకు ఎ' (వక్రము) పరము కాఁగా య' కు స' అగుట కుదాహృతి చేయు+ఎడి+ఎను = చేసెడిని.' 'చేయు' ధాతువునకు ప్రథమపురుషమునందలి ను' పరముగుచుండఁగా ౭౩ - సూత్రముచే ఎడిగాగమమువచ్చినది ఎ' వక్రమగుటచే దానికిముందున్న ధాతు యకారము సకారముగా మాఱినది

## చువర్ణకంబు పరంబగునపు డన్వాదుల కుత్వలోపంబేని నుస్థానంబున బిందువేని విభాషనగు ౫౫

అన్చున్నాఁడు - అంచున్నాఁడు - అనుచున్నాఁడు - అన్చును - అంచును - అనుచును అను - కను - కొను - తిను- మను-విను-ఇవి యన్వాదులు

౫౫ చు' ప్రత్యయము పరమగునపుడు ను' చివఱఁగల అను' మొదలగుధాతువుల ను' లోని ఉకారమునకు వికల్పముగా లోపమైనను కలుగును లేదా ను' అనుదానికి నిండుసున్నగాని వికల్పముగా నగును.

(అన్వాదులలో ను' నుడి తొలిహ్రస్వముమీఁదనే యున్నందున సూత్రములోని యనుస్వారమును నిండుసున్నగానే భావింపవలెను. అను+చు +ఉన్నాఁడు = అన్చుచున్నాఁడు అంచున్నాఁడు అనుచున్నాఁడు.' మీఁదివి 'అను' ధాతువునకు ప్రథమపురుషైకవచనరూపములు ఇందలి చు' ప్రత్యయము ౧౪ - సూత్రముచే ఉన్న' పరమగునపుడు కలిగినది ఆ చు' పరమగునపుడు ధాతువు చివఱి ను' లోని ఉకారము లోపింపఁగా అన్చున్నాఁడు' అని అయినది 'ను' నిండుసున్నగా మాఱి అంచున్నాఁడు' అయినవి ఈ రెండును రానిపక్షమున అనుచున్నాఁడు' అనియే యుండును. ఇట్లు త్రివిధములుగ నుండును అను+చును = అన్చును, అంచును అనుచును' అను' ధాతువునకు ౪౩ - సూత్రముచే శత్రర్థక చు' వర్ణకము ద్రుతాంతము రాఁగా ఈసూత్రముచే ను' లోని ఉకారమునకు లోపమును ను' కు నిండుసున్నయును వికల్పముగా వచ్చినవి అన్వాదులు = అను' మున్నగునవి.

ఉన్నశబ్దంబు పరంబగునపు డుండుధాతువునకు లోపంబగు ౫౬.

ప్ర. ఉన్నాఁడు - ఉన్నారు - ఉన్నది ఉన్నవి. మ. ఉన్నావు - ఉన్నారు. ఉ. ఉన్నాను-ఉన్నాము. ఉన్నవాఁడు.

౫౬. క్రియా ౧౩-సూత్రముచే లట్టు పరమగునపుడు విధింపఁబడిన 'ఉన్న' యును ౪౬ - సూత్రముచే విధింపఁబడిన ఉన్న' యును పరమగునపుడు ఉండు' ధాతువు లోపించునని భావము.

ఉండు+ఉన్న+ఁడు = ఉన్నాఁడు' (౧౫ - వ సూత్రముచే 'ఉన్న' కు దీర్ఘము ధాతులోపము.) ఇట్లే తక్కినవియును. 'ఉన్నది, ఉన్నవి'

అనుచోట్ల ౧౭ - వ సూత్రముచేతనే ది - వి అనునవి పరమగునపుడు దీర్ఘము నిషేధింపఁబడుట గ్రహింపనగును

## చేదాద్యర్థనాంతంబయిన యుండున కున్నాదేశంబు విభాషనగు ౫౭.

ఉన్నను - ఉండినను

౫౭ చేదాద్యర్థనాంతంబయిన = ఎవి ఐన' మున్నగు నర్థములందు వచ్చిన నకారము చివరఁ గలిగియున్న - చేదాద్యర్థకమయిన నకారముతోఁ గూడిన ఉండు' ధాతువునకు ఉన్న' అను నాదేశము వికల్పముగా నగును అనఁగా ౪౧ - సూత్రముచే ద్రుతాంతవర్ణకముతోఁ గూడిన ఉండు' ధాతువునందలి ఉండి' అనుభాగమునకు ఉన్న అనునది ఆదేశమగునని యర్థము ఉండినను' - అనునది ఉండు ధాతువునకు చేదర్థక మగురూపము, దానిలోని ఉండిన' అనుభాగమునకు ఉన్న' వికల్పముగా ఆదేశము కాఁగా ఉన్న + ను = ఉన్నను' అనురూపము ఏర్పడును ఉన్న' ఆదేశమగుట వికల్పముగాన ఉండినను' అనియు నుండును

## తిదుటలు పరంబులగునపు డన్వాదుల నుస్థానంబున సున్నయు నుండుదులోపంబును విభాషనగు ౫౮.

అందురు - అంట - ఉందురు - ఉంట. పక్షంబున - అను దురు-అనుట-ఉండుదురు-ఉండుట-ఇత్యాది

౫౮ తి దు ట' అనునవి పరములగునపుడు అను' మున్నగు ధాతువుల ను' కు బదులు నిండుసున్నయు ఉండు' ధాతువుయొక్క దు' అను దానికి లోపమును వికల్పముగా నగును.

అన్వాదులనుస్థానంబున = అను' మున్నగువాని ను' కు బదులుగా ఉండు దులోపంబు = ఉండు' ధాతువులోని దు' అనుదానికి లోపమును

తి' కి ఉదాహృతి తర్వాత నీయఁబడును. అను+దు+రు=అందురు అనుదురు' ఇచట అను' ధాతువుకంటె తద్ధర్మాద్యర్థమున లాట్ప్రత్యయమును, ౮-వ సూత్రముచే లకారమునకు ప్రథమాబహువచనమున రు' వచ్చినది ౨౨ వ సూత్రముచే దుగాగమము కలిగినది పిదప ఈసూత్రముచే దు' పర మగుచుండఁగా ను' నిండుసున్నగా మాఱి అందురు' అయినది ఇది వికల్ప మగుటచే అనుదురు అనియు నగును

అను+టి=అంట అనుట'- అను' ధాతువుకంటె ౩౫-వ సూత్రముచే భావార్థమున ట' వచ్చిన పిదప ను' నిండుసున్నగా మాఱి అంట' అగును ఆ ఆదేశము రానప్పుడు అనుట' అనియే యుండును

ఉండు+దు+రు'=ఉందురు ఉండుదురు' ఇచట ఉండు' ధాతువు నకు తద్ధర్మాద్యర్థమున ప్రథమాబహువచనమున రు' ౨౨-వ సూత్రముచేదుగా గమమువచ్చి పిదప నీసూత్రముచే ఉండు' లోని డు' లోపింపఁగా ఉందురు' అయినది లోపము వికల్పము కాన అది రానప్పుడు ఉండుదురు' అనియే యుండును ఉండుట' అనునప్పుడును మీఁదిరీతినే డు' వికల్పముగా లోపించి ఉంట ఉండుట' అనియగును

## ఇట బిందుపుమీఁది తద్దలకు నిత్యవైకల్పికంబులయి టడలగు. ౫౯

అంటివి - అనితివి - అండురు - అందురు ఉంటివి - ఉండితివి-ఉండురు-ఉందురు.

౫౯ ఇట=ను' సున్నగా మాఱినపుడును డు' లోపించినపుడును, బిందుపుమీఁది తదలకు=నిండుసున్నకుఁ దరువాతనున్న తకారదకారములకు నిత్యవైకల్పికంబులు = తకారమునకు నిత్యముగాను దకారమునకు వికల్పము గాను అను' మున్నగువాని ను' సున్నగా మాఱినపుడును ఉండు' లోని 'డు' లోపించినపుడును-ఆధాతువులకు తి దు ట' లు పరమగునపుడు నిండు

సున్నకు దర్వాతనున్న తకారమునకు నిత్యముగా టకారము ఆదేశమగును నిండుసున్నకు దర్వాతనున్న దకారమునకు వికల్పముగా డకారము ఆదేశమగు నని యర్థము.

త్రను+తి+వు=అంటివి అనితివి ఇచట అను ధాతువునకు భూత కాలము మధ్యమపురుషైకవచనమున వు' ౧౮-వ సూత్రముచే తివర్ణకమయి నది పిదప తత్సను ౫౬-వ సూత్రముచే వు' లోని ఉకార మికారముగా మాఱినది ౨౮-వ సూత్రముచే తి కి ముందున్న ను' నిండుసున్నగా మాఱి ఈ ౨౯-వ సూత్రముచే తకారము ట' కారముగా మాఱి అంటివి' అయి నది ను' నిండుసున్నగా మాఱనిపక్షమున ౧౭-వ సూత్రముచే ఇగాగమము వచ్చి సంధియై అనితివి' అయినది

అను+దు+రు = అండురు అందురు' అందురు' ఎట్లగునదియు వెనుకటి సూత్రవివరణమునఁ జెప్పఁబడినది ఈ సూత్రముచే బిందువుమీఁది దకారము డ' కారముగా మాఱి అండురు' ఐనది ఈడకారాదేశము వికల్పముకావున ఇది రానపుడు 'అందురు' అగును అదియుం రానప్పుడు అను దురు' అని యుండునని ౨౮ సూత్రముచే వివరణముననే తెలుపబడినది

ఉండు+తి+వు - ఉంటివి ఉండితివి.' ఇచట ఉండు' ధాతువు నకు భూతకాలమధ్యమపురుషైకవచనమున వు' ౧౮ సూత్రముచే తి' వర్ణ కమును వచ్చి తత్సమ ౫౬ సూత్రముచే వు లోని ఉకారము ఇకారమై నది పిదప ౨౮ సూత్రముచే వికల్పముగా డు' లోపము తర్వాత నీ సూత్ర ముచే బిందువునకు దర్వాతనున్న తకారము టకారముగా మాఱఁగా ఉంటివి' అయినది డు' లోపింపనపుడు ౧౭ సూత్రముచే ధాతువునకు ఇగాగమము వచ్చి సంధియయి ఉండితివి' అని యగును

ఉండు+దు+రు = ఉండురు ఉందురు ఉండుదురు.' ఇచట 'ఉండు' ధాతువునకు తద్ధర్మార్థమున ప్రథమపురుష బహువచనమున రు'

౫౭ సూత్రముచే దుగాగమమువచ్చినది ౫౮. సూత్రముచే డు' వికల్పముగా లోపింపఁగా ఉంఁడురు' అగును ఈ ౫౯ సూత్రముచే బిందుపూర్వ దకారమునకు ద' కారము వికల్పముగా ఆదేశముకాఁగా ఉండురు' అయినది ఈ ఆదేశము రానపుడు ఉందురు' అనియుం డు లోపించనపుడు 'ఉండుదురు' అనియుఁగూడ ఉండును.

ముజ్జు పరంబగునపుడు కోశబ్దంబు కొనునకు
బహుళంబుగా నగు ౬౦

బహుళంబనుటచే దీనికి నొకానొకచో నతిచారంబని యెఱుంగునది

౬౦ ముజ్జు = మధ్యమపురుషమందలి ముదు' ప్రత్యయములు మధ్యమపురుషము దుజ్జులు పరమగునపుడు కొను' అను దానికి కో' అనునది బహుళముగా ఆదేశమగును. సూత్రములో బహుళము' అని చెప్పుటచేత (వికల్పమనిచెప్పక) ముజ్జు పరముగానున్న కొన్నిచోట్ల కొను'నకు కో' అను నది యాదేశ మగునని గ్రహింపవలెను

అతిచారంబు=మితిమీఱి సంచరించుట-సూత్రమునందుఁ జెప్పబడిన స్థలమునందే గాక ఇతరస్థలములందును బ్రవర్తించుట యని భావము

ముజ్జు పరంబగునపుడు దీర్ఘంబునకు హ్రస్వంబును
మువర్ణకంబునకు మాముడియు నగు. ౬౧.

కొమ్ము - కొనుము - కొండు - కొనుఁడు.

౬౧ ముదు' అను మధ్యమపురుష ప్రత్యయములు పరమగునపుడు వానికి ముందున్న దీర్ఘములు హ్రస్వములగును మువర్ణకమునకు ద్విత్వమగును- 'ము' మ్ము గా మాఱుననుట.

కొను + ము = కొమ్ము కొనుము'-ఇచట పూర్వసూత్రముచే ము' పరమగునపుడు కొను' నకు 'కో' ఆదేశమైనది పిదప ప్రకృతసూత్రముచే

కో' కొ'గా మాఱి మ' ద్విత్వమునొంది కొమ్మ' అయినది కో' ఆదేశము బహుళమగుటచే అది రానప్పుడు కొనుము' అని యుండిపోయినది

కొను+(డు=కొందు కొనుఁడు'-ఇచట (డు' పరమగుచో కొను' నకు కో' ఆదేశమైనపిదప కో' హ్రస్వముగా మాఱినది ప్రత్యయమగు డు' విత్తుకావున దానికి ముందు బిందువగును సంధి ౨౨-వ సూత్రము నను సరించి నడి తొలిహ్రస్వముమీఁద అఱసున్న యుండదుకావున నిండుసున్నయే వచ్చి కొందు' అయినది కో ఆదేశము బహుళము కావున అది రానపుడు కొనుఁడు' అని యుండును

చదువుకొను+మి = చదువుకోమి చదువుకొనమి' ఇచట మఱు పర ముగాలేకున్నను మిశే పరమైయున్నను కొను' నకు కో ఆదేశమయినది. ఇట్లగుటకు ౬౦ సూత్రములోని బహుళగ్రహణమే ఆధారము ఇట్లే చదువు కొననేల? కు చదువుకోనేల? అనియు, చదువుకొనక' కు చదువుకోక' అనియు రూపము లుండవచ్చుననుట గ్రహింపనగును

రువర్ణకంబు పరంబగునపుడు సున్నమీఁది తదడల యుత్వంబునకు లోపంబు విభాషనగు ౬౨

పోషింత్రు - పోషింతురు - కొంద్రు - కొందురు కొండ్రు - కొండురు.

౬౨ మధ్యమపురుషబహువచనప్రత్యయమగు రు' పరమగునపుడు నిండుసున్నకుఁ దరువాతనుండు తు-దు-డు' ల ఉకారము వికల్పముగా లోపించును

పోషించు+దు+రు=పోషింత్రు పోషింతురు'-ఇచట ౧౦౮ సూత్ర ముచే చుదు' లకు తు' ఆదేశము రాఁగా పోషింతురు' అగును అప్పుడీ సూత్రముచే రు' పరమగునపుడు సున్నమీఁది తకారముమీఁది ఉకారము వికల్పముగా లోపింపఁగా పోషింత్రు' అగును ఉకారలోపము రానపుడు 'పోషింతురు' అనియే యుండును

## క్రియాపరిచ్ఛేదము

కొను+దు+రు=కొంద్రు కొందురు'-అను-చోట అన్వాదుల నుకారమునకు ౧౮-వ సూత్రముచే నిందుసున్నయును ప్రకృతసూత్రముచే దకారముమీఁది ఉకారమునకు లోపమును రాఁగా కొంద్రు' అయినది. ఉకారలోపము రానప్పుడు కొందురు అని యుండును కొను+దు+రు' అని యుండఁగా 'ను' నిండుసున్నగా మాఱి ౧౯-వ సూత్రముచే దకారమునకు దకారము ఆదేశముకాఁగా కొందు+రు' అనియుండగా ప్రకృతసూత్రముచే దకారము మీఁది ఉకారము లోపించి కొంద్రు అగును ఉకారము లోపింపనపుడు 'కొందురు' అని యుండును.

### సంస్కృతంబున కంగలాదుల కించుక్కగు ౬౩.

సంస్కృతధాతువుల కంగలాదుల కించుగాగమంబగు - పచించు-వచించు - త్యజించు - భజించు అంగలించు. అంగల-అడక - ఆరగ - ఆవుల - ఉంక - ఉగ్గడ - ఓసర-కార - గాల - జాడ - తిలక - తులక - పంక - పరిక - పలవ - అప్ప - ఒప్ప - ఆల-ఇత్యాదు లంగలాదులు.

౬౩ సంస్కృతధాతువులకును అంగల' మొదలగు తెలుఁగుధాతువులకును ఇంచుక్' అనునాగమము కలుగును ఇయ్యది కిత్తు (కకారము ఇత్సంజ్ఞగాఁగలది) కావున ధాతువుచివఱనే చేరుచుండును.

పచ్+ఇంచు=పచించు' ఇట్లే తక్కినసంస్కృతధాతువులును.

అంగల+ఇంచు=అంగలించు' ఇచట సంధి ౧౧ సూత్రముచే నిత్యసంధి ఇట్లే తక్కిన తెలుఁగుధాతువులును

### ఇఉఋుల కించుక్కు పరంబగునపు డయుగపుగరుక్కులగు. ౬౪

జి - జయించు. నీ - నయించు ద్రు - ద్రవించు లూ-లవించు. ధృ-ధరించు తౄ-తరించు.

౬౮ ఇకారాంతధాతువులకంటెను ఉకారాంతధాతువులకంటెను, ఋకారాంతధాతువులకంటెను ఇంచుక్కు (ఇంచు) పరముగా నున్నపుడు- ఇకారాంతములకంటె అయుక్కు (అయ్) అనునదియు ఉకారాంతముల కంటె అవుక్' (అవ్) అనునదియును ఋకారాంతములకంటె అరుక్' (అర్) అనునదియును ఆగమములుగా నగును ఇకారాంతములు- జి+అయ్+ ఇంచు=జయించు' (ఇచట 'అయ్' పరముకాఁగా సంధి ౧౧-వ సూత్రము ననుసరించి నిత్యసంధి ) నీ+అయ్+ఇంచు=నయించు' ఉకారాంతములు- ద్రు+అవ్+ఇంచు=ద్రవించు'

లూ+అవ్+ఇంచు = లవించు ఋకారాంతములు ధృ+అర్+ ఇంచు=ధరించు

కౄ+అర్+ఇంచు=కరించు' ఇందన్నియెడల సంధి ౧౧ సూత్రముచే నిత్యసంధియని యెఱుఁగునది ఇచటి ఇ-ఉ-ఋ'లు హ్రస్వ దీర్ఘములు రెండింటిని గ్రహించునని ఉదాహరణములవల్లను స్పష్టమగుచున్నది

నిర్జినామంబుల కయుగాగమంబు గలుగదు. ౬౯

నిర్జికి నామధాతువుల కయుగాగమంబు గలుగదు. నిర్జించు - నుతించు - స్తుతించు ఈజ్ఞాపకంబుచేతనే నామంబులకు ధాతుత్వవివక్షయం దించుగాగమంబగునని యెఱుంగునది. శయనించు-పయనించు.

౬౯ నిర్జినామంబులకు=నిర్జిధాతువునకును ధాతుత్వవివక్షగల నామములకును (అనఁగా నామధాతువులకును నిర్జిధాతువు ఇకారాంతములగు నామధాతువులును (ఇకారాంతము లగుటచే) వెనుకటి సూత్రము ననుసరించి అయుగాగమమును పొందవలసియున్నవి కాని వానికి అయుగాగమము రాదని యర్థము

నిర్జి+ఇంచు=నిర్జించు' ఇచట సంధి ౧౧ సూత్రముచే సంధివచ్చినది,

అయుగాగమమేవచ్చినచో ఇట నిర్ణయించు అని కావలసియున్నది. కాని, ఆరీతిని కాలేదు నుతి+ఇంచు=నుతించు'=ఇచట నుతి నామధాతువు దాని కించుక్కు వచ్చి నుతించు' అయినది ఇది ఇకారాంతమైనను అయుక్కు రాలేదు. (అది వచ్చినచో నుతయించు' కావలసియున్నదికదా) ఇట్లే స్తుతించు' అనునదియును

ఈజ్ఞాపకము—నామధాతువులకు ఏసూత్రములచేతనుగూడ ఇంచుక్కు' విధింపఁబడలేదు దేనివల్లనైనను ఒకకార్యము ప్రాప్తించునపుడే దానిని నిషేధించునావశ్యకత కలుగును తొలుతనే ప్రాప్తిలేనపుడు నిషేధమనావశ్యకముకదా ఈసూత్రమున నామధతువుల కించుక్కు పరమగుచో అయుగాగమములేదు' అని చెప్పుటచేతనే-వేఱే విధిలేకున్నను ఈ సూత్రమే నామములకు ధాతుత్వవివక్షయందు ఇంచుగాగమమగును' అను విషయమును జ్ఞాపకము చేయుచున్నది కావుననే శయన' శబ్దమునకును తద్భవమగు పయన' శబ్దమునకుచు ధాతుత్వవివక్షయందు ఇంచుక్కు' వచ్చి శయనించు పయనించు' అనురూపము లగ్న్యునని గ్రహించునది

## సంస్కృతంబునకు లఘూపధంబున కించుక్కు పరంబగునపుడు గుణంబగు ౬౬

అ-ఏ-ఓ- ఈ మూఁడును గుణంబులు నాఁబడు ఋస్థానికం బగు గుణంబు రపరంబయియుండు. సంస్కృతధాతూపధలకు-ఇ - ఉ-ఋ - అనువానికి సొరిదిని - ఏ-ఓ-అర్ - అనునవి యించుక్కు పరంబగునపు డగునని యెఱుంగునది ఛిద్ - ఛేదించు - భిద్ - భేదించు - ఘుష్ - ఘోషించు - పుష్ - పోషించు-వృష్-వర్షించు-హృష్-హర్షించు

౬౬. లఘూపధంబునకు=(ఉపధ అనఁగా చివఱియక్షరమునకు ముందున్నఅక్షరము) లఘువైన (గురువుకాని) అక్షరము ఉపధగాఁగలది

లఘూపధము. అట్టి యక్షరమునకు (దీర్ఘాక్షరములును ం ః ద్విత్వసంయుక్తాక్షరములకు ముందున్న అక్షరములు గురువులనియు తక్కినవి లఘువులనియు నీవలనే చెప్పఁబడినది) గుణము=అ ఎ ఓ అను మూడచ్చులు

లఘువర్ణము ఉపధగాఁగల సంస్కృతధాతువునకు ఇంచుక్కు పరముగా నుండునపుడు గుణమగును

సంస్కృతధాతువులలో ఉపధగానున్న ఇ ఈ ఎ యను ఉ ఊ ఓ యును ఋ ౠ అర్ అనునది గాను వచ్చును ఋకారస్థానమునవచ్చిన 'అ' రేఫతోఁగూడి వచ్చును.

ఛిద్+ఇంచు=ఛేదించు' ఇచట ఛి లోని ఇకారము లఘువైన యుపధ కాన దానికి ఏ' ఆదేశమయి (ఛేద్+ఇంచు) ఛేదించు' ఐనది. అట్లే భేదించు అనునదియును

ఘుష్+ఇంచు=ఘోషించు' అనుచో ఘుకారముమీఁది ఉకార ముపధగనుక దానికి ఓ' ఆదేశమయి ఘోషించు' అయినది పోషించు ఇట్లే

వృష్+ఇంచు = వర్షించు' ఇచట ఋకారముపధ దానికి అర్' వచ్చి (వ్+అర్ ష్+ఇంచు) వర్షించు' అని యైనది. ఇట్లే హర్షించు'

స్పృశికి గుణంబు విభాషనగు. ౬౭.

స్పర్శించు - స్పృశించు

౬౭ స్పృశ్' అను సంస్కృతధాతువునకు గుణము వికల్పముగా నగును స్పృశ్+ఇంచు=స్ప+అర్+శ్+ఇంచు=స్పర్శించు' అగును గుణము రానిచో స్పృశించు' అనియే యుండును

లిఖ భుజ రుచ కృశంబులకు గుణంబు లేదు. ౬౮.

లిఖించు - భుజించు - రుచించు - కృశించు. రుచధాతువునకు గుణంబు లేదని యొకండు వక్కాణించె నది గ్రాహ్యంబు గాదు

౧౮ 'లిఖ్' మున్నగు నాలుగు సంస్కృతధాతువులకును గుణము రాదు ౧౭ వ సూత్రముచే గుణము వచ్చుచుండఁగా నీసూత్రముచే నిషేధింపఁబడుచున్నది

లిఖ్+ఇంచు=లిఖించు' అగునుగాని లేఖించు కాఁజాలదు 'భుజించు' భోజించు' కాదు 'రుచించు'ను రోచించు'గా వాడరాదు 'కృశించు'ను 'కర్శించు'గా చెప్పరాదు

కుచ్+ఇంచు=కోచించు.' దీనికి కోచించు అని చెప్పరాదనియు, 'కుచించు' అనియే చెప్పవలెననియు నొకరుచెప్పిరి సంకుచించు' అను ప్రయోగము సంకుసాల నృసింహకవివ్రాసిన కవికర్ణరసాయనము' అను పద్యకావ్యమున (అ ౧ ప) కనఁబడుచున్నది కాని సంకోచించు' అని గుణముతోఁ గూడిన ప్రయోగమే ప్రసిద్ధమై యున్నది కాన కుచించు' గ్రాహ్యము కాదు

## సృజికి నిర్మితిని గుణంబు లేదు ౧౯.

చతుర్ముఖుండు ప్రజలను సృజించె. అతండు విషయంబుల విసర్జించె. ౯౬

౧౯ సృజ్'అనుధాతువునకు పుట్టించు' అనునర్థమునందు ౧౭-సూత్రముచే వచ్చుగుణము రాదు వేఱగునర్థములలో గుణమురావచ్చును చతుర్ముఖుఁడు ప్రజలను సృజించె' అనుటకు సర్జించె' అని చెప్పరాదు విడిచెను' అను నర్థమున గుణమువచ్చి విసర్జించె అని యుండవచ్చును

## సర్వంబునకుం ప్రేరణంబునం బించుక్కగు ౨౦.

పచింపించు - వచింపించు - ఆవులింపించు - వండించు - పండించు

౨౦ సర్వంబునకు=తత్సమధాతువులకును, దేశ్యధాతువులకును గూడ,

ప్రేరణంబున=ప్రోత్సహించుటలో చేయు' అనునర్థమున ధాతువు లన్నిటికిని ప్రేరణార్థమునందు ఇంచుక్కు' వచ్చునని యర్థము

ఇదివఱకు కొన్ని ధాతువులకు స్వార్థము (ధాత్వర్థము) నందు ఇంచుక్కు' విధింపఁబడినది అట్టివానికిని ఈసూత్రముచే ప్రేరణమున ఇంచుక్కు' వచ్చును అనఁగా కొన్నియెడల ఇంచుక్కు' మీఁద ఇంచుక్కు' వచ్చునని యభిప్రాయము

పచించు+ఇంచు=పచింపించు' ఇచట పచ్ ధాతువునకు స్వార్థమున ౬౩ సూత్రముచే ఇంచుక్కు' వచ్చి పచించు' అయినది దానికి ప్రకృత సూత్రముచే ప్రేరణమున(పచించునట్లు చెయుమనను నర్థమునందు) ఇంచుక్కు' వచ్చినది ౮౨-వ సూత్రముచే మొదటి ఇంచు' లోని చకారము పచించు', లోని చకారము) పకారముగా మాఱినది వచింప్చించు అవ్వలింప్చించు' అనునవియు నిట్లె వందు+ఇంచు=వండించు పండు+ఇంచు=పండించు'

## రంజాదుల యించుక్చకారంబునకు సబిందుకంబున కప్రేరణంబున ద్విరుక్తలకారంబగు. ౨౧

రంజిల్లు - భాసిల్లు - వర్ధిల్లు - విలసిల్లు-రాజిల్లు ఈయాదేశయోగంబున భిదాదు లకర్మకంబులగు. భేసిల్లు - కంపిల్లు సంధిల్లు.

౨౧ రంజాదులు = రంజ్' మున్నగుధాతువులు ఇంచుక్చకారంబునకు సబిందుకంబునకు = బిందువున్నతోఁగూడిన ఇంచు' లోని చకారమునకు ంచ్' అనుదానికి ద్విరుక్తలకారంబు = ల్ల్' అనునది

రంజాదులకు ౬౩ వ సూత్రముచె స్వార్థమునందువచ్చిన ఇంచుగాగమములోని ంచ్' అనుదానికి ఆదేశమయి ల్ల్' అగును రంజ్+ఇంచు, రంజ్+ఇ+ల్ల+ఉ=రంజిల్లు' - ఇచటి ఇంచు' లోని ంచ్' నకు ల్ల్' అయినది 'భాసిల్లు' మున్నగునవియు నిట్లే

ఈయాదేశయోగంబున — ఈద్విత్వలకారము ఆదేశమైనపుడు భిద్' మున్నగుధాతువులు అకర్మకములగును ఉదా — భేదిల్లు కంపిల్లు సంధిల్లు భేదిల్లుట అనఁగా బ్రద్దలగుట కంపిల్లుట = చలించుట సంధిల్లుట = కలిసి కొనుట.

## ఇంచుక్కు పరంబగునపుడు రంజాదుల యించుక్కునకు లోపంబగు ౭౨

లాదేశంబున కపవాదంబు - రంజించు - భేదించు - సంధించు

౭౨ ఇంచుక్కు పరంబగునపుడు = ప్రేరణార్థకమగు ఇంచు' అనునది పరమునందుండఁగా రంజాదుల ఇంచుక్కునకు = రంజ్ మున్నగుధాతువులకు స్వార్థమునందువచ్చిన ఇంచు' అనునది 'ప్రేరణార్థకమగు ఇంచు' పరమగుచుండఁగా రంజ్ మున్నగువానికి స్వార్థమునందువచ్చిన ఇంచు లోపించునని భావము

లాదేశంబున కపవాదము = ఈ యించుక్కు' లోపము ౭౧-వ సూత్రముచే విధింపఁబడిన ద్విత్వలకారవిధికి బాధకము ౭౨ నకు ౭౧ సూత్రముచే ల్' రాకముందే ఈసూత్రముచే ఇంచు' అనుదాని కంతకును లోపమువచ్చునని భావము అపవాదము = బాధకము రంజ్ + ఇంచు + ఇంచు = రంజించు రంజ్' ధాతువునకు ౬౩ - సూత్రముచే స్వార్థమున ఇంచుక్కువచ్చి పిదప ప్రేరణార్థమునందు ౭౦-సూత్రముచే (రెండవ) ఇంచుక్కువచ్చినది ప్రకృతసూత్రముచే ఈరెండవ (ప్రేరణార్థమగు) ఇంచుక్కు పరమగుచుండఁగా మొదటి (స్వార్థమునవచ్చిన) ఇంచుక్కు లోపించి రంజించు' అయినది

(రంజించు = సంతోషింపఁజేయు - అనునది సకర్మకము రంజిల్లు = సంతోషించు అనునది అకర్మకము.)

ఇట్లే భేదించు సంధించు' అనునవియును భేదించు = బ్రద్దలగునట్లు

చేయు - (సకర్మకము) ఛేదిల్లు = బద్దలగు - (అకర్మకము) సంధించు = కలిగించు - (సకర్మకము) సంధిల్లు = కలుగు (అకర్మకము)

**చుగాగమం బాచ్ఛికంబున కసంయుక్తనలడరాంతంబునకుం బ్రేరణంబున బహుళంబుగా నగు. 23**

పూను-పూనుచు - పూనించు. తేలు-తేలుచు-తేలించు మగుడు - మగుడుచు మగిడించు కుదురు - కుదురుచు - కుదిరించు విను - వినుచు. వక్ష్యమాణంబు పుగాగమంబు - వినిపించు బాహుళకంబుచేఁ గొన్నింటికిఁ జుగాగమంబు లేదు. అను - అనిపించు తిను - తినిపించు. కను - కనిపించు దీని యత్వంబునకు దీర్ఘంబునగు - కానిపించు

23 అసంయుక్తనలదరాంతంబునకు = నకార లకార డకార రేఫద్విత్వంబు చివఱ లేనట్టిదానికి సంయుక్తములుకాని న-ల-డ-ర అను వర్ణములు చివఱఁగల అచ్చతెలుఁగుధాతువులకుఁ బ్రేరణమున చుక్' అనునది బహుళముగా నగును చుక్ - కిత్తు కావున ఇది ప్రకృతికిఁ జివఱ చేరును)

ఆచ్ఛికమున కగునని చెప్పుటచేత సంస్కృతధాతువులకుఁ బ్రేరణమున 'ఇంచుక్కు' వచ్చునుగాని చుక్కు' రాదని గ్రహించునది

అచ్చతెలుఁగుధాతువగు పూను' నకు చుక్కు' రాఁగా పూనుచు' అగును ఈ చుక్కు' రానప్పుడు ఇంచుక్కు' (20-సూత్రముచే) వచ్చి 'పూనించు' అగును

ఇట్లే తేలు మగుడు కుదురు విను - మున్నగువానికిని రూపద్వయము గుర్తించునది విను' ధాతువునకు చుక్కు' రానపుడు ఇంచుక్కు' రాఁగా విను+ఇంచు' అని యుండఁగా ముందుచెప్పఁబోవు 24-సూత్రముచే పుగాగమమువచ్చి వినిపించు' అగును

ఈవిధి బహుళమని చెప్పుటచే కొన్నింటికి చుగాగమము రాదని గ్రహింపవలెను అను' ధాతువునకు చుక్కు' రాదు ఇంచుక్కే యగును.

ఆయించుక్కు పరమగుచో ౨౭ సూత్రముచే పుగాగమమయినది అను+పు+ఇంచు' అనియుండఁగా ౨౧ సూత్రముచే పకారముతోఁ గూడిన ఇంచు' (పించు) అనునవి పరమగుచుండఁగా ధాతువు చివరి ఉకారము ఇకారముగా మారి అనిపించు అయినది ఇట్లే ప్రేరణార్థములో కను' ధాతువునకు కనిపించు' అనియు తిను ధాతువునకు తినిపించు అనియు రూపములగును. ౨౨-వ సూత్రము ననుసరించి కనుపించు' లోని కకారముమీఁది అకారమునకు దీర్ఘమై కానిపించు' అనియు నగును

## అట్లు పుగాగమంబును మాన్వాదులకగు ౨౮

మాను-మానుపు-మానుచు మను - మనుపు - మనుచు. బాహుళకంబున దీని కించుక్కు లేదు.

౨౮ అట్లు = ప్రేరణమున అసంయుక్తనాంతములయిన — వెనుకటి సూత్రమునందుఁ జెప్పినరీతిని సంయుక్తముఁ గాని నకారము చివరఁగల మాను' మున్నగు ధాతువులకు ప్రేరణమునందు పుక్' అను నాగమము బహుళముగా నగును మాను+పు = మానుపు' ఈయాగమము బహుళముకాన ఇది రానపుడు చుక్కు'(౨౩ సూత్రముచే) రాఁగా మానుచు' అని యగును ఆచుక్కు కూడబహుళమగుటచే అదియురానపుడు ౨౦।సూత్రముచే ఇంచుక్కురాఁగా ౨౭ సూత్రముచే వికల్పముగా పుగాగమము మానిపించు మానించు' అను రూపము లగును ఇట్లు నాల్గురూపము లగును

మను ధాతువునకు చుక్పుగాగమములచేఁ' గ్రమముగ మనుచు' మనుపు' అను రెండురూపములగును బహుళమనిచెప్పుటచే మను' ధాతువునకు ఇంచుక్కు రానందున మనించు' అనురూపము కాఁజాలదు

## చుక్పువర్ణంబులు పరంబు లగునపు డిత్వంబున కుత్వంబగు. ౨౯

౨౫ ప్రేరణార్థమునందువచ్చు చుక్కు పు - అనునవి పరమగునపుడు వానిముందున్న ఇకారమునకు ఉకారమగును

బిగియు' ధాతువునకు ప్రేరణమున చుక్కు' రాఁగా ౨౬ సూత్రముచే చివఱియక్షరము (యు) లోపించి ప్రకృతసూత్రముచే గి లోని ఇకారము ఉకారముగా మాఱి బిగుచు' అగును

## అట్లు చుక్పుగాగమంబు లడంగ్వాది మాయ్వాదులకగు నగుచో వానికడవ్రాలు లోపించు ౨౬.

అడఁగు - అడఁచు - అడఁగించు. మాయు - మాపు - మాయించు అడఁగు - కరఁగు - కలఁగు - నలఁగు - ఇత్యాదు లడంగ్వాదులు మాయు-ఉడుగు - కడచు - కుడుచు-బిగియు- ఇత్యాదులు మాయ్వాదులు. ఆఁగు ప్రభృతు లుభయగణంబులు బాహుళకంబునంజేసి కొన్నింటి కిం చుక్పుక్పుగాగమంబులు పూఁడును, గొన్నింటికందు యథాసంభవముగా రెండును గొన్నింటి కొక్కటియు నగునని యెఱుంగునది ఆఁగు - ఆఁచు - ఆఁపు - ఆఁగించు రేఁగు - రేఁచు - రేఁపు-రేఁగించు - పాయు - పాచు - పాపు విఱుగు - విఱుచు. చూచు-చూపు నేరుచు - నేరుపు మేయు - మేపు లేచు - లేపు కలియు - కలుపు తడియు - తడుపు తెలియు - తెలుపు ఇత్యాదు లెఱుంగునది.

౨౬ అట్లు-ప్రేరణంబునందు బహుళముగా అడంగ్వాదిమాయ్వాదులకు= అడంగు'మున్నగుధాతువులకును మాయు' మున్నగుధాతువులకును వాని కడవ్రాలు = వానిచివఱియక్షరములు అడఁగుమున్నగువానికి చుక్కు'ను మాయు మున్నగువానికి పుగాగమమును ప్రేరణమున బహుళముగావచ్చును. అట్లు వచ్చునపుడు ధాతువు చివఱియక్కరము లోపించును

ఆడఁగు+చు = ఆడఁచు 'ఆడఁగించు' ఇచట 'చు' పరమగుచో 'గు' లోపించి 'ఆడఁచు' అయినది చుగాగమము బహుళమగుటచే అది రానప్పుడు 20 సూత్రముచే ఇంచుక్కు కలిగినది చుక్పుగాగమములు పరమగునపుడే ధాతువు చివఱియక్షరము లోపించును కాని ఇంచుక్కు పరమగునపుడు లోపించదు కాన 'ఆడఁగించు' అనురూపము నయినది

'మాయు' ధాతువునకు పుగాగమమువచ్చి అది పరమగునపుడు 'యు' లోపించి 'మాపు' అయినది పుగాగమము రానప్పుడు ఇంచుక్కువచ్చి 'మాయించు' అనియు నయినది

ఉభయగణంబులు = రెండుగణములందును జేరినవి అనఁగా వానికి చుగాగమమును పుగాగమమును కూడ వచ్చును 'అఁగు' నకు 'చుక్కు' వచ్చి 'అఁచు' అగును. పుగాగమమయి 'అఁపు' అగును ఇవి రానిపక్షమున ఇంచుక్కువచ్చి 'ఆగించు' అనియు నగును

ప్రకృతసూత్రమునందును 23-వ సూత్రము నుండి క్రమముగా వచ్చు బహుళపదము తీసికొని రాబడుచున్నందున దానిసామర్థ్యమువలన కొన్ని ధాతువులకు ఇంచుక్చుక్పుగాగమములు మూఁడును కొన్నింటికి ఏవియేనియుం డునో అవియును అగునని గ్రహింపవలెను అఁగు ధాతువునకుఁ బ్రేరణమున నైన మూఁడురూపములును చూపఁబడినవి రేఁగు నకును మూఁడురూపము లగును. పాయు నకు ఇంచుక్కు రాదు కాన రెండురూపములే యగును.

విఱుఁగు'నకు చుక్కుమాత్రమేవచ్చి 'విఱుచు' అయినది 'చూఁచు' మున్నగు వానికి పుగాగమముమాత్రమేవచ్చి 'మాపు' మున్నగురూపములయినవి-

**ఇంచుక్చుక్పుగాగమంబులు పరంబు లగునపు**
**డాగమాదేశలోపంబులు పెక్కుదెఱంగులం**
**గానంబడియెడి 22**

అగు - కావించు వచ్చు - రావించు - రప్పించు విన్న

పము-విన్నవించు మోఁకాలు - మోకరించు కేక - కేకరించు.
పలవ - పలవరించు - పలవించు అల - అలకించు - అలించు.
వ్రక్క-వ్రక్కలించు నొచ్చు - నొంచు - నొప్పించు ఉండు -
ఉనుచు - ఉంచు డిగు - డించు - డిగించు పెరుగు - పెనుచు-
పెంచు. తునుఁగు - త్రుంచు మునుఁగు - ముంచు - మునుచు.
మొగుడు- మొగుడుచు - మొగుచు - మోడుచు - మొగిడించు
చొచ్చు - చొనుపు - చొప్పించు చినుఁగు - చించు - చింపు
త్రెగు - త్రెంచు - త్రెంపు తిరుగు - త్రిప్పు చచ్చు - చంపు
నిలుచు-నిలువరించు - నిలుపు కొను - కొలుపు పోవు-పుచ్చు.
పనుచు - పంచు - పనుపు - పంపు - అనుచు - అంచు-అనుపు -
అంపు-అనుప్రయుక్తంబగు పోవునకుం బుచ్చుమాత్రంబగు -
మోసపోవు-మోసపుచ్చు ఇత్యాదు లెఱుంగునది.

22 ప్రేరణంబున నించు గాగమము చుగాగమము పుగాగమములును పరములగునపుడు ధాతువులకు ఆగమములును ఆదేశములును అక్షరలోపములును పరిపరివిధములుగాఁ గనబడుచుండును

అగు+ఇంచు=కావించు ఇచట ఇంచుక్కు పరమగునపుడు అగు' నకు కావ్' అను నాదేశమయినది వచ్చు+ఇంచు=రావించు రప్పించు' ఇచట వచ్చు' నకు రావు రప్పులు వికల్పముగా ఆదేశములయినవి

విన్నపము' అను నామమునకు ధాతుత్వవివక్షయందు ఇంచుక్కు పరముకాఁగా పకారమునకు వకారమాదేశమయి విన్నవించు' అయినది అట్లే 'మోఁకాలు నామధాతు వగునపుడు ఇంచుక్కు పరమైయుండఁగా కాలు' నకు కర్' ఆదేశమయి మోకరించు అయినది కేక' కు ఇంచుక్కు పరము కాఁగా ర్ ఆగమమయి కేకరించు' అయినది పలవ+ర్+ఇంచు=పలవరించు రేఫాగమము రానపుడు పలవించు' అల+క్+ఇంచు = అలకించు

వికల్పముగ నీకకారాగమము రానిచో అలించు అగును ప్రక్క+ల్+ఇంచు=ప్రక్కలించు' నొచ్చు+ఇంచు=నొంచు నొప్పించు'-ఇట నొచ్చు' ధాతువునకు ఇంచుక్కు పరమగుచుండఁగా ద్విత్వచకారమునకును ఇంచుక్కులోని ఇకారమునకును లోపమురాఁగా నొంచు' అయినది ద్విత్వచకారమునకు ద్విత్వపకారము ఆదేశము కాఁగా నొప్పించు' అనియు నైనది ఉండు+చు=ఉనుచు'-ఇచట ఉండు'ధాతువునకు 23-చే నైన చుక్కు పరము కాఁగా ండు' నకు ను ఆదేశమయి ఉనుచు' అయినది ఉండు+చు=ఉంచు' అనుచో ఉండు' లోని డు' మాత్రము లోపించినది డిగు+ఇంచు=డించు' ఇచట డిగు'లోని గ్గుకును ఇంచు' లోని ఇకిని లోపము. లోపము రానపుడు డిగించు' అగును

పెరుగు+ఇంచు=పెనుచు పెంచు' ఇచట పెరుగు' లోని రుగు' లకును ఇం' కును ను' ఆదేశమయి పెనుచు' అయినది గురు' అనుదానికిని, ఇంచు' లోని ఇకారమునకును లోపమువచ్చి పెంచు ఐనది

తునుఁగు+ఇంచు=త్రుంచు'-ఇచట తునుఁగు'నకును ఇంచుక్కులోని ఇ' కిని 'త్రు' ఆదేశమయినది

మునుఁగు+ఇంచు=మునుచు ముంచు' ఇచట ధాతువులోని గు' కును, ఇచులోని ఇం' కును లోపము రాఁగా మునుచు' అగును నుఁగు ఇ' లకు లోపము రాఁగా ముంచు' అగును

మొగుడు+చు=మొగుడుచు మొగుచు మోడుచు' ఇచట మొగుడు'నకు చుక్కు' రాఁగా మొగుడుచు' అయినది చుక్కు పరమగుచో డు' లోపింపఁగా మొగుచు' అయినది. మొగుడు' లోని గు' లోపించి ఆద్యక్షరమునకు దీర్ఘము రాఁగా మోడుచు' అయినది మొగుడు' నకు ఇంచుక్కు ఈవిధిచే ఇత్వమువచ్చి మొగిడించు' అయినది ఈనాల్గును 'మొగుడు నకు ప్రేరణమున రూపములు

చొచ్చు+పు=చొనుపు' ఇచట చ్చు'కు ను ఆదేశమయినది

చొచ్చు+ఇంచు=చొప్పించు' ఇచట ఇంచుక్కు' పరమందుండగా 'చ్చు' కారమునకు ప్పు' కార మాదేశమైనది

చినుఁగు+చు.చించు చినుఁగు+పు=చింపు' ఇచట చుగాగమ పుగాగమములు పరమగునపుడు చినుఁగు' లోని నుఁగు'లకు బిందు వాదేశమైనది

త్రెగు' నకు చు-పు లు పరమగుచో గు' కు బిందువు ఆదేశమయి త్రెంచు=త్రెంపు' అనురూపములు సిద్ధించినవి

తిరుగు+పు=త్రిప్పు' అనుచో తిరుగు' నకు త్రిప్' ఆదేశమయినది.

చచ్చు+పు=చంపు' పుగాగమము పరమగుచో చ్చు' కు బిందువు ఆదేశమయినది నిలుచు+ఇంచు=నిలువరించు' ఇచట నిలుచు' న కించుక్కు పరమగుచో ధాతువు చివరి చు'కు వర్' ఆదేశమైనది

నిలుచు+పు=నిలుచు పుగాగమము పరమగుచో నిలుచులోని చు' లోపించినది కొను+పు=కొలుపు' అనుచో ను' లు'గా మారినది.

పోవు+చు=పుచ్చు పనుచు పంచు-' ఇచట చుక్కు పరము కాఁగా 'పోవు' నకు పుచ్చు' పను పం' అనునవి వికల్పముగా ఆదేశములు కాఁగా మీఁదిరూపము లేర్పడెను మఱియు పోవు' నకు-చుక్కు పరము కాఁగా అను' 'అం' ఆదేశములు రాఁగా అనుచు అంచు' అనురూపము లగును ఇట్లు 'పోవు' నకు చుక్కు పరమగుచో ఐదు రూపములగును పయి పోవు' నకే పుగాగమము పరమగుచో పను పం అను అం అనునాదేశములు వికల్పముగావచ్చి పనుపు పంపు అనుపు అంపు' అను నాల్గురూపములగును. ఇట్లు 'పోవు' నకు ప్రేరణమున ౯ రూపములగును.

అనుప్రయుక్తంబగు—స్వతంత్రముగా నిలువక వేఱొకశబ్దముతోఁ గూడియున్న (శబ్దపల్లవరూపముగనున్న) పోవుధాతువునకు ప్రేరణమున 'పుచ్చు' అనిమాత్రమే యగుఁ తక్కినవి కావు. శబ్దపల్లవధాతువు - మోసపోవు-ప్రేరణము-మోసపుచ్చు

## అన్వాదుల కించుక్కు పరంబగునపుడు పుగాగమంబగు మానునకు విభాషనగు. ౨౮.

అనిపించు అను-కను - తిను - విను మానిపించు - మానించు.

౨౮ అను' మున్నగుధాతువులకు ఇంచుక్కు పరమగునపుడు పుగాగమము నిత్యముగా నగును మాను' ధాతువునకుమాత్రము పుగాగమము వికల్పముగా నగును

అను+పు+ఇంచు=అనిపించు' ఇచట ఇంచుక్కు పరముకాఁగా పుగాగమమువచ్చి ౮౧-వ సూత్రముచే అను' లోని ఉకారము ఇకారమైనది. 'మాను ధాతువు నుదాహృతులు ౪౮ సూత్రముకడనే వివరింపఁబడినవి

## అడ్డాదుల కించుక్కు పరంబగునపుడు గుగాగమంబగు నప్పాదులకు విభాషనగు. ౨౯.

అడ్డము-అడ్డగించు. అడ్డము - ఓర-చిత్తము - పంతము - పెల్ల-బోర-మట్టము - మేళము - ఇత్యాదు లడ్డాదులు అప్ప - అప్పగించు-అప్పించు. అప్ప - ఒప్ప - పల్లము - కోపము. ఇవి యప్పాదులు.

౨౯ అడ్డ' మున్నగునామధాతువులకు ఇంచుక్కు పరమగునపుడు గుక్' అనునాగమము (గు) నిత్యముగా నగును ఈయాగమము అప్ప' మున్నగువానికి వికల్పముగా నగును.

అడ్డ+గు+ఇంచు=అడ్డగించు' ఇచట ౭౩ సూత్రముచే ఇంచుక్కుగును

అప్ప+గు+ఇంచు=అప్పగించు' అప్పాదుల కీయాగమము వికల్పము గాన గుగాగమము రానప్పుడు (అప్ప+ఇంచు=) అప్పించు' అనియుం నగును. పైవానివలెనే తక్కినవియును.

## ఆడోడు కూడులడకారంబునకుం జుక్కు పరంబగునపుడు రేఫంబగు. ౮౦.

ఆడు - ఆరుచు - ఆడించు. ఓడు - ఓరుచు - ఓడించు. కూడు-కూరుచు-కూడించు.

౮౦ ఆడు ఓడు కూడు' అనుధాతువులకు చుక్కు పరమైగానున్నపు డాధాతువుల దకారమునకు రేఫ మాదేశముగా వచ్చును ఆడు+చు = ఆరుచు ఇచట దకారము రేఫముగా మాఱినది ఇంచుక్కు పరమగునపుడు ద రేఫముగా మాఱదు కాన ఆడు+ఇంచు=ఆడించు' అని యగును ఓడు+చు= ఓరుచు ఓదు+ఇందు=ఓడించు కూడు + చు = కూరుచు కూడు + ఇంచు= కూడించు

## చెడునకుం జుక్పుగాగమంబులును డాకలఘురేఫంబు నగు. ౮౧

చెఱుచు - చెఱుపు

౮౧ చెడు' ధాతువునకు చుగాగమమును పుగాగమమును పర్యాయముగ ప్రేరణమున నగును అపుడు ధాతువులోని దకారమునకు శకటరేఫము (ఱ) ఆదేశముగా నగును చెదు + చు=చెఱుచు చెడు + పు=చెఱుపు'

## పడునకుం జుక్కును డా కలఘురేఫంబు నగు ౮౨

పఱుచు

౮౨ పడు' ధాతువునకుఁ బ్రేరణమున చుగాగమమును ధాతువు దకారమునకు శకటరేఫ (ఱ) మాదేశముగను అగును. పడు + చు=పఱుచు'

## శబ్దపల్లవంబగుపడున కించుక్కు విభాషనగు నగుచో డాకు లఘురేఫంబగు ౮౩.

వెలువడు - వెలువరించు - వెలువఱుచు. చొప్పడు - చొప్పరించు-చొప్పఱుచు.

౮౩ శబ్దపల్లవము=నామము వైఁగాని ధాతువుపయిఁగాని వేఱొక ధాతువుచేరి క్రొత్తయర్థము నిచ్చునది. అట్టి శబ్దపల్లవమగు పడు' ధాతువునకు ఇంచుక్కు వికల్పముగా నగును అట్లయినపుడు పడు లోని డ' రేఫముగా మాఱును.

వెలువడు + ఇంచు=వెలువరించు' ఇచట డ రేఫముగా మాఱినది ఇంచుక్కు వికల్పము కావున-ఇది రానపుడు ౮౨ సూత్రము ననుసరించి చుక్కున డాకు ఱ ఆదేశముగ నగును వెలువడు + చు=వెలువఱుచు'

(చొప్పు + పడు=) చొప్పడు + ఇంచు = చొప్పరించు'-ఇచ్చటను డకారమునకు రేఫాదేశమైనది. ఇంచుక్కు రానపుడు చుక్కువచ్చును— 'చొప్పడు + చు=చొప్పఱుచు' ఇచట డ కు శకటరేఫము (ఱ) ఆదేశముగా వచ్చుట గమనించునది

## ప్రేరణంబునం దించుక్కుమీఁద నించుక్కు లేదు ౮౪.

ఇట్లనుటంజేసి ప్రేరణార్థంబయిన యితరాగమంబు మీఁదం బ్రేరణార్థేంచుగాగమంబగునని యెఱుంగునది నొచ్చు-నొంచు-నొంపించు. చచ్చు-చంపు-చంపించు.

౮౪ ప్రేరణార్థమున ఇంచుక్కు వచ్చినవాని యించుక్కు మీఁద మఱల ప్రేరణార్థము కల్పించినచో ఇంకొకయించుక్కు రాదని యర్థము.

ఇట్లనుటంజేసి=ఇంచుక్కు మీఁద వేఱొకయించుక్కు లేదనుటంజేసి, ఇంచుక్కుమీఁద నించుక్కు రాకపోవచ్చునుగాని చుగాగమ పుగాగమముల మీఁద ఇంచుక్కు రావచ్చునని యభిప్రాయము

నొంచు + ఇంచు=నొంపించు-' నొచ్చు' ధాతువునకుఁ బ్రేరణమున 'చుక్కు వచ్చి 22-సూత్రముచే చ్చు' కు బిందు వాదేశమయి నొంచు' అయినది ప్రస్తుతవిధిచే ఈచుగంతముపయి ప్రేరణమున ఇంచుక్కు' వచ్చి ౮౭ సూత్రముచే నొంచు' నందలి చకారమునకు పకార మాదేశమయి నొంపించు ఐనది చంపు + ఇంచు=చంపించు'

ఇత్వంబుగాని యెత్వంబుగాని కూడుచో
సనాద్యంబయినయుత్వంబున కిత్వంబగు. ౮౫

నిగుడు - నిగిడి - నిగిడె   మగుడు - మగిడి - మగిడె,
ఉడుగు - ఉడిగి - ఉడిగె, మునుఁగు - మునిఁగి - మునిఁగె.

౮౫ అనాద్యంబునకు=మొదటి తొలిని లేనిదానికి-పదమునఁ దొలుత నున్నదానిని విడిచి తక్కినదానికనుట-ఇకార ఎకారములు ధాతువుచివఱఁ జేరునపుడు ఆధాతువునందలి తొలియక్షరముమీఁది యుంకారమును విడిచి, తక్కినయుంకారములకు ఇకార మాదేశముగా నగును

నిగుడు + ఇ = నిగిడి   నిగుడు + ఎ = నిగిడె   నిగుడు నకు ౩౮ సూత్రముచే ఇగాగమమువచ్చి ప్రస్తుతవిధిచే గకారముమీఁది ఉకారము నకు ఇకార మాదేశమయి నిగిడి' అయినది  ఈయిధాతువుమీఁదనే భూతార్థమునందు ౧౬-వ సూత్రముచే ఎను' వచ్చి ప్రకృతసూత్రముచే గకారముమీఁది ఉకారము ఇకారముగా మాఱినది పిదప అవసానద్రుత లోపము (సంధి ౨౦) వచ్చి నిగిడె' అయినది మగుడు' మున్నగువాని రూపములకు ఇట్టే ప్రక్రియ నెఱుంగునది

ముజ్జీత్తులు ముత్తు నాఁబడు ౮౬.

౮౬. ముజ్జీత్తులు=ముజ్జు జి' ఇత్సంజ్ఞ గాకలవి, ఆశీర్వాద సంప్రార్థనములయందు మధ్యమపురుషమున నగు ము, డుజ్జులును, లజి కలజి మజి పదుజి రుజి వుజి'-మున్నగుజీత్తులును ముత్తు' అనుసంజ్ఞతో వ్యవహరింపఁబడును

ప్రేరణేంచుక్కు పరంబగునపుడు పకారంబు
చకారంబునకగు. ౮౭.

పచించు - పచింపించు. వచించు - వచింపించు. పిలుచు

పిలిపించు వలచు - వలపించు పత్వంబు హెచ్చునకుం గలు
గదు మెచ్చునకు విభాష నగు హెచ్చించు - మెప్పించు -
మెచ్చించు.

౨౧ ప్రేరణార్థకమగు ఇంచుక్కు' పరమగుచుండఁగా దానికి ముం
దున్నచకారమునకు పకారము నిత్యముగా ఆదేశమగును

వచించు + ఇంచు'-ఇచట వచించు ధాతువునకుఁ బ్రేరణమునందు
౨౦-వ సూత్రముచే ఇంచుక్కు రాఁగా అది పరమగునపుడు స్వార్థేంచుక్కు-
చకారము పకారము' గా మాఱి వచింపించు' అయినది ఇట్లే వచింపించు'
మున్నగునవియును ఈపకారాదేశము హెచ్చు' ధాతువునకుఁ గలుగదు.
కాన హెచ్చించు' అనియే యుండునుగాని హెప్పించు' అనికాదు.
'మెచ్చు' నకు వికల్పముగావచ్చును పకారాదేశము వచ్చినపుడు మెప్పించు'
అనియుం రానపుడు మెచ్చించు' అనియుం నగును

## ఆగమాన్యచకారంబుల కద్విరుక్తంబులకు ముత్తు పరం బగునపుడు పవలగు ౨౨.

ఆగమంబు - పచింపఁడు - పచింపుము అడఁపఁడు - అడఁ
పుము అన్యము - పిలువఁడు-పిలువుము.

౨౨. ఆగమాన్యచకారంబులకు=ఆగమరూపమైన చకారమునకును,
ఆగమరూపముకాని చకారమునకును ముత్తనము డుజ్జులును జే ఇత్వం
జ్ఞ గాఁగలవియు

ద్విత్వము కలిగియుండని ఆగమరూపచకారములకు ముజ్జిత్తులు పర
మగునపుడు పకార మాదేశమగును. ద్విత్వరహితములైన (ధాతువుల) చకార
ములకు ముజ్జిత్తులు పరమగునపుడు వకారము ఆదేశముగా నగును

ఆగమచకారము పకారమగుట ఉదాహృతులు పచించు + ఁడు'
అనుచో వ్యతిరేకార్థమున ప్రథమపురుష డుద్వన్ణకము ముత్తు కావున ఇంచు

గాగమసంబంధమగు చువర్ణములోని చకారమునకు పకారము ఆదేశమయి 'పచింపు' అని యుండి ౨౦-వ సూత్రముచే ఉకారము అకారమయి 'పచింపఁడు' అయినది. ఇట్లే 'పచించు+ము=పచింపుము'

'అడఁగు+చు+ఁడు'-అడఁగు ధాతువునకుఁ బ్రేరణమున 'చుక్కు' వచ్చి ౭౬-వ సూత్రముచే 'గు' లోపించినది పిదపఁ బ్రకృతవిధిచే చకారము పకారమయి, ౨౦-వ సూత్రముచే పకారముమీఁది ఉకారము అకారముగా మాఱి 'అడఁపఁడు' అయినది ఇట్లే 'అడఁపు+ము అడఁపుము'

ఆగమముకాని చకారము వకారమగుట కుదాహృతి- 'పిలుఁచు+ఁడు= పిలువఁడు' ఇచటను 'పచింపఁడు' నకువలెనే ప్రక్రియ ఇట్లే 'పిలుచు+ము= పిలువుము'-ఈచోట్లలో సాగమాన్యచకార మున్నదిగాన అది 'వకారము' గా మాఱెనని గమనించునది.

## ఖండబిందువుమీఁది సిద్ధచకారంబునకు ముత్తు పరంబగునపుడు పకారంబు ప్రాయికంబుగ నగు ౮౯.

తలఁపక - త్రేఁపక - తోఁపక. ఏఁచునకు వైభాషికంబు - ఏఁపక-ఏఁచక. నోఁచునకుం గలుగదు-నోఁచక.

౮౯ సిద్ధచకారమునకు=శబ్దము పుట్టుకతోనున్న చకారమునకు, ముక్తిత్తులు పరముగా నున్నపుడు అఱసున్నకుఁ దర్వాతనున్న శబ్దములసహజ చకారమునకు పకారము సాధారణముగా నగును.

'తలఁచు+కక్=తలపక'-ఇచట 'తలఁచు' ధాతువునకు ముత్తగు కక్ పరముగానున్నది. ధాతువున సహజముగానున్న 'చు' లోని చకారము అఱసున్నకుఁ దర్వాతనున్నది కావున ఆచకారము పకారముగా మాఱినది పిదప ౨౦ వ సూత్రముచే పకారముమీఁది ఉకారము అకారముగా మాఱినది. ఇట్లే 'త్రేఁచు+క=త్రేపక తోఁచు+క=తోఁపక' అగును. 'ఏఁచు' ధాతువు చకారమునకు పకారాదేశము వికల్పమగుటచే 'ఏఁచు+క= ఏఁపక ఏఁచక' అని

రెండురూపము లగును నోఁచు+క=నోఁచక' అనియే అగునుగాని నోపక' అని కాదు సూత్రమున ప్రాయికముగా నగును' అని చెప్పుటచేతనే ఎఁచు' నకు వికల్పాదేశము నోఁచు' నకు రాకుండుటయును సిద్ధించెనని గ్రహించునది

### ఆగమచ్చకారంబునకు నెఱసున్న మీఁదిదానికి దుక్పరంబగునపుడు పకారంబు విభాషనగు. ౯౦.

ఆకర్ణింపుదురు - దంపుదురు - చింపుదురు పత్వంబురాని పక్షంబున వక్ష్యమాణతాదేశంబు. ఆకర్ణింతురు - దంతురు - చింతురు.

౯౦ నిండుసున్నకుఁ దరువాతనున్న ఆగమరూపమగుచకారమునకు దుగాగమము పరముగా ఉన్నయెడల పకారము వికల్పముగా నగును.

ఆకర్ణించు+దు+రు' ఇచట ఆకర్ణించుధాతువునకు తద్ధర్మాద్యర్థమున ప్రథమాబహువచనము పరముకాఁగా దుగాగమమువచ్చినది ఇచటి చు' నిండుసున్న తరువాత నున్నది అది ఆగమసంబంధమైనది దానితర్వాత దుగాగమము ఉన్నది కాన చు' లోని చకారము పకారమైనది ఇట్లే దంచు+దు+రు=దంపుదురు చించు+దు+రు=చింపుదురు'

ఈపకారాదేశము వికల్పమగుటచే పక్షమున ౧౦౮-వ సూత్రముచే చుదు' లోని చుద్' అనుభాగమునకు తకారము ఆదేశమయి ఆకర్ణింతురు' మున్నగురూపము లగును

### అగు వచ్చు చొచ్చు చూచులకు ముత్తు పరంబగునపుడు కారా చొరు చూదులగు ౯౧

అగు-కాఁడు-కమ్ము. వచ్చు - రాఁడు - రమ్ము. చొచ్చు-చొరఁడు-చొరుము-చూచు-చూడఁడు-చూడుము.

౯౧. ముజ్డు జేత్తును పరమగునపుడు అగు' నకు కా' వచ్చు' ధాతువునకు రా' చొచ్చు' నకు చొరు' చూచు' నకు చూడు' అను నాదేశము లగును

అగు+(డు=కా(డు' ఇది అగు' ధాతువు లట్ప్రథమపురుషైకవచన రూపము ఇచట లట్స్థానమునవచ్చిన (డు' జేత్తు కావున దానికి ముందున్న అగు' కా గా మారినది

అగు+ము కా+ము' ౭౧-వ సూత్రముచే మ' కుద్విత్వమును కా' కు హ్రస్వమును రాఁగా కమ్ము' అయినది

వచ్చు+(డు=రా(డు' కా(డు' వలెనే ప్రక్రియ వచ్చు+ము= రమ్ము' కమ్ము' వలెనే ప్రక్రియ చొచ్చు+(డు=చొర(డు' వెనుకటివలెనే. ఇచట చొరు' లోని ఉకారము ౨౦-వ సూత్రముచే అకారముగా మారినది

చొచ్చు+ము = చొరుము' చూచు+(డు = చూడ(డు' ఇచట చూడు' ఆదేశమైనపిమ్మట ౨౦-వ సూత్రముచే డు' లోని ఉకారమునకు అకారము ఆదేశమైనది చూచు+ము=చూడుము'

ఇచ్చునకు సర్వంబున కీయగు ౯౨.

ఇచ్చు - ఈఁడు - ఇమ్ము ఈయయనునాదేశంబు నొకా నొకచోఁ గానంబడియెడి బలిమినీయనిభూమివలయపతుల.

౯౨. మధ్యమపురుష ము, డుజ్డులును జేత్తును పరమగునపుడు ఇచ్చు' ధాతువున కంతకును ఈ' అనునది ఆదేశమగును

ఇచ్చు+(డు=ఈ(డు' ఇచట వ్యతిరేకమున లట్స్థానమునవచ్చిన డుజ్డు పరముకాఁగా ఇచ్చు' ఈ' గా మారినది ఇచ్చు+ము ఈ+ము= ఇమ్ము ఇచట ౭౧-వ సూత్రముచే మకారమునకు ద్విత్వమును దానిముందరి దీర్ఘమునకు హ్రస్వము నైనవి.

ఇచ్చు+ని=ఈని' అని యుండవలసియున్నది కాని ఇచ్చు' నకు ఈయ' ఆదేశమయి ఈయని' అనురూపముకూడ గానఁబడుచుండుటచే ఈయ' యను నాదేశంబు ఇత్యాదిగా గ్రంథకర్త వ్రాయవలసివచ్చెను

## తేతేరులు తెచ్చున కగు. ౯౩.

తెచ్చు-తేఁడు-తేరఁడు-తెమ్ము-తేరుము

౯౩. ముజ్జిత్తులు పరములగునపుడు తెచ్చు ధాతువునకు తే అనునదియు తేరు' అనునదియు పర్యాయముగా ఆదేశము లగును

తెచ్చు+ఁడు=తేఁడు తేరఁడు' ఇచటి డుజ్జు లజ్‌స్థానమున వచ్చినది గావున జిత్తుధర్మమంకలది తేరు' లోని ఉకారము ౨౦-వ సూత్రముచే అకారముగా మాఱినది ( తే ఒకసారియు తేరు ఒకసారియు తెచ్చు' నకు ఆదేశము లయియుండుట గ్రహించునది )

తెచ్చు+ము= తే+ము=తెమ్ము ఇచట ౬౧-వ సూత్రముచే ము' లోని మకారమునకు ద్విత్వమును దానిముందున్న ఏకారమునకు హ్రస్వమును అయినవి తెచ్చు+ము=తేరు+ము=తేరుము'

## చావు నోవులు చచ్చునొచ్చుల కగు ౯౪.

చచ్చు - చావఁడు - చావుము నొచ్చు - నోవఁడు - నోవుము వక్ష్యమాణంబు ద్విత్వంబు-నొవ్వఁడు.

౯౪ ముజ్జిత్తులు పరములగునపుడు చచ్చు' ధాతువునకు చావు' అనియును నొచ్చు' ధాతువునకు నోవు' అనునదియును ఆదేశములగును

చచ్చు+ఁడు=చావఁడు-' ఇచట వ్యతిరేకార్థప్రథమపురుషైకవచనమున లజ్‌స్థానమున వచ్చినడుజ్జు జిత్తువంటిదికాన దానికి ముందున్న చచ్చు' నకు చావు' ఆదేశమయి ౨౦-వ సూత్రముచే వు' లోని ఉకారము అకారముగా మాఱినది చచ్చు+ము=చావుము ఇట్లే నొచ్చు+ఁడు=నోవఁడు' అగును. నొచ్చు+ము=నోవుము

వక్ష్యమాణంబు — ప్రకీర్ణ ౬-వ సూత్రముచే వ' ద్విత్వమువచ్చి దానిముందున్న దీర్ఘము హ్రస్వముకాఁగా నొవ్వఁడు' అగును

## జీత్తు పరంబగునపుడు వాని వువర్ణంబు విభాషను లోపించు ౯౩.

చాక - చావక - చాకుము - చావకుము. నోక-నోవక-నోకుము-నోవకుము

౯౩ జీత్తు పరముగా నున్నపుడు చావు నోవు' ల వు' వికల్పముగా లోపించును

(చచ్చు+క చావు+క) చావ+క=చాక చావక' ఇట్లే తక్కినవియును

## అగున కను కసులకు ముజ్జీత్తులు పరంబులగునపుడు కానా కానలు విభాషనగు. ౯౪.

అపవాద్యసూత్రముచేగాకు వకారంబు. వక్ష్యమాణం బొత్వంబు కమ్ము-అగుము - అవుము-ఔము. కండు-అగుఁడు-అవుఁడు-ఔఁడు నాఁడు-అనఁడు-కానఁడు-కనఁడు.

౯౪ ము డుజ్జులు పరమగునపుడు అగు' ధాతువునకు కా' అనునది యును జీత్తు పరమగునపుడు అను' నకు నా' అనునదియు కను నకు కాన' అనునదియును వికల్పముగా ఆదేశములగును

అగు+ము=కమ్ము-' ఇచట ము పరమగుటచే అగు' నకు కా' ఆదేశమయి ౬౧-వ సూత్రముచే మకారమునకు ద్విత్వము కా దీర్ఘమునకు హ్రస్వము నయినవి

ఈ కా ఆదేశము వికల్పముకాన ఇది రానపుడు అగుము' అనియు నుండును. అగు' లోని గకారమునకు ఆద్భిక ౨౭-వ సూత్రముచే వకార

మాదేశముకాఁగా అవుము' అనియు నగును ౧౦౩-వ సూత్రము ననుసరించి 'అవు' అనుభాగమునకు వికల్పముగా ఓ రాఁగా ఓను' అనియు నగును ఇట్లు నాల్గురూపము లుండును అగు' ధాతువునకు ము్డు పరమగునపుడును (బహువచనప్రత్యయము) మీఁదిరీతిని ౪ రూపములగును అగు+ఁడు=కా+ఁడు కండు'-ఇచట మ్డు పరమగుటచే ౬౧-వ సూత్రముచే దీర్ఘము హ్రస్వమయి సంధి ౨౨-వ సూత్రము ననుసరించి బిందుసున్నయైనది ఈ యాదేశము రానపుడు అగుఁడు' అనియు గకారమునకు వికల్పముగా వకారమువచ్చినపుడు అవుఁడు' అనియు ఓత్వమువచ్చినపుడు ఓఁడు' అనియు నగుట గ్రహించునది

అను+ఁడు=నాఁడు అనఁడు' ఇచటి డుము వ్యతిరేకమున లభించి వచ్చినది కావున జిత్తువంటి దగుటచే దీనికి ముందున్న అను ధాతువునకు 'నా' ఆదేశమయి నాఁడు' ఐనది అది రానపుడు ను మీఁది ఉకారమునకు ౨౦-వ సూత్రముచే అకార మాదేశమయి అనఁడు' అగును

కను+ఁడు = కానఁడు కనఁడు' ఇచట వ్యతిరేకమునవచ్చిన డుము జిత్తువంటిదేకాన కను నకు కాన' ఆదేశముకాఁగా కానఁడు' అగును ఈ యాదేశము రానప్పుడు కను+ఁడు అనుచో ౨౦-వ సూత్రముచే ను' లోని ఉకారమునకు అకార మాదేశముకాఁగా కనఁడు' అగును

నేరుచునకు లిడ్లాట్టులు ముత్తుంబరంబులగునపుడు
రుచులకు లోపంబు బహుళంబుగానగు ౯౭.

నేచెను - నేరిచెను నేచును - నేరుచును నేరఁడు - నేరువఁడు.

౯౭. నేరుచు' ధాతువునకు లిట్టు లాట్టు పరమైయున్నపుడు-అందలి 'రు' బహుళముగా లోపించును ఆధాతువునకు ముత్తు (ముడుమ్లులును జిత్తును) పరములగునపుడు-ధాతువులోని చు' బహుళముగా లోపించును.

నేరుచు+ఎను=నేచెను 'నేరిచెను-' ఇచట 'నేరుచు' ధాతువునకు లిట్టులోని ప్రథమపురుషైకవచనమగు 'ఎను' (౧౭-వ సూత్రముచే వచ్చినది) పరముకాఁగా ప్రకృతవిధిచే 'రు' లోపించి 'నేచెను' అయినది ఈ 'రు' లోపమురానపుడు 'నేరు+చెను' అని యుండఁగా ౮౫-వ సూత్రముచే ఎత్వము పరమగుచున్నందున 'రు' లోని ఉకారము ఇకారముగా మాఱఁగా 'నేరిచెను' అయినది

ఇట్లే 'లాట్టు' లో 'ను' పరమగునపుడు ను ప్రక్రియ గమనించునది. (లాట్టు ధుఙ్ఞునకు ౧౦౧-వ సూత్రముచే 'ను' ఆదేశమైనదని గ్రహింప వలెను )

నేరుచు+డు=నేరఁడు 'నేరువఁడు-' ఇచట 'నేరుచు' నకు లట్ స్థానమున ప్రథమపురుషైకవచనమునవచ్చిన ధుఙ్ఞు క్రిత్తుతో సమము కావున, అది పరమగుచుండఁగా 'నేరుచు' లోని 'చు' లోపించినది పిదప ౭౦-వ సూత్రముచే 'రు' లోని ఉకారము అకారముగా మాఱి 'నేరఁడు' అయినది 'చు' లోపింపనిపక్షమున ఈచకారము ధాతువునకు సహజమైనదగుటచే ౮౮-వ సూత్రము ననుసరించి దానికి వకార మాదేశమయి 'నేరువు+డు' అనియుండఁగా ౭౦-వ సూత్రముచే 'వు' లోని ఉకారమునకు అకార మాదేశమయి 'నేరువఁడు' ఐనది.

## పోవునకు ధుఙ్ముత్తులు ముఙ్ఞుంబరంబులగునపుడు వులోపంబుం బొదపదలును విభాషనగు ౯౮.

పోదురు - పోవుదురు. పోఁడు - పోవఁడు పోవుము - పొదము - పదము - పొమ్ము.

౯౮ 'పోవు' ధాతువునకు దుగాగమమును ముఙ్క్తిత్తులును పరములగు నపుడు 'వు' వికల్పముగా లోపించును. ఈధాతువునకు మధ్యమపురుష 'ము-డు' లు పరమగునపుడు 'పొద పద' అనునవి వికల్పముగా నాదేశము లగును.

పోవు + దు + రు = పోదురు పోవుదురు- ఇచట పోవు' నకు లాట్టు నందు రు' పరమగునపుడు ౭౭ - సూత్రముచే దుగాగమము వచ్చినది అది పరమైనందున వు' లోపించి పోదురు' ఐనది వు' లోపము వికల్పముగాన, అది రానపుడు పోవుదురు' అనియు నుండును

పోవు + ఁడు = పోఁడు పోవఁడు-' ఇచట లఙ్కి కాదేశమగు డుజ్ఞు జేత్తు వంటిదగుటచే అది పరముకాఁగా వు' లోపించి 'పోఁడు' అయినది, 'వు' లోపింపనపుడు ౬౦ సూత్రముచే వు' లోని ఉకారము అకారము కాఁగా పోవఁడు' అయినది పోవు + ము = పోదము పదము పొమ్ము, పోవుము' ఇచట ముజ్ఞగు ము' పరమగుచుండఁగా పోవు' నకు పోద' ఆదేశమయి పోదము' అనియు పద' ఆదేశమయి పదము' అనియు నయినది ఈ రెండును రానపుడు మధ్యమ పురుష ఏకవచనముకు ము' పరమగుచుండఁగా వు' లోపించి ౬౧ సూత్రముచే మకారమునకు ద్విత్వము ముందున్న పో' కు హ్రస్వమునువచ్చి పొమ్ము' అయినది వు' లోపము వికల్పముకాన అది రానపుడు పోవుము' అనియు నుండును ఇట్లు నాల్గు రూపము లగును.

## అగుపోవుల కడవ్రాల కిద్వక్రంబులు పరంబులగునపుడు యకారంబగు. ౯౯.

వక్ష్యమాణం బైత్వంబు - అయి - ఐ అయిరి - ఐరి. పోయి-పోయిరి-పోయెను-పోయెడు.

౯౯ కడవ్రాలకు = తుదియక్షరములకు. ఇద్వక్రంబులు = ఇకార, ఎకారములు. అగు, పోవు' అను రెండు ధాతువుల చివఱియక్షరములగు గు వు' లకు ఇకారముగాని ఎకారముగాని పరమైనపుడు యకారము ఆదేశమగును.

అగు + ఇ = అయి, ఐ' - అగు' ధాతువునకు క్త్వార్థమునందు 3ర-వ సూత్రముచే ఇకారము రాఁగా ప్రస్తుతసూత్రముచే గకారమునకు యకార మాదేశమై (అయ్ + ఇ) అయి' అయినది. ౧౦౩ సూత్రముచే అయి'ః ఐ' ఆదేశముకాఁగా ఐ' అనియు నగును.

అగు+రు = అయిరి ఐరి' అగు' నకు లిట్టునందైన రు పరమూ కాఁగా ౧౭-సూత్రముచే ఇగాగమమయి అగు+ఇ+రు'అనియుండి ప్రకృత విధిచే గు' యుం గా మాఱినది పిదప తత్సమ ౨౫-వసూత్రముచే రు' రి' గా మాఱి అయిరి' అగును అయి' కి ౧౦౩-సూత్రముచే ఐ ఆదేశము రాఁగా ఐరి' అనియుం నగును

పోవు+ఇ = పోయి' - ఇచట పోవు నకు క్త్వార్థకమగు ఇకారము పరమైయుండఁగా యకార మాదేశమైనది

పోవు+రు పోవు+ఇ+రు పోయు+ఇ+రు=పోయిరి' వెనుకటి వలెనే ప్రక్రియ పోవు+ఎను పోయు+ఎను = పోయెను' పోవు+ఎదు పోయు+ఎదు = పోయెదు' పోయెను' లిట్టురూపము పోయెదు లాట్టు రూపము.

వక్ష్యమాణంబు=ముందుఁ జెప్పఁబడునది ౧౦౩-సూత్రముచే విధింపఁ బడున దనుట.

అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు ౧౦౦.

వక్ష్యమాణంబు ద్విత్వంబు - ఆయెను - అయ్యెను - ఆగెదు-అయ్యెదు

౧౦౦. అగుధాతువునకు వక్రము పరమగునపుడు మొదటి అకార మునకు దీర్ఘమగును

వక్ష్యమాణము = ప్రకీర్ణపరిచ్ఛేదమున ౬-సూత్రముచే చెప్ప బడునది

అగు+ఎను = ఆయెను, అయ్యెను' అగు' నకు వక్రమగు ఎ' పర మగుటచే ధాతువులోని గు' యుం' గా వెనుకటి (౯౯-సూ) సూత్రముచే మాఱినది ఈసూత్రముచే అగు' అకారము ఆకారమయి (ఆయు+ఎను) ఆయెను' అయినది. ప్రకీర్ణ - ౬ - సూత్రముచే యకారమునకు ద్విత్వము నమాస. ౧౩ సూత్రముచే ఆకారమునకు హ్రస్వము రాఁగా అయ్యెను' అనియుం నగును

చేరిన సంస్కృతసమము లగు పదములకు ఈనియమము చెల్లను వానియందు నిందునున్న వియక్షరమునకయినను ముందుండవచ్చును.

## యకారంబును వు వూ వొ వో లును దెలుఁగుమాటలకు మొదటలేవు ౧౭.

ఎవఁడు - ఎక్కటి-ఏమి-ఏల-ఉండ-ఊరు - ఒకఁడు - ఓడ - హరియతఁడు నిద్రవోయె నిట్టిచోట్ల సంధివశంబున వచ్చిన యకార వకారంబులుగాని పూర్వసిద్ధంబులుగావు వోఢృ వోఢవ్య శబ్దములు దప్ప సంస్కృతసమంబులందు సహితము వు వూ వొ వో వర్ణాదులగు శబ్దంబులు లేవని యెఱుంగునది ఉదకము-ఊర్మిక-ఓదనము

౧౭ అచ్చ తెలుఁగుమాటల మొదట యకారముగాని వు వూ వొ. వో లుగాని యుండవు. కాన పదముల మొదట వానిని వ్రాయరాదు. 'యెవఁడు యెక్కడ వూరు వొకటి అనురీతిని వ్రాయక ఎవఁడు, ఎక్కడ, ఊరు ఒకటి' అనియే వ్రాయవలెను

రెండుపదములకు సంధిచేయునపుడుమాత్రము నడుమ యకారము రావచ్చు అప్పుడు (హరి+అతఁడు=) హరి యతఁడు అను నిట్టిచోట్ల రెండవపదము మొదట 'య' కారము ఉండవచ్చును ఇట్టివి సంధివలన వచ్చినవి కాని తొలుతనుండియు ఉన్నవి కావు కాన అట్టి యకార ముండ వచ్చును మొదటిపదము మొదటమాత్రము ఎన్నఁడును 'య' కార ముండదు

## యరలవలు లఘువులని యలఘువులని ద్వివిధంబు లగు ౧

హరియతఁడు-ఇత్యాదులం దాగమ యకారము లఘు తక్కిన యకార మలఘువు. విఱుగు మెఱుఁ గిత్యా

రేఫంబలఘువు ఇదే శకటరేఫ మని చెప్పఁబడును శకట రేఫము తత్సమ తద్భవములందు లేదు పెఱుగు కఱ గిత్యాదు లందు రేఫంబు లఘువు. ఏళులు పాళులు త్రాళులని బహుత్వ మందు రలడల కాదేశ మయిన ళకార మలఘువు తల-నెల యిత్యాదులందలి లకారము లఘువు అతఁడు వ్రాసె నిత్యాదు లందున్న పాదేశ వకారము లఘువు. తక్కిన వకార మలఘువు. వర్ణసమామ్నాయమందలి ళకారము వర్ణాంతరము గాని యలఘుళకారము గాదని యెఱుంగునది.

౧౮ తేలికగా నుచ్చరింపఁబడునవి లఘువులు. కఠినముగా (బరువుగా) నుచ్చరింపఁబడునవి యలఘువులు. య-ర-ల-వ అను నాల్గక్షరముల కును లఘ్వలఘుభేదము కలదు ౧ లఘుయకారము ౨ అలఘుయకారము ౩ లఘురేఫము. ౪ అలఘురేఫము ౫ లఘులకారము ౬ అలఘులకారము. లఘువకారము అలఘువకారము వీనిలో—వ్యాకరణ నియమము ననుసరించి—ఆగమముగా వచ్చినయకారము లఘువు. [ఆగమ మనఁగా—ఉన్నయక్షరములకు సాయముగా ఎక్కువగా వర్ణమువచ్చుట—వర్ణాధిక్యము ] వారి+అతఁడు = వారి యతఁడు.

శబ్దము పుట్టులో నుండిన యకార మలఘువు కాయ చాయ. రేఫము లఘువు—పెరుగు కరుగు శకటరేఫము (బండిరా) అలఘువు—విఱుగు మెఱుఁగు

[మీఁది ఱ సంస్కృత ప్రాకృత సమము లగు శబ్దములందును, సంస్కృత, ప్రాకృతములనుండి ఏర్పడినశబ్దములందును ఉండదు ]

లకారము లఘువు—కల నెల డ-ల-ర లకు బహువచనమునందు ఆదేశముగా వచ్చిన ళకారము అలఘువు [ఒకయక్షరమును కొట్టివేసి దానికి మారుగా వేఱొకయక్షరము వచ్చుట ఆదేశము.] ఏరు (ఎక) ఏళులు (బహు)—ఇచటి ళకారము అలఘువు

అగు+ఎదు' అయు+ఎదు అయు+ఎదు = అయెదు' య ద్విత్వము అకారమునకు హ్రస్వమును రాఁగా అయ్యెదు' అనియు నగును (ఇవి లాక్షణికములు)

పిలుచు మొదలగువానికి ముత్తు పరంబగునపుడు
కడవ్రాయి బహుళంబుగ లోపించు. ౧౦౧.

పిలఁదు - పిలువఁదు - పిలుము - పిలువుము లేచునకు ముజ్జు పరంబగునపుడు చులోపంబగు లెమ్ము-లెండు పిలుచు - నిలుచు-తలఁగు-ఇత్యాదులు

౧౦౧ ముత్తు=ముడుజ్జులును జేత్తును కడవ్రాయి=చివఱియక్షరము. పిలుచు+ఁదు = పిలఁదు పిలువఁదు' ఇచట పిలుచు' నకు లఙకాదేశమగు డుజ్జు పరముకాఁగా చు' లోపించి ౨౦-సూత్రముచే లు' లోని ఉకారము అకారముగా మాఱి పిలఁదు ఐనది చు' లోపింపనపుడు చకారమునకు ౭౭-సూత్రముచే వకార మాదేశమయి ౨౦-సూత్రముచే ఉకారము అకారముగా మాఱి పిలువఁదు ఐనది ఈసూత్రమున బహుళమని చెప్పుటచేఁ గొన్నిచోట్ల తుదియచ్చు నిత్యముగా లోపించుననియుఁ గ్రహింపవలెను

లేచు+ము = లెమ్ము ఇచట ముత్తు (ము) పరముకాఁగా లేచు' లోని చు లోపించి ౬౧-సూత్రముచే మ' కు ద్విత్వమును దానికి ముందున్నదీర్ఘమునకు ('లే' అనుదానికి) హ్రస్వమునై లెమ్ము' అయినది

లేచు+ఁదు = లెండు —ఇచట ముత్తగు దుజ్జు పరముకాఁగా లేచు' చు' లోపించి ౬౧-సూత్రముచే లే' హ్రస్వమయి, సంధి ౨౧-సూత్రము ననుసరించి దు' కు ముందు నిండుసున్నవచ్చి 'లెండు' అయినది

లాఁతిచో సహితము కాదేశాదులు కానంబడియెడి. ౧౦౨.

కావుతను-కాతను అగుట - కావుట అగుదును-కావు

డును కానను - కావునను. అనుడును - అనవుడును - నావు డును ఇత్యాదు లెఱుంగునది

౧౦౨ లాఁతిచో సహితము = ఇతరస్థలములందుఁగూడ ముక్తీత్తులు పరములగునపుడేగాక వానికంటె నితరములు కొన్ని పరము లయియున్నను 'కా' మున్నగు నాదేశములు 'అగు' మున్నగువానికి ప్రయోగములందుఁ గన్పట్టుచున్నవని సూత్రార్థము ఆదిశబ్దముచేఁ బూర్వోక్తరీతిని ఆయాధాతువుల కాయా ఆదేశములేగాక వానికిఁ గొన్ని క్రొత్తగఁ జేరనవర్ణములతోఁ గూడ ఆదేశములు కలుగునని గ్రహించునది

అగు+తను = కావుతను కాతను' ఇచట 'అగు' నకు లూట్టున ౨౬. సూత్రముచే వచ్చిన 'తను' పరమైనప్పుడు 'కావు' అనునాదేశమై 'కావుతను' అయినది 'కా' అని యాదేశమైనపుడు 'కాతను' అని యైనది

'అగు' నకు భావార్థకమగు 'ట' పరమగుచో 'కావు' ఆదేశము వికల్పముగా నయి 'కావుట' 'అగుట' అను రెండురూపములు నేర్పడినవి

ఆనంతర్యార్థక 'డును' పరమగుచో 'అగు' నకు 'కావు' వికల్పముగ నాదేశమయి 'కావుడును' 'అగుడును' అను రూపము లైనవి 'అగు' నకు ౪౧ సూత్రముచే 'నను' ప్రత్యయము రాఁగా 'కావు' ఆదేశమయి 'కావునను' అయినది 'కా' ఆదేశమయి 'కానను' అయినది.

'అను' నకు ఆనంతర్యార్థక 'డును' పరమగుచో 'అనవు' ఆదేశమై 'అనవుడును' 'నావు' ఆదేశమయి 'నావుడును' అని వికల్పము లగుటచే 'అనుడును' అనియుఁ నగును.

## అచ్చికంబులం దయి యవులకు వక్రతమంబులు బహుళంబుగానగు ౧౦౩.

అయిదు - ఐదు. అయిరేని - ఐరేని అవుడు - ఔడు. గవునెన-గౌనెన.

౧౦౩ అచ్ఛికశబ్దములందలి అయి' అనుదానికి ఐ' అనియు అవు' అనుదానికి ఔ' అనియు బహుళముగా ఆదేశము లగును

వక్రతమములు = ఐ ఔ అనునవి ఉదాహృతులు స్పష్టముగ నున్నవి

### కలుగున కస్త్యర్థంబునందు లట్టు పరంబగునపుడు కలయగు ౧౦౪.

ప్ర కలఁడు-కలరు - కలది - కలవు మ కలవు-కలరు.
ఉ కలను-కలము

౧౦౪ అస్త్యర్థమునందు = ఉన్నాఁడు ఉన్నది అను నర్థమునందు 'ఉన్నాఁడు ఉన్నది' అనునర్థమున లట్టు పరంబగునపుడు కలుగు' ధాతువునకు కల అనునది నిత్యముగా ఆదేశమగును కలుగు నకు డు - రు - వు రు- ను - ము లు పరమగుచో కల ఆదేశమయి కలఁడు' మున్నగురూపము లగును అమహదర్థమున డు - వు లు కలుగఁగా (ప్రథమపురుషమున) కలదు కలవు' అనురూపము లుండును.

### త్రర్థంబునం గలాదేశంబు విభాషనగు ౧౦౫.

ఎడియెడులకు లోపం బిట నిత్యంబు-కలవాఁడు - కలుగువాఁడు

౧౦౫ త్రర్థమునందు=తృజర్థమున సంస్కృతమున తృచ్' అను ప్రత్యయము నర్థమున తెలుఁగునవచ్చిన ఎడి ఎడు' వర్ణకములు పరముగా 'కలుగు' నకు కల' అనునాదేశము వికల్పముగా నగును

ఈసూత్రముచే కల' ఆదేశమైనపుడు ఎడి ఏడు' లున్నచో 'కలెడి కలెడు' అని (అసాధురూపములు) అగునుగాన అట్లు కాకుండుటకయి 'ఎడి ఎడు' లకు లోపం బిట నిత్యంబు' అని వివరింపఁబడుచున్నది

కలుగు+ఎడు+వాఁడు=కలవాఁడు కలుగువాఁడు' కలుగు ధాతువునకు తృజర్థమున ౪౪ సూత్రముచే ఎడి ఎడు' రాఁగా నీసూత్రముచే కలుగు నకు కల' ఆదేశమం పిదప ౪౫ సూత్రముచే ఎడి ఎడు లకు లోపము పిదప సమాస. ౬-వ సూత్రముచే తచ్ఛబ్దము అనుప్రయుక్తము కాఁగా కలవాఁడు' అగును ఈ ఆదేశము రానపుడు కలుగువాఁడు' అనియు నుండును (ఎడి ఎడు' లున్నపుడు కలుగెడివాఁడు కలుగెడువాఁడు' అనియు తచ్ఛబ్దవకారమునకు ౧౧౭-వ సూత్రముచే లోపమువచ్చినపక్షమున కలాఁడు అనియు నగుట గ్రహించునది)

## అస్త్యర్థంబునకు లజి మి క ని వడి వర్ణకంబులు పరంబు లగునపుడు లే యగు. ౧౦౬.

ప్ర. లేఁడు - లేరు - లేదు - లేవు మ లేవు-లేరు ఉ. లేను - లేము లేమి - లేక - లేని - లేవడి.

౧౦౬ అస్త్యర్థంబునకు=ఉన్న' అనునర్థము కల కలుగు' నకు అస్త్యర్థకమగు కలుగు' ధాతువునకు లజి వ్యతిరేకభావమున ౩౭-వ సూత్రముచే నగు మిజి' వ్యతిరేకక్త్వార్థమున ౩౯-వ సూత్రముచే నైన కజి వ్యతిరేక తృజర్థమున ౪౭-వ సూత్రముచే గలుగు నిజి' కృదంతపరిచ్ఛేదములోని ౨౨-వ సూత్రముచే నగు వడి' ప్రత్యయములు పరమగునపుడు లే ఆదేశమగును. వ్యతిరేకమున కుదాహృతులు —

ప్ర పురు. కలుగు+డు=లేఁడు కలుగు+రు=లేరు కలుగు+దు=లేదు కలుగు+వు=లేవు మ పురు కలుగు+వు=లేవు కలుగు+రు=లేరు ఉ పురు కలుగు+ను=లేను కలుగు+ము=లేము వ్యతిరేకభావార్థకము-కలుగు+మి=లేమి వ్యతిరేకక్త్వార్థకము-కలుగు+క=లేక వ్యతిరేకత్రర్థకము-కలుగు+ని=లేని కృత్తు-వడి-రాఁగా-కలుగు+వడి=లేవడి

## వ్యతిరేకంబునందు వలచున కొల్ల విభాషనగు. ౧౦౭.

ప్ర ఒల్లఁడు - ఒల్లరు - ఒల్లదు - ఒల్లవు మ. ఒల్లవు- ఒల్లరు ఉ. ఒల్లను - ఒల్లము. ఒల్లమి - ఒల్లక - ఒల్లని పక్షంబున వలవఁ డిత్యాది ఒల్లమి కొల్లఁబాటని ప్రయోగంబులం గానంబడియెడి

౧౦౭ వ్యతిరేకార్థమున వలచు ధాతువునకు ఒల్ల' అనునది వికల్పముగా ఆదేశమగును

ఉదాహృతులు స్పష్టములు ఒల్ల రానపుడు 'వలవఁడు' మున్నగునవి యగునని గ్రహించునది ఒల్లమి' అను దాని బదులుగ-ఆయర్థమున ఒల్లఁబాటు' అనురూపము కవులప్రయోగములందుఁ గానఁబడుచున్నది

## చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు ౧౦౮.

నిలుతురు-పిలుతురు - అఁడతురు - కడతురు - చింతురు - పెంతురు - పచింతురు - వచింతురు చేతురు - కోతు రిత్యాదులసాధువులని యెఱుఁగునది

౧౦౮ దుగ్దకారంబు=దుగాగమములోని దకారము షష్ఠ్యాద్యర్థమున ౭౭-వ సూత్రముచే విధింపబడిన దుగాగమము' నకు ముందు చు' ఉన్న యెడల ఆ చుదు' లోని చుద్' అనుదానికి తకారము ఆదేశముగా వచ్చును

నిలుచు + దురు నిలుత్ + ఉరు = నిలుతురు' ఇట్లే పిలుతురు-' మున్నగునవియును

ఇచట చుద్' నకే తకారాదేశము చెప్పఁబడినందున చేతురు కోతురు' అనునవి అసాధువులని చెప్పవలెను చేయు + దురు = చేయుదురు, కోయు + దురు = కోయుదురు' అనుచోట్ల చుదు' లేదు యుదు' ఉన్నందున ఈ సూత్రము ప్రవర్తింపదు

## పడుజి కొను లోకానోకచో స్వార్థంబునం దనుప్రయుక్తంబులగు ౧౦౯.

చొచ్చు - చొరఁబడు. నిలుచు - నిలువఁబడు కూడు- కూడఁబడు పండు-పండుకొను.

౧౦౯ కర్మార్థమునందు (౪౯-సూత్రముచే) వచ్చు పడుజి యును ఆత్మనేపదార్థమునందు (౭౨-వ సూత్రముచే) వచ్చు కొను' అనునదియును కొన్ని ధాతువులకు ధాత్వర్థమునందే వచ్చుట కానవగునని సూత్రాభిప్రాయము.

చొచ్చు + పడు = చొరఁబడు-' ఇచట పడు' పరమగుచుండ గా 'చొచ్చు' నకు చొరు' అని (౯౧-వ సూత్రముచే) ఆదేశమగును పిదప ౨౧-వ సూత్రముచే నుగాగమము ౨౦-వ సూత్రముచే చొరు' లోని ఉకారమునకు అకారమును ద్రుతకార్యము నయి చొర బడు' అగును

చొచ్చుట' అన్నను చొరఁబడుట' అన్నను ప్రవేశించుట' అనియె యర్థము చొరఁబడుట' యనఁగా ప్రవేశింపఁబడుట' అని యర్థముకాదు

నిలుచు + పడు=నిలువఁబడు-' ఇచట నిలుచు' లోని చకారమునకు ౭౭-వ సూత్రముచే వకారాదేశము ౨౧-వ సూత్రముచే నుగాగమము ౨౦-వ సూత్రముచే వు' లోని ఉకారమునకు అకారము ద్రుతకార్యము. నిలువఁబడు' అగును

కూడు + పడు=కూడఁబడు-' ౨౧-వసూత్రముచే నుగాగమము ౨౦-వ సూత్రముచే డు' లోని ఉకారమునకు అకారము ద్రుతకార్యము. కూడఁబడు.'

ఇచట నిలుచు నిలువఁబడు' లకు ఒకటే యర్థము అట్లే కూడు, కూడఁబడు' లకును అర్థమున భేదములేదు

పండు పండుకొను' అనునవి రెండును సమానార్థకములే ఇచట 'కొను' స్వార్థమున వచ్చినదికాన పండుకొను' ఐనది

**తెంచుధాతువగ్వాదుల కనుప్రయుక్తంబగు నగుచో**
**నుత్వంబుపయిని దానితకారంబు దకారంబగు ౧౧౦.**

అగుదెంచు - నెగయుదెంచు పోవుదెంచు అగు నెగయు-పోవు - చొచ్చు - పుచ్చు - తోఁచు-నడచు - పఱచు - మొలచు-వీచు-ఇత్యాదులు

౧౧౦. అగు' మున్నగుధాతువులకు స్వార్థమునందు తెంచు' అను ధాతువు చేరుచుండును. ఉదంతములగు నా అగు మున్నగువాని తరువాతి తెంచు' తకారము దకార మగును. అగు + తెంచు=అగుదెంచు.

నెగయుఁదెంచు పోవుదెంచు లనిట్లే చొచ్చు' మున్నగువానికి ౧౧౨-వ సూత్రవివరణమున ఉదాహృతు లీయఁబడును

**అభ్యాగతి నరుగ్వాదుల కయ్యెడి యనుప్రయుక్తంబగు**
**నగుచో గువర్ణంబు విభాషను లోపించు ౧౧౧**

అరుదెంచు-అరుగుదెంచు. ఏతెంచు - ఏగుదెంచు - చనుదెంచు.

౧౧౧ అభ్యాగతి = ఎదురుగావచ్చుట అభ్యాగతియందు అరుగు' మున్నగువానికి తెంచు' చేరును అట్లు వచ్చునపుడు ధాతువుచివఱి గు' వికల్పముగా లోపించును

అరుగు + తెంచు = అరుదెంచు అరుగుదెంచు-' ఇచట ౧౧౦ - సూత్రముచే తెంచులోని తకారము దకారమైనది గు' లోపింపఁగా అరుదెంచు' అగును లేనపుడు అరుగుదెంచు' అగును ఇట్లే తక్కిన యుదాహృతులును

**అయ్యెడి పరంబగునపుడు చువర్ణంబు లోపించు ౧౧౨.**

చొచ్చు-చొత్తెంచు. పుచ్చు-పుత్తెంచు తోఁచు - తోఁతెంచు.

౧౧౨ తెంచు' అనుప్రయుక్తమై, పరముగా నున్నపుడు చు'

లోపించును చొచ్చు + తెంచు = చొత్తెంచు' పుచ్చు + తెంచు = పుత్తెంచు' ఇచట తెంచు' పరమగుచుండగా చొచ్చు పుచ్చు' లలోని చు' లోపించి, సంధి ౩౯. సూత్రముచే పరమైనహల్లునకు (తెంచు లోని తకారము' నకు) ద్విత్వమై చొత్తెంచు పుత్తెంచు' అని యగును తోఁచు + తెంచు = తోఁతెంచు' - ఇట్లే నడతెంచు కఱతెంచు' మున్నగునవియును.

## అర్థానికి ముత్తు పరంబగునపుడు తే తేరు లగు ౧౧౩

అగుదేఁడు - అగుదేరఁడు - అగుదెమ్ము - అగుదేరుము

౧౧౩ అర్థానికి = స్వార్థమునందును అభ్యాగతియందును అనుప్రయుక్తమగు తెంచు' నకు

అనుప్రయుక్తమగు తెంచు' నకు ము డుజ్ఞులును, శత్రులును పరమగునపుడు తే తేరు' అనునవి వరుసఁగా అగును అగు + తెంచు + ఁడు = అగుదేఁడు అగుదేరఁడు' ఇచటి డుజ్ఞు లజ్స్థానమున వచ్చినది కావున శత్రువంటిదగును అది పరమగుచుండఁగా తెంచు' నకు తే' ఆదేశమయి తకారముదకారముగా మాఱి అగుదేఁడు'అయినది తెంచు' నకు తేరు' ఆదేశమైనపుడు ౨౦ సూత్రముచే రు' ర' గామాఱి అగుదేరఁడు' అయినది అగు + తే + ము = అగుదెమ్ము' - ఇచట తెంచు' నకు తే ఆదేశముయి ౬౧-సూత్రముచే తే' కు హ్రస్వమును మ' కు ద్విత్వము నయినది తేరు' ఆదేశ మగునపుడు అగుదేరుము' అగును.

## భూతంబున లజీకి లిడంతంబగు నగుధాతు వనుప్రయుక్తంబగు ౧౧౪

వాఁడు రాఁడయ్యెను-వారు రారయిరి-అది రాదయ్యెను. అవి రావయ్యెను నీవు రావయితివి మీరు రారయితిరి. నేను రానయితిని-మేము రామయితిమి.

౧౧౪ భూతంబున లఁజికి = వ్యతిరేకార్థక ప్రత్యయము లంతమందుఁ గల భూతకాలికరూపములకు పరంతంబగు నగుధాతువు = అగుధాతువు యొక్క భూతకాలికరూపము భూతార్థమునందలి వ్యతిరేక క్రియకు అగు' ధాతువుయొక్క భూతకాల క్రియారూపము అనుప్రయుక్త మగునని యర్థము.

(వాఁడు) రాఁడయ్యెను - ఇచట రాఁడు' అనునది వచ్చు' ధాతువునకు ౯౧ సూత్రము ననుసరించి వ్యతిరేకార్థకరూపము దానికి అగు' ధాతువునకు ౧౦౦ సూత్రము ననుసరించి వచ్చిన అయ్యెను అనునది అనుప్రయుక్త మయినది (ఇది ఏకవచనమునకు రూపము) వారు రారయిరి' అనునది బహువచనమునకు రూపము అమహత్తు ఏకవచనమునకు అది రాదయ్యెను' అనియును బహువచనమునకు -వి రావయ్యెను' అనియును నుదాహృతులు ఇట్లే మధ్యమోత్తమపురుషముల యుదాహరణములకును ప్రక్రియ గ్రహించునది

## నుజ్యంతంబగు నగుధాతువు క్రియావిశేషణంబుల కనుప్రయుక్తంబగు నుజికి విభాషనగు ౧౧౫

కాను - అనునది నుజ్యంతం బగునగుధాతువురూపంబు.

౧౧౫ నుజ్యంతంబగు నగుధాతువు = అగుధాతువుయొక్క నుజ్యంత రూపము కాను' అనునది నుజికి = నుజ్యంతధాతురూపమునకు క్రియావిశేషణము లనఁగా క్రియతో నన్వయించు విశేషణము లని యర్థము

క్రియావిశేషణములకు అగుధాతు నుజ్యంతరూపమగు కాను' అనునది నిత్యముగా అనుప్రయుక్తమగును ఈ కాను' అనునది నుజ్యంతధాతువులచివర వికల్పముగాఁ జేర్పఁబడును

కాను' - అగు' ధాతువునకు ౪౦ సూత్రముచే నుజియు అది పరము కాఁగా ౯౬ సూత్రముచే అగు' నకు కా' అనునాదేశమును అయి కాను' అయినది. ఇదియే అగుధాతు నుజ్యంతరూపము.

దానికి హ్రస్వంబు విభాషనగు ౧౧౬

లెస్సగాను-లెస్సగను - న్యాయ్యముగాను-న్యాయ్యముగను-ఇట సరళంబు నిత్యంబు చూడఁగాను - చూడఁగను - చూడను - ఇట స్వత్వంబు లేదు.

౧౧౬. దానికి = అగు' ధాతు నుబ్యంతరూపమునకు కాను' అను దానికి

క్రియావిశేషణములమీఁదను నుబ్యంతములమీఁదను జేరిన కాను' అనుదాని దీర్ఘమునకు హ్రస్వము వికల్పముగా నగునని భావము

లెస్స + కాను = లెస్సగాను లెస్సగను.' ఇచట లెస్స' క్రియావిశేషణము దానికి ౧౧౫ సూత్రముచే కాను' చేరినది ప్రకృతసూత్రముచే కా లోని దీర్ఘమునకు వికల్పముగా హ్రస్వమును కకారమునకు సంధి ౧౩ సూత్రముచే నిత్యముగ సరళాదేశమును వచ్చినవి హ్రస్వమైనపుడు లెస్సగను, అనియుం దీర్ఘముగనే యుండునపుడు లెస్సగాను' అనియుం నగును న్యాయ్యముగాను న్యాయ్యముగను' అనునవియుం నిట్లే

చూచు + ను + కాను = చూడఁగాను చూడఁగను చూడను' ఇచట చూచు' ధాతువునకు ౪౦ సూత్రముచే నుక్ (ను) వచ్చినందున ఇది నుబ్యంతమగుచున్నది. దీనికి కాను' వికల్పముగాఁ జేరును. నుక్ పరమగునపుడు ౯౧ సూత్రముచే చూచు'కు చూడు' ఆదేశమై ౨౦-సూత్రముచే, డు' లోని ఉకారము అకారముగా మాఱినది నుక్' కి ద్రుతకార్యము కాను' లోని దీర్ఘము వికల్పముగా హ్రస్వముకాఁగా - దీర్ఘమున్నపుడు చూడఁగాను' హ్రస్వమువచ్చినపుడు చూడఁగను అనురూపము లైనఁ.

నుబ్యంతములకు కాను' చేరుటయు వికల్పము కావున అది రావప్పుడు ను' తోఁగూడిన చూడను' అనురూపమే యుండును ఇట్లు మూఁడు రూపములు.

ఇట స్వత్వంబు— చూడను+కాను-' అని యున్నపుడు ను' అను దానికగు ద్రుతకార్యములలో స్వత్వరూపమగు ను' కూడ ఉన్నందున 'చూడనుగాను చూడనగను' అనురూపము లగునేమో యనుభ్రాంతి కలుగ కుండ ఇట స్వత్వంబులే' దని తెలుపఁబడినది ఇట్టిచోట స్వత్వమురాదని వ్యాకర్తచే వ్యవస్థ చేయఁబడుచున్నది

## ఉన్నకలనవర్ణకంబులమీఁది తచ్ఛబ్ద వకారంబునకు లోపంబు విభాషనగు. ౧౧౭.

బాహుళకంబుచే నిట సంధి నిత్యంబు వండుచున్న వాఁడు-వండుచున్నాఁడు - వండుచున్న వారు - వండుచున్నారు. వండుచున్న వాఁడవు - వండుచున్నాఁడవు వండుచున్న వారరు. వండుచున్నారరు వండుచున్న వాఁడను - వండుచున్నాఁడను. వండుచున్న వారము - వండుచున్నారము ఇట్లు వండఁగల వాఁడు - వండఁగలాఁడు. వండినవాఁడు - వండినాఁ డిత్యాదు లెఱుంగునది

౧౧౭. ఉన్న కల న-' అను ప్రత్యయములనుపొందిన క్రియల మీఁది తచ్ఛబ్దముయొక్క వకారమునకు లోపము వికల్పము [క్రియావిశే షణములమీఁద (సమాస ౯-వ సూత్రముచే) తచ్ఛబ్దము ( ఆ' శబ్దము) అను ప్రయుక్తమగునని యిదివఱకే చెప్పఁబడినది ఉన్న' మున్నగునవి వర్త మానాద్యర్థములందు ధాతువున కగునని ౪౬-వ సూత్రముచే విధింపఁబడి యున్నది ఆ ఉన్న' మున్నగువానికయివచ్చిన వకారమునకు వికల్పలోపము నీసూత్రము విధించుచున్నది ]

వండుచున్న + వారు=వండుచున్నారు.' ఇచట వండుచున్న + వారు" అనునపుడు వకారలోపము రాఁగా వండుచున్న + అరు' అనియుండఁగా సంధి. ౪-వ సూత్రము ననుసరించి నిత్యసంధివచ్చినది [సంధి ౪-వ సూత్ర

మున అకారసంధి బహుళము గావచ్చునని చెప్పఁబడినది కాన బహుళగ్రహ ణముచే నిట్టిచోట్లమాత్రము నిత్యసంధినే గ్రహింపవలెను కాన వండుచున్న యాఁడు' అని కాఁజాలదు ] ఈయంశమే బాహుళకంబుచే నిట' ఇత్యాదిచే వివరింపఁబడినది

వకారలోపము రానప్పుడు వండుచున్నవాఁడు' అగును ఇట్లే తక్కిన వానికిని ప్రక్రియగ్రాహ్యము వండుచున్నాఁడవు వండుచున్నవాఁడవు' ఇత్యాదులందు యుష్మదస్మద్విశేషణములకు కారక. 33-చే ఏకత్వబహుత్వ ములందు వు ను-రు ము-లు కారక 34-వ సూత్రముచే వానికి ముందున్న ఉకారమునకు అకారాదేశమును రాఁగా రూపసిద్ధియని యెఱుఁగునది

వండ గలవాఁడు వండగలాఁడు-' అనుచోట్ల ౨౦ ౨౧-వ సూత్ర ములచే కలశి పరముగునప్పుడు వగుసగా అత్వ నుగాగమములు వచ్చుటయు పిదప ద్రుతకార్యమగుటయు గ్రాహ్యములు వండినవాఁడు వండినాఁడు' అనుచోట న' పరముకాఁగా ౧౭-వ సూత్రముచే ధాతువునకు ఇగాగమ మగుట గమనించునది

## ధాత్వాదులకు ధాతువు లను ప్రయుక్తంబులయి విలక్షణార్థాభిధాయకంబులగు నీయవి శబ్దపల్లవంబులు నాఁబడు ౧౧౮

కూరుచుండు-నిలుచుండు-పరుండు - పన్నుండు-ఆఁకొను-ఈకొను - చేయుకొను-వ్రయ్యకొను - పక్కొను - త్రెక్కొను-మేకొను-మయికొను-మేలుకొను - మేలుకను - మేలుకాంచు - అలవడు - ఏనుపడు - చొప్పడు - వెలువడు - తలపోయు - వాప పోవు - ఆపోవు - కొంపోవు - కొనిపోవు - విజయంచేయు - కయివ్రాలు-తూపొడుచు-ఇత్యాదులు శబ్దపల్లవంబులు.

౧౧౮ ధాతువునకుఁగాని నామమునకుఁగాని చేరి ఆచేరికవలనఁ గ్రొత్తయర్థమును తెలిపినచో నట్టియర్థమును దెల్పు కూడిక శబ్దపల్లవ మనఁబడును

కూరుచు + ఉండు = కూరుచుండు నిలుచు + ఉండు = నిలుచుండు పడు + ఉండు = పరుండు పన్ను + ఉండు = పన్నుండు (శయనించు) మీఁదివి ధాతువునకు ధాతువు చేరి ఏర్పడిన శబ్దపల్లవములు

ఆఁకలి + కొను = (కలి లోపము) ఆఁకొను ఆఁకలిపొందు - ఇచట నామమునకు ధాతువు ప్రయుక్తమైనది )

ఇచ్చు + కొను = కైకొను (అంగీకరించు) (ఇచ్చునకు కై ఆదేశము.) 'కయి' ఆదేశమగునపుడు కయికొను 'ఇయ్యకొను' అనురూపములు నగును.

రేఁగు + కొను = రెక్కొను (విజృంభించు) త్రెంచు + కొను = త్రెక్కొను (చంపు) మొదలగువానిలో ధాతువునకు ధాతువు ప్రయుక్తమగుట గమనించునది )

మే + కొను = మేకొను మయి + కొను = మయికొను (సమ్మతించు) మేలు + కొను = మేలుకొను మేలు + కను = మేలుకను మేలు + కాంచు = మేలుకాంచు (తెలివినిపొందు) అలవు + పడు = అలవడు (అభ్యాసమగు) మొదలగు నామములపై ధాతువులు చేరుట కుదాహృతులు

ఏర్చు + పడు = ఏర్పడు (తేటపడు) చొచ్చు + పడు = చొప్పడు (సరిపడు) పైవి ధాతు ధాతుసంయోగమువలన నేర్పడిన శబ్దపల్లవములు

వెలి + పడు = వెలువడు (బయలుదేరు) తలఁపు + పోయు = తలపోయు (చింతించు) వాయి + పోవు = వాపోవు (ఏడ్చు) ఆదట + పోవు = ఆపోవు (తృప్తినొందు) మొదలగు నామ, ధాతుసంయోగముచే నేర్పడినవి

కొని + పోవు = కొంపోవు కొనిపోవు - (తీసికొనిపోవు) - ఇది క్త్వార్థము మీఁద ధాతువు చేరుట కుదాహృతి

విజయము + చేయుం = విజయంచేయుం (వచ్చు) కయి + వ్రాలు = కయి వ్రాలు (ఒఱగు) తూ + పొడుచు = తూపొడుచు (ఉమియు)

## చేదర్థయోగంబున లృట్టునకు లిట్టగు. ౧౧౯.

ఆఋషీశ్వరుండు వచ్చెనా ఫలించుఁ గార్యముల్. వాఁడు రేపు వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము

౧౧౯ చేదర్థయోగంబున = హేతు హేతుమద్భావంబున 'ఆ' 'ఏని' 'ఐన' మున్నగు చేదర్థకములతో సంబంధమున్నపుడు భవిష్యత్కాలమును దెల్పు ధాతువునకు భూతకాలరూపమగును

ఆఋషీశ్వరుండు రాఁగలఁడేని ఫలించుకార్యముల్-' అనునర్థమున- చేదర్థముతో సంబంధముండుటచే 'వచ్చు' ధాతుభవిష్యత్తుకు మాఱు భూతకాలక్రియయయి 'ఆ ఋషీశ్వరుండు వచ్చెనా ఫలించెఁ గోరికల్' అని యుండును ఇచట పనులు నెఱవేఱుట కార్యము మునీశ్వరుఁడు వచ్చుట కారణము కావున నిచట భవిష్యత్తునకు భూతకాలరూపమైనది.

వాఁడు రేపు (రాఁగలఁడేని యనునర్థమున) వచ్చెనేని నీవు కార్యంబు దొరఁకొనుము' ఇచట రేపు రాఁగలుగుట కారణము పని మొదలుపెట్టుట కార్యము ఈ కార్యకారణభావముఁ దెల్పు 'ఏని' యోగమున 'వచ్చు' ధాతువు భవిష్యత్తునకు భూతకాలపురూపము గలిగినది

## ఆత్మార్థం బభిహితంబగుచోఁ దల్లింగసంఖ్యాభిధాయి వచనంబు ధాతువిశేషణంబుల కగు ౧౨౦.

రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రిసహితంబుగఁ బుష్పకారూఢుం డయి సాకేతంబునకేతెంచె

౧౨౦ ఆత్మార్థంబు = ఆత్మార్థకమగు 'తాను' శబ్దము తల్లింగసంఖ్యాభిధాయివచనంబు = ఆత్మన్ శబ్దముయొక్క లింగము వచనమును

తాను' శబ్దము క్రియచేఁ జెప్పబడినచో ధాతువునకును విశేషణము-
లకును ఆ తాను' అనుదాని లింగవచనములే అమరునని యర్థము వాక్యము
నందుఁ జెప్పఁ గర్త లుండునపుడు వానితోఁ బాటు తాను అనునదియు
నున్నపుడు విశేషణములును ధాతువును తక్కిన కర్తలయొక్క లింగ వచన
ముల ననుసరింపక తాను' శబ్దార్థముయొక్క లింగవచనములనే పొందునని
భావము రాముఁడు రావణుం బరిమార్చి సీతయుం దాను సౌమిత్రి సహి-
తంబుగం బుష్పకారూఢుండయి సాకేతంబున కేతెంచె - ఇచట ఏతెంచు'
ధాతువు రామునితో నన్వయించురీతిని సీతతోడను అన్వయించుచున్నది.
'పుష్పకారూఢ పదమున (విశేషణము) నట్లే రామునితోవలె సీతతోడను
సమన్వయించుచున్నది అయినను ఈవాక్యమున తాను' ప్రయోగింపఁబడు
టచే ఆ-ఆత్మశబ్దార్థమయిన రామ పదముయొక్క లింగవచనములే) పుం
లింగ-ఏకవచన ములే) విశేషణమునకును ధాతువునకును కలిగినవి ఈసూత్రము
వలని నియమమే లేనిచో పుష్పకారూఢులయి సాకేతంబున కేతెంచిరి'
అని యుండవలసివచ్చును

## అగతికంబులగు భ్వాదుల క్రింద యోగంబు లేదు ౧౨౧.

భూ - సృ - కృ - రేకృ - లోకృ - లోచ - పచి - లప
ఇత్యాదులకు గతివిరహితంబు లగుధాతువుల కీభావం బ్రయో-
గంబు లేదు. ప్ర - పరా - అప - సమ్ - అను - అవ - నిస్ -
నిర్ - దుస్ - దుర్ - వి - ఆఙ్ - ని - అధి - అపి - అతి - సు-
ఉద్ - అభి - ప్రతి - పరి - ఉప-ఊరీప్రభృతులును సాక్షాత్ప్ర-
భృతులును గతిసంజ్ఞాకంబులు. ప్రాదు లిరువదిరెండు నుప
సర్గంబులు నాఁబడు ప్రభవించు - ఆవిర్భవించు - ప్రసరించు -
సంస్కరించు - భస్మీకరించు - సాక్షాత్కరించు - అతిరేకించు -

ఆలోకించు - ఆలోచించు - ప్రపంచించు - ప్రలపించు ఇత్యాదు లార్థప్రయోగంబుల నెఱుంగునది

౧.౨౧ ఆగంతుకంబులగు = క్రింద జెప్పంబోవుప్రాదులు మున్నగు వానిలోఁ గూడియుండని

క్రియతో సంబంధముగల ప్ర-పరా- మున్నగునవియును ఊరీ మున్నగునవియును సాక్షాత్ప్రభృతులును గతి అను పేరుకలవి ఈగతి సంజ్ఞ గలవానిలోఁ జేరికలేనప్పుడు సంస్కృతధాతువులగు భూ-' మున్నగ ధాతువులకు తెలుఁగులో ప్రయోగములేదని యర్థము- భూ' మున్నగువానికి తెలుఁగులో స్వతంత్రప్రయోగము లేదనియు వానికి ముందుగా ప్రాదులు' చేరినపుడే అవి ప్రయోగార్హము లగుననియు భావము

ప్రాదులు-ప్రాదులు అను గతిసంజ్ఞకలవియును ఉపసర్గసంజ్ఞగలవియుఁగూడ నగుచున్నవి

ప్రభవించు' దీనిని ప్ర' తీసివేసి భవించు' అని వాడరాదు ఇట్లే తక్కినవానిని గ్రహించునది

## వలయ్యాదిక్రియలకుం గర్తయుఁ భావంబునందు నుజీయగు. ౧౨౨

వలయ్యాదిక్రియలకుం గర్తృభూతక్రియావృత్తియగు ధాతువునకు నుజీవర్ణకంబగు వాఁడుచూడవలయు - వారలు చూడఁగావలయు - నీవుచూడవలయు - మీరుచూడవలయు. నేను జూడవలయు - మేముచూడవలయు - మనముచూడవలయు వలయును - వలదు - కూడును - కూడదు - చెల్లును- చెల్లదు-తగును-తగదు-ఇత్యాదులు వలయ్యాదులు

సకర్మకంబునకు స్వరూపప్రేరణార్థంబులు రెండును

గొనుపద్వ్యనుబంధంబులం దొక్కొక్కటితోడ రెంటితోడం గూడుచో నగు నవియాఱుం గూడ రూపంబు లెనిమిదయ్యె వాని సొరిది నుదాహరించెద.

కర్త్రర్థకము

మైత్రుఁడు - వంటకమును - వండెను

ఆత్మనేపదకర్త్రర్థకము

మైత్రుఁడు - వంటకమును - వండుకొనియెను.

కర్మార్థకము

మైత్రునిచేత - వంటకము - వండఁబడియెను

ఆత్మనేపదకర్మార్థకము

మైత్రునిచేత - వంటకము - వండుకొనఁబడియెను.

ప్రేరణకర్త్రర్థకము.

చైత్రుఁడు-మైత్రునిచేత - వంటకమును - వండించెను.

ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము.

చైత్రుఁడు-మైత్రునిచేత - వంటకమును వండించుకొనియెను.

ప్రేరణకర్మార్థకము

చైత్రునిచేత - మైత్రునిచేత - వంటకము - వండింపఁబడియెను.

ప్రేరణాత్మనేపదకర్మార్థకము

చైత్రునిచేత - మైత్రునిచేత - వంటకము - వండించుకొనఁబడియెను.



౧౨౨ వలయు' మొదలగు సమాపకక్రియలకుఁ గర్తృభూతమైన వ్యాపారమునందుండు ధాతువులకు నుజ్ ఆగును అనఁగా ప్రధానములగు వలయు' మున్నగు క్రియలచేఁ జెప్పఁబడువ్యాపారమునకు వేఱొకవ్యాపారము కర్తగా అగునపుడు- వలయు మున్నగువాని కర్తృభూతధాతువులకు నుజ్ ఆగునని భావము

వాఁడు చూడవలయును ఇచట వలయును' అను సమాపక (ప్రధాన) క్రియకు చూడు అనునదే కర్తగాన దానికి కావించే నుజ్ యను ౨౦-వ సూత్రముచే డు' వర్ణము నుకారమునకు అకారమువచ్చినది వాఁడు' అనునది చూచు' ధాతువునకుఁ గర్తగా నన్వయించును చూడన్' అనునది వలయు ననుదానికిఁ గర్తగా నన్వయించును ఇట్లు వారలు చూడఁగా వలయు' మున్నగుచోట్లను వారలు (బహువచనాంతము)' చూచు' ధాతువుతోడను ఆధాతువు కర్తగా వలయు ధాతువుతోడను అన్వయించును గావున వలయు' ధాతువు సదా ఏకవచనాంతముగానే యుండునని తెలియదగును

ఇట్టే మీరుచేయ దగదు మనమాడఁ జెల్లును మేము వెళ్ళనచ్చును' మున్నగు నుదాహరణములందుఁ ప్రధానక్రియావాచ్యవ్యాపారములకుఁ జేయుట యాడుట వెళ్ళుట మొదలగువ్యాపారములే కర్తలుగాన నుజ్ వానికయ్యెనని గ్రహించునది

సకర్మకంబునకు— సకర్మకక్రియకు ప్రధానరూపములు ౨. ౧ స్వార్థరూపము ౨ ప్రేరణార్థకము అందు స్వార్థమున-కొను (ఆత్మనేపదార్థము) పడు కర్మార్థకము, కొనఁబడు - (ఆత్మనేపదకర్మార్థకము) అనునవియు రాఁగా మూఁడేసిరూపములు ఇట్లే ప్రేరణార్థకమునకును మూఁడేసి రూపములగును ఈయాఱును ప్రధానములగు మొదటి స్వార్థ ప్రేరణరూపములు రెండునుగలిసి ౮ రూపము లగును

- ౧ కర్తృ(స్వా)ర్థము (వండెను) కర్తృస్వార్థకము
  - ఆత్మనేపదము (వండుకొనియెను) ౧
  - కర్మార్థకము (వండఁబడియెను) ౨
  - ఆత్మనే కర్మార్థ (వండుకొనఁబడియెను) ౩
- ౨ ప్రేరణము (వండించెను) ప్రేరణము
  - ఆత్మ — వండించుకొనియెను ౧
  - కర్మ — వండింపఁబడియెను ౨
  - ఆ క — వండించుకొనఁబడియెను ౩

(౩ + ౩ + ౨ = ౮ సకర్మకరూపములు)

**గతిబుద్ధిప్రత్యవసానార్థశబ్దాకర్మకంబుల కప్రేరణంబునం గర్త యగునది ప్రేరణంబునం గర్మంబగు ౧౨౩**

పొందు మొదలయినవి గత్యర్థకంబులు తెలియు మొదలయినవి బుద్ధ్యర్థకంబులు తిను మొదలయినవి ప్రత్యవసానార్థకంబులు విను-చెప్పు - చదువు - మొదలయినవి శబ్దకర్మంబులు. అకర్మకంబులు ప్రసిద్ధంబులు మైత్రుండు గ్రామంబుం బొందెను- చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను లాఁతిచోసహిత మిక్కార్యంబు గానంబడియెడి మైత్రుండు పుడమి నేలెను - చైత్రుండు మైత్రునిం బుడమి నేలించెను

౧౨౩ గతిబుద్ధిప్రత్యవసానార్థములు-గతి = పొందుట బుద్ధి=తెలిసికొనుట ప్రత్యవసానార్థము=తినుట యనునర్థములుకలవి శబ్దకర్మములు=ధ్వనిని దెల్పుపదములు కర్మలుగాఁగలవి అకర్మకములు=కర్మ లేనివి

గత్యర్థకములు మున్నగుధాతువులు ప్రయోగించునపుడు అప్రేరణమున (కర్త్రర్థమున) ఏవి కర్తలుగా నుండునో అవి ప్రేరణార్థమున కర్మ లగును

'మైత్రుండు గ్రామంబుఁ బొందెను-' ఇచట 'పొందు' గత్యర్థకము-కర్త్రర్థకము ఈప్రయోగమున కర్త మైత్రుఁడు 'చైత్రుండు మైత్రుని గ్రామంబుం బొందించెను' అనుచోట 'పొందించెను' ప్రేరణార్థకము కాన అప్రేరణమున కర్తయైన మైత్రుఁడు అనునది ఇందు కర్మయై ద్వితీయా విభక్తిని (కారక ౨-వ సూత్రము) పొంది మైత్రుని- అని యైనది

లాఁతిచోసహితము—వేఱుచోట్లఁగూడ అనఁగా గత్యాదులకంటె వేఱగునర్థములందును-కర్తలకుఁ బ్రేరణమునఁ గర్మత్వము సిద్ధించునని భావము

'మైత్రుండు పుడమి నేలెను' ఇచటి ఏలు అనునది గత్యాదులలోఁ జేర లేదు అయినను ఆయర్థమునఁ గల 'మైత్రుండు' అనుకర్తకుఁ బ్రేరణమున 'చైత్రుండు మైత్రునిం బుడమి నేలించెను' అని ప్రేరణమునందుఁ గర్మత్వము సిద్ధించి ద్వితీయావిభక్తివచ్చెను ఇట్టివానిని ప్రయోగానుసారముగా గ్రహింపనగును

## అనభిహితకర్త కొకానొకచో షష్ఠి బహుళంబుగా నగు ౧౨౮.

రాముఁడు మిథిలంగనియె - రామునకు మిథిల గనంబడియె - రామునిచే మిథిల గనంబడియెను. మైత్రుండు తత్త్వంబుం దెలిసెను - చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను. కన్యాదియోగంబునం బ్రయోజ్యకర్తకు షష్ఠి నిత్యంబుగానగు - విశ్వామిత్రుఁడు రామునకు మిథిలం గానిపించెను. కృష్ణుం డర్జునునకు విశ్వరూపంబుం జూపెను.

అకర్మకంబున కప్రేరణంబునం దాత్మనేపదకర్త్రానుబంధంబులు లేమిం జేసి రూపభేదంబు లయిదని యెఱుంగునది.

కర్త్రర్థకము.

మైత్రుండు - మనియెను

ప్రేరణకర్త్రర్థకము

చైత్రుండు - మైత్రుని - మనిచెను

ప్రేరణాత్మనేపద కర్త్రర్థకము

చైత్రుండు - మైత్రుని - మనుచుకొనియె

ప్రేరణకర్మార్థకము

చైత్రునిచేత - మైత్రుండు - మనుపఁబడియె

ప్రేరణాత్మనేపదకర్మార్థకము

చైత్రునిచేత - మైత్రుండు - మనుచుకొనఁబడియె

రెండియుం బ్రేరణంబునం దించుగాగమంబు గలిగినచో సకర్మకంబునకుం బండ్రెండు నకర్మకంబునకుం దొమ్మిదియు భేదంబులని యూహించునది.

౧౨౮ అభిహితకర్త=ధాత్వర్థముచేఁ జెప్పఁబడినకర్త క్రియచేఁ జెప్పఁబడనికర్తకుఁ గొన్నియెడల బహుళముగా షష్ఠివచ్చును అనభిహితకర్తకు సాధారణముగా కారక 3-వ సూత్రము ననుసరించి తృతీయ రావలసియుండఁగా షష్ఠికూడ బహుళముగా గల్గునని యీసూత్రముచె విధింపఁబడినది

రాముఁడు మిథిలం గనియె-' అనుచో రాముఁడు' అనునది క్రియచే అభిహితమైనది (ఎవఁడు కనియె నని ప్రశ్నింపఁగా రాముఁడు' అని సమాధానము వచ్చెను) కాన దీనికి షష్ఠిరాదు 'రామునిచే మిథిల కనఁబడియె' ననుచో కర్తయగు రాముఁడు' క్రియచేఁ జెప్పఁబడలేదు (ఏది కనఁబడియెను? అని ప్రశ్నించినచో మిథిల' అని జవాబువచ్చుచున్నది కాని కర్త జవాబుకాలేదు.)

రామునిచే-'అనుచోట కారక 3-వ సూత్రముచే తృతీయవచ్చి నది తృతీయకుబదులు షష్ఠియు బహుళముగా రావచ్చునని యీసూత్ర ముచే విధింపఁబడినందున రామునకు మిథిల కనఁబడినది యనియు నుండ వచ్చును

మైత్రుండు తత్త్వంబుం దెలిసెను' అనుచోట క్రియచేఁ జెప్పఁబడు కర్త మైత్రుఁడు' అభిహితము కానందున దీనికి షష్ఠిరాదు చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను అనుచోటఁ దెలిసినవాఁడు చైత్రుఁడుకాని మైత్రుఁడుకాఁడు కాన మైత్రుఁడు' అనభిహితకర్తయైనాఁడు ఇచట అప్రే రణమునందుఁ గర్తయైన మైత్రుఁడు ప్రేరణమునఁ గర్మ యగుటచే ద్వితీయ రావలసియుండఁగా ఈవిధిచే షష్ఠివచ్చి (ద్వితీయను బాధించి) చైత్రుండు మైత్రునకుం దత్త్వంబు దెలిపెను' అని యైనది

కన్వాది - ఈసూత్రమునందలి బహుళగ్రహణము ననుసరించి కను మున్నగు ధాతువులతోడి సంబంధమునందు కను' మున్నగు ధాత్వర్థముల ప్రేరణరూపములతోడి యన్వయమున వాని అప్రేరణమునందలికర్తకు నిత్య ముగా షష్ఠి కలుగునని యర్థము అట్టియెడల ద్వితీయ కాదని భావము

ప్రయోజ్యకర్త = ప్రోత్సహింప (ప్రేరింపఁ) బడుకర్త - స్వార్థము నందుఁ గర్తయయి ప్రేరణమునందు వేఱొకనిచే వ్యాపారమునందుఁ బ్రవేశ పెట్టఁబడుకర్త

(అప్రేరణము లేక స్వార్థము రాముఁడు మిథిలం గనెను ఇచట కర్త రాముఁడు' దీనికిఁ బ్రేరణార్థకరూపము-) విశ్వామిత్రుండు రామునకు మిథి లం గానిపించెను' అనుచోట ప్రయోజ్యకర్త రాముఁడు' ప్రయోజకకర్త ప్రోత్సహించినవాఁడు విశ్వామిత్రుఁడు' ఇచటఁ బ్రయోజ్యకర్తకు ౧-౩- సూత్రము ననుసరించి ద్వితీయ రావలసియుండఁగా షష్ఠి నిత్యముగా విధింపఁ బడుచున్నది షష్ఠి నిత్యమనిచెప్పుటకు సూత్రమునందలి బహుళ' గ్రహణమే

కారణము ఇట్లే కృష్ణుం డర్జునుని విశ్వరూపంబుం జూపెను అనుచోఁ ప్రయోజకకర్తచేఁ బ్రేరింపబడిన ప్రయోజ్యకర్త యగు నర్జునుఁడు అను దానికి ద్వితీయకు బదులు షష్ఠి వచ్చెనని గ్రహించునది

అకర్మకంబునకు - కర్మలేని (కేవల) కర్త్రర్థకమనను కర్మార్థమునఁ గల్గు పదులకె రావందునను ఆత్మనేపదార్థమున వచ్చు కొను స్వార్థమున రానందు నను స్వార్థమునఁ గర్త్రర్థకరూప మొక్కటియే కలుగును ప్రేరణార్థక ప్రత్యయములు అకర్మకములకును గలుగును కావున ప్రేరణకర్త్రర్థకరూపములమీఁద కొను వడు కొనుపడు లు సంధించుటచే ప్రేరణార్థమున నాల్గురూపము లేర్పడును స్వార్థమునందలి రూపముతోఁ గూడఁ జేరి అకర్మకమునకు ఐదు రూపములగనని యభిప్రాయము

అకర్మకము




వెండియుం బ్రేరణంబున—సకర్మకమునకు ౧౨౨ సూత్రము టీకలో విపరింప బడినప్రకారము కలిగిన ఆ రూపములలో-ప్రేరణరూపములు నాల్గింటి

మీఁదను మఱలఁ బ్రేరణప్రత్యయములను గూర్చునెడల మఱి ౪ రూపములు ఎక్కువయగును

ప్రేరణకర్త్రర్థకమునుండి పునః ప్రేరణకర్త్రర్థకము- దేవదత్తుఁడు చైత్రునకు మైత్రునిచేత వంటకము వండింపించెను

ప్రేరణాత్మనేపదకర్త్రర్థమునుండి పునః ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము- దేవదత్తుఁడు చైత్రునకు మైత్రునిచేత వంటకమును వండింపించుకొనెను'

ప్రేరణకర్మార్థకమునుండి పునః ప్రేరణకర్మార్థకము - దేవదత్తునిచేత చైత్రునిచేత మైత్రునకు వంటకము వండింపింపఁబడియెను' ప్రేరణాత్మనేపద కర్మార్థకమునుండి పునః ప్రేరణాత్మనేపదకర్మార్థకము - దేవదత్తునిచేత చైత్రుని చేత మైత్రునకు వంటకము వండింపించుకొనఁబడియెను'

అకర్మకమునకు కలిగిన ౫ రూపభేదములలోఁ బ్రేరణార్థకములగు నాల్గింటిమీఁద మఱలఁ బ్రేరణ ప్రత్యయములను గూర్చినయెడల మఱి ౪ రూపములు ఎక్కువగాఁ గల్గును

౧ ప్రేరణకర్త్రర్థకమునుండి మఱలఁ బ్రేరణకర్త్రర్థకము - దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించెను.'

౨ ప్రేరణాత్మనేపదకర్త్రర్థకమునుండి పునః ప్రేరణాత్మనేపదకర్త్రర్థకము - దేవదత్తుఁడు చైత్రునిచేత మైత్రుని మనిపించుకొనియెను.

3 ప్రేరణకర్మార్థకమునుండి పునః ప్రేరణకర్మార్థకము - దేవదత్తునిచేత చైత్రునిచేత మైత్రుఁడు మనిపింపఁబడియెను

౪ ప్రేరణాత్మనేపదకర్మార్థకమునుండి పునః ప్రేరణాత్మనేపదకర్మార్థకము- దేవదత్తునిచేత చైత్రునిచేత మైత్రుఁడు మనిపించుకొనఁబడియె'

ఈయిరీతిని సకర్మకమునకు ౧౨ ను అకర్మమునకు ౯-యును భేదములగును.

ఇది క్రియాపరిచ్ఛేదము.

# కృదంతపరిచ్ఛేదము



## కృత్తుల కర్థంబులు యథావ్యవహారంబుగ గ్రాహ్యంబులు. ౧

ధాతువునకు విహితంబగు దుఙ్భిన్న ప్రత్యయంబు కృత్తనంబడు. కృత్తులకు వక్ష్యమాణంబులకు భావకర్తృ కర్త్రాద్యర్థంబులు మహాజనవ్యవహారానుసారిగా నెఱుంగునది. ఆఁక - బంధనము మొలక - నవోద్భిదము ఏలిక - పాలకుడు కోరిక-వాంఛయు - వాంఛితంబును మూఁక - సంఘము. ఆడిక-నింద. ఓడిక-స్రోతస్సు.

కృదంతపరిచ్ఛేదము—ధాతువులకుఁ జేరుప్రత్యయములు కృత్తులు కృత్తులు చివరఁ గలవి కృదంతములు-ఇవి నామవాచకములు ధాతువులకు ప్రత్యయములు చేరి నామవాచకము లగునవే కృదంతములని భావము వానిని గూర్చి తెలుపు గ్రంథభాగము కృదంతపరిచ్ఛేదము.

౧ కృత్తులు=ధాతువుల చివరఁ జేరు దుజ్ రు వు రు ను ముఙ్ఙు లకంటె వేఱైన ప్రత్యయములు.

భావార్థమున కుదాహృతి- ఆఁగు+క=ఆఁక 'ఆఁగు' నకు 'ఆఁగుట' అను భావార్థమున 3-వ సూత్రముచే 'క' వచ్చి ౨-వ సూత్రముచే 'గు' లోపించినది

కర్త్రర్థమున కుదాహృతులు-మొలుచు+క= మొలక (నవోద్భిదము=క్రొత్తగా అంకురించినది') ఇచట 3-వ సూత్రముచే 'క' ప్రత్యయమును ౨-వ సూత్రముచే 'చు' లోపమును వచ్చినవి. ఏలు+ఇక=ఏలిక.' ఇచట

౧౨-వ సూత్రముచే ఇక ప్రత్యయము వచ్చి సంధి (సంధి ౧౧-వ సూత్రము) అయినది కోరు+ఇక=కోరిక అనునది కర్త్రర్థమున ఉదాహృతి ప్రక్రియ మీఁదిరీతినే మూఁగు+క=మూఁక' అనునది కర్త్రర్థకము ఇట 3-వ సూత్రముచే ౘ ౨-వ సూత్రముచే గు' లోపము వచ్చినది అడు+ఇక=అడిక' అనుచోట భావార్థమున ఇక' వచ్చినది ఓడు+ఇక=ఓడిక' ఇచట కర్త్రర్థమున ఇక వచ్చినది (స్త్రోతస్సు-ప్రవాహము)

## ఇటం గృత్యగతపవేములు పరంబు లగునపుడు క గ చ య వ లకు లోపంబగు. ౨

కృత్సంబంధులగు కాదులు పరంబులగునపుడు ధాతువు నంతంబులగు కగచయవలకు లోపంబగు మీఁదిలక్ష్యంబులం జూడంబడు

౨ ఇట = ధాతువులందు కృత్యగతపవేములు = కృత్ప్రత్యయసంబంధములగు క-గ-చ-ప-వ-ఇనులు వీని ఉదాహరణములు తరువాతిసూత్రములందు చూచునది

## కవర్ణకం బలుగ్వాదుల కగు 3

అలుగు - అలుక అఁగు - అఁక ఎలుఁగు - ఎలుక ఇట బిందులోపంబు ఇట్లు కొన్నింట గ్రహించునది కడఁగు - కడఁక. కలఁగు - కలఁక కాఁగు - కాఁక. తునుఁగు - తునుక. నడచు - నడక. నలఁగు-నలఁక. పోవు-పోక. మడఁగు-మడఁక మలఁగు - మలఁక మునుఁగు - మునుక మూఁగు మూఁక మొలచు - మొలక వచ్చునకు - రా - రాక. వంగు - వంక వీఁగు - వీఁక. ఇఁక కవులు పరంబులగునపుడు కనునకు దీర్ఘంబగు - కానుక. కినియు మునియుల కుత్వంబునగు కినియు - కినుక మునియు - మునుక ఇత్యాదు లలుగ్వాదులు

## క్షువర్ణకం బడంగ్వాదులకగు. ౬.

అడఁగు-అడఁకువ. ఎఱుఁగు ఎఱుకువ - కలఁగు-కలఁకువ - నలఁగు - నలఁకువ పెనఁగు - పెనఁకువ పొలయు-పొలఁకువ. మఱచు - మఱకువ మెలఁగు - మెలఁకువ. లోఁగు - లోఁకువ. వేగు - వేకువ.

౬. అడంగు' మున్నగుధాతువులకు కువ' అగును అడఁగు+కువ=అడఁకువ' ౦-సూత్రముచే గు' లోపము ఇట్లే తక్కినవియును

## టవర్ణకం బాడ్వాదుల కగు నగుచో నంతలోపంబగు. ౭.

ఆడు - ఆట ఊరు - ఊట ఊఱు - ఊఱట వేఁకరు - వేఁకట ఓడు - ఓట తివురు - తివుట తేరు - తేట త్రిమ్మరు - త్రిమ్మట పండు - పంట పాడు - పాట మండు - మంట వండు - వంట వేసఱు - వేసట. అనుప్రయుక్తం బయిన యాటశబ్దంబు ప్రాయికంబుగాఁ గ్లీబసమం బగు కోలాటము - పోరాటము - మంద్రాటము ఇత్యాదులు

౭ ఆడు మున్నగుధాతువులకు ట' అగును ఆ ట' పరమగునపుడు ధాతువు చివఱియక్షరము లోపించును ఆడు+ట-ఆట -ఇట్లే మిగిలినవియును.

అనుప్రయుక్తంబు—కొన్నిశబ్దములవెనుకఁ జేర్పఁబడు ఆట' శబ్దము తఱచుగ నపుంసకసమమగును కాన ము' వర్ణకముపొందును ఉదా — కోలాటము-పోరాటము-మంద్రాటము' వీనిని కోలాట పోరాట మంద్రాట' అని వ్రాయరాదు.

## టువర్ణకంబు పడ్వాదుల కగు నగుచోనవి యాద్యక్షరశేషంబులయి దీర్ఘంబు నొందు. ౮.

పడు - పాటు చెడు - చేటు. అడుచు - ఆటు కఱచు -

కాటు పొడుచు - పోటు వయిచు - వాటు ఏయు - ఏటు. ఓడు - ఓటు ప్రేయు - ప్రేటు

౮. పడు మొదలగుధాతువులకు టు' అగును అది పరముకాఁగా ధాతువు మొదటియక్షరమే మిగిలి దీర్ఘమును పొందును. (తక్కినయక్షరములు లోపించును) పడు + టు = పాటు' అడుచు + టు = ( డుచు' లోపము) ఆటు ఇట్లే తక్కినవియును

## పవర్ణకంబు తిరియ్యాదుల కగు ౯

తిరియు - తిరిపము కలియున కత్వంబు నగు - కలపము. పొలయు - పొలపము మురియు - మురిపము సొలయు - సొలపము వలియు - వలిపము

తిరియు మొన్నగుధాతువులకు ప' ప్రత్యయమగును. తిరియు + ప + ము = తిరిపము' - ఇచట ౨-సూత్రముచే యు' లోపము అచ్చికి ౨-సూత్రముచే క్లీబసమత్వమువచ్చి ము' అయినది ఇట్లే తక్కినవియును. కలియు + ప + ము = కలపము. (ఇచట లి' ల' గామారినది )

## తవర్ణకం బావులించు లోనగువానికగు ౧౦.

ఆవులించు - ఆవులింత ఇగిలించు - ఇగిలింత ఓకిలించు - ఓకిలింత కుళ్లగించు - కుళ్లగింత. కుసిలించు - కుసిలింత కొక్కరించు. కొక్కరింత కొప్పగించు - కొప్పరింత గిలిగించు - గిలిగింత - ఇత్యాదు లెఱుంగునది.

౧౦ ఆవులించు' లోనగుధాతువులకు త' అగును. ఆవులించు + త = ఆవులింత' - ఇచట ౨-సూత్రముచే చు' లోపము

## వువర్ణకంబు మాయ్యాదుల కగు ౧౧.

మాయు - మాపు మేయు - మేపు అడుచు - అడుపు.

ఇంచు - ఇంపు వేఁచు - వేఁపు ఏచు - ఏపు - కను - కానుపు
కాచు - కాపు మాచు-మాపు తలఁచు - తలఁపు తోఁచు -
తోఁపు త్రేఁచు - త్రేఁపు త్రోఁచు - త్రోఁపు పూఁచు - పూఁపు
పెనుచు - పెనుపు పొలుచు - పొలుపు ప్రోచు - ప్రోపు
మెచ్చు - మెప్పు మోచు - మోపు వలచు - వలపు వాచు -
వాపు ఇత్యాదులు మాచ్యాదులు

౧౧ మాచు' మున్నగువానికి పు అగును మాచు+పు=మాపు' ౧-సూత్రముచే చు' లోపము ఇట్లే మిగిలినవియును

## ఇకవర్ణకం బంజ్యాదుల కగు ౧౨

అంజు - అంజిక అమరు - అమరిక అరయు - అరయిక
అలయు - అలయిక ఆసు - ఆసిక ఓపు - ఓపిక. ఓపు - ఓపిక
కను - కానిక కూఁపు - కూపిక - కోరు - కోరిక పొందు -
పొందిక పోలు - పోలిక తూఁగు తూఁగునకగు - తూనిక.
ఇత్యాదు లంజ్యాదులు.

౧౨ అంజు మొదలగువానికి ఇక' అగును అంజు+ఇక=అంజిక సంధి ౧౧ సూత్రముచే సంధి) తూఁగు+ఇక=తూనిక' ఇచట తూఁగు' అనుదానికి తూను' ఆదేశమయినది

## అప్పాదులకు నజి యగు ౧౩

అప్ప - అప్పన ఉజ్జ - ఉజ్జన ఒప్ప - ఒప్పన గట్ట - గట్టన.
గడ - గడన దట్ట - దట్టన. దీవ - దీవన. పాట - పాటన మన్న-
మన్నన వీచు - వీవన

౧౩ అప్ప' మొదలగు ధాతువులకు నజి' (న) అగును అప్ప+న=అప్పన' వీచు+న=వీవన ఇచట నజి చేర్చుటచే ధాతువు చివరి (చు

బోని) ఈకారము అకారమగుచున్నది (చూ క్రియా ౨౦ సూత్రము) పిదప క్రియా ౮౮ చే చకారము వకారముగా మారినది

## బడి యేల్వాదులకగు ౧౪

ఏలుబడి - కట్టుబడి - కనుబడి - కొనుబడి - గిట్టుబడి - చెల్లుబడి - చేరుబడి - తగులుబడి - తీఱుబడి - పెట్టుబడి - పోబడి - మ్రొక్కుబడి - వచ్చుబడి - సాగుబడి.

౧౪ ఏలు' మున్నగువానికి బడి' అగును ఏలు+బడి=ఏలుబడి' ఇట్లే తక్కినవియు

## గడ చేర్వాదుల కగు ౧౫

చేరుగడ - తిరుగడ - తీఱుగడ - తేలుగడ - తేగడ . మనుగడ - విడుగడ - వీడుగడ

౧౫ చేరు మున్నగువానికి గడ అగును చేరు+గడ=చేరుగడ' ఇట్లే తక్కినవియు

## ఇకి కోర్వాదుల కగు ౧౬

కోరికి - పూనికి - పోలికి-మనికి - వినికి - చూడు చూడ్కిన కగు - చూడికి

౧౬ కోరు' మున్నగువానికి ఇకి అగును. కోరు+ఇకి=కోరికి (సంధి ౧౧-సూత్రముచే సంధి) చూచు+ఇకి=చూడికి' (క్రియా ౯౧ సూత్రముచే చూచు' నకు చూడు' ఆదేశము.)

## వు ప్రవర్ణకంబు మన్వాదుల కగు ౧౭.

మను - మనువు కాచు - కావు కొలుచు - కొలువు. చచ్చు - చావు. తడయు - తడవు నిలుచు - నిలువు నొచ్చు నోవు పూచు - పూవు ప్రిచ్చు - ప్రివ్వు.

౧౭ మను' మన్నగువానికి వు' అగును. మను+వు=మనువు' 'కాచు +వు=కావు' (౧-సూత్రముచే చు' లోపించినది) ఇట్లే తక్కినవియును చచ్చు+వు=చావు ౧-వ సూత్రముచే చ్చు లోపము ఆద్యక్షరమునకు దీర్ఘము ఇట్లే నొచ్చు+వు=నోవు ప్రుచ్చు+వు=ప్రువ్వు' ౧ సూత్రము చ్చు' లోపము వ' కార ద్విత్వమును

## అవర్ణకంబు గీఱ్ఱాదుల కగు ౧౮

గీఱ - ఊఁద - ఎండ - కాయ-చవియ - తునియ - పరియ - పాయ - పిడుచ - మీట - ముడియ - వదర - వ్రయ్య

౧౮. గీఱు' మన్నగువానికి అ అగును గీఱు+అ=గీఱ - (సంధి ౧౧-చే సంధి) ఇట్లే తక్కినవియును

## అకవర్ణకంబు మాఱ్ఱాదుల కగు ౧౯

మాఱు మాఱకము అమ్ము - అమ్మకము అంపు - అంపకము పంచు - పంపు - పంపకము. వండుడకారంబు టకారంబగు - వంటకము తోము - తోమకము అద్దు - అద్దకము

౧౯ మాఱు' మొదలగువానికి అక' అగును మాఱు' మున్నగునవన్నియును క్లీబతుల్యములు కాన వీనికి ము' ప్రత్యయ మగును మాఱు+అక+ము=మాఱకము'(సంధి. ౧౧ చే సంధి) వండు+అక+ము=వంటకము' అనుచోట డకారము' టకార' మయినది

## డువర్ణకం బాఱ్ఱాదుల కగు నగునపుడు పకారంబు చయలకగు ౨౦

ఆఱు - ఆఱుడు. అమ్ము - అమ్ముడు. అల్లు - అల్లుడు ఎక్కు - ఎక్కుడు. క్రమ్ము - క్రమ్ముడు చోపు - చోపుడు. త్రొక్కు - త్రొక్కుడు. త్రోచు - త్రోపుడు దంచు - దంపుడు.

దాఁచు - దాఁపుడు దిగు - దిగుడు దోఁచు-దోఁపుడు పెంచు-పెంపుడు - ప్రేఁపుడు ప్రాఁకు - ప్రాఁకుడు మాయు - మాపుడు. రాచు - రాపుడు ఇత్యాదులు.

౨౦ ఆఱు' మున్నగువానికి 'డు' అగును ఆ డు' పరమగుచో చ య లు ప' గా మాఱును ఆఱు + డు = ఆఱుడు' దంచు + డు = దంపుడు' మాయు + డు = మాపుడు'-అనుచోట్ల పరుసగా చ య' లకు పకార మాదేశ మగుటను గమనించునది ఇట్లే తక్కినవియును

ఉవర్ణకం ఒడుక్వాదుల కగు ౨౧.

అడుకు - అంటు - ఒప్పు - ఒఱుగు - ఒసఁగు

౨౧ అడుకు' మున్నగువానికి ఉ' అగును అడుక + ఉ = అడుకు' సంధి ౧౧ సూత్రముచే సంధి ఇట్లే తక్కినవియును

వడిప్రభృతు లిట్లెఱుంగునది ౨౨

వడి కొలువడి - గెలువడి - నడవడి వ్యతిరేకంబున లేవడి- వి తనివి - తెలివి - విరివి అవు తగవు - నగవు - ఉఱవు. ఇ చేయి - వ్రాయి కలి కనుకలి - వినుకలి ఇత్యాదులు మహాజనవ్యవహారంబుల నెఱుంగునది.

౨౨. వడిప్రభృతులు = వడి వి అవు ఇ కలి మున్నగునవి వడి' మున్నగునవి ఆయాధాతువుల కాయాయర్థములందు గలుగుటను పెద్దలవ్యవహారము ననుసరించి గ్రహింపఁదగును కొలుచు + వడి = కొలువడి. (వడి). ఇచట ౫ సూత్రముచే చు' లోపము ఇట్లే తక్కినవి కలుగు + వడి (వ్యతిరేకము) = లేవడి క్రియా ౧౧౬ చే కలుగు' నకు లే ఆదేశమయినది

(వి) తనియు + వి = తనివి (౭-సూత్రముచే యు' లోపము) ఇట్లే 'తెలివి విరివి' అనునవియును

(అవు) తగు+అవు=తగవు' (సంధి ౧౧-సూత్రముచే సంధి నగవు 'ఉఱవు' ఇట్లే

(ఇ) చేయు+ఇ=చేయి. (సంధి ౧౧-సూత్రముచేసంధి ) ఇట్లే 'వ్రాయి' (కలి)

'కను+కలి=కనుకలి విను+కలి=వినుకలి'

ఇది కృదంతపరిచ్ఛేదము



# ప్రకీర్ణకపరిచ్ఛేదము

**పదాద్యంబులు ఋౠ వర్ణంబులు రల తుల్యంబులు ౧**

అతఁడు ఋషి - ఇట సంధిలేదు. ఆఋషి - ఇట యడాగమము లేదు వచ్చె ఋషి - వచ్చెఁ ఋషి - వచ్చెను ఋషి - ఇట ద్రుతమునకు లోప సంశ్లేషస్వత్వములు.

ప్రకీర్ణక పరిచ్ఛేదము—ప్రకీర్ణ మనఁగా నంతటఁ జల్లబడినది-చిల్లరయైనది వెనుకఁజెప్పఁబడిన పరిచ్ఛేదముల కన్నింటికిని సంబంధించిన విషయములను వివరించుగ్రంథభాగము ప్రకీర్ణక పరిచ్ఛేదము.

౧ పదము తొలుతనుండు అచ్చులగు ఋ-ౠలు రేఫలకారముల వంటివి

అతఁడు+ఋషి-' ఇచట ఋకారము' ర' తో సమానమగుటచే ఉకారసంధిరాలేదు కాన అతదృషి' కాలేదు.

ఆఋషి' అనుచో ఋ' అచ్చుగాఁ బరిగణింపఁబడినచో యడాగమమువచ్చి ఆయృషి' కావలసివచ్చును అట్లు కాలేదు వచ్చెన్+ఋషి= (1) వచ్చెఋషి (2) వచ్చెన్‌ఋషి (8) వచ్చెను ఋషి' ఇచట ఋకారము' రేఫగాఁ బరిగణింపఁబడి స్థిరత్వముపొందుటచేసంధి ౧౮-వ సూత్రముచే అనుసరించి ద్రుతమునకు (1) లో లోపము (2) లో సంశ్లేషము, (3) లో స్వత్వము కలిగినవని గ్రహింపనగును.

**ఆచ్ఛికపదంబులం దుత్తమంబు లగు రులుషుల ముందఱియేత్వంబునకు హ్రస్వంబు విభాషనగు. ౨.**

నల్లేరు - నల్లెరు పల్లేరు - పల్లెరు పెన్నేరు - పెన్నెరు. మానేరు - మానెరు. ఆడేలు - ఆడెలు. కుందేలు - కుందెలు. తోఁడేలు - తోఁడెలు నాఁగేలు - నాఁగెలు నేరేడు - నేరెడు. మారేడు - మారెడు పూరేడు - పూరెడు తంగేడు తంగెడు

౨ ఉత్తమంబులు = మూఁడచ్చులు గలపదములలో మూఁడవ యక్షరములు అచ్చతెనుఁగుపదములందు మూఁడక్షరములు గలపదములలో మూఁడవయక్షరములు 'రు లు-డు' అనునవైనచో వానికి ముందున్న ఏకారము వికల్పముగా ఎకారమగును 'నల్లెరు' లోని రు ఉత్తమము దానికి ముందున్న ల్లే లోని ఏత్వము వికల్పముగా ఎత్వమై 'నల్లెరు' ఆయినది తక్కినవియు నిట్లే

ఊయేల పయ్యేదతాయెతులం ద్రిక్కనామంబులందు
యాకుం దాలవ్యవక్రయోగంబులేదు. 3.

స్పష్టము.

3 త్రిక్క=తప్పు తాలవ్యవక్రయోగము=ఎ ఏ' లతోఁ గూడి యుండుట 'ఊయేల పయ్యెద తాయెతు' అను మూఁడుపదములను విడిచి వేఱెచ్చటనుగూడ 'యె యే' లు పదములలో లేవు

ఊయేల యూయాలలచాఁపులనొండొంటికిం
గుఱుచయొండె నగు. ౪.

ఉయేల - ఊయెల - ఊయేల - ఉయాల - ఊయల - ఊయాల వక్ష్యమాణంబు యద్విత్వంబు - ఉయ్యేల - ఉయ్యెల- ఉయ్యాల - ఉయ్యల.

౪ చాపుల=దీర్ఘములందు ఒండొంటికి=పర్యాయముగ ఒండె=వికల్పముగా ఊయేల ఊయాల' అనుదానిదీర్ఘములకు హ్రస్వము వికల్పముగా నగు వక్ష్యమాణంబు=ముందు విధింపఁబడునది (౬-వ సూత్రముచేత నని యర్థము.) (1) ఉయేల (2) ఊయె, (3) ఉయ్యెల (4) ఉయ్యేల, (5) ఊయేల (1) ఉయాల (2) ఊయల (3) ఉయ్యల (4) ఉయ్యాల, (5) ఊయాల

## పయ్యెద పయ్యద. ౫.

౫ పయ్యెద' అనునది పయ్యద' యని య' కారమధ్యముగను ఉండవచ్చునని యర్థము.

## ఊయేలాదులం దొలియచ్చు మీఁదిహల్లునకు ద్విర్వచనంబొండె నగు ౬.

ఉయ్యేల - ఊయేల. ఊయేల - ఊయెల ఊయాల - ఊయల ఆయె - ఏలిదము - ఓయ - ఓయారము - కోపు (ధనురగ్రము) జాజర - తీనియ - తీయము - తేప (ప్లవము) తేమ - తోయలి - దీవియ - హూవు - నోవి - నోవు - పూవు వేయ - మోక (అంకురము) మోటిక - మోపు - వీయము - ఇత్యాదులూయేలాదులు.

౬ ద్విర్వచనంబు=ద్విత్వము ఒండె=వికల్పముగా ఊయేల' మొదలగుశబ్దములందు పదము తొలియచ్చునకుఁ దర్వాత నున్నహల్లునకు ద్విత్వము వికల్పముగా నగును

ఊయేల' అనుదానిలోని ఊ' తర్వాతి యకారమునకు ద్విత్వము రాఁగా సమాస ౧౩-వ సూత్రముచే ఊ' హ్రస్వమయి ఉయ్యేల' అయినది ఇట్లే తక్కినవియును.

## ఆకారంబు క్రింది ఆకారంబునకుం దుదినులుల క్రిందినలలకు లోపంబు బహుళంబుగ నగు ౭.

అఱ్ఱు - అఱు గొఱ్ఱియ - గొఱియ కన్ను - కను. నన్ను - నను. పల్లు - పలు విల్లు - విలు.

౨ ఱ్ఱ (ద్విత్వశకటరేఫము) లోని ఒక అకారమునకును పదము తుదనున్న న్ను ల్లు' లలోని నకార లకారములకును లోపము బహుళము. అఱ్ఱు-అఱు కన్ను-కను విల్లు-విలు' తక్కినవియునిట్లే

అక్కటాదులజడ్డకు లోపంబు విభాషనగు ౮.

అకట - అక్కట అక్కట - అట్టిక - అట్టుక - అట్టె - అయ్యో - అయ్యారె - అవ్వారి - ఇట్టిక - ఉప్పవడము - ఉమ్మి- ఎక్కసక్కియము - ఎక్కసెక్కియము - ఎక్కిరింత - ఎడ్డ-ఎన్నిక- ఎమ్ముక - కజ్జాయము - కట్టా - కట్టిక - కప్పురము - కమ్మటము - కమ్మతము-కువ్వాడము - కొట్టిక - కొమ్మ - కొయ్యగూర - గయ్యాళము - గిజ్జిగాఁడు - గుజ్జరాతి - చిట్టి - చిన్న - చిమ్మట- చెన్నఁటి - చెప్పుము - చెప్పుఁడు - చెమ్మట - చెల్లియలు - జవ్వాజి - జాబిల్లి - తమ్మటము - తమ్ములము - తల్లి - తుమ్మికి - తువ్వర - తెల్ల - దవ్వు - దివ్వియ - నవ్వు - నిద్దుర - నివ్వరి - నివ్వాళి - నువ్వు - నెట్టిక - నెమ్మలి - పవ్వళించు - పిన్న - పుల్లియ - పువ్వు - పెద్ద - పొట్టి - ప్రాకెన్న - ప్రెగ్గడ - బెగ్గడు - బొమ్మ - బొమ్మికము - బొమ్మిడికము - బొమ్మిడీకము - మజ్జ - మత్తాబు - మల్లారము - ముక్కు - ముద్దియ - మెట్టిక - మొక్కరము - మొగ్గరము - మొల్లాము - రడ్డి - లొట్టిపిట్ట - వట్టి - వయ్యాళి - సన్నియ - సవ్వడి - సివ్వంగి - అట్టు - ఇట్టు - ఎట్టు - అప్పుడు - ఇప్పుడు - ఎప్పుడు - అన్ని - ఇన్ని - ఎన్ని - కొన్ని - మమ్ము - మిమ్ము - తమ్ము - అమ్మ - అక్క - అవ్వ - అయ్య -

అప్ప - అచ్చోటు - ఇచ్చోటు - ఎచ్చోటు - అచ్చటు - ఇచ్చటు - ఎచ్చటు ఇత్యాదు లక్కటాదులు

౮ అక్కట' మొదలగుశబ్దములందుఁగల (జడ్డకు) ద్విత్వమునకు లోపము వికల్పము అకట-అక్కట' ఇట్టే తక్కినవియును

జడ్డక్కరంబుతోఁ బదాదిస్వరంబు గూడుచో జడ్డకు లోపంబు లేదు. ౯.

అత్తెత్తె - కన్నదరె - నన్నడిగె - పల్లొత్తె - విల్లందె.

౯ ద్విత్వాక్షరము అజాదిపదములోఁ గలియునపుడు మీఁదిసూత్రముచేఁ గలుగులోపము ద్విత్వమునకు రాదు 'త్తు+ఎత్తె=అత్తెత్తె' ఇచట ద్విత్వమగు త్తు' అజాదిపదమగు ఎత్తె' లోని ఎ' తో కలియుచున్నందున ద్విత్వము లోపింపలేదు ఇయ్యది నిత్యవిధికావున ఎప్పుడును ద్విత్వలోపము రాదనియు, అందుచే అతెత్తె' అని కాదనియు భావము ఇట్టె తక్కినచోట్లను గ్రహించునది

హాదులయు నీలుగులోనగువానితొలిహల్లునకు లోపంబు బహుళంబుగ నగు. ౧౦.

హాడపము - అడపము హారిదళము - అరిదళము హాలఁది - అలఁది. నీలుగు - ఈలుగు నీలుగు - నెగయు - పొందు - పొనరు. వూను పొదవుల కాదిలోపం బొకండు వచియించె నది యవిచారమూలకంబు

౧౦ హాదులయు = హాకారము మొదటఁగల పదములయొక్కయు. హాకారము మొదటఁగలపదములలోని తొలిహాకారమునకును నీలుగు' మున్నగుపదములలోని తొలిహల్లునకు నులోపము బహుళము

హాడపము . (హాకారము లోపింపఁగా) అడపము' (నీలుగు—నకా

రము లోపింపగా) ఈలుగు' ఇట్లే తక్కినవియును. అప్పటి పూను పొద రు' ల మొదటివాల్లునకు వికల్పలోపమును చెప్పెను కాని యట్లుచెప్పుటకు వరిగా ఆలోచింపమియే కారణమని చిన్నయసూరిగారి యాశయము ( పూను ఊను' అనునవియు పొదవు పిదవు'లును పరస్పర సంబంధము లేనివనియు విభిన్నార్థకమనియు నభిప్రాయము )

## ఆరాటాదులం బ్రథమేతరదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు ౧౧.

ఆరాటము - ఆరటము. ఆరాటము - కస్త్యాఆతి - కేళాకూళి - కొమారుఁడు - కొమారిత - గంబ్బూరము - పెండారము - బంగారము - బేహారము - వీటతాటము - సంతోసము.

౧౧. ఆరాటము' మున్నగుశబ్దములందలి మొదటిదీర్ఘమునువిడిచి తక్కినదీర్ఘములకు హ్రస్వము వికల్పముగా నగును ఆరాటము - ఆరటము (ఇట రెండవదీర్ఘమగు రా రగా మాఱినది ) ఇట్లే తక్కినవియును.

## ఓయారాదులం దొలిదీర్ఘంబునకు హ్రస్వంబు విభాషనగు. ౧౨.

ఓయారము - ఒయారము ఓయారము - కేళాకూళి - కోలె - కూడారము - గోరువంకపక్షి - జోహారు - నీలుగు - పేఁడ - బేహారము దీర్ఘమధ్యంబు - మూలు - మూలుగు - మోలకు - వీటతాటము - వీడియము ఇత్యాదులు.

౧౨. ఓయారము' మున్నగుశబ్దములందు మొదటి దీర్ఘమునకు హ్రస్వము వికల్పము. ఓయారము' - ఒయూరము' గా మాఱినది బేహారము, బెహరమనియు, పేఁడ, పెండ అనియు నగును ఇట్లే తక్కిదవియును

అడంగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు. ౧౩.

అడఁగు - అణఁగు. అడఁగు - కడఁగు - చిల్లాడము - తడగము - నాఁడెము - పోఁడి - మిడుఁగు - వడఁకు - మిడుఁగులు - ఇత్యాదు లడంగ్వాదులు.

౧౩ అడఁగు' మున్నగువాని డ' వికల్పముగా ణ' గా మాఱును అడఁగు - అణఁగు-' ఇట్లే మిగిలినవియును.

దక్కులోనగువాని దాకు డకారంబువిభాషనగు ౧౪.

దక్కు - డక్కు. దక్కు - దగ్గఱు - దాఁగు - దాకలి-దిగు - దిగ్గియ - దూయు - దెందము - దెప్పరము - దెప్పు - దొంగ - దొప్ప - ఇత్యాదులు.

౧౪ దక్కు' మొదలగువాని ద' వికల్పముగా డ' గా మాఱును దక్కు-డక్కు' ఇట్లే తక్కినవియును

ఏతాదులకు మువర్ణకంబు పరంబగునపుడు దీర్ఘంబు విభాషనగు. ౧౫.

ఏతము - ఏతాము. ఏతము - కళ్లము - గాలము - గుడ్డము - గోణము - గోతము - జాజము - జొంజము - జోతము - తణగము - బొండ్లము - మండము - లాతము - వీణము - ఇత్యాదులు

౧౫ ఏతము' మున్నగుశబ్దములందు ము కు ముందున్న హ్రస్వమునకు వికల్పముగా దీర్ఘమగును ఏతము-' దీర్ఘమైనచో ఏతాము-' ఇట్లేమిగిలినవియును.

పదాంతంబులయి యసంయుక్తంబు లయిన సులురుల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు. ౧౬.

ఇందు నురుల కుత్వలోపంబు ప్రాయికంబుగ హల్పరకం బులకుఁ జూపట్టెడు ప్రాన్పడె - మినుపడె - మిన్పడె - వత్తురు వారు - వత్తుర్వారు - కారుకొనియె - కార్కొనియె - రాములు - రామల్ - వనములు - వనముల్.

౧౬. పదాంతంబులు=పదములచివర నుండునట్టివి అసంయుక్తంబులు=వేఱొకహల్లుతోఁ గూడియుండనివి పదములచివర నుండి వేఱొక హల్లులోఁగూడి యుండని ను-లు-రు' అను వాని ఉకారము బహుళముగా లోపించును ఇందు ను రు' లకుమాత్రము వేఱొకపదముయొక్క హల్లు పర మగునపుడే ఉకారలోపము తఱచుగాఁ గన్పడుచున్నది ప్రాను+పడె= ప్రాన్పడె-' ఇట పదాంతమయి అసంయుక్తమగు ను లోని ఉకారమునకు పడె' లోని పకారము-హల్లుపరమగునపుడే లోపము వచ్చినది లు' కు ఈనియమము లేదు. రాములు-రామల్ వనములు-వనముల్'

ఆచ్ఛికంబులం బదమధ్యంబుల నలడరల యుత్వంబునకు లోపంబు బహుళంబుగ నగు. ౧౭.

కినుక - కిన్క. కానుక - కాన్క. చిలుక - చిల్క. కాలువ - కాల్వ. అడుగు - అడ్గు. కడుపు - కడ్పు పెరుగు - పెర్గు. కూరుకు - కూర్కు.

౧౭. అచ్చతెనుఁగుపదములందు నడుమనున్న న-ల-డ-ర'ల ఉకార మునకు లోపము బహుళముగా నగును కినుక-' ను లోని ఉకారము లోపిం పఁగా కిన్క' అగును ఇట్లే తక్కినవియుం

లాఁతియచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపంబు గానంబడియెడి. ౧౮.

కలికి - కల్కి. ములికి-ముల్కి. బుడిపి - బుడ్పి. పొలఁతి- పొల్తి.

౧౮ లాఁతియచ్చునకు సహితము=(ఉకారముకంటె) ఇతరమగునచ్చునకుఁగూడ కొన్ని యచ్చతెనుఁగుపదములందు పదమధ్యస్థములగు న-ల-డ-ర-లమీఁదనున్న ఇతరమగు నచ్చునకును ఉకారముకంటె వేఱగుదానికిని లోపము కనఁబడుచున్నది కలికి' ఇచటి లకారముమీఁది ఇకారము లోపింపఁగా కల్కి' అయినది ఇట్లే తక్కినవియును

**అబ్బురాదులం దుత్వంబునకు లోపంబు విభాషనగు ౧౯.**

అబ్బురము-అబ్రము అబ్బురము - కప్పురము అప్పుడు-ఇప్పుడు-ఎప్పుడు-చప్పుడు-నెత్తురు-ఇత్యాదులు

౧౯ అబ్బురము' మొదలగుపదములయందున్న ఉకారము వికల్పముగా లోపించును అబ్బురము-ఉకారము లోపింపఁగా-అబ్రము' అగును. (ఉత్వము లోపించునపుడు ద్విత్వములోని యొకయక్షరము లోపించునని గ్రహించవలెను) ఇట్లే తక్కినవియును

**చుక్కరకరువర్ణంబునకు ముందఱి దువర్ణంబు నుత్వంబునకు లోపంబు విభాష నగు నగుచోఁ దత్పూర్వంబు గురువు గాదు. ౨౦**

అదురుచు - అద్రుచు ఎదురుచు - ఎద్రుచు. పదురుచు - పద్రుచు.

౨౦ చుక్కరకరువర్ణంబు=చుక్కనకు ముందుగా నున్న రు' అను దానికి తత్పూర్వంబు=ఆ ఉకారము లోపించిన దు అనువానికి (ద్రు) ముందున్నయక్షరము ప్రేరణార్థమునవచ్చు చుక్క నకు ముందున్నరుకారమునకుఁ బూర్వముగానున్న దు' లోని ఉకారము వికల్పముగా లోపించును. అట్లు లోపించిన ఉకారముకల దకారమునకు ( ద్రు' అనుదానికి) ముందున్న యక్షరము గురువు కాఁజాలదు

అదురుచు-'ఇచట చు' కు ముందు రు' కలదు దానికి ముందు దు' కలదు కాన దాని ఉకారము వికల్పముగా లోపింపగా అద్రుచు' అను రూపము సిద్ధించినది

సంయుక్తాక్షరమునకు ముందున్నయక్షరము గురువని నియమము కలదు, ఇచట ద్రు' అనునది సంయుక్తాక్షరము కావున దానికి ముందున్న అకారము గురువు కావలసియున్నది కావున అట్టివి గురువులు కాఁజాలవని సూత్రమునసే చెప్పఁబడినది ఇట్లే కక్కినవియును

జూదాదుల దాకు జకారంబు విభాష నగు. ౨౧

జూదము - జూజము. అవుదు - జవాది - జాది - జాదు. వివాది.

౨౧ జూదము' మున్నగుశబ్దములం దున్నదకారమునకు జకారము వికల్పముగా నగును జూదము - జూజము' ఇట్లే కక్కినవియును

నిందయం దామ్రేడితంబు నాద్యక్షరములకు
హ్రస్వదీర్ఘంబులకు గిగీ లగు ౨౨.

కుంభకర్ణుఁడు - గింభకర్ణుఁడు రావణుఁడు - గీవణుఁడు

౨౨ నిందించుట స్పష్టమగునప్పుడు ద్విరుక్తమగుశబ్దము రెండవ రూపము మొదటియక్షరము హ్రస్వమైనచో గి దీర్ఘమైనచో గీ' ఆదేశములుగా వచ్చును

కుంభకర్ణుఁడు - గింభకర్ణుడు - ఇచట నిందయందు రెండవశబ్దమునం దలి తొలిహ్రస్వము కు' గి' గా మాఱినది ఇట్లే రావణుఁడు - గీవణుఁడు' అనునప్పుడు ఆమ్రేడికమునందలి దీర్ఘమగు రా అను దానికి గీ ఆదేశమైనది

పాదంబునం బ్రథమద్వితీయాక్షరములు వళిప్రాసంబులు
నాఁబడు ౨౩

౨౩ పద్యపాదములందు మొదటియక్షరము వళి యనియు, రెండవది 'ప్రాసము' అనియు జెప్పఁబడును

యవలలు లఘ్వలఘువులు మైత్రింబొరయు
రేఫంబులు పొరయవు ౨౪

౨౪ య-ర-ల-వ అనువాల్గింటను లఘువులు అలఘువులు అను భేదము లున్నట్లు సంజ్ఞా ౧౭ సూత్రమునఁ జెప్పఁబడినది అందు రేఫలను (ర-ఱ లను) విడిచి తక్కిన య వ-ల' లు పరస్పరముమైత్రిని పొందును అనఁగా యతిప్రాసములలో లఘువులకుబదులు అలఘువులను అలఘువులకు బదులు లఘువులను వాడవచ్చును కాని ర-ఱ' లకుమాత్రము పరస్పరము అట్టి యవకాశము లేదు (వానికి బరస్పరము మైత్రి లేదు

రేఫంబులు లఘ్వలఘువులుం దక్కంగల విశేషంబులు
నార్యవ్యవహారంబులఁ దెలియుట శ్రేయంబు ౨౫.

౨౫ లఘు రేఫములు, అలఘు రేఫములు ఎక్కడెక్కడ నుండునదియు, ఇందుఁ జెప్పఁబడని యితరవిశేషములను పెద్దల వ్యవహారమునుబట్టియే నిశ్చయించుట మేలైనపని

శ్లో. శ్రీ స్తనాఞ్చితకస్తూరీపఙ్కసంకలితోరసే
పఙ్కజాక్షాయ నాథాయ వేంకటేశాయ మఙ్గళమ్.

ఇది ప్రకీర్ణకపరిచ్ఛేదము

బా ల వ్యా క ర ణ ము

సం పూ ర్ణ ము.

---

క మును మదుపజ్ఞం బగుచుం
దనరినవ్యాకృతిని సూత్రతతి యొకకొంతం
దెనిగించి యిది ఘటించితి
ననయము బాలావబోధ మగు భంగిఁ దగన్.

క. తెనుఁగునకు శబ్దలక్షణ
మనయం బరయంగ వేడ్క నందినవారల్
తనరఁగ నీవ్యాకరణం
బున మూలంబయినకృతిని బోలఁ గనఁదగున్.

# సూత్రానుక్రమణిక

| పుట | | | సూత్రము. |
|---|---|---|---|
| | అ | | |
| 62 | అందదుకు ప్రభృతులు యథాప్రయోగంబుగ గ్రాహ్యంబులు | సంధి | ౪౨ |
| 73 | అందున సప్తమి | తత్స | ౭ |
| 219 | అందు వరుసను రెండేసి ప్రథమమధ్యమోత్తమంబు లనంబడు | క్రియా | ౩ |
| 30 | అంద్వవగాగమంబులుదప్ప నపదాదిస్వరంబు పరంబగునప్పుడచ్చునకు సంధియగు | సంధి | ౧౧ |
| 63 | అంద్వాదులకుఁ గలిగెడునుంబు సమాసంబునం దగు | సంధి | ౪౪ |
| 41 | అంట యుంక చూడు శబ్దంబులందప్ప నడిమి తొలి హ్రస్వంబుమీఁద ఖండబిందువుకు ద్రుతంబునకు లోపంబును లేవు | సంధి | ౨౨ |
| 8 | అఆఉఊఒఓఔలం గూడిన చజలు దంత్యంబులు | సంజ్ఞా | ౩ |
| 316 | అకవర్ణకంబు మాత్రాదులకగు | కృదం | ౧౩ |
| 322 | అక్కటాదులజడ్డకు లోపంబు విభాషనగు | ప్రకీ | ౯ |
| 299 | అగణికంబులగు భ్వాదుల కిందు యోగంబులేదు | క్రియా | ౧౨౧ |
| 280 | అగున కను కనులకు మూర్తులు పరంబులగునపుడు కాఁగా కానలు విభాషనగు | క్రియా | ౩౬ |
| 284 | అగునకు వక్రంబు గూడుచో దీర్ఘంబగు | క్రియా | ౧౦౦ |

ఇ

ఈ

## య

# బాలవ్యాకరణము లఘుటీక

# బాలవ్యాకరణము లఘుటీక

శ్రీ రామా ప్రెస్‌న ముద్రితము 1958.